# శ్రీ భీమేశ్వర పురాణము

( భీమఖండము )

శ్రీనాథ కవిసార్వభౌమ ప్రణీతము


తర్కాచార్య, భాషాప్రవీణ

శ్రీ కంభంపాటి రామగోపాల కృష్ణమూర్తి

విరచిత టీకాతాత్పర్య సహితము





ప్రకాశకులు :

కల్యాణీ గ్రంథమండలి

విజయవాడ-1.

# మనవి

ఆంధ్రవాఙ్మయమునఁ జిరస్థాయులగు ప్రబంధముల రచించిన కీర్తిశేషుఁడు శ్రీనాథ కవిసార్వభౌముఁడు. అతఁడు రచించినవానిలో నష్టములైనవి కాగా నష్టప్రాయమైనదీ భీమఖండము. ఇదతనిచేఁ బ్రౌఢనిర్భర వయఃపరిపాకమున భీమనాయకునిఁ బొగడుటకై వ్రాయఁబడి, రాజమహేంద్రవరపాలకుఁడగు వీరభద్రారెడ్డికమాత్యుఁడగు బెండపూడి యన్నయమంత్రి కంకిత మొసఁగబడినది. తూర్పుగోదావరి జిల్లాలోని 'ద్రాక్షారామ' మనఁబడు దక్షారామస్థలపురాణ మిమ్మహాగ్రంథము స్కాందపురాణాంతర్గత భీమఖండమున కనుకృతి.

ఇతని యనువాదముఁ గూర్చి కొంత ముచ్చటింతును. 'సహిసర్వదేవరాట్' అన్నదానికి 'సంతతము దేవవేశ్యాభుజంగుఁడతఁడు' ద్వి. 13. అని భీమేశునకు భుజంగత్వమును కల్పించెను. అతనికే కాదు; కృతిపతికి సైతము 'పంచారామవధూటీపంచాస్త్ర విహారకేలి పాంచాలునకున్' అని చెప్పుట గొప్పగాఁ జూచియుండనోపు. 'భవ త్యపాంగమాత్రేణ తస్య సర్వ మిదం తతం' అన్నదానికి 'అతని నిశ్వాసముల మాత్ర నానాకావా, వేదములును చరాచర విశ్వజగము' అని 2 ఆ. 14 ప. 'సప్తగోదావరతట క్రీడాసక్తస్య శీకరైః। గజాస్యస్య కరోన్ముక్తైః క్లిన్నమార్తాండమండలం'నకు 'వేదండ వదన శుండా కాండ చుళుకితోన్ముక్త సప్తగోదావర సలిల ధారా ఝుణత్కారబృంహిత బ్రహ్మాండగోళంబును' 3 ఆ. 18. 'పుండరీకోద్భవ శిరోమాలికాహారశోభితం'నకు 'పుండరీకత్వక్ప ♦ కాండాతిమండిత, కటిమండలంబు 4 ఆ. 153. 'దశపూర్వాన్ దశాపరాన్' నకు 'అయిదు తరముల పూర్వుల ♦ నవల మీఁద, నందఱనుఁ గాచు నూర్ధ్వలో ♦ కాలయముల' 5 ఆ. 67. మఱొక్కచోట కొంచెమశ్రద్ధగా 'సత్సమాగమ మస్నామ కథాశ్రవణ యోగతః। పాపక్షయో భవేద్దేవి' అన్న మూలమునకు, 5 ఆ.157 ప.లో 'పాపంబులన్నియుఁ బ్రబలుచుండుఁ, బాపంబు లాకభంగిఁ బ్రక్షయం బొందిన' అని పాపక్షయమునకు కారణమును చెప్పుట మానెను. ఇది గాక యిది శైవమాహాత్మ్యాభివర్ణకంబగుటచేఁ గానోపు శ్రీ కూర్మ సింహాచలాది వైష్ణవ క్షేత్రములను మూలమున రెండధ్యాయములలో నున్నవాటి నొక్క పద్యమున (2 ఆ. 51) వర్ణించెను. వర్ణనలపట్లఁ దన ప్రాగ్భల్యముఁ జూపి విహరించెను. (2: 30) 'ముజ్జగము (4: 137) ఎల్లన్ శిష్యుల (2: 120) సీమటు (5: 77)' అని లక్షణవిరుద్ధప్రయోగములును గలవు. 'దివ్యపాదాంబుజ ♦ క్షేత్రజలము (2: 51), అని పలుచోట్ల యతిస్థానమున వాడిన క్షేత్రపద మెట్లు సరిపడునో?

5. ఆ. 81 లో జెప్పిన 'మహాగ్రామ, ఖండిక, భట్టిగ్రజా' దిభేదములిప్పుడు తెలియఁ బడవు. 2:56 లోఁ జెప్పిన శాకభేదములు, 3: 57 లోని సస్యభేదములు నిప్పుడు తెలియ నశక్యములు. 3:39 మొదలు 42 వరకు ముహూర్తమునుఁగూర్చి చక్కగా వివరించెను. 1-111లో భీమేశవర్ణనము మనోహరము. 3.6లో 'ముగురంగూర్చిన ముండ దైవమునకున్ మోమోటలేదోసుమీ?' అని లోకోక్తి కటు వను కొనక వాడినాఁడు. రెండవయాశ్వాసమురసముచింగు ఘట్టము. మొత్తముమీఁదనితని పాకము ప్రౌఢిమతో నారికేళపాకమున నడచినది.

ఇట్టి యుద్గ్రంథమిప్పుడు ముద్రితమై లేకుండుటకు వగచి నాలో నేను గుములుచుండ ప్రకాశకులీ సత్కార్యమును తాము నిర్వహింపఁబూనిరి. అంతేకాక ఇట్లు ముద్రణలేని సద్గ్రంథములనెల్ల ముద్రితములఁ జేయుట కంగీకరించిరి. అది వారి యౌదార్యము. మన కాంధ్రరాష్ట్రము వచ్చినను మన యాంధ్రభాష కమూల్యాలంకారములనఁబడు ప్రబంధములనుఁ బ్రభుత్వమువారు ముద్రింపకపోగాఁ బ్రజాప్రభుత్వమను మాట నిలఁబెట్టఁదలఁచియో వీరు పూనుకొనిరి. దానికిఁ బ్రజాభిమతము ననుసరించి తగునట్లు లఘు వివరణముగా కఠినపదార్థతాత్పర్యముల వ్రాసితిని. ఈ నా వాఁదోడు గాగెలవంటకు వ్రేలున్నదన్నట్లే.

ఈ మా పూనికకుఁ జదువరులగు రసజ్ఞులు పొత్తములఁగొని ప్రోత్సాహమిత్తురుగాక! మాకదే పదివేలు. ప్రకాశకులు ద్విగుణీకృతోత్సాహులై త్వరలో నింకను గ్రంథములఁ బ్రచురించి ప్రజోపకారముఁజేయునట్లు భగవానుఁడు వారిని బ్రేరేపించి తగు సహాయ సంపత్తి నిచ్చుఁగాక! అందఱును దలకొక చేయి వేసినఁ గాని యీ కార్యము సానుకూలము కాదు. నాచూపిన కొలఁది తప్పులు లేకుండునట్లు చూచితి; నింకను దొరలినచో క్షమింపఁ బ్రార్థన.

శా. శ. 1880. విలంబి
విజయదశమి.
విజయవాడ.

ఇట్లు
విబుధజనవిధేయుఁడు,
కం. రామగోపాల కృష్ణమూర్తి.



# విషయసూచిక

—————

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

| విషయములు. | | పుటలు. |
|---|---|---|






శ్లో. సమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం।
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమో నమ శ్శంకర పార్వతీభ్యాం॥



# తప్పొప్పుల పట్టిక

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| శోక | శుక | 25 | 28 |
| త్రిపురాసుల | త్రిపురాసురుల | 29 | 19 |
| తిమిరంపుజంపు | తిమిర పుంజంపు | 32 | 29 |
| తీరోస్తతంగము | తీరోత్సంగము | 49 | 18 |
| వర్ధితానెక | వర్ధితానేక | 68 | 13 |
| సిమా | సీమా | 72 | 1 |
| నముచివెరి | నముచివైరి | ,, | 7 |
| శాంభవీభక్తి | శాంభవీశక్తి | 82 | 21 |
| ఫాలనెత్రా | ఫాలనేత్రా | 99 | 12 |
| సంఫుల్లఫుటంబు | సంఫుల్లపుటంబు | 100 | 18 |
| భవుడుచెప్పి | భవుడుచెప్పి | 104 | 6 |
| ద్వానరవము | ధ్వానరవము | 111 | 16 |
| లుత్సాహంబులు | లుత్సాహంబులు | ,, | 17 |
| విషవిశ్వాస | విషనిశ్వాస | 112 | 3 |
| విభవస్ఫుర్తి | విభవస్ఫూర్తి | 116 | 3 |
| బుద్ద | బుద్ధ | 128 | 1 |
| ప్రతిపనను సౌఖ్యన్ను | ప్రతిపన్న సౌఖ్యకును | 129 | 4 |
| కుంభాదరులును | కుంభోదరులును | 139 | 14 |
| నొప్సగు | నొప్పగు | 147 | ,, |
| రప్సించి | రప్పించి | 146 | 23 |
| కల్గిసన్ | కల్గినన్ | 159 | 18 |
| డువదేశించె | డుపదేశించె | 161 | 26 |
| విసుడు | వినుడు | 163 | 6 |
| గైకొనియెనె | గైకొనియెనే | ,, | 18 |
| యప్పస | యప్సర | ,, | 19 |

శ్రీరస్తు

శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## ప్రథమాశ్వాసము



శ్రీస్తనగంధసార పరి • షేకసమంచిత సాయకప్రయో
గాస్తమహాపురత్రయుఁ డ • హార్యధనుర్ధరుఁ డర్కకోటి దీ
ప్తిస్తవనీయవిగ్రహుఁడు • భీమయదేవుఁడు దక్షవాటికా
వాస్తుఁడు ప్రోచుఁగావుత ధ్రు • వంబుగ దేవయయన్న ధీమణిన్. 1

### ఇష్టదేవతా ప్రార్థనము

ఉ. ఏనికమోముతాల్పెలుక • నెక్కినరావుతురాజు సౌరసే
నానియనుంగుఁబెద్దన వి • నాయకదేవుఁడు కర్ణతాళయుం
ఝానిలతాడనంబున ని • రంతరమున్ ప్రబలాంతరాయసం
తానమహాఘనాఘన క • దంబములన్ విదళించుఁ గావుతన్. 2

ఉ. బాలికమోము మత్తవన • బర్హికిశోరకలాస్యలీలఁ బై
వాలిచి పచ్చకప్పురపు • వాసనతోడి ముఖారవింద తాం
బూలపుమోవి మోవిపయి • మోపుచు రాధకు నిచ్చు ధూర్తగో
పాలుఁడు ప్రోచుఁగావుత మ • పారకృపామతి మంత్రియన్ననిన్. 3

---

1. శ్రీస్తన...త్రయుఁడు=విష్ణువను బాణముచే త్రిపురాసురుల సంహరించిన వాఁడు; అహార్యధనుర్ధరుఁడు = మేరువు ధనువుగాఁగలవాఁడు; అర్క...విగ్రహుఁడు = కోటి సూర్యుల కాంతికల దేహముకలవాఁడు; దక్ష...వాస్తుఁడు = దక్షారామపుర నిలయుఁడు; ధ్రువంబుగన్ = ఎల్లప్పుడును; దేవయయన్న ధీమణిన్ = కృతినాయకుఁడగు బెండపూఁడి అన్నయమంత్రిని; ప్రోచుఁగావుతన్ = రక్షించుఁగాక! 2. ఏనికమోము తాల్పు = గజముఖుఁడు; ఎలుక..రాజు = మూషకవాహనుఁడు; సౌర...పెద్దన = కుమారస్వామికన్న; కర్ణ...తాడనంబునన్ = చెవులగాలితో; ప్రబల...కదంబములన్ = విఘ్నములను కారుమబ్బులను; విదళించుఁగావుతన్ = పోఁగొట్టుఁగాక! 3. బాలికమోము = రాధముఖమును; మత్త...లీలన్ = మదించిన అడవినెమలి మాతినివలె; పైవాలిచి = పైకెత్తి; మోవి = అధరోష్ఠమును; ధూర్తగోపాలుఁడు కొంటెకృష్ణుఁడు.

కం. నెట్టుకొని కొలుప నన్నయ, భట్టోపాధ్యాయసార్వ • భౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత, ఘట్టోల్లంఘనపటిష్ఠ • గాథప్రతిభున్. 8

ఉ. పంచమవేదమై పరఁగు • భారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేను పర్వములు • విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున క • ఖండిత భక్తి నమస్కరింతు ని
ర్వంచిత కీర్తివైభవ వి • రాజికిఁ దిక్కన సోమయాజికిన్. 9

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ • కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణ సంగ్రహకలా • కావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితా • విద్యాధరుం గొల్తు మా
యనుఁగుం దాతఁ బ్రదాత శ్రీకమలనా • భామాత్య చూడామణిన్. 10

మ. హరమూర్ధాహరిణాంకవక్రతయుఁ గా • లాంతస్ఫురచ్చండికా
పటుపీనోన్నతపయోధరస్ఫుటతటీ • పర్యంత కౌటిల్యమున్
పరిహాసంబును సంగ్రహించె ననఁగా • సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబు నటింపుచుండుఁ గవిరా • జీగేహ రంగంబులన్. 11

—♦ కుకవి నిరాకరణము ♦—

చం. వెస వసుధాస్థలంబునఁ గ • వీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనఃకటాహ కుహ • రంబుల నించి కలంచి జిహ్వికా
కీలలసత్తూలికం గొని లి • ఖింపరు కబ్బము లెన్నఁగా మహా
ప్రౌఢిమతో నిజానన వి • యత్తల తాలపలాశరేఖలన్. 12

తే. బోధ మల్పంబు గర్వ మ • భ్యున్నతంబు, శాంతి సిప్పచ్చరంబు మ • చ్చరము ఘనము
కూపమండూకములఁబోలెఁ • గొంచెమెఱిఁగి, పండితంమన్యులైన వై • తండికులకు. 13

8. భారత...ప్రతిభున్ = భారతఘట్టముల దాటగలిగిన ప్రతిభకలవాఁడు. 9. కాంచనగర్భతుల్యునకున్ = బ్రహ్మతో సరియైనవానికి. 10. కనకక్ష్మాధరధీరున్ = మేరువువంటి ధైర్యశాలి; వినమత్కాకతిసార్వభౌమున్ = కాకతిచక్రవర్తిచే సేవింపఁబడువాఁడు. 11. హర...వక్రతయున్ = శివునితలమీఁది చంద్రకళయొక్క వంకర; కాలాంత...కౌటిల్యమున్ = ప్రళయకాలచండికయొక్క స్తనకౌటిల్యమును; కవిరాజీగేహరంగంబులన్ = కవులనెడి వాకిళ్లలో. 12. శేముషీమషీరసము = బుద్ధియనెడి మసిని; మనఃకటాహకుహరంబులన్ = మనస్సనెడి మూకుళ్లలో; కలంచి = కలిపి; జిహ్వికా...తూలికన్ = నాలుకనెడి ఘంటములతో; నిజ...రేఖలన్ = తమ ముఖములను తాటియాకులనై. 13. సిప్పచ్చరంబు = సున్న; పండితంమన్యులు = మూర్ఖులు; వైతండికులు = వితండవాదము చేయువారు.

తే. నిటలమున నుండి శ్రుతిపుట • నిష్ఠురముగ, నదరికాకులు చిట్టు పె • ద్దఱచినట్లు
డుడిగిరాయంచ యూరక • యుండ తెన్న, సైఁపరాకున్న నెందేనిఁ • జనుటయొప్పు. 14

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృత • భాష యండ్రు, పలుకు నుడికారమున నాంధ్ర • భాష యందు
రెవ్వ రేమన్న నండ్రుఁగా • కేలకొఱఁత, నాకవిత్వంబు నిజము క • ర్ణాటభాష. 15

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును బురాతన కవీంద్రగుణకీర్తనంబును గుకవి నిరాకరణంబునుం జేసి యాత్మగతంబున. 16

తే. నవమరుత్తు చరిత్రంబు • నైషధంబు,
సప్తశతి పండితారాధ్య • చరిత మనఁగఁ
గావ్యములు పెక్కు చెప్పియుఁ • గాంతిపసక
వెండియునుఁ గావ్యమొకటిఁగా • వింపఁదలఁచి. 17

వ. ఉన్నంత. 18

—• ఉపోద్ఘాతము •—

సీ. ఏమంత్రి కులశైల • మిందుశేఖరుఁడు ద, క్షారామభీమేశుఁ • డఖిలకర్త
యేమంత్రి మేలిక • యిక్ష్వాకుమాంధాతృ, రాజసన్నిభుఁడైన • వేమనృపతి
యేమంత్రి నిజకీర్తి • యేడువారాసుల, కడకొండ యవులచేఁ • గటికి గొంగ
యేమంత్రి సౌభాగ్య • మిగురుఁగైదువజోదు, లాలిత్యలీలకు • మేలుబంతి
తే. యతఁడు కర్ణాట లాట భో • టాంగ వంగ, కురు కుకురు కుంతలావంతి • ఘూర్జరాది
నృపసభాస్థానబుధవర్ణ • నీయసుగుణ, మండనుఁడు బెండపూఁడన్న • మంత్రివరుఁడు. 19

వ. ఒక్కనాఁడు. 20

సీ. భాట్టప్రభాకర • ప్రస్థాన సంవేద్యు, లుద్దండ పండితు • లొక్కవంక
ఫణిపభాషితభాష్య • ఫక్కికాభావజ్ఞు, లుత్తమ ప్రాగల్భ్యు • లొక్కవంకఁ
గణభుజ్మత గ్రంథ • గాథార్థవిదులు బా, హుశ్రుత్యసంపన్ను • లొక్కవంక
వేదాంతవాసనా • విశ్రాంతహృదయజ్ఞు, లుపనిషత్తత్త్వజ్ఞు • లొక్కవంక
తే. నుభయ భాషాకవీశ్వరు • లొక్కవంక, వేశ్యలొకపంక్తి నొకపంక • వీరభటులు
బలసికొలువంగఁ గొలువుండి • పిలువఁబంపె, బెండపూఁడన్న మంత్రీశ్వ • రుండు నన్ను. 21

---

14. శ్రుతిపుట నిష్ఠురముగన్ = చెవులకు కటువుగా; అదరి = వ్యాపించి. 15. నుడికారము = శైలి. 17. వెండియును = మరల. 19. ఏడు...గొంగ = సప్త సముద్రముల కావలనున్న కొండకావలనున్న కటికచీకటిని పోఁద్రోలునది (దిక్కుల వ్యాపించినది); ఇగురుఁగైదువజోదు = మన్మథుఁడు; మేలుబంతి = శ్రేష్ఠుఁడు. 21. భాట్ట...సంవేద్యులు = పూర్వమీమాంసకులు; ఫణి...భావజ్ఞులు = వైయాకరణులు; కణభుక్...విదులు = తార్కికులు; బాహుశ్రుత్యసంపన్నులు = బహుశ్రుతము కలవారు.

గీ. ఇట్లు పిల్పించి సమ్మాన • మెసక మెసఁగ, సముచితాసనమున నుంచి • చతురలీల
నానతిచ్చెను రాయవే • శ్యాభుజంగు, మంత్రి గంభీరధీరసం • భాషణముల. 22

సీ. వినిపించినాఁడవు • వేమభూపాలున, కఖిలపురాణ వి • ద్యాగమములు
వల్పించినాఁడవు • గాథసాతంబైన, హర్షనైషధకావ్య • మాంధ్రభాష
భాషించినాఁడవు • బహుదేశబుధులతో, విద్యాపరీక్షణ • వేళలందు
వెదచల్లినాఁడవు • విశదకీర్తిస్ఫూర్తి, కర్పూరములు దిశాం • గణములందుఁ

తే. పాకనాటింటి వాఁడవు • బాంధవుఁడవు, కమలనాభుని మనుమఁడ • వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబం • ధంబు నీవు, లలితగుణగణ్య శ్రీనాథ • కవివరేణ్య. 23

తే. సప్తసంతానములు నాకు • సంభవించె, నొక ప్రబంధంబు వెలితిగా • సుకృతగరిమ
నావెలితిమాన నాపేర • నంకితముగ, శివపురాణంబు తెనుఁగుగాఁ • జేయుమొకటి. 24

వ. అనియును. 25

కం. బంధుర సపాదలక్ష, గ్రంథంబై యెడుపదులు • ఖండంబులలో
సంధిల్లును స్కాందం బన, సింధువునకుఁ గాల్వ లమరి • చినచందమునన్. 26

మ. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగు ద • క్షారామభీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యముతోడఁ గూడి భువన • శ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసారమగు శ్రీ • గోదావరీఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీ • భాషాప్రబంధంబుగన్. 27

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాంబ రాభరణంబు లొసంగి వీడుకొలిపిన. 28

సీ. ధారాసురత్రాణ • ధాటీసమారంభ, గర్వపాథోరాశి • కలశజులకు
సప్తమాడియరాజ • చూడియుజ్మపాల, పండిత శ్రీపాద • పసరుహాలకు
సింహాద్రి పర్యంత • సీమాంధ్రమేదినీ, మండలీ పాలనా • ఖండలులకు
హరిదంతదంతిదం • తావళీలిఖ్యమా, నానేకజయశాస • నాక్షరులకు

తే. వీరభద్రేశ వేమ పృ • థ్వీధవులకు, సనుఁగుమంత్రి మహాప్రధా • నాగ్రగణ్యు
బెండపూఁడన్న జగనొబ్బ • గండబిరుద, సచివదేవేంద్రుఁ గృతికధీ • శ్వరునిఁ జేసి. 29

---

22. ఎసక మెసఁగన్ = అతిశయింపగా. 26. సపాదలక్షగ్రంథము = 125 వేల శ్లోకములుకల గ్రంథము. 27. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడు = సూర్యునిచే ప్రతిష్ఠింపఁబడినవాఁడు. 28. జాంబూనద = బంగారు. 29. జగనొబ్బగండబిరుద = జగనొబ్బ గండడను బిరుదుకల.

వ. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితంబు లనుపంచలక్షణంబులతోడం గూడి సపాదలక్ష గ్రంథసంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండమండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీమహాస్కాందం బను నాదిపురాణంబునందు గోదావరీ ఖండంబు శ్రీమద్దక్షారామభీమేశ్వరమాహాత్మ్య సంయుతంబగుటం జేసి భీమేశ్వరపురాణం బనం బరఁగు; నది యాంధ్రభాషాప్రబంధంబుగఁ జెప్పందొడంగితి; నమ్మహాప్రారంభంబునకు మంగళాలంకారంబుగా నమ్మహామంత్రీశ్వరు నేలిన వీరభద్రేశ్వర వేమభూపాలుర వంశావతారం బభివర్ణించెద. 30

## —♦ వేమభూపాలుని వంశావతారవర్ణనము ♦—

ఉ. కైటభదైత్యవైరి పద • కంజమునం దుదయంబు నొందె మి
న్నేటికి భూతధాత్రికిని • నెత్తయు నచ్చిన తోడఁబుట్టువై
హాటకగర్భముఖ్య నిధి • లామరమౌళి మహామణిప్రభా
పాటలవర్ణమైన యొక • పావనవర్ణ ముదీర్ణసంపదన్. 31

వ. అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసిచరణపల్లవంబు దనకుఁ బుట్టినిల్లుగావునఁ గారణ గుణసంక్రమంబునం దోఁచె జామరరోమరచ్ఛత్రధనుఃఖడ్గాది చిహ్నోపశోభితంబై, చదలేటిసేటివలని సోదరీయస్నేహసంబంధంబులుం బోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యంబులు చరితమనస్స్వభావవచనంబుల ధరియించి సైదోడుం బొదివి విశ్వవిశ్వంభరా క్రీడనంబు దనకువిదిర్చిన పరమక్షాంతి యంతరంగంబున సంతరించి నిఖిలప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందుఁ బద్మనాయకులన వెలమలనఁగమ్మలనసరిసర్లనవంటర్లన బహుప్రకారశాఖోపశాఖా భిన్నంబులైన మార్గంబులం ద్రిమార్గగంగాప్రవాహంబులుం బోలె గోత్రంబు లెన్నియేనియు జగత్పవిత్రంబులై ప్రవహించుచుండఁ గల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులుసరికడచి వత్సరంబులుచని కాలచక్రంబులతిక్రమించుచుండఁ జతుర్థకులమౌళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబైన పంటమహాన్వయంబు పాకనాటిదేశంబున భద్రపీఠంబునధివసించి సింహవిక్రమనగరదువ్వూరు గండవరాది పట్టణంబులు నిజనివాసంబులుగా భ్రూలతాదష్టాష్టాదశద్వీపాంతరాళులగు భూపాలగ్రామణులన్ ద్రిలింగభూమండలాఖండలులను బ్రోలయవేమాన్నపో తాన్న వేమకుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులం గాంచె. తత్సంబంధ

---

30. పంచాశత్ఖండమండితంబై=50 ఖండములు కలది. 31. కైటభ...కంజమునందున్=విష్ణుపాదమందు; మిన్నేటికిన్=గంగకును. 32. కారణగుణసంక్రమము=కారణమైన మట్టియున్నగుపాటి గుణములు కార్యములైన కుండ మున్నగువాటియందు సంక్రమించుట; చదలేటిసీరు=గంగనీరు; సైదోడు=తోబుట్టువు; విశ్వంభర=భూమి; భ్రూలతా...రాళులు=కనుబొమముడిచే భయపెట్టఁబడిన పదునెన్మిదిద్వీపాలరాజులు;

బాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబునం గంధసింధురఘటాకూట కపటకిటి కచ్ఛపావతారనారాయణ భుజంగ భూధరంబులకుఁ దోడుజోడై రాయగురుపర మేశ్వర సాధుజనవిధేయ ఫోడెరాయుస కలకళాభామావిబిరుదభాస్వరుండై భీమయ గురువరేణ్య పుణ్యకారుణ్య కటాక్షవీక్షాలబ్ధ సుస్థిరైశ్వర్యధుర్యుండై విజయ ధాటీసమాటీకనంబులవిశాలల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజ ధానిగా సింహాద్రిపర్యంతం బుత్కళ కళింగ యవనకర్ణాటలాటాంతర్ద్వీపంబైన ప్రతా పంబున దిలీప ఇల నహుష నాభాగ భరత భగీరథ మాంధాతృ ధుంధుమార పూరుపురూరవఃప్రభావుండై విశ్వవిశ్వంభరా భువనమండలంబుఁ బరిపాలించెఁ దదనంతరంబ. 32

గీ. రాజరఘురాములల్లాడ • రమణసుతులు, ధాత్రిఁ బాలింతురాచంద్ర • తారకముగ
వేమభూవల్లభుండును • వీరవిభుఁడు, సన్నదమ్ములు హరియును • హరుఁడుఁబోలె. 33

ఉ. తమ్ముని వీరభద్రవసు • ధాధిపు విక్రమవీరభద్రుని
న్నెమ్మదిపేల రాజ్యధుర • బిట్టిటఁ బట్టముఁగట్టి బాహు ద
ర్పమ్మున వేమభూవిభుఁడు • వ్రాసె జగద్విజయప్రశస్తి వ
స్తమ్ములు దిగ్గురంధర ను • రద్విపకుంభవిషాణ మండలిన్. 34

సీ. పాతాళభువనాధి • పతికి శేషాహికిఁ, బ్రియలతో మనకానఁ • బెనఁగఁగలిగె
దిక్సింధురములకు • దివ్యవాహినిలోనఁ దేఁటి రాయిడి మానఁ • దేలనొదవె
నుర్వీధరములకు • నుదధిలోఁ గాపున్న, కొలముసాములయిండ్లఁ • గుడువబ్బెఁ
గుహనాకిటికి లక్ష్మి•కుచకుంభములమీఁది, కుంకుమంబున నుసుల్•కొనఁగఁగూడె

తే. రాయవేశ్యాభుజంగ వీ • రప్రతాప, భాసి యల్లాడవిభువీర • భద్రనృపతి
సర్వసర్వంసహాచక్ర • సర్వభరము, పృథుభుజాపీఠమున సంభ • రించుటయును. 35

కం. ఏరీ ధరణిపు లల్లయ, వీరక్ష్మాపతికి సాటి • వితరణగరిమన్
ధారాధర ధారాధర, ధారాధరవాహదాన • ధారానిధికిన్. 36

---

ధౌరంధర్యము=భరించుశక్తి; గంధసింధురఘటాకూట=దిగ్గజములు; కపటకిటి=ఆదివరాహము; భుజంగ=శేషుఁడు; భూధరము=పర్వతము; విజయధాటీసమాటీకనములు=దండయాత్రలు. 34. దిక్...మండలిన్=దిగ్గజముల కుంభస్థలములమీఁద, దంతములమీఁదను. 35. మనకొనన్=సంభోగమున; తేఁటిరాయిడి=తుమ్మెదల బాధ; కుహనాకిటికి=ఆదివరాహమునకు; ఉసుల్కొనగన్=సుఖపడునట్లు; సర్వ... భరము=సకలభూభారము. 36. ధారాధరధారా=మేఘధారలచే;అధర=క్రిందుగాఁ జేయఁబడిన; ధారాధర వాహ=ఇంద్రుఁడుకల; దానధారానిధి=దానధారలకు నిధి యైనవాఁడు. (వర్షధారలకంటె హెచ్చైన దానధారల కురిపించి యింద్రునిమించిన వాఁడని భావము)

తే. ధర్మశాసన ఘనశిలా • స్తంభమెత్త, శ్రీముకుందోద్భవస్వామి • శివునిమ్రోల
పీఠభిద్దేశుఁడా చంద్ర • తారకముగ, నగ్రహారాళి నఖిలమా • న్యంబులొసఁగి. 42

సీ. కమలాచలాగ్ర మా • ర్కండేయ శివశిర, శ్శశిచంద్రికాధౌత • సౌధవీథి
గోదావరీపుణ్య • కూలంకషాజల, స్ఫారిత శ్రీరుద్ర • పాదయుగళి
బలపథ్యున్నత • ప్రాకారపరివేశ, గంధూషితాజాండ • మండలంబు
గంధవంశావళ • గ్రైవేయఘంటికా, ఠంకారముఖరము • టాపథంబు

తే. రాజబింబాననాసూత్న • రత్నపేటి, వీరరాహుత్త సుభటకం • కీరవాద్రి
వేమభూపాలరాజ్యాబ్ధి • వృద్ధికరము, సాంద్రవిభవంబు రాజమ • హేంద్రవరము. 43

తే. పీఠపద్దేశసేమ వృ • త్తిదవులకు, మంత్రియగు దెందులూరన్న మంత్రివరుని
విమలవంశావతారంబు • విస్తరింతు, నభ్యుదయహేతువుగఁ బ్రబం • ధాదియందు. 44

## కృతినాయక వంశావతారవర్ణనము

సీ. అకాశలక్ష్మికి • నవతంసకంబైన, మునిమండలములోని • మొదలిచుక్క
యఋకాల బ్రహ్మాండ • మప్పళించిన యట్టి చిన్నివేల్పులరాజుఁ • గన్నతండ్రి
యాదికల్పంబునాఁ • డఖిలప్రపంచంబు, సృజియించు బ్రహ్మకుఁ • జేయిదోడు
పరశురామునిచేతఁ • బాథోధిమేఖలా, ధరము దానముఁగొన్న • బ్రాహ్మణుండు

తే. పేరుదక్షప్రజాపతి • పెండ్లికొడుకు, కశ్యపబ్రహ్మ నిజవంశ • కర్తగాఁగ
వెలసె నుభయాన్వయంబులు•వృద్ధిఁబొంద, బ్రాలుఁబ్రాలునుగల మంత్రి•పోలమంత్రి. 45

కం. సాటి చపలేటిపేటికి, హాటకగర్భునివధూటి • కమరద్రుమ వనీ
వాటికి మధుకైటభరిపు, పీటికి శ్రీపోలమంత్రి • విశదయశంబుల్. 46

కం. ఆమంత్రికి సుచయించిరి, శ్రీమంతులు కార్యఖడ్గ • జితవైరి మహా
సామంతులు శ్రీ యల్లా, డామార్యగ్రామణియును • నన్నవిభుండున్. 47

కం. అల్లాడవిభుఁడు రిపుహృ, ద్భల్లాడంబరుఁడు వాఁడు • ధామలమనసుల్
గొల్లాడఁగ మదనుఁడు దిశ, లల్లాడఁగఁజేయుఁ దద్బ • జాటోపంబుల్. 48

43. కమలాచలము = రాజమంద్రినగరము పుండరీకపర్వతముమీఁద నేయున్నది; గ్రైవేయఘంటికా = మెడలోని గంట. 45. అవతంసకంబు = అలంకారము; అప్పళించిన = అణచిన; బ్రాలుఁబ్రాలునుగల మంత్రి = చదువు, ధనముకల మంత్రి. 46. హాటక...వధూటికిన్ = సరస్వతికి; అమర...వాటికిన్ = కల్పవృక్షపంక్తికి; మధు...పీటికిన్ = శ్వేతద్వీపమునకు; విశదయశంబుల్ = స్వచ్ఛమైన కీర్తులు. 48. కొల్లాడగన్ = హరింపగా.

తే. ధర్మశాసన ఘనశిలా ♦ స్తంభమెత్త, శ్రీముకుందోద్భవస్వామి ♦ శివునిమ్రోల
పేరభిద్రేశుఁడా చంద్ర ♦ తారకముగ, నగ్రహారాళి నఖిలమా ♦ న్యంబులొసఁగి. 42

సీ. కమలాచలాగ్ర మా ♦ ర్కండేయ శివశిర, శ్శశిచంద్రికాధౌత ♦ సౌధవీథి
గోదావరీపుణ్య ♦ కూలంకషాజల, స్ఫారిత శ్రీరుద్ర ♦ పాదయుగళి
బలపదభ్యస్నాత ♦ ప్రాకారపరివేశ, గంధూషితాజాండ ♦ మండలంబు
గంధదంతావళ ♦ గ్రైవేయఘంటికా, ఠంకారముఖరము ♦ టాపథంబు

తే. రాజబింబాననాసూత్న ♦ రత్నపేటి, వీరరాహుత్త సుభటకం ♦ ఠీరవాద్రి
వేమభూపాలరాజ్యాభి ♦ వృద్ధికరము, సాంద్రవిభవంబు రాజమ ♦ హేంద్రవరము. 43

తే. వీరభద్రేశసేవప్పృ ♦ థ్వీధవులకు, మంత్రియగు బెండపూఁడన్న మంత్రివరుని
విమలవంశావతారంబు ♦ విస్తరింతు, నభ్యుదయహేతువుగఁ బ్రబం ♦ ధాదియందు. 44

## ——♦ కృతినాయక వంశావతారవర్ణనము ♦——

సీ. అకాళలక్ష్మికి ♦ నవతంసకంబైన, మునిమండలములోని ♦ మొదలి చుక్క
యఖిలబ్రహ్మాండ ♦ ముప్పిరించిన యట్టి చిన్నివేల్పులరాజుఁ ♦ గన్నతండ్రి
యాపిల్పంబునాఁ ♦ దఖిలప్రపంచంబు, సృజియించు బ్రహ్మకుఁ ♦ జేయిదోడు
పరశురామునిచేతఁ ♦ బాహోదిమేబలా, ధరసు దానముఁగొన్న ♦ బ్రాహ్మణుండు

తే. పేరుదక్షప్రజాపతి ♦ పెండ్లికొడుకు, కశ్యపబ్రహ్మ నిజవంశ ♦ కర్తగాఁగ
వెలసె సుభగాన్వయంబుల ♦ వృద్ధిఁబొంద, వ్రాలుఁబ్రాలునుగల మంత్రి ♦ పోలమంత్రి. 45

కం. సాటి పసపేటిసీటికి, హాటకగర్భునివధూటి ♦ కమరద్రుమ వనీ
వాటికి మధుకైటభరిపు, వీటికి శ్రీపోలమంత్రి ♦ విశదయశంబుల్. 46

కం. ఆమంత్రికి సుదయించిరి, శ్రీమంతులు కార్యఖడ్గ ♦ జితవైరి మహా
సాముంటిలు శ్రీ యల్లా, డామాత్యగ్రామణియును ♦ నన్నవిభుండున్. 47

కం. అల్లాడవిభుఁడు రిపుహృ, ద్భల్లాడంబరుఁడు వాఁడు ♦ భామలమనసుల్
గొల్లాడఁగ మదనుఁడు దిశ, లల్లాడఁగఁ జేయుఁ దద్భ ♦ జాటోపంబుల్. 48

---

43. కమలాచలము = రాజమండ్రినగరము పుండరీకపర్వతముమీఁద నేయున్నది; గ్రైవేయఘంటికా = మెడలోని గంట. 45. అవతంసకంబు = అలంకారము; అప్పళించిన = అణచిన; వ్రాలుఁబ్రాలునుగల మంత్రి = చదువు, ధనముకల మంత్రి. 46. హాటక...వధూటికిన్ = సరస్వతికి; అమర...వాటికిన్ = కల్పవృక్షపంక్తికి; మధు...వీటికిన్ = శ్వేతద్వీపమునకు; విశదయశంబుల్ = స్వచ్ఛమైన కీర్తులు. 48. కొల్లాడగన్ = హరింపగా.

మహాస్రగ్ధర. ఫణిరాజస్తబ్ధరోమ • ప్రకటకమఠరా • ట్పర్వతశ్రేణి దిగ్వా
రణధౌరంధర్యభారా • రభటిసమధిక • ప్రౌఢబాహాప్రతాప
ప్రణతప్రత్యర్థి పృథ్వీ • పతి మకుటమణీ • భాసమానాంఘ్రి పీఠున్
బ్రణుతింతున్ వీరభద్రుం • బ్రతిభటధరణీ • పాలకాలాగ్నిరుద్రున్. 37

సీ. పండువాసురతాణి • పావడం బిచ్చిన, భద్రేభములు వీథిఁ • బాలె ముండు
నొద్దె ధాత్రీనాథుఁ • డుపదపుత్తెంచిన, బంగారుబొక్కి సం • బెళపహించుఁ
గర్ణాటభూపతి • కానుక యనిచిన, ముక్తాతపత్రంబు • మ్రోలమెఱయు
యవనాధిపతి యుపా • యనముగా నొసఁగిన, పాగాహయంబులు • వాగెవచ్చు

తే. దూరముందంతదారుహ • దొంతిమన్నె, సప్తమాడియరాజన్య • సమితిమ్రొక్కు—
రాయవేశ్యాభుజంగ సం • గ్రామపార్థ, గాయగోవాళ వేమన • క్ష్మాధవునకు. 38

శా. దేవబ్రాహ్మణభక్తిపద్ధతిఘన • శ్రీచంద్రసామ్రాజ్య ల
క్ష్మీవాస్తోష్పతి సంస్తుతింపఁగఁదగున్ • శ్రీవేమపృథ్వీశ్వరున్
లావణ్యాపర మత్స్యలాంఛనుని నా • లంకాపురీకంధర
గ్రావాభ్యంతరకూలముద్వహయశః • కల్లోలినీవల్లభున్. 39

కం. కాంచీ శ్రీగిరి కాశీ, సంచారామాది దేవ • సదనంబుల బ్రా
ఖ్యంచెను వేమక్ష్మాపతి, యంచిత ఘనదానశాస • నాక్షరపంక్తుల్. 40

సీ. ధరియింప నేర్చిరి • దర్భపట్టెడు వ్రేళ్ల, లలితమాణిక్యాంగు • ళీయకములు
కల్పింప నేర్చిరి • గంగమట్టియ మీఁదఁ, గస్తూరికాపుండ్ర • కములు నొసల
సవరింప నేర్చిరి • జన్నిదంబుల మ్రోలఁ, దారహారములు ము • త్యాలసరులు
చేర్పంప నేర్చిరి • శిఖల నెన్నడుములఁ, గమ్మనిక్రొత్త చెం • గల్వవిరులు

తే. ధామముల వెండియును పైఁడి • దవఁబడంగ, బ్రాహ్మణోత్తము లగ్రహా • రములఁ బోల
వేమభూపాలుఁ డనుజన్ము • వీరభద్రు, ధాత్రి యేలింప గౌతమీ • తటమునందు. 41

---

37. ఫణిరాజ...పీఠున్ = ఆదిశేషు, ఆదికూర్మ, కులపర్వత, దిగ్గజముల భూభరణభారమును మోయఁగలిగిన బాహుప్రతాపముచే వంచఁబడిన శత్రురాజకిరీటములచే బ్రకాశింపఁజేయఁబడిన పాదపీఠము కలవాఁడు; ప్రతి...రుద్రున్ = శత్రురాజులకు రుద్రునివంటివాఁడు. 38. పండువాసురతాణి = పండువాదేశపు రాజు; పాలెముండుట = పడఁగాపులుపడియుండుట; ఉపదపుత్తెంచిన = కానుకగా పంపిన; సంబెళ = తాంబూలములుండుపాత్ర; ముక్తాతపత్రంబు = ముత్యాలగొడుగు; ఉపాయనము = కానుక; పాగాహయంబులు = గుఱ్ఱపుమంద; వాగెవచ్చున్ = కళ్లెము బిగపవచ్చును. 39. దేవ...వాస్తోష్పతి = దేవబ్రాహ్మణభక్తిచేఁ బొందిన సామ్రాజ్యలక్ష్మికి నిలయుఁడు; లావణ్య...లాంఛనునిన్ = సౌందర్యమున మన్మథుఁడు; ఆలంకా...వల్లభున్ = లంక మొదలు కైలాసమువరకు వ్యాపించిన కీర్తికలవాఁడు. 40. శ్రీగిరి = శ్రీశైలము. 41. పుండ్రకము = బొట్టు; ధామములన్ = ఇండ్లలో; పైఁడి = బంగారము.

తే. ధర్మశాసన ఘనశిలా • స్తంభమెత్తి, శ్రీముకుందోద్భవస్వామి • శివునిమ్రోల
వీరభద్రేశుఁడా చంద్ర • తారకముగ, నగ్రహారాళి నఖిలమా • న్యంబులొసఁగి. 42

సీ. కమలాచలాగ్ర మా • ర్కండేయ శివశిర, శ్శశిచంద్రికాధౌత • సౌధవీథి
గోదావరీపుణ్య • కూలంకషాజల, స్ఫారిత శ్రీరుద్ర • పాదయుగళి
బలపదభ్యున్నత • ప్రాకారపరివేశ, గంధూషితాజాండ • మండలంబు
గండదంతావళ • గ్రైవేయఘంటికా, ఠంకారముఖరఘం • టాపథంబు

తే. రాజబింబాననానూత్న • రత్నపేటి, వీరరాహుత్త సుభటకం • ఠీరవాద్రి
వేమభూపాలరాజ్యాభి • వృద్ధికరము, సాంద్రవిభవంబు రాజమ • హేంద్రవరము. 43

తే. వీరభద్రేశసేవ పృ • థ్వీధవులకు, మంత్రియగు బెండపూఁడన్న మంత్రివరుని
విమలవంశావతారంబు • విస్తరింతు, నభ్యుదయహేతువుగఁ బ్రబం • ధాదియందు. 44

—♦ కృతినాయక వంశావతారవర్ణనము ♦—

సీ. ఆకాశలక్ష్మికి • నవతంసకంబైన, మునిమండలములోని • మొదలి చుక్క
యఱకాల బ్రహ్మాండ • మప్పళించిన యట్టి చిన్నివేల్పులరాజుఁ • గన్నతండ్రి
యాపితల్పంబునాఁ • డఖిలప్రపంచంబు, సృజియించు బ్రహ్మకుఁ • జేయిదోడు
పరశురామునిచేతఁ • బాథోధిమేఖలా, భరము దానముఁగొన్న • బ్రాహ్మణుండు

తే. పేరుదక్షప్రజాపతి • పెండ్లికొడుకు, కశ్యపబ్రహ్మ నిజవంశ • కర్తగాఁగ
వెలసె నుభయాన్వయంబులు•వృద్ధిఁబొంద, బ్రాలుఁబ్రాలునుగల మంత్రి•పోలమంత్రి. 45

కం. సాటి చదలేటిపేటికి, హాటకగర్భునివధూటి • కమరద్రుమ వనీ
వాటికి మధుకైటభరిపు, పీటికి శ్రీపోలమంత్రి • విశదయశంబుల్. 46

కం. ఆమంత్రికి సుచయించిరి, శ్రీమంతులు కార్యఖడ్గ • జితవైరి మహా
సామంతులు శ్రీ యల్లా, డామాత్యగ్రామణియును • నన్నవిభుండున్. 47

కం. అల్లాడవిభుఁడు రిపుహృ, ద్భల్లాడంబరుఁడు వాఁడు • భామలమనసుల్
గొల్లాడఁగ మదనుఁడు దిశ, లల్లాడఁగఁజేయుఁ దద్భు • జాటోపంబుల్. 48

---

43. కమలాచలము = రాజమండ్రినగరము పుండరీకపర్వతముమీఁద నేయున్నది; గ్రైవేయఘంటికా = మెడలోని గంట. 45. అవతంసకంబు = అలంకారము; అప్పళించిన = అణచిన; బ్రాలుఁబ్రాలునుఁగల మంత్రి = చదువు, ధనముకల మంత్రి. 46. హాటక...వధూటికిన్ = సరస్వతికి; అమర...వాటికిన్ = కల్పవృక్షపంక్తికి; మధు...పీటికిన్ = శ్వేతద్వీపమునకు; విశదయశంబుల్ = స్వచ్ఛమైన కీర్తులు. 48. కొల్లాడగన్ = హరింపగా.

సీ. కాకతిక్ష్మాపాల • గంధదంతావళ, ధ్వజినీమహాధురం • ధరుఁ డనంగ
నవలక్షకోదండ • నాథరాజ్యాంభోధి, సంపూర్ణపూర్ణిమా • చంద్రుఁ డనఁగ
సంభ్రమభూమండలా • ధ్యక్షసింహాసన, సంప్రతిష్ఠాపనా • చార్యుఁ డనఁగ
వీరరుద్రాశేష • విశ్వంభరాధీశ, పృథులదక్షిణ భుజా • పీఠ మనఁగ

తే. యవనసంహార విలయకా • లాగ్ని యనఁగ, ధాటివిఘటితతుమ్మతో • ద్యానుఁ డనఁగ
విశ్వలోక ప్రశస్తుఁడై • వినుతికెక్కె, నతులబలసీరి పోలయ • యన్నశౌరి. 49

చం. కొలనుఁ బ్రతాపరుద్ర నృప • కుంజరుచేత నరేంద్రసారణీ
సలిలవివర్ధమాన బహు • సస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణ • వేళఁ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభు • తో సరియెల్లు ప్రధానులెవ్వరున్. 50

శా. అయ్యన్నయ్యకు యావదర్థ పదగ • ర్భానర్ఘగంభీరవాక్
శయ్యాకైటభవైరిశయ్యకు ఘనుల్ • షాడ్గుణ్య విద్యానిధుల్
త్రయ్యంతజ్ఞులు దేవధీమదియునున్ • దల్ల ప్రభుండున్ సుతుల్
వియ్యం బందుఁ దదీయకీర్తులు దిశా • వేదండ తుండాళితోన్. 51

శా. లక్ష్మీదేవిఁ బయోజహేతుసుతఁ బో • ల్పం బాత్రమై యొప్పు శ్రీ
లక్ష్మీదేవికి నన్నమంత్రికి సుతుల్ • లావణ్యసంపన్నిధుల్
లక్ష్మీవంతులు పేదమంత్రియును ద • ల్లప్రప్రధానుండు స
ర్వక్ష్మాధీశసభాంతర స్తుత నయ • ప్రాగల్భ్యవాచస్పతుల్. 52

కం. పన్నిటగంధజలంబునఁ గన్నయపల్లిప్రధానుఁ • డభిషేకింపన్
గన్నప పుక్కిటినీటను, గన్న యరోచికము వాయుఁ • గలకంఠునకున్. 53

సీ. ముక్కంటిపరిహాస • మున కనుప్రాసంబు, మిన్నేటిసేటికి • మిక్కుటంబు
శారదజ్యోత్స్నకు • సాదంబునకు వీప్స, నలువపట్టాంతంబు • న కనుభాష
కల్పకారామ రే • ఖకుఁ బ్రతిచ్ఛందంబు, త్రిదశేంద్రుకరటి కా • మ్రేడితంబు
పుండరీకారణ్య • మునకు నధ్యాహార, మమృతాంబునిధి కభి • ధాంతరంబు

తే. గంధసారతుషారపా • ణింధమంబు, దానవిద్యావిలాస వి • ద్యాధరుండు
మంత్రియన్నయ దేవయ్య • మహితయశము, నిఖిలదిక్తటమంతయు • నిండియుండె. 54

---

49. ధ్వజిని = సేన. 50. సారణీ = కాలువ; విభాకరగ్రహణవేళన్ = సూర్యగ్రహణసమయమున. 51. కైటభవైరిశయ్య = భాష్యకర్త; షాడ్గుణ్యవిద్యానిధుల్ = రాజనీతిజ్ఞులు; త్రయ్యంతజ్ఞులు = వేదాంతులు; దిశా...తుండాళితోన్ = దిగ్గజములతో; వియ్యంబందున్ = సాటివచ్చును. 52. పయోజహేతుఁడు = విష్ణువు; సర్వ... వాచస్పతుల్ = రాజసభలలోఁ బొగడఁబడిన నీతికౌశలముకలవారు. 53. అభిషేకింపన్ = రుద్రాభిషేకముచేయఁగా; కన్నప = కన్నప్పయను ఎఱుకవాఁడు; అరోచికము = అసహ్యము; పాయున్ = పోవును; గలకంఠునకున్ = రుద్రునకు. 54. అనుప్రాసము, మిక్కుటము, వీప్స, అనుభాష, ప్రతిచ్ఛందము, ఆమ్రేడితము, అధ్యాహారము, అభిధాంతరము = సమమైనది; పాణింధమము = ఊదునది; నలువపట్టాంతంబునకున్ = వాణికి; త్రిదశేంద్రుకరటికిన్ = ఐరావతమునకు; మహితయశము = గొప్పకీర్తి.

మహాస్రగ్ధర. వియదాశా భూతధాత్రీ • విహృతికలన ని • ర్విఘ్న సంభారనిఘ్నా
 వ్యయకీర్తిస్ఫూర్తి ముద్రా • హసితశశికరీ • టాట్టహాస స్వయం భూ
 దయితా మందార చంద్రా • తప సురతటినీ • తార నీహారుతో న
 న్నయ దేవామాత్యుతోడన్ • హరహర సరియే • యన్యభూపాల మంత్రుల్. 55

ఉ. ధీరుఁడు దేవమంత్రి నయ • ధీగుణనిర్జిత దేవమంత్రి శ్రీ
 వీరయదేవవల్ల్యధిప • విశ్వవిభు ప్రియపుత్రి రామమాం
 బారమణీమణిన్ భువన • పావనవర్తనఁ బెండ్లియాడె నం
 భోరుహనేత్రుఁ డంబునిధి • పుత్రికఁ బెండిలియాడుకైవడిన్. 56

సీ. జగదేక సంస్తుత్య • సౌభాగ్యసంపద, రతిదేవిఁబోలునీ • రాజవదన
 పరమపాతివ్రత్య • భాగ్యగౌరవమున, భూపుత్రిఁబోలునీ • పువ్వుఁబోణి
 యక్షీణమహిమఁగ • ల్యాణవైభవమునఁ, బార్వతిఁబోలునీ • పద్మగంధి
 ప్పృమగభీరప్రౌఢ • మితభాషణంబుల, భారతిఁబోలునీ • పరమసాధ్వి

తే. యనుచు బంధులు వినుతింప • నవనిమించె, నధికసుభగాత్రి విశ్వనా • యకునిపుత్రి
 యన్నవిభుదేవమంత్రి • యర్ధాంగలక్ష్మి, రమ్యసద్గుణనికురుంబ • రామమాంబ. 57

తే. సింధుకరికాశ భల్లాణ • సేనయాది, పరమమాహేశ్వరాచార • పరులసరణి
 నన్నవిభుదేవయామాత్యు • నెన్నవచ్చుఁ, బార్వతీవల్లభునిమీఁది • భక్తిగరిమ. 58

శా. ఆ రామాంబకు దేవమంత్రికిని ద • క్షారామభీమేశ్వర
 స్ఫారాపార కృపాగుణోదయమునం • బన్నించి రాత్మోద్భవుల్
 ధీరోదాత్తుఁడు లింగమంత్రి విభుఁడున్ • ధీశాలి తల్లన్నయున్
 బారావార గభీరుఁడన్న ధరణీ • పాలుండు లక్ష్మీనిధుల్. 59

ఉ. సంగరసవ్యసాచికిఁ బ్ర • శస్తవితీర్ణిదధీచికి స్మరా
 పంగశచారుమూర్తికి స • పంచిత నిర్మలధర్మమూర్తికిన్
 లింగనమంత్రికిన్ విశద • నీతిధురావిబుధేంద్రమంత్రి కు
 త్తుంగతర ప్రతాపగుణ • ధూర్జటి కెవ్వరుసాటి ధారణిన్. 60

55. వియదాశా...కలన=భూమ్యాకాశముల విహరించు; నిర్విఘ్న... ముద్రా=కీర్తిప్రకాశముచే; హసిత...నీహారుతో=నవ్వఁబడిన శివునియట్టహాసము, వాణి, మందారము, వెన్నెల, గంగ, చుక్కలు, మంచుకలవాఁడు. (స్వచ్ఛమైన కీర్తి కలవాఁడని భావము) 56. నయ...దేవమంత్రి=నీతికౌశలమున గురునిమించినవాఁడు; అంభోరుహనేత్రుఁడు=విష్ణుమూర్తి. 57. రాజవదన=చంద్రునివంటి ముఖముకలది; రమ్య...నికురుంబ=మంచి గుణములరాశి. 58. పరమ...సరణిన్=వీరశైవ మత భక్తిలో. 59. దక్ష...ఉదయమునన్=దక్షారామభీమేశ్వరుని కృపచే; ఆత్మోద్భవుల్=కొడుకులు. 60. సంగరసవ్యసాచి=యుద్ధమున నర్జునుఁడు; ప్రశస్త...దధీచి= దానమున దధీచి; విశద...మంత్రి=నీతిలో బృహస్పతి; ఉత్తుంగ...ధూర్జటి= గొప్ప ప్రతాపమున శివునివంటివాఁడు.

సీ. ఖండశర్కర జొన్న • కండచక్కెరలు దో, సెలువడ ల్సేవెపా • సెములతోడఁ
గమ్మఁగాఁ గాఁచిన కపిలయాలనేతితోఁ, గమనీయపంచ భ • క్ష్యములతోడ
సంబారములతోడి • శాకపాకములతోడఁ, బక్వమైన పెసర • పప్పుతోడఁ
దేనియధారతోఁ • దాసకంబులతోడ, శిఖరషాడబ రస • శ్రేణితోడ
తే. నచ్చులవణాదికములతోడ • నమృతఖండ, పాండరంబైన దధితోడ • బ్రాహ్మణులకు
భోజనముపెట్టు ద్వాదశీ • పుణ్యవేళ, లింగమంత్రి నవీన రు • క్మాంగదుండు. 61

కం. ప్రతిఘటియింపఁగవచ్చునె. ప్రతిభటులకు నసమసమర • ఫల్గునుతోడన్
శతకోటిదృఢకఠార, క్షతశాత్రవుతోడ లింగ • సచివునితోడన్. 62

సీ. ఝూడేశవసస్త • మాడెదారుహదొంతు, వంతునాదిక్షితి • పతుల గెలిచి
యొడ్డాదిమత్స్య పం • కోదయార్జునుచేతఁ, బల్లవాధిపుచేతఁ • బలచమంది
దండకారణ్యమ • ధ్యపుళిందరాజరం, భాహివంశజులకు • నభయ మొసఁగి
భానుమక్కల పీఠ • భద్రాన్న దేవేంద్రు, గర్వసంరంభంబుఁ • గట్టిపెట్టి
తే. యవనకర్ణాటకటక భూ • ధవులతోడ, బిరిమివాటించి యేలించెఁ • దెలుఁగుభూమిఁ
దననిజస్వామి నల్లాడ • ధరణినాథు, బళిరె యరిమేటిలింగన • ప్రభువరుండు. 63

కం. దేవబ్రాహ్మణభూములు, భూవరునకుఁ జెప్పి ధార • వోయించె భళీ
దేవయలింగన ప్రియసం, భావననిరుపాధి సర్వ • మాన్యంబులుగన్. 64

చం. అవుర! ప్రతాపపేమ వసు • ధాధిపుచే నృపపట్టభద్రుచే
భువన మనోహరంబయిన • బోదసకుర్తి మహాస్థలంబునన్
దివిరి పరిగ్రహించె మన • దేవయలింగనమంత్రియన్న చో
డవర మహాగ్రహారముఁ • గడంకఁ గవిద్విజబంధురక్షకై. 65

---

61. జొన్న=జొన్నగడ్డ; సేవె=గోధుమనూక పాలుకలిపివండిన పిండివంట; పాసెము=పరమాన్నము; కపిలయాలనేయి=కపిలగోఘృతము; శిఖర=పండినదానిమ్మగింజలు; షాడబరస=పులుసు. 62. అసమసమరఫల్గునుఁడు=సాటిలేని, యుద్ధమందర్జునుఁడతటివాఁడు; శత...శాత్రవుతోడన్=వజ్రమువంటి కత్తిచే నఱకఁబడిన శత్రువులు కలవానితో. 63. పలచము=కప్పము. 64. సర్వమాన్యంబులుగన్=ప్రతిఫలమక్కఱలేని మాన్యములుగా. 65. బోదసకుర్రు, చోడవరము=తూర్పుగోదావరి, విశాఖజిల్లాలలోని యూళ్లు; కడంకన్=పూనికతో.

సీ. వాహ్యాళిభూమి రే • వంతనైషధు లట్లు, హయరత్నములనెక్కి • యాడనేర్చుఁ
గవిబుధశ్రేణికిఁ • జెవులుపండువులుగా, నాస్థానమున మాట • లాడనేర్చు
శక్తిత్రయంబునఁ • జతురుపాయంబుల, షాడ్గుణ్యముల బుద్ధిఁ • జరుపనేర్చుఁ
గైసేసి ప్రత్యక్ష • కందర్పమూర్తియై, నిర్వికారంబున • నిలువనేర్చు
తే. నిష్ఠురాటోపవిస్ఫూర్తి • నృహరి కరణి, నతికఠోర కుఠార ధా • రాంచలమున
వైరివక్షస్థ్సలము వ్రచ్చి • వైవనేర్చు, సంగరార్జునుఁ డరియేటి • లింగవిభుఁడు. 66

ఆ. లింగమంత్రి ధామ • గంగాంబికాదేవి, గనియె సుతుల నర్థి • కల్పతరుల
భవ్యరూపవంచ • బాణావతారుల, మంత్రిమంత్రి దేవ • మంత్రివరుల. 67

తే. కశ్యపాన్వయపాథోధి • కల్పశాఖి, సర్వగుణరత్నరోహణ • క్ష్మాధరేంద్ర
మభ్యుదయమందు మంత్రిలింగ•య్య సుతుఁడుమదనగోపాలసన్నిభ•మంత్రిమూర్తి. 68

ఉ. చంచలలోచనాకుసుమ • చాపుఁడు దానకళాదధీచి యా
శాంచలవారణేంద్ర దశ • నాంకుర నిర్మలకీర్తి వైభవా
భ్యంచిత సర్వలోకుఁ డన • పాయరమావిభవ ప్రపంచరా
త్రించరశాత్రవుండు మన • దేవయతల్లన మంత్రిమాత్రుఁడే. 69

కం. ఈవసుధామండలమున, నేవారును సరియె రూప • హేలానుస్మృత
శ్రీవత్సలాంఛనునకును, దేవయతల్లనికి మంత్రి • దేవేంద్రునకున్ 70

కం. నాళీకభవవధూ స్తన, పాళీకల్హారకస్య • పరిమళ లహరీ
శాలీనతావిధాయి వ, చోలీలలు తల్లనార్థి • సురభికి నమరున్. 71

తే. తదనుసంభవుఁ డఖిల వి • ద్యావిరించి, యాచిజనకామధుగ్ధేను • వన్నమంత్రి
క్రీడసల్పును వాని స • త్కీర్తికాంత, సప్తలోకమహోత్సవ • సౌధవీథి. 72

మ. అరవీభాష తురుష్కభాష గజక • ర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభా • షా సింధు సౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం • భాషావిశేషంబు ల
చ్చెరువై వచ్చు నరేటియన్ననికి గో • ష్ఠీసంప్రయోగంబులన్. 73

---

66. వాహ్యాళి=స్వారి; శక్తిత్రయము=ప్రభుమంత్రోత్సాహ శక్తులు; చతురుపాయంబులు=సామదానభేద దండములు; షాడ్గుణ్యములు=సంధి, విగ్రహ, యాన, సన, ద్వైధ, శ్రయములాఱు; కైసేసి=అలంకరించుకొని; నృహరికరణిన్ = నరసింహమూర్తివలె; కుఠారధారాంచలమునన్ =గండ్రగొడ్డలి పదునుతో; వ్రచ్చి వైవనేర్చున్=చీల్చి పాఱవేయును. 68. సర్వ...క్ష్మాధరేంద్రము=గుణములను రత్నములకు రోహణపర్వతమువలె పుట్టినిల్లైనవాఁడు. 69. ఆశాంచల...కీర్తి= దిగ్గజదంతములవలె స్వచ్ఛమైన కీర్తికలవాఁడు; అనపాయ...శాత్రవుఁడు=విష్ణువువలె లక్ష్మికి స్థిరనివాసమైనవాఁడు. 70. రూప...లాంఛనునకున్ =రూపమున విష్ణువును పోలినవానికి. 71. నాళీక...లీలలు=సరస్వతి చనుదమ్ములనిగాఁడి కలువల పరిమళముకల వాగ్విలాసములు; అర్థిసురభి=యాచకులకు కామధేనువు. 72. తదనుసంభవుఁడు=అతని తమ్ముఁడు; విరించి=బ్రహ్మ; అర్థి...ధేనువు=యాచకులకు కోర్కెలనిచ్చువాఁడు. 73. గోష్ఠీసంప్రయోగంబులన్ =సభలలో.

ఉ. అన్నయ మంత్రిశేఖరుఁ డ • హమ్మదుసేనువదాన్యభూమిభృ
త్సన్నిధికి న్మది వ్వసుచి • తంబుగ వేమ మహీసురేంద్ర రా
జ్యోన్నతి సంతతాభ్యుదయ • మొందఁగఁ బారసిభాష వ్రాసి సం
గన్నులపండువై యమరుఁ • గాకితమందలి వర్ణపద్ధతుల్. 74

సీ. రాజమహేంద్ర దు • ర్గమునఁ గావించె శ్రీ వీరభద్రునకుఁ బ్రా • కారరేఖ
నిలిపె మార్కండేయ • నీలకంఠుని మ్రోల, రామేశుఁ దమతల్లి • నామకముగ
సంగమేశ్వర దివ్య • శంభులింగమునకుఁ, గల్పించెఁ గళ్యాణ • గర్భగృహము
దక్షవాటికయందుఁ • దరుణేందుమౌళికి, మొగలివాకిట ధామ • మును రచించెఁ

తే. ప్రాగ్దిశావప్రగోపుర • ప్రాంగణమున, సప్తమునిసింధుసోపాన • సరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయ • దేవునగ్ర, మంత్రిదేవయ యన్నయా • మాత్యవరుఁడు. 75

ఉ. భావనసంతసిల్లఁగ వి • భావసుజాప్తుని విద్విషత్పరా
భావ నవీనశౌరిఁ బ్రవి • భావుని నిఖిలక్షమాజనుల్
దీవనలిచ్చి మెచ్చుదురు సు • ధీవనరాశి నుతింతు రుత్తముల్
దేవనమంత్రి యన్నవిభు • దేవ నదీ వన పావనాన్వయున్. 76

కం. సిరియేలికయగు సరకే, సరి యేమో కాని గర్వ • సంరంభముమైన్
సరి యేపొనరఁగ నితరులు, సరిరాపే యరియేటియన్న • సచివాగ్రణికిన్. 77

శా. కాంచీకంకణదామహారకటక • గ్రైవేయ భూషావళుల్
లంచంబిత్తురు దూతికాతతికి లీ • లన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపముఁ దారతార కవయన్ • బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్లెలఁ బురిం • బ్రౌఢేందుబింబాననల్. 78

తే. తారగిరిమందరముల బృం • దారకావి, తారకారాజవదనలు • తారుతార
తారధారా శ్రుతి స్వరో • దారలీలఁ, బాడుదురు బెండపూఁడన్న • భవ్యకీర్తి. 79

---

74. వర్ణపద్ధతుల్ = అక్షరపంక్తులు. 75. నిలిపెన్ = ప్రతిష్ఠించెను; ధామము = మంటపము; సప్త...కెలనన్ = సప్తగోదావరీ సోపానముల ప్రక్కన. 76. విభావసుజాప్తుని = కౌంతిలో సూర్యునివంటివాని; విద్విషత్...శౌరిన్ = శత్రుల నవమానించుటలో విష్ణువంటివాని; నిఖిలక్షమాజనుల్ = జనులెల్లరు; సుధీవనరాశి = బుద్ధిసముద్రుఁడు; దేవనదీవన = గంగోదకమువలె. 77. గర్వసంరంభముమైన్ = గర్వాడంబరముతో; సరియేపు = సమమైన పెంపు. 78. తారతార = తామతామే; కవయన్ = కూడుటకు; ప్రౌఢేందుబింబాననల్ = పూర్ణచంద్రముఖులు. 79. తారగిరి = ఎత్తగు కొండ; తారకారాజవదనలు = చంద్రముఖులు; తారుతార = తమంతటతామే; తార... లీలన్ = ఉచ్చశ్రుతి స్వరవిలాసములతో.

సీ. కలకంఠములఛాయఁ • గల కంఠకోణంబు, నాగకుండలముల • నాగరకతఁ
జూడఁజూడఁగనొప్పు • సురసరిత్పూరంబుఁ, గాలఁగాలవిభాళ • కటకముద్ర
మేన మేనాత్మజా • మానినీరత్నంబుఁ, గేలికురంగంబుఁ • గేలి వ్రేల
భస్మోపవాహంబుఁ • బాండుదేహంబునఁ, గటినిబుట్టంబైన • కరటితోలు

తే. వికటశృంగారమున నొప్పు • వేల్పు తేని, నాగమోపనిషన్మనో • హరుని హరుని
కర్చమున సేయు సంధ్యాత్ర•యంబులందు, బెండపూఁడన్న కన్నుల•పండువుగను. 80

సీ. అఖిలదిగ్దంతి దం • తాగ్రశంబుల వ్రాయు, నధిపుదిగ్జయశాస • నాక్షరములఁ
గువలయాక్షుల మించు • గుబ్బచన్నులవ్రాయుఁ, గుంకుమపత్ర భం • గాంకురముల
గర్వితారాతి ప • క్షస్థలంబుల వ్రాయు, నయకార్యసరణికి • నాంకములను
నర్థిసందోహ ఫా • లాంచలంబుల వ్రాయు, లక్ష్మీప్రదములైన • లక్షణములఁ

తే. బసిఁడిగంటాన భూపాలు • పార్శ్వసీమ, వ్రాయు నయకావ్యసరణికే • వలమకాదు
వేమధాత్రీశపత్రుగా • రాము మంత్రి, యతులగుణహారి బెండపూఁ • డన్నశౌరి. 81

—♦ షష్ఠ్యంతములు ♦—

కం. ఇట్టి మహిమంబు గల జగ, జెట్టికి సర్థార్థిలోక • చింతామణికా
రట్టహయధట్టసేనా, ఘట్టితరిపుపట్టణోప • కంఠక్షితికిన్. 82

కం. కంఠీరవవిక్రమునకు, కుంతప్రతిభునకు దాన • గుణసురభికి శ్రీ
కంఠాంఘ్రి కమలనయనో, త్కంఠా వైకుంఠునకు న • ఖండితధృతికిన్. 83

కం. దుగ్ధపయోధిసుధారస, ముగ్ధేందుధరాట్టహాస • మురహరశయ్యా
దిగ్ధూర్ధర కరటిఘటా, స్నిగ్ధయశోదిగ్ధ రోద • సీకుహరునకున్. 84

కం. చెంచుమలచూఱకారుడవ, కంచితబాహాపరాక్ర • మాధారునకున్
పంచారామ వధూటీ, పంచాస్త్ర విహారకేలి • పాంచాలునకున్. 85

80. కలకంఠములఛాయ = కోకిలల నలుపు; సురసరిత్పూరంబు = గంగాప్రవాహము; కాలన్ = కాలియందు; మేనన్ = శరీరమందు; మేనాత్మజామానినీరత్నంబు = పార్వతి; కేలిబ్రేలన్ = చేతిబ్రేళ్లలో; కేలికురంగము = ఆటలేడి; భస్మోపవాహము = భస్మపుఁబూత; పాండుదేహంబునన్ = తెల్లనిశరీరమున; కటిని = మొలను; పుట్టంబైన = బట్టయైన; కరటితోలు = గజచర్మము; వేల్పుతేని = దేవరాజగు. 81. ధాత్రీకళత్రుఁడు = రాజు. 83. సురభి = కామధేనువు; శ్రీకంఠ ... వైకుంఠునకున్ = శివుని పాదపద్మసేవ సేయువానికి. 84. దుగ్ధ ... కుహరునకున్ = పాలసముద్రము, అమృతము, శివునియట్టహాసము, ఆదిశేషుఁడు, దిగ్గజములతో పరిచయముకల కీర్తిచే నింపబడిన భూమ్యాకాశముల మధ్యప్రదేశము కలవాఁడు. 85. చెంచుమలచూఱకారునకున్ = చెంచులున్న కొండను కొల్లగొట్టినవాఁడు.

౮౦. శ్రీవీరభద్రవేమ, క్ష్మావరరాజ్యాభివృద్ధి • కారణమునకున్
లావణ్య రూపసంపదఁ, బూవిలుకానికిని బెండ • పూఁడన్ననికిన్. 86

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ గథా నాయకుండైన భీమేశ్వర మహాదేవునకుఁ బ్రియధామంబైన దక్షారామపుర వర్ణనం బెట్టిదనిన. 87

—♦ దక్షారామపురవర్ణనము ♦—

సీ. పర్యంత మందార • పారిజాతకవనీ, రమమాణనిర్జరీ • సముదయంబు
సరసరసానిద్ధ • వరవారి సంపూర్ణ, గంభీరతరపరి • ఖాపయోధి
ప్రబలచింతారత్న • పాషాణసంఘాత, వప్రరేఖాచక్ర • వలయితంబుఁ
గామధేనుసహస్ర • కలితసరింఖాటంబు, దళనదంతురితర • థ్యాముఖంబు
తే. భద్రపాతాళభైరవ • పాలితంబు, గుహవినాయక రక్షణా • కుంఠితంబు
సప్తమాతృకపరివార • సంకులంబు, వసుమతీనూపురము దక్ష • వాటిపురము. 88

సీ. కాంతిసంపదనేల • కైవార మొనరింప, విధుబింబమున నుద్భ • వించిరనిన
మాధుర్యగుణమేల • మాటిమాటికిఁ జెప్ప, నమృతాబ్ధి నవతార • మందిరనినఁ
దేజోవిశేషంబు • తెలుఁగు పల్కఁగనేల, విద్యుల్లతలలోన • వెడలి రనిన
మోహనాకృతియేల • మునిమాడి కొనియాడఁ, బుష్పచాపుని వింటఁ • బుట్టిరనిన
తే. సంభవించిరి గంధర్వ • జాతిననినఁ, గలితనంబేల పెన్నాట • కంబుసేయ
ననఁగ భీమేశ్వరునిఁ గొల్తు•రప్పురమున, సానులనుపేరి యుప్సర•శ్చంద్రముఖులు. 89

మ. మొరయింపన్ సురుఁ డిక్షుచాప మనిశం • బుం చక్షవాటీ మహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువన్ • బు త్తెంచులీలం బురం
దర విశ్రాణితదేవతా భువనగం • ధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహనూపురస్వనములన్ • జంకించు ఝుంకారముల్. 90

87. ప్రియధామము=ఇష్టమైన నివాసము. 88. పర్యంత=ప్రాంతమందున్న; వనీ=వనమునందు; రమమాణ=క్రీడించు; నిర్జరీ=దేవతాస్త్రీలు కలది; కామధేను... ముఖంబు=చాల కామధేనువుల గిట్టలదెబ్బలకు మెరకపల్లములైన వీధులు కలది; గుహ=కుమారస్వామిచే; సప్తమాతృక=బ్రాహ్మి మున్నగు నేడు మాతృదేవతల యొక్క; వసుమతీనూపురము=భూదేవి కంటెవంటిది. 89. నేల=నేలను; కైవారగ మొనరింపన్=సేవించుటకు; విధుబింబమునన్=చంద్రబింబమందు; (అప్సరసలు చంద్రునినుండి పుట్టిరి) అమృతాబ్ధిన్=అమృతముకల సముద్రములో; విద్యుల్లతలు=మెఱుపులు; మునుమాడి=ఎక్కువగాఁజెప్పి; కలితనంబు=సామర్థ్యము; సానులను పేరి=వేశ్యలను పేరుతోనున్న. 90. మొరయింపన్=మ్రోయింపగా; అనిశంబున్=ఎల్లపుడును; పురందర...స్వనములన్=ఇంద్రునిచే నియ్యఁబడిన దేవ, గంధర్వాప్సర స్త్రీల కాలియందెల చప్పుళ్లయందు; జంకించున్=భయపడును.

శా. గంధర్వోపనిషద్రహస్యములు వ • క్కాణింతు రాలాప సం
బంధ ప్రస్ఫుటఝుంటుఝుంటుపద గుం • ఫస్థాపవర్గావళీ
సంధానక్రమ దివ్యమంత్రకములన్ • సాయాహ్న కాలంబులన్
గంధర్వాప్సరసల్ పురోపవనికా • కల్పద్రుమచ్ఛాయలన్. 91

సీ. చరణద్వయీభూరి • సౌభాగ్యసంపదఁ, బరిభవింతురు హేమ • పద్మవనము
ఘననితంబస్థలీ • గౌరవాభ్యున్నతి, సంప్రతింతురు నదీ • సైకతముల
గంభీరతరనాభి • గర్తవిభ్రమముల, ప్రక్కలింతురు జలా • వర్తశోభ
గురుపయోధరభార • పరిణాహ విస్ఫూర్తి గుద్దలింతురు హేమ • కుంభగరిమ

తే. గారవింపుదు కంఠోప • కంఠకాంతిఁ, గంబుమణికాంతి బిబ్బోక • డంబరంబు
మచ్చరింతురు ముఖచంద్ర•మండలములఁ, బూర్ణశశిమండలముతోడఁ•బురముసతులు. 92

శా. దక్షారామ విలాసినీతతుల సౌం • దర్యంబు వర్ణింపఁగాఁ
జక్షుశ్శ్రోత్ర కులాధినాయకునకున్ • శక్యంబె? తచ్చారు పా
లక్షేత్రంబును బోలలేక మునిఁగెం • లజ్జాభరాక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖర సుధాం • ధస్సింధుపూరంబులన్. 93

సీ. అంబుధర[1]శ్రేణి • హరిణలాంఛనరేఖ[2], క్రముకార్ముక[3]వల్లి • కామతల్లి
జలచరద్వంద్వంబు[4] • చంపకప్రసవంబు[5], బింబంబు[6] దాడిమ[7] • బీజరాజి
శష్కులీయుగళంబు[8] • చారుదర్పణములు[9], శంఖంబు బిసములు[10] • జలరుహములు[11]
పసిఁడికుంభంబులు[12] బయ[13]లంబువీచులు[14], పుష్కరావర్తంబు[15] • పులినతలము[16]

తే. కదళికా[17] హేమకాహళ[18] • కచ్ఛపములు[19], మణులబంతులు తారకా • మండలములు
సంఘటించి పురంబు వే • శ్యల సృజించె, జాణదేవరశ్రీ[20]పంచ • శరవిరించి. 94

---

91. గంధర్వోపనిషద్రహస్యములు=సంగీతశాస్త్ర మర్మములు; పురోపవనికా=నగరోద్యానమందలి. 92. జలావర్తశోభన్=నీటిలోని సుడిని; కంబు... డంబరంబు=శంఖముల, మణుల కాంతి విలాసములను; సతులు=స్త్రీలు. 93. చక్షుశ్శ్రోత్రకులాధినాయకునకున్=ఆదిశేషునకును; తత్...క్షేత్రంబును=వారి సుందరమగు ముఖమును; శంభు...పూరంబులన్=శివుని జటలలోని గంగోదకములలోను; నక్షత్రేశుఁడు=చంద్రుఁడు. 94. (1) మబ్బులు (2) చంద్రకళ (3) విల్లు (4) చక్రవాకములజంట (5) సంపెఁగపువ్వు (6) దొండపండు (7) దానిమ్మగింజలు (8) దొప్పలు (9) అద్దములు (10) తామరతూండ్లు (11) తామరపువ్వులు (12) బంగరు కుండలు (13) ఆకాశము (14) కెరటములు (15) నీటిసుడి (16) ఇసుకతిన్నె (17) అరఁటికంబము (18) బంగరు మద్దెల (19) తాఁబేలు (20) మన్మథుఁడను బ్రహ్మ (ఇవన్ని యుపమానములు)

సీ. ముడువంగనేర్తురు • మూలఁగమ్మనితావి, గలుగు క్రొవ్విరులు లోఁ • గండకుండ
మురియంగనేర్తురు • మోహనాస్పదమైన, మొగలివాకిటిచాయ • నగరవీధి
నలపింపనేర్తురు • వలరాజుగెలిచిన, పెద్దగాలమువేల్పు • భీమనాథుఁ
బలుకంగనేర్తురు • పాటలాధరముల, మొల్కతేనగవులు • ముద్దుగురియఁ

తే. బందురునితోడఁ గల్పవృ • క్షములతోడఁ, దారతో లక్ష్మితో నమృ • తంబుతోడఁ
గౌస్తుభముతోడ మున్నీఁటఁ • గలిగినారు. విబుధగంధర్వజాతు ల • వ్వీటిసతులు. 95

కం. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁదలరుసొంపు • వీడ్కోలుపుఁ బురిన్
వేఁబోకఁబోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ • బొదలినగాడ్పుల్. 96

ఉ. వీటికి నాల్గువంకలను • వెన్నెలతేటలఁబోలు నీళ్లతో
హాటకపద్మమండితము • లైన కొలంకులు చూడనొప్పుగున్
జీటికిమాటికిన్ హరుఁడు • జృంభితలీల నటింప మౌళి మి
న్నేటిక్రొపీటనిర్ఝరము • లింతటనంతటఁ జిందెనోయనన్. 97

సీ. తిలకంబుబలుతేని • యలఁబోఁకమోపల, పువ్వుఁబాళలతావిఁ • బుక్కిలించి
కలమగోపికల చ • క్కని చన్నుగవలపై, వటపల్లవంబులు • వాయఁదట్టి
సప్తగోదావర • జలతరంగారోహ, కేలీసుఖంబు లం • గీకరించి
దేవగంధర్వ లీ • లావతీహాటక, ప్రాసాదవలభి గ • ర్భములుఁదూఁటి

తే. ప్రతిదినము దక్షవాటీ పు • రంబునందు, మలయ వేలావనీ • మందమారుతంబు
గంధసారలతా కుడుం • గముల మెలఁగు, చిలువరేములు సేవింప • వెలితిపడుచు. 98

తే. దక్షవాటికఁ బశ్చిమ • ద్వారభూమిఁ, బ్రతివసించును సర్వాంగ • రమ్యయగుచు
సేవకులపాలి సురశాఖి • పూవుఁగొమ్మ, కోమలార్ధేందుధరుకొమ్మ • గోఁగులమ్మ. 99

తే. దక్షపురమున నుత్తర • ద్వారమందు, నూర్జితంబుగ నుండు మ • హోజ్జ్వలాంగి
కామితార్థైకసంకల్ప • కల్పవల్లి, మహితసుగుణమతల్లి శ్రీ • మండతల్లి. 100

కం. సారమతి దక్షవాటిక, తూరుపుగవనిన్ బ్రసిద్ధి • తో వసియించున్
హేరాళక్రీడాసం, చారిణి నూకాంబ భక్త • జనరక్షకయై. 101

---

95. క్రొవ్విరులు=అప్పటికప్పుడు వికసించిన పుష్పాలు; వలరాజు=మన్మథుఁడు; పాటలాధరములన్ = లేయెఱుపైన పెదవులందు; మున్నీఁటన్ = సముద్రములో; అవ్వీటిసతులు=ఆయూరి స్త్రీలు. 96. వేఁబోకలన్ = ఉదయవేళల; తలరుసొంపు= వీచెడిరీతి; పూఁబాళలకమ్మతావిన్ = పోఁకపూల సువాసనలతో; గాడ్పుల్ = గాలులు. 97. వీటికి=నగరమునకు; హాటకపద్మమండితములు=బంగరు తామరలు కలవి; మౌళి...నిర్ఝరములు=జటాజూటమందలి గంగాప్రవాహములు. 98. అల...తావి=పోఁక మొక్కల పూలవాసన; వటపల్లవంబులు=మఱ్ఱిచిగుళ్లు; లీలావతీ=స్త్రీల; హాటక...గర్భములు=బంగారు మేడల చూరులు; గంధ...కుడుంగములన్ =చందన చెట్లపొదలలో; చిలువరేములు=నాగకన్యలు. 99. సుర...కొమ్మ=కల్పవృక్షము; గోఁగులమ్మ, మండతల్లి, నూకాంబ, ఘట్టాంబిక=పరివారశక్తులు. 101. తూరుపుగవనిన్ =తూర్పుద్వారమున.

కం. మట్టయినయట్టి దక్షిని, పట్టణమున దక్షిణంబు • పార్శ్వపుగవనిన్
నెట్టుకొని వెలసి నిలిచిన, ఘట్టాంబికఁ గొల్వఁ గలుగుఁ • గామితఫలముల్. 102

తే. పృథివిఁ బదునెనిమిది యోగ • పీఠశక్తి, గణములం దెంచ సర్వశృం • గారయగుచు
భీమనాథుని సన్నిధిఁ • బ్రేమ వెలయు, మాణికాదేవి సకల క • ల్యాణమూర్తి. 103

ఉ. ఏదెసఁ జూచినన్ విబుధు • లేదెసఁ జూచిన మౌనిమండ లం
బేదెసఁ జూచినన్ హరి ద • దీశ్వరవర్గము వాసవాది యం
చేదెసఁ జూచిన న్నవమ • హేశ్వరమూర్తులు శ్రీనికుంభ కుం
భోదరతండు భృంగిరిటి • హూహుకహాహులు దక్షవాటికన్. 104

సీ. విపులదండలతోడి • వేణికాభారంబు, పొంకంబు పిఱుఁదులఁ • బొరలియాడ
మణితులాకోటి కో • మలఝణత్కారంబు, రవలిమట్టెలమ్రోఁత • యవఘళింపఁ
గుచులనిండినచిన్ని • గుబ్బచన్నులమీఁద, ముత్యాలత్రిసరంబు • మురువుఁజూప
వలమానతాటంక • వజ్రాంకురచ్ఛాయ, లేఁతవెన్నెలఁ బుక్కి • లించి యుమియ
తే. సాని యీశానియై మహో • త్సవమునందుఁ, గేల నవచంద్రకాంతపు • గిన్నెపూని
పేళిభిజాటనమొనర్చు • వేళఁ జేయు, మరులనృత్యంబు జగముల • మరులుకొలుపు. 105

సీ. వేదండవదనపుం • దాదండచుళికిత, ప్రోక్షితాంభశ్ఛటా • ప్లుతనభంబు
దేవగంధర్వాప్స • రోవధూటీస్తన, స్థాసక శ్రీగంధ • ధవళితంబుఁ
గనకసౌగంధిక • గంధోత్తమాగంధ, సారనిష్పంద పు • ష్పంధయంబుఁ
జటులవీచీఘటా • ఝూటడోలారూఢ, హంససంస న్నినా • దాలసంబు
తే. భూరితీరావనీఘనీ • భూత చూత, జాతివకుళవనీసమా • చ్ఛాద్యమాన
బహుళసింధు ధునీవన • బకమరాళి, దక్షపురియొద్ద సప్తగో • దావరంబు. 106

---

102. మట్టయినయట్టి = సురక్షితమైన. 103. ఎంచన్ = ఎన్నునట్లు; మాణికాదేవి = మాణిక్యాంబ. (భీమేశుని భార్య) 104. విబుధులు = దేవతలు; హరి...వర్గము = దిక్పాలకులు; శ్రీనికుంభ...హాహులు = నికుంభాదులు, ప్రమథులు, హాహాహూహూలు, గంధర్వులు. 105. వేణికాభారము = బరువైన జడ; మణి...ఝణత్కారంబు = మణులు గుప్పిన యందెలమ్రోత; అవఘళింపన్ = అణచగా; త్రిసరంబు = మువ్వేటదండ; వలమాన = చలించుచున్న; పుక్కిలించియుమియన్ = తక్కువచేయగా; ఈశాని = పార్వతి; మరులుకొలుపన్ = మనోహరముగానుండును. 106. వేదండ...నభంబు = వినాయకుఁడు పుక్కిలించిననీటితో నిండిన యాకాశము గలది; దేవ...ధవళితంబు = దేవ గంధర్వాదిస్త్రీలు స్తనములపై రాసికొన్న కుంకుమాగులపూతచే తెల్లనైనది; కనక...పుష్పంధయంబు = బంగారు చెంగల్వల వాసనలచే చిలుపాల మొక్క, మంచిగంధపు మొక్కలపైకి కదలని తుమ్మెదలు కలది; చటుల...అలసంబు = కెరటములను నుయ్యాలలపై నూగు హంసల కూతలతో కూడినది; భూరి...మరాళి = ఒడ్డున మొలిచిన దట్టమైన మామిడి, జాజి, వకుళ వృక్షముల తోపులచే కప్పఁబడిన గోదావరిలోని కొంగలు, హంసలు కలది; సప్తగోదావరంబు = వృద్ధ గౌతమీనది.

సీ. సరివచ్చు ననవచ్చు • శతమన్యువీటికి, వివిధదేవాగార • విభ్రమమునఁ
బ్రతివచ్చు ననవచ్చుఁ • బాలమున్నీటికి, నక్షయం బగు జీవ • నాభివృద్ధి
నెనవచ్చు ననవచ్చు • నిందుబింబమునకు, సకలకళావిలా • స ప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చుఁ • దోయజాక్షునిమూర్తి, కభిరామలక్ష్మీ స • మగ్రమహిమఁ
తే. జెప్పనొప్పదె యప్పుర • శ్రీసహస్ర, ధవళశరదీర్ఘదృక్పుట • ధాళధళ్య
సమ్మిళద్భీమనాథ భూ • షాశశాంక, తరళదీధితిపరిపాటి • దక్షవాటి. 107

కం. రోధించు నభముఁ బటికపు, సౌధంబులు వీట భీమ • శంకరహార్దో
త్సేధాట్టహాసరేఖా, దీధితిమైత్రీత్రిధా వి • ధేయములగుచున్. 108

చం. ప్రహరిచరింతు రెప్పుడును • భైరవు లర్ధనిశాగమంబులన్
గహకహనిష్ఠురాట్టహస • గర్వితకంఠకఠోరహుంకృతుల్
బహులభుజాడమడ్డమరు • ఘాంకృతినాదము మేళగించి ది
క్కుహరములోర్చు హాటకపుఁ • గోటలమీఁదట దక్షవాటికన్. 109

వ. మఱియు నప్పురంబు దళితసమదకరిసహస్రంబు లగు సుభటసహస్రంబులవలన సింహసంహతియు, సమధికవితరణశాఖా నిరాఘాటకీర్తిస్ఫూర్తులగు వదాన్యుల వలనఁ బారిజాతోద్యానంబును, ననేక శతసవనసముజ్జ్యోతిర్ధారియగు సుమనో వర్గంబువలన సుధర్మాస్థానంబును, నభిరామరామణీయక సౌభాగ్యరేఖావిలాస పక్ష్మాంత లక్ష్మీవిరాజమానంబగు రాజకుమార లోకంబులవలన గంధర్వ లోకంబును, మకరకచ్ఛపముకుంద నిధిసనాథులగు వైశ్యులవలన వైశ్రవణస్థానంబు ననం దగి, సకలభువన ప్రశస్తంబై; భారతవర్షంబునకు ఫలసంపదయునుంబోలె శాఖానగరసహస్రసంబాధ పరిసరంబై; సకలజగన్నిర్మాణమాతృకయగు కృత యుగంబునకుం గారణంబనఁ గనకగిరి వప్రదీప్రప్రాకార బహుప్రకార వప్ర ప్రకరపరివేషవలయ వలయితంబై; సలిలసంక్రాంత కనకావరణమండల ప్రతిబింబంబగుటంజేసి కులిశపతన భయావగాహ హాటక క్షితిధరంబగు నపరాంబు రాశియుంబోని పరిఖాచక్రంబుచేతను, గ్రీడాగజమదజలపంకిల ప్రాంగణంబులగు భృంగిరిటి నికుంభకుంభోదర ప్రధాన ప్రమథగణమణిభవన సౌధంబులచేతను,

---

107. శతమన్యువీటికిన్ = అమరావతికి; జీవనము = నీరు, ప్రాణము; కళ = చంద్రకళ, విద్య; దొరవచ్చున్ = సాటివచ్చును; అభిరామలక్ష్మి = సౌందర్యము; దక్షవాటి = దక్షారామము. 108. రోధించున్ = అడ్డగించును; పటికపుసౌధంబులు = స్ఫటిక మణులతో కట్టిన మేడలు; హార్దోత్సేధ = ఎక్కువ యానందము. 109. ప్రహరి చరింతురు = గస్తీ తిరుగుదురు; హాటకపుఁగోటలు = బంగారు కోటలు. 110. వదాన్యులు = దాతలు; సుమనోవర్గంబు = దేవతాసముదాయము; సుధర్మ = దేవసభ; మకర సనాథులు = మకర, కచ్ఛప, ముకుందములను నిధులతో కూడిన; వైశ్రవణస్థానము = కుబేరుని నివాసము, శాఖా...పరిసరమ్మై = ఎక్కువ పేటల సమ్మర్దముకల పరిసరముకలది;

నాసన్నదీర్ఘికావీచీ పవనవికీర్యమాణ వికస్వరజలజనిష్యందమధు బిందువర్షాంబు దూరీకృతశంభళీకపోల కస్తూరికాపత్ర భంగంబులగు నప్సరోంగనావాటంబుల చేతను, గుట్టిమఖచితమణికిరణవిసరణజనితాకాండ ప్రసారితకదళీపలాశ సంగతిసం శోభితకక్ష్యావిభాగంబులగు యక్ష గంధర్వ కిన్నర కింపురుష సిద్ధవిద్యాధరస్థానం బులచేతను, గారుత్మత రత్నాంశుపటలఘటితపటయామినీ తారకాయమానస్థల ఖచి తస్థూలముక్తాఫలశలాకా నికాయంబులగు భైరవాయతనంబులచేతను, ప్రస్నిగ్ధ శ్యామలశిలోత్కీర్ణ రమ్యోపవాహ్య శాక్కరంబులగు శంకరాగారద్వారంబుల చే తను, దులసీదళశీతలామోదముషిత కిల్బిషంబులగు విష్వక్సేన ధామంబులచేతను, నిరంతర సంఫుల్లమల్లీవల్లికాతల్లజపుష్ప నిష్యందమాన మధుమత్తపుష్పంధయవిరు తిపునీతహరిదుపఘ్నంబులగు విఘ్నేశ్వరావాస లలితోద్యానంబులచేతను, బృథుల వారిశీకరపటలపానదర వికటకరటిముఖ వికలితవరాటకోశవ్యాకోచ హాటకకుశేశయం బులగు సప్తగోదావర ప్రవాహసలిలంబులచేతను, గోపులకింజల్కాగ్రగ్రసనజాగ్ర చ్చక్రవాక చరణనఖశిఖాసముల్లిఖిత కమలకువలయకుముదషండంబులగు తీర్థకుం డంబులచేతను, గోదావరీతుల్యభాగా కౌంతేయా తుల్యాపగా నదీమాతృకాయమా నంబై యిరుగారునుబంటపొసంగు పంటవలంతి కేదారక్షేత్రంబులచేతను, నఖండి తాంభస్సమృద్ధి విజృంభించి విశ్వంభరా భ్రూలతాకారిసేతు రేఖాలంకారంబులై తటతరుకుసుమాంతరక్షర దమందమకరంద సందోహస్యందన కల్లోలంబులై సలిల కేళీలోల కలహంసకామినీ కోలాహలానుకృతజలదేవతాచరణ మణినూపుర ఝణ ఝణత్కారంబులై కారండవపక్షవిక్షేప పరిచరిత పంకజపరాగపాళీ విరచితాశీక సంధ్యానుబంధచరిత చక్రవాక మిథునంబులై పయోధిగన్నబిడ్డలుంబోని యొడ్డుచె ఱువులచేతను, సరస సహకారశాఖాశిఖాధిరూఢ కోకిలకుటుంబినీ కంఠనాళ కోమల కుహూ కారకోలాహలకలిత విరహిణీహృదయ హాలాహలక్షేపంబులును మధుకర నికరగుంజాయమాన మాధవీ నికుంజకుంజన్నిహిత కింజపుంజంబులును సము ద్భిన్న పున్నాగకుసుమపరిమళోద్గార నీహారంబులును సముల్లసితచంపకకళికాకలాప కల్పిత కందర్పపావకాస్త్రపరిత్రస్తపథికలోకంబులును, బాకపరిస్ఫుటిత పుండ్రేక్షు పర్వముఖోద్గీర్ణ ముక్తామణిదర్శితాకారరాకా నిశాకర ప్రకాశంబులును గోరకప్రకర తారతారకిత కురువకానోకహంబులును వనితావదనాసవసనాథ వకుళవనంబులును మహోరుకుచ కలశకాంతి చోరఫలకలితలికుచ నిచయంబులును మాతులుంగామోద హృదయంగమంబులును నవనాగరంగసంగసుఖిత సారంగపుంగళగానసరస

దీర్ఘిక = దిగుడుబావి; శంభళీ = కుంటెనకత్తె; ఉపవాహ్యశాక్కరంబులు = దేవవాహన మైన వృషభములు; విష్వక్సేనధామంబులు = విష్ణ్వాలయములు; హరిదుపఘ్నంబులు = చుట్టుప్రక్కలు కలవి; ఇరుగారు = ఏటికి రెండుసార్లు; పంటవలంతి = భూమి; కారం డవము = నీటిపక్షి; కోకిలకుటుంబినీ = ఆడుకోకిలలు; పుండ్రేక్షు = నామాల చెఱకు;

సంగీత ప్రసంగంబులును భుజంగలతాపరిష్వంగ ధన్యతరుణపూగ ద్రుమంబులును, లలిత లవలీలతా లింగిత లవంగంబులును నగు శృంగారారామంబులచేతను, నభిరామంబై; కలితచాతుర్వర్ణ్య స్థితియగుటం ద్రైలోకతిలకంబును, సముద్భాసితా సంఖ్య దేవాలయంబగుట శతమఖనగరంబును, నక్షయజీవనధృతియగుట ధర్మపాల మండలంబును, ననధిగతకంటక రుచిరంబగుటం బ్రజాభాగ్య ఘంటాపథంబును, బ్రచురసన్మణినివాసంబగుట వసుంధరాధిప స్థానంబునునై, గుహ్యక నగరంబునుం బోలె వివిధమనుష్యధర్మ చరితపవిత్రంబును లంకానగరంబునుంబోలెఁ బుణ్యజనాధ్యుషిత సన్నివేశంబును గార్తవీర్యార్జున మూర్తియునుంబోలె నవిరళకర భూషితంబును నృసింహ లీలాడంబరంబునుంబోలెఁ బ్రథితహిరణ్యకశిపు క్షయంబును శరత్కాలంబునుంబోలె విలసత్ప్రకాశంబును బ్రాహ్మణజాతిధర్మంబునుంబోలె నిగమశాలియునునై; మహాభూషాన్వితంబయ్యును నిరాక్రోశంబును బ్రకటభుజంగ ప్రచారంబయ్యును సదాహితాభయంబును బలిరాజనిలయ భూతంబయ్యును గంధర్వభూమియునై; వర్ణసాంకర్యంబు వాసవకోదండంబునందు, యహిభయంబు వల్మీకంబులయందు, జీవనసంశయంబు వారిదంబులయందు, వృషాతిక్రమంబు గృహంబులయందు, పరదర్శనంబు యతులయందు, దోషోల్లాసంబు కువలయంబులయందు, కౌరవపదానుసరణంబు కిరాతులయందు, తరళత్వంబు కరికరసంతానంబులయందు, విపక్షక్షోభంబు కొలంకులయందు, యాత్తగంధత్వంబు చందనంబులయందు, కాని తనయందుఁ బొందనీక విభవంబునకుఁ బ్రభవంబును విలాసంబునకు నివాసంబును నపవర్గంబునకు సర్గంబును ధర్మంబునకు మర్మంబును దానంబునకు నిధానంబును నానందంబునకు మూలకందంబును విద్యకు నిషద్యయు విశ్రామంబునకు ధామంబునునై యొప్పు నప్పట్టణంబున కధీశ్వరుండు. 110

సీ. హాలాహలంబను • నల్లనేరెడుపండు, మిసిమింతుఁడునుగాక • మ్రింగినాఁడు
పెనువ్రేలికొనగోర • బిసరుహాసను మోముఁ, గెందమ్మివిరివోలెఁ • గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ • బ్రసవనారాచుని, నెఱ్ఱచిచ్చఱకంట • జుఱ్ఱినాఁడు
మెఱుఁగుఁగోఱలుడుల్ల • మృత్యుదేవతనోరు, దట్టించి యఱకాలఁ • దన్నినాఁడు
తే. త్రిపుర దైత్యావరోధ నా • రీవిలాస, దంతతాటంకములకెగ్గు • దలఁచినాఁడు
దక్షపురిసానికూఁతులఁ • దవిలినాఁడు, విశ్వలోకకుటుంబి భీ • మేశ్వరుండు. 111

---

పుణ్యజన=రాక్షసులు, పుణ్యముచేసిన జనులు; గుహ్యకనగరము=అలక; మనుష్యధర్మ=కుబేరుఁడు; భుజంగ=విటుఁడు. సర్పము; వృషాతిక్రమము=అనావృష్టి; దోషోల్లాసము=రాత్రి వికసించుట; నిషద్య=అంగడి. 111. మిసిమింతుఁడు=అలసినవాఁడు; ప్రసవనారాచుని=మన్మథుని; ఎఱ్ఱచిచ్చఱకంటన్=మూఁడవ (అగ్ని) కంటితో; డుల్లన్=రాలునట్లు; త్రిపుర...తాటంకములకున్=త్రిపురాసురుల స్త్రీల చెవుల కమ్మలకు.

మ. ఎనయంగల్గినకూర్మి ఖృంగిరిటిఁగా • నీ తండుఁగానీ నికుం
భునిఁగానీ కయిదండపట్టుకొని సం • భోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్ను మొఱంగి యప్పురమునం • గన్నె ఱుకాఁదారి ప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ • ధూర్తప్రకారంబునన్. 112

కం. పదునాల్గు మహాయుగముల, ముదుకగు భీమేశ్వరునకు • మొగచాటై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు, నది దక్షారామ మహిమ • మగునో కాదో? 113

సీ. నేదిష్ఠమున సప్త • గోదావరంబున, నఘమర్షణస్నాన • మాచరించి
త్ర్యాయుతమంత్రాక్ష • తాభిమంత్రితమైన, విమలభూతి త్రిపుం • డ్రము ధరించి
మొగలివాకిలిఁ దాటి • దిగువశాక్వరరాజు, నగరిపై వెన్నుని • ననువుఁజూచి
మణిశిలాసోపాన • మధ్యమార్గంబుగా, నభ్రంకషంబైన • హర్మ్యమెక్కి
తే. సప్తపాతాళభువన వి • ష్కంభములను, దెఱచి వెడలినజ్యోతిః ప్ర • దీప్తమూర్తి
శంభుభీమేశ్వరేశ్వర • స్వామిఁగొలుచు, పరమమాహేశ్వరునకేమి • బ్రాతిముక్తి. 114

కం. పరమాశించును భీమే, శ్వరు నెనమతిఁజేసి చోడ • వంశాభరణుం
డరికాలుఁడు కరికాలుఁడు, దరణీధరవల్లి మనసు • దైన్యము ముంచెన్. 115

సీ. గజచర్మ మెన్నఁడో • కాని నిచ్చలుగట్టు, పసిఁడికమ్ముల పట్టు • పచ్చడంబుఁ
భసితమెన్నఁడొకాని•ప్రతిదినంబునయందు, మలయజంబుకురంగ•మదముగూర్చి
నిడుదపాములరాజు • తొడవులెన్నఁడొకాని, తారహారములు ని • త్యము ధరించు
నృకరంకరుండమా • లిక లెన్నఁడోకాని, ధరియించు కల్హార • దామమెపుడు
తే. కాట నడుచక్కి నెన్నఁడో • కాని యుండు, దక్షవాటిసువర్ణ సౌ • ధములమీఁద
నెన్నఁడొపిశాచులనుగాని•యిందుముఖుల, నెల్లకాలంబుఁదలఁచు భీ•మేశ్వరుండు. 116

---

112. తండున్ = భక్తుని; కన్ను మొఱంగి = మోసగించి; కన్నె ఱుకాన్ = ఎవరికిని కన్పడకుండునట్లు; తారి = పోయి; కాఁదారి = నడిరాత్రి; ప్రొద్దునన్ = సమయమున. 113. ముదుకగు = ముసలివాఁడైన; మొగచాటై = మొగము మొత్తునదై. 114. నేదిష్ఠమున = మిక్కిలి సమీపమున; శాక్వరరాజు = వృషభరాజము; విష్కంభములను = అడ్డుగడియలను; బ్రాతి = దుర్లభము. 116. పసిఁడి...పచ్చడంబు = జరీ అంచుల ధోవతి; భసితము = విభూతి; మలయజంబు = గంధము; కురంగమదము = కస్తూరి; నిడుద = పొడవైన; తొడవులు = భూషణములు; నృ...మాలికలు = కపాల మాలికలు; కల్హారదామము = కలువ దండ; కాటన్ = శ్మశానమున; నడుచక్కిన్ = మధ్యలో.

సీ. ఒకవేళ ధరియించు • యువనాశ్వుఁడిచ్చిన, కట్టాణిముత్యాల • కంఠమాల
మాంధాతృఁడిచ్చిన • మాణిక్యఖచితకే, యూరంబు ధరియించు • నొక్కవేళ
నిక్ష్వాకుఁడిచ్చిన • హీరాంకురంబుల, యుంగరంబు ధరించు • నొక్కవేళ
ఘనచక్రవర్తి యి • చ్చిన ప్రవాళంబుల, యొడ్డాణము ధరించు • నొక్కవేళ

తే. పేడ్క ధరియించు నొక్కొక్క • వేళయందు, భరతదుష్యంతరంతినా • భాగనహుష
నలభగీరథనృగమహీ • నాథదత్త, హేమమణిభూషణములు భీ • మేశ్వరుండు. 117

వ. వెండియు భీమేశ్వరుండు పండువు పండువు నఖండవిభవంబున నాఖండలాది విబుధ
మండలంబు పరివేష్టింప చలిగొండరాచూలియుం దానును మార్తాండచంద్ర
మండలంబువలనను బాలసముద్రబుంవలనను మధుకైటభారి యూరుకాండంబు
వలనను గృపీటభవ జ్వాలాజాలంబువలనను గంధర్వసార్వభౌమువలనను బ్రభ
వించి కంతుకుంతంబులనఁ గాముతోమరంబులన మదనుముద్గరంబులన శంబరారి
కతారంబులన నంగభవుకొంగవాలులన సిరిపట్టి సెలకట్టియలన పలరాజు భిండివా
లంబులనఁ, దళతళంబొలయు తొలకరిమెఱుంగు మొలకలఁ గలకలనగు కలికితెలి
గన్నుఁగవయును, జక్కవకవలఁ దక్కవపఱచుచుఁ గ్రిక్కిఱిసిన మెఱుంగు నిబ్బ
రంబుగుబ్బచన్నులును, మిలమిలనిజిలుఁగువలిపెంపువలువల తెరలమెడలవెలుపడి
కేలిగదలుకొను పసిమిగలపసిండితగటునుం దెగడు నునుదొడలజిగియును, బగ
డంపుఁ జిగురుటధరములతుదల నిగురుచుఁ జిఱుతనగవులుబిగియనగినం దెగిపడి
యెడుసనువడువున నడుగడుగునకు పడవడవడంకుచుం బిడికిటనడంగు నడుముల
బెడంగునుంగలిగి, ఘుమఘుమం గురంగనాభిసౌరభసారంబులతోడంగూడి సంకు
మదపంకపరిమళంబుల ఝుంకించు కర్పూరవాసనాసముల్లాసంబును, గర్పూరవాస
నాసముల్లాసంబు నుల్లసంబాడు కాలాగురుకర్దమామోదంబునునుంబునుంగుపసం
బిసాళించు గొజ్జంగినీటినెత్తావియును, గొజ్జంగినీటినెత్తావి బిత్తరించు గంధ
పొడిపొలుపును, గంధపొడి పొలుపునుంగుమ్మరించు ధమ్మిల్లమల్లికాహల్లక వకుళ
వాసంతికాజాతి కేతకీకుందకుసుమగంధంబులును నిఖిలదిక్సంధిబంధంబుతో బాం
ధవం బనుసంధింప, నిలింపగంధర్వాప్సరోజాతులగు సానికూతులుఁగొలువ, జగ
నొబ్బగండ జగదగోపాల పల్లవాదిత్య పల్లవత్రినేత్ర కేళాదిరాయ రాయవేశ్యా
భుజంగ బిరుదాభిరామాల్లయ వేమభూపాల రాజ్యభారధురంధరుండై, బెండ
పూఁ దన్నయామాత్యుఁడు గట్టించిన మొగసాలవాకిటి మహోత్సవమండపంబు

---

117. కడు+ఆణిముత్యాలు = కట్టాణిముత్యాలు; హీరాంకురంబులయుంగరంబు=రవ్వలుదాపిన యుంగరము; ప్రవాళము=పగడము. 118. అఖండలాది= ఇంద్రాది; చలిగొండరాచూలి=పార్వతి; కృపీటభవ=అగ్ని; సిరిపట్టి=మన్మథుఁడు; పసిండితగటు=బంగారురేకు; సంకుమద = కస్తూరి; ధమ్మిల్ల = కొప్పులోని; సానికూతులు=భోగపు పడుచులు;

నందుఁ, బేరోలగంబుండి, కుండలీ దండలాసక్త పేరణీ ప్రేంఖణసింధుకందుకధ
మాళిచేలమతల్లీ హల్లీసకాదినృత్యంబు లవలోకించుచుఁ, బంతంబు లవధరించుచు,
మేలంబు లాలకించుచుఁ, జంపూచాటునాటకోదాహరణ జయఘోషచక్రవాళ చతు
ర్భద్రచతురాత్మిప్రబంధంబు లాకర్ణించుచు, వేణువీణామృదంగ కాంస్యకాహళ
పటహఢక్కా హుడుక్కానక ఝల్లరీ హృద్యవాద్యానుషంగంబు లాదరించుచు,
సంగీతభంగీతరంగంబు లంగీకరించుచు, నిగమంబులు గ్రహించుచుఁ బురాణం
బులు వినుచు, నితిహాసంబు లిచ్ఛగించుచుఁ, దర్కంబులు వితర్కించుచు, నాగ
మంబులు పరీక్షించుచు, నిఖిలలోక రక్షణార్థంబుగా వివిధ విద్యాకలాపంబుల
వినోదించుచుండు. 118

కం. ఏతాదృశప్రభావో, పేతుండగుదక్షవాటి • భీమేశ్వరువి
ఖ్యాతకథ చెప్పెదను శుక, తాతకృతపురాణసరణి • తప్పకయుండన్. 119

—• కథా ప్రారంభము •—

వ. ఇప్పుమహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:—నైమిశారణ్య పుణ్యక్షేత్రంబున
ద్వాదశవార్షికంబైన దీర్ఘసత్రంబు ప్రవర్తిల్లుచుండఁగులపతిశౌనకుండను పరమఋషి
మొదలుగాఁగలసంయమీశ్వరులు యదృచ్ఛాసమాగతుఁడైన రోమహర్షణపుత్రుఁబాద
రాయణప్రియశిష్యుఁ బౌరాణికు సూత్యాహసంభవు సూతు నర్చించి యతనివలనను
బంచాశత్ఖండమండితంబును, బహుసంహితాసమాకీర్ణంబును, సపాదలక్ష గ్రంథసంఖ్యా
సమన్వితంబును, నైనస్కాందపురాణంబు వినువారును నందుఁ బూర్వఖండంబునం
బారాశర్యుండు నిజాపరాధంబు గారణంబుగా విశ్వనాథుచేత నధిక్షేపింపబడి వారణాశి
వెల్వడియె ననివిన్నవారగుటం జేసి యటమీఁది వృత్తాంతంబు వినువేడుక నమ్ము
నీంద్రు నభినందించి యిట్లనిరి. 120

తే. కాశి వెలువడివచ్చి ప • రాశరాత్మ, జుండు ఖేదంబు నొంది శి • ష్యులును దాను
నెచట వసియించె నెచ్చోట • నేమిచేసె,నసఘ యేతీర్థమాడె మా • కానతిమ్ము. 121

వ. అని యడిగిన. 122

మ. సరసీజాసనవంశమౌక్తిక కళా • సర్వజ్ఞ విజ్ఞానశం
కరినాథాంఘ్రిసరోజషట్పద సమి • ద్గాండీవకోదండ భూ
భరణ ప్రౌఢభుజాభుజంగ మహిమా • పాంచాల వేమక్ష్మా
వరసామ్రాజ్యరమాధురంధర జగ • ద్వ్యాప్తప్రతాపోదయా. 123

పేరోలగము = పెండుసభ. 119 శ్లోక...సరణి = వ్యాసభక్తి. 120. ద్వాదశవార్షికము = పంన్రెండేళ్లుండునది; యదృచ్ఛాసమాగములు = తలవనితలంపుగా వచ్చిన వారలు; పారాశర్యుఁడు = వ్యాసముని; అధిక్షేపింపబడి = తిట్టఁబడి. 121. తీర్థమాడుట = తీర్థములలో స్నానము చేయుట.

కం. శ్రీ వీరభద్రభూపతి, సేవాహేలాకటాక్ష • సిద్ధసమృద్ధ
శ్రీ విభవపాకశాసన, భావభవారాతిభక్తి • పరతంత్రనిధీ. 124

మాలిని. అకుటిలనయమార్గా • యాచితార్థిప్రవర్గా
సుకృతిసరణిపాంథా • శుద్ధకీర్తిప్రబంధా
సకలజనవిధేయా • శారదాభాగధేయా
ప్రకటసుగుణసంగా • రాయవేశ్యాభుజంగా. 125

గద్య. ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహాప్రబంధంబునందుఁ

ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు
శ్రీమహా గణాధిపతయేనమః
శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము.

## ద్వితీయాశ్వాసము



ఖండ ఘుసృణ మకరీ
రేఖాలంకార సుంద • రీ స్తనయుగ పా
శీ ఖచిత భుజాంతర విథి
వాఖండల! బెండపూఁడి • యన్నా మాత్యా! 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పం దొడంగె. 2

తే. మృడునిచే నిట్లు కోపానఁ • బడి కలంగి, గంగ దరినుండి నిజశిష్య • గణముతోడ
మద్గురుస్వామి సకలధ • ర్మజ్ఞుఁ డపుడు, పృథివిఁ గలతీర్థముల లెక్క • వెట్టిచూచి. 3

వ. ఇ ట్లనియె. 4

తే. అంబపార్వతి నాతోడ • నానతిచ్చెఁ, గాశి యెక్కుడు క్షేత్రసం • ఘములలోనఁ
గాశికన్నను నెక్కుడు • గౌరవమున, మోక్షభోగ నివాసంబు • దక్షవాటి. 5

వ. తొల్లి దక్షప్రజాపతి భూచరఖేచరులగు నఖిలగీర్వాణుల రప్పించి హాటకగర్భ కైటభారులఁ బురస్కరించికొని మహాధ్వరంబు సేయం బ్రారంభించి. 6

గీ. అర్థితో నోషధీశ్వరుఁ • డాదియైన, పెండ్లికొడుకుల నెల్లను • బిలువ నంపె
గబ్బితనమున జగదీశుఁ • గాలకంఠుఁ, బిలువఁబంపక మానె న • బ్బిరుదులాఁడు. 7

3. మృడునిచే=శివునిచే; కలంగి=కలతచెంది; మద్గురుస్వామి=వ్యాసముని.

తా॥ శివుని కోపమునకు గురియైన మా గురువులు (వ్యాసమహర్షి) గంగా తీరమున నిలుచుండి పృథివిలోని తీర్థముల పర్యాలోచన చేసి యిట్లనెను. (అని సూతుడు వ్యాసుని మాటల చెప్ప నారంభించెను)

5. తా॥ క్షేత్రములలోకెల్ల కాశియెక్కువది; అంతకన్నను దక్షారామమెక్కువది.
6. హాటకగర్భ=బ్రహ్మ; కైటభారి=విష్ణువు. 7. అర్థితోన్=మక్కువతో; ఓషధీశ్వరుఁడు=చంద్రుఁడు; పెండ్లికొడుకులన్=అల్లుండ్రను; గబ్బితనము=పెద్దతనము (గర్వము); బిరుదులాఁడు=ప్రతిజ్ఞ పట్టినవాఁడు.

కం. అజ్ఞానంబున హరున కవజ్ఞదలఁచి యతని నొసలి • వ్రాఁతఫలమునన్
యజ్ఞము సేసెను సురలయ, నుజ్ఞఁ బురోవృద్ధి కప్ప • నులు సమకొనునే. 8

ఉ. అల్పపుబుద్ధి నీక్రియమ • హాక్రతుతంత్రముఁబన్నగాధిపా
కల్పునిఁ బాయఁబెట్టి కను • గానక దక్షుఁడు చేయఁజొచ్చి యా
వేల్పులఁ దాను దుర్దశల • వేఁగె మహాప్రళయాగ్ని రుద్రునిం
బోల్పగ వచ్చునట్టి పటు • భూరివిభుండగు వీరభద్రుచేన్. 9

తే. పువ్వుముడిచిన పురవీథి • భూమియందుఁ, గట్టె మోవంగవలసిని • కారణమున
వీరభద్రునిచే దైన్య • వృత్తినొందె, దక్షుఁడట్టి మహాధ్వర • స్థానమునను. 10

కం. తుదిఁబోయి యుమ్మహేశ్వరు, పదపద్మములాశ్రయించి • బ్రతికెం దాసుం
త్రిదశులుఁ బెద్దలునయ్యె, యదసునఁజూపుదురునిగ్ర • హానుగ్రహముల్. 11

సీ. దక్షప్రజాపతి • తప్పులోఁగొని యాత్మఁ, గృపపుట్టి మిగుల ర • క్షించెఁగాన
హరివిరించిపురంద రాది దైవతకోటి, మించి క్రమ్మఱ గార • వించెఁగాన
నరిగి యంతర్ధాన • మందిన తనదేవి, నెడమమేనఁ బరిగ్ర • హించెఁగానఁ
గోపాగ్నిఁ గడుఁబరి • తాపంబు నొందెడు, రిపులకు నభయంబు • లొసఁగెఁగాన

తే నట్టుదెగనేసి జన్నపు • టిట్టి శిరము, గరిమచెడకుండ దివ్రేఁ • గట్టెఁగాన
నయముగలవేల్పు శ్రీ భీమ • నాయకుండు, దక్షవాటంబు తీర్థంబు•ధరణియందు. 12

---

7. తా॥ దక్షుడు (పూర్వజన్మమునగు సతీదేవికి తండ్రి) చంద్రుడు మొదలైన అల్లుండ్రను పిలిచి శివుని పిలుచుట మానెను.

8. అవజ్ఞ=అనుమానము. తా॥ ఆతని నుదుటి వ్రాతఫలితముట్లుండుటవలన, తెలియక, శివుని కవమానము తలపెట్టి ఇతరదేవతల మాటపై యజ్ఞము చేసెను. అట్టి పనులు పురోభివృద్ధికి కావు. 9. పన్నగాధిపాకల్పుని=శివుని; పాయఁబెట్టి=వెలివెట్టి; కనుగానక=ఒళ్లుతెలియక. తా॥ నీచబుద్ధితో నిట్లు శివునివెలివేసి, యజ్ఞము చేయుచు, ప్రళయకాల రుద్రునివంటివీరభద్రునిచే బాధలందెను. 10. ముడిచిన=అలంకరించుకొన్న. తా॥ ఆ యజ్ఞము చేసినచోట దక్షుడు, పూవు లలంకరించుకొన్నచోట కట్టెలు మోసినట్లు, వీరభద్రునిచే దైన్యమునందెను. 11. త్రిదశులు=దేవతలు; అదను=సమయము. తా॥ చివరకతడు వెళ్లి శివుని పాదము లాశ్రయించినందున, అతడును, దేవతలును బ్రతికిరి. పెద్దలాయాసమయముల కోపప్రసాదముల జూపుదురుకదా. 12. లోఁగొని=మన్నించి; రిపులకు=దేవతలకు; అట్టు=కంఠము; జన్నపుటిట్టి=యజ్ఞముగేడి; గరిమ=పస; నయము=కరుణ. తా॥ దక్షుని తప్పును మన్నించి దయతో రక్షించెను. బ్రహ్మాదిదేవతల మఱల రక్షించెను. అంతర్ధానమైనతన భార్య నెడమదేహమున ధరించెను. తనకోపమునకు భయపడు శత్రువుల కభయ మిచ్చెను. మెడతెగనరికిన యజ్ఞపశువుతలను పస చెడకుండ స్వర్గాన వ్రేలగట్టెను. కాన శ్రీ భీమేశ్వరుడు గొప్పదైవము; దక్షారామముభూమిలో పుణ్యక్షేత్రమునైనది.

తే. కాలకూటోపసంహార • కారియతఁడు, త్రిపురదైత్యాధిపతుల మ • ర్దించెనతఁడు
నిగ్రహానుగ్రహ ప్రౌఢినిపుణుఁడతఁడు, సంతతము దేవవేశ్యాభుజంగుడతఁడు. 13

తే. ఏమిచిత్రంబు భీమేశ్వ • రేశ్వరుండు, నిగ్రహానుగ్రహక్రియా • నిపుణుఁడగుట
యతని నిశ్వాసముల మాత్ర • నౌనొకాదొ, వేదములును జరాచర • విశ్వజగము. 14

వ బ్రహ్మాది సంస్తుతుండై నిజార్ధ దేహంబుననున్న మాయారూపిణి, మహాదేవిభువన మోహిని, దేవకార్య ప్రయోజనంబును, మేనకాదేవి భాగధేయంబును, హిమవంతుని తపోవిశేషంబును, గారణంబుగాఁ దద్దేహంబున జన్మింప నియోగించిన భువనేశ్వరి మహేశ్వరుని దేహంబువలన నిర్ముక్తయయ్యెంగావున దక్షారామంబు ముక్తిక్షేత్రంబు నాఁబరఁగె. వెండియు. 15

కం. దక్షుని సవనాగారము, దక్షారామంబు శివుఁడు • దన్మధ్యమునం
సాక్షాత్కరించియుండుట, మోక్షము భోగంబు బ్రాఁతె • ముజ్జగములకున్. 16

తే. ధాత్రి వలయంబులో భోగ • దములుగొన్ని, మోక్షదంబులుగొన్ని ప • రీక్షసేయ
భోగమోక్షములకు జన్మ • భూమియైన, దక్షవాటంబు తావు క్షే • త్రములకెల్ల. 17

తే. భీమనాథేశ్వరునికన్న • పెద్ద వేల్పు, దక్షవాటంబుకంటె ను • త్తమపదంబు
సప్తగోదావరము కంటె • సకలతీర్థ, సారమగు తీర్థరాజంబు • జగతిలేదు. 18

కం. అచ్చమగు భోగమోక్షము, లచ్చోటం దొరకుఁ గరత • లామలకముగన్
విచ్చలవిడి బ్రతికినసుం, జచ్చినఁగడుమెచ్చ భీమ • శంకరు నగరన్. 19

---

13. నిగ్రహానుగ్రహములు=శిక్షరక్షణలు. తా॥ అతడు కాలకూటము మ్రింగినవాడు, త్రిపురాసుల మర్దించినవాడు. నిగ్రహానుగ్రహ సమర్థుడు, అప్సరసల భోగించువాడును. 14. నిశ్వాసము=నిట్టూర్పు. తా॥ ఎవని యూర్పులవలన వేదములు, చరాచర జగత్తు పుట్టినవో అట్టి భీమేశుడు నిగ్రహానుగ్రహ సమర్థుడగుటలో చిత్రమేమున్నది? 15. మేనకాదేవి=హిమవంతునిభార్య; భాగధేయము=భాగ్యము; నిర్ముక్తయయ్యెన్ = వెడలెను; ముక్తిక్షేత్రము=విడిచిన పుణ్యస్థలము. తా॥ బ్రహ్మాదులు స్తుతింపగా తన దేహముననున్న మాయారూపిణియైన సతీదేవిని మేనకా హిమవంతులకు పుట్టవలసినదిగా ఆజ్ఞాపించి వదలెను. అందుచే దక్షవాటికకు ముక్తిక్షేత్రమని పేరు కల్గినది. 16. సవనాగారము=యజ్ఞవాటిక; బ్రాతె=దుర్లభమా? తా॥ దక్షుని యజ్ఞశాలయైన దక్షారామమున శివుడును సాక్షాత్కరించియుండ ముక్తి భుక్తులకేమి కొదువ? 17. తావు=స్థానము. తా॥ ఆలోచింపగా భూమిలో కొన్ని క్షేత్రములు మోక్షము నిచ్చుచున్నవి, కొన్ని భోగముల నిచ్చుచున్నవియునైయున్నవి. కాని దక్షారామము భోగమోక్షముల నిచ్చునది కాన గొప్పది. 18. ఉత్తమపదము=పుణ్యస్థలము. తా॥ భీమేశునికన్న దేవుడు, దక్షారామముకన్న క్షేత్రము, సప్తగోదావరముకన్న తీర్థమును జగత్తులోలేవు. 19. తా॥ భోగమోక్షములు కరతలామలకములైయుండు దక్షవాటికలో బ్రతికినను, చచ్చినను సుఖమే.

కం. దక్షిణ వారాణశికిని, మోక్ష శ్రీభోగవిభవ • మూలంబునకున్
దక్షారామంబునకు స.దృక్షంబగునట్టి పుణ్య • క్షేత్ర(తీర్థ)ము గలదే. 20

సీ. కాలకూట విషాగ్ని • కబళహేలాగ్రాస, కల్మాషితాసిత • కంఠుచేతఁ
గుంభినీధరసుతా • కుచకుంభపరిరంభ, సంభావనాకేలి • శాలిచేత
గగన కల్లోలినీ • కల్లోలమాలికా, స్ఫాలితబాలేందు • మౌళిచేతఁ
గుటిలకుండలిరాజ • కుండలాలంకార, విలసితగండమం • డలునిచేత

తే. ద్రుహిణపంచమమస్తక • ద్రోహిచేత, భీమనాథునిచే జగ • త్స్వామిచేత
హరునిచేత సనాథమై • యఖిలయిల్లు, మోక్షభోగనిదానంబు • దక్షవాటి. 21

వ. అని దక్షారామమాహాత్మ్యం బభివర్ణించుచు. 22

మ. కినుకంబుట్టినయట్టి మౌనిహృదయ • క్లేశంబు శాంతంబుగా
మునిశిష్య ప్రకరంబుతోడ గమనో • న్ముఖ్యంబునన్ ముచ్చటల్
తనియం జెప్పుచు వేల్పుటేటి నికట • స్థానంబునం దుండఁగా
వనజాతాప్తుని మండలంబు దిగియె • న్వారాశి దిక్సీమకున్. 23

20. సద్వృక్షంబగునట్టి = సమమైన. తా॥ భోగమోక్షములకు నిలయమై, దక్షిణకాశి యగుదక్షారామమునకు సాటితీర్థము లేదు. 21. కాల...కంఠుచేతన్ = కాలకూటవిషము మ్రింగుటచే నలుపుచేయఁబడిన కంఠముకలవానిచే; కుంభినీధరసుతా = పార్వతి; పరిరంభ = కౌగిలింత; గగన...మౌళి = గంగాతరంగ పంక్తులచే తరచఁబడిన చంద్ర కళను జటలో ధరించినవాడు; కుటిల...మండలుఁడు = పాపములను కుండలములచే ప్రకాశించు చెక్కిళ్లు కలవాఁడు; ద్రుహిణ...ద్రోహి = బ్రహ్మదేవుని యైదవతల నరకినవాఁడు; సనాథ = పరిపాలింపబడునది; నిదానంబు = మూలకారణము. తా॥ కాల కూటమును మ్రింగుటచే నల్లనైన కంఠముకలవాడును, పార్వతీస్తనముల నాలింగనము చేయువాడును, జటాజూటమందలి గంగాతరంగములు తాకెడి చంద్రరేఖకలవాడు, కుండలములైన పాములచే ప్రకాశించు చెక్కిళ్లు కలవాడు, బ్రహ్మదేవుని యైదవ శిరమును ద్రుంచినవాడునైన భీమనాథునితోకూడిన దక్షారామము భోగమోక్షముల నిచ్చును. 23. కినుకన్ = కోపమువలన; గమనోన్ముఖ్యంబునన్ = యాత్రకు సిద్ధ మగుటను; తనియన్ = తనివిచెందునట్లు; వేల్పు...స్థానంబునందున్ = గంగయొడ్డున; వనజాతాప్తుని = సూర్యుని; వారాశి దిక్సీమకున్ = పడమటి దిక్కునకు. తా॥ శివుని కోపమువలన కల్గిన మనోవేదన తగ్గునట్లు వ్యాసుడు శిష్యులగు మునులతో చెప్పుచు గంగాతీరముననుండగా సూర్యమండలము పడమటి సముద్రమునీదికిదిగెను.

—♦ సూర్యాస్తమయ వర్ణనము ♦—

తే. అల్లనల్లన గగన మ ♦ ధ్యముననుండి,
వ్రాలె నస్త్రాద్రి కరుణసా ♦ రథిరథంబు
పశ్చిమాంభోధిమారుతా ♦ స్ఫాలనమునఁ,
గేతనముమీఁది పసిఁడికిం ♦ కిణులు మొరయ. 24

కం. తారాపథాంచలము డిగి, వారిజహితమండలంబు ♦ వ్రాలె నపరది
క్పారావారంబునకై, పారావతపతగపాద ♦ పాటల మగుచున్. 25

తే. కూడియొప్పారె నస్త్రాద్రి ♦ కూటకోటి, భానుబింబంబు కన్నుల ♦ పండువుగను
విశ్వనాథుని గుడిమీఁది ♦ విమలకాంతి, భాసురంబైన హేమకుం ♦ భంబువోలె. 26

కం. చరమాచలశిఖరంబునఁ, దిరమై యొక్కింత తడవు ♦ దినకరుఁడొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున, నరవిందాక్షులకు మించు ♦ టద్దంబగుచున్. 27

సీ. సిద్ధవాహిని నీటఁ ♦ జిఱుబంతి పసుపాడి, శ్రీవిశాలాక్షి కై ♦ నేయఁదొడఁగె
మొరసె నంతర్గేహ ♦ మున విశ్వనాయక, తాండవారంభ మ ♦ ర్దల రవంబు
మందారతరుపుష్ప ♦ మధుపానగోష్ఠికిఁ, బ్రారంభ మొనరించె ♦ భైరవుండు
కొక్కొరోకోయని ♦ కొమరుసామి రథంబు, కంఠంబు సాఁచి క్రేం ♦ కారమిచ్చె

తే. మొగుడఁబాఱిన యరవింద ♦ ములను బాసి,
గములుగములుగ మత్తభృం ♦ గములుగూడి
డుంఠివిఘ్నేశు చెక్కులు ♦ త్కంఠఁజేరె,
నభినవంబైన యపరసం ♦ ధ్యాగమమున. 28

---

24. అస్త్రాద్రికిన్ = పడమటికొండకు; అరుణ...రథంబు = సూర్య రథము; కేతనము = జెండా; పసిఁడికింకిణులు = బంగరుచిఱుగంటలు; మొరయన్ = ధ్వనించగా. తా॥ పడమటి సముద్రవాయువులచే రథముమీది బంగారు చిరుగంటలు మ్రోయుచుండ సూర్యరథము మెల్లగా అస్త్రాద్రికి వ్రాలెను. 25. తారా...అంచలము = ఆకాశపుటంచు; వారి...మండలంబు = సూర్యబింబము; పారావత...పాటలము = పావురపుకాలు వలెలేయెరుపైనది. తా॥ పావురపు కాలువలె లేయెరుపైన సూర్యబింబము పశ్చిమ సముద్రముమీదికి వ్రాలెను. 26. హేమకుంభంబు = పసిఁడికుండ. తా॥ పడమటికొండమీది సూర్యబింబము విశ్వనాథుని గుడిమీది పసిడికుండ వలె ప్రకాశించెను. 27. చరమాచల శిఖరంబునన్ = పడమటికొండకొనపై; తిరమై = స్థిరమై; శుద్ధాంతంబునన్ = అంతఃపురమునందు; మించుటద్దంబు = మెఱుఁగైనయద్దము. తా॥ అస్త్రాద్రి శిఖరమున కొంచెముసేపు నిలిచిన సూర్యబింబము వరుణుని రాణివాసపు స్త్రీలకు అద్దమువలె మెరసెను.

చం. ప్రమదమదాతిరేకమునఁ • బాశివిలాసవతీకదంబకం
బుమిసిన తమ్ములంపుఁగఱ • యోయన నింగిలికంబు ఛాయచేఁ
గమిసిన దాసనంపుఁబువు • కాంతికి డాసిన కూర్మి సుట్టమౌ
కొమరున సంజయంబరము • కొంగున నూన్చెఁ గుసుంభరాగమున్. 29

తే. సంజకెంపును దిమిరపుం • జంపునలుపు,
గమిచి బ్రహ్మాండభాండంబు గరముమెఱసె
పరమపరిపాకదశవృంత • బంధమెడలి,
పతనమగు తాటిపంటితోఁ • బ్రతిఘటించి. 30

తే. కామినీవిప్రయోగ దుః • ఖమునఁగుందెఁ,
జక్రవాకంబు సురనదీ • సైకతమునఁ
గాశికా విప్రయోగ దుః • ఖమునఁగుందు,
బాదరాయణమునిసార్వ • భౌముకరణి. 31

శా. ఆకాశాంచలవీధుల న్నిగిడె సం • ధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రిత పారిభద్రకళికా • పాండిత్య వైతండికో

---

28. చిఱుబంతి పసుపాడి=పసుపుపూసికొని తానమాడి; కై సేయఁగాఁడఁ గెన్ =అలంకరించుకొనసాగెను; మొరసెన్ =మ్రోగెను, అంతర్గేహమునన్ =లోపలి యింటిలో; మర్దలరవంబు=మద్దెలచప్పుడు. పుష్పమధు=పూదేనె; కొనురుసామి రథంబు=నెమలి; మొగుడఁబాఱిన=ముడుచుకొనుచున్న; గముఁలుగములుగ న్ = గుంపులుగుంపులుగా; ఉత్కంఠన్ =వేడుకతో. తా॥ సాయంసంధ్యవేళ శ్రీ [illegible] గంగలో పసుపునీట జలకమాడి సింగారించుకొనుచుండెను. సగియలో విశ్వనాథుని తాండవారంభమగుచున్నట్లు మద్దెల మ్రోయనారంభించెను. భైరవుడు మంచారి మకరందపానము సేయుచుండెను. నెమలి క్రేంకారముచేసెను. ముడుచుకొనిపోవు చున్న తామరపూవులవదలి గుంపులు గుంపులుగా తుమ్మెదలు విఘ్నేశ్వరుని చెక్కిళ్లు చేరుచుండెను. 29. ప్రమద...అతిరేకమునన్ =సంతోషాతిశయముతో; పాశి...కదంబకంబు=వరుణుని భార్యలు; తమ్ములంపుఁగఱ=తాంబూలపు మరక; కమిసిన=కూడిన; సంజ=సంధ్య; అంబరము కొంగునన్ =వస్త్రముచివర; కుసుంభ రాగము=కుసుమపురంగు. తా॥ సంధ్యవేళ ఆకాశపుటంచులనున్న యెఱుపు, వరుణ భార్యలు తాంబూలము వేసికొని యుమిసినట్లు ఇంగిలీకపుఛాయ కలిసిన దాసనపుష్ప రంగుతో మెరసెను. 30. సంజకెంపు=సంధ్యారాగము; తిమిరంపుచంపునలుపు= చీఁకటి లేత నలుపు; వృంతబంధమెడలి=తుదికి పట్టూడి; ప్రతిఘటించి=సాటివచ్చి. తా॥ సంధ్యారాగము, చీకటి నలుపు కలిసి ప్రపంచకము, బాగుగామగ్గి క్రిందికి పడుచున్న తాటిపండువలెనున్నది. 31. విప్రయోగము=వియోగము; బాదరాయణ ముని=వ్యాసముని. తా॥ గంగలోని యిసుకతిన్నెలపై చక్రవాకము భార్యావియో గమునకై, కాశీవియోగమునకై వ్యాసుడువలె విచారించెను.

త్సేకస్ఫూర్జిత చండతాండవరయో • ద్రేకారభిట్యుద్ధృత
శ్రీకంఠస్థిర దీర్ఘపాటలజటా • శ్రేణిన్ విడంబించుచున్. 32

వ. అప్పుడు బాదరాయణుండు సంధ్యాసమయంబు నిరూపించి యమరసింధు ప్రవాహం బునం గాలోచిత క్రియాకలాపంబులు నిర్వర్తించి యొక్క నిర్మలసైకత ప్రదే శంబునం గూర్చుండి పార్వతీవల్లభుండు తనకుఁజేసిన యవమానంబునకు నుల్లం బునం దురపిల్లుచుండె నయ్యవసరంబున. 33

కం. వెల్లిగొనె నఖిలదిక్కులఁ, నల్లని చీఁకటి నవాంజ • న ప్రతిభటమై
భల్లూకసటావల్లిమ, తల్లీ విభ్రమదమై య • దభ్రస్ఫురణన్. 34

సీ. గిరినికుంజములఁ గుం • జరపుంజ మనుశంకఁ, గంఠీరవంబు లు • త్కంఠ నెగయఁ
బల్వలంబులఁ గిరి • ప్రకరంబు లనుశంక, నెఱుకురాజులు విండ్లు • లెక్కువెట్టఁ
గదలి మధ్యంబునఁ • గాకోల మనుశంక, జలదేవతలు భీతి సంభ్రమింప
నదములఁ గువల కా • ననవాటి యనుశంక, నిందిందిరశ్రేణు • లెదురు కొనఁగ

తే. రజతగిరియందుఁ దాండవా • రంభరభస, భంగిపతితపరశ్వధ • పాణి వికట
కంధరారుద్ధగజకృత్తి • కంఠశంక, ప్రమథులకుఁ దోఁప నంధకా • రంబు ప్రబలె. 35

32. ఆకాశాంచల వీథులన్=ఆకాశము చివళ్లు; నిగిడెన్=వ్యాపించెను; పాక...శ్రేణిన్=రంగువచ్చిన దేవదారు మొగ్గలవంటి, వితండవాదుల యుద్రేకము కలిగి మహాతాండవ సంరంభమున విడిపోయి వ్రేలాడు శివునియొక్క పొడవైన జటాజూటమును; విడంబించుచున్=అనుకరించుచు. తా॥ ఆకాశపుటంచుల నున్న సంధ్యారాగరేఖలు తాండవోద్రేకమున క్రిందికి వ్యాపించిన శివుని జటాజూటమువలె ప్రకాశించినవి. 33. నిరూపించి=అయినట్లు తెలిసికొని; ఉల్లంబునన్=మనస్సులో దురపిల్లుచుండెన్=బాధపడుచుండెను. 34. వెల్లిగొనెన్=ప్రవహించెను; నవాంజన ప్రతిభటమై=క్రొత్తకాటుకతో సమమై; భల్లూక...విభ్రమదమై=ఎలుఁగుబంటి జటలవలెనుండి; అదభ్రస్ఫురణన్=ఎక్కువ కాంతితో. తా॥ అప్పుడు కాఱుచీకటి క్రొత్తకాటుకవలెను, ఎలుగుబంటి జడలవలెను నాలుగు దిక్కుల ప్రవహించెను. 35. ఉత్కంఠన్=వేడుకతో; ఎగయన్=ఎగురగా; పల్వలము=చిన్న నీటిగుంట; విండులు=విల్లులు; కడలి=సంద్రముయొక్క; కాకోలము=విషము; కువలకానన వాటి=కలువలగుంపు; ఇందిందిరశ్రేణులు=తుమ్మెదలు; రజతగిరి=కైలాసము; తాండవ...కంఠశంక=తాండవమున కారంభించునపుడు శివుని మెడను కట్టుకొన్న గజాజినమోయను భ్రాంతి. తా॥ చీకటి వ్యాపింపగా ముళ్లపొదలను చూచి సింహములేనుగులను భ్రాంతిపడుచున్నవి. పచ్చికపట్టులనుచూచి అడవిపందులను కొని కోయలు విల్లెక్కుపెట్టుచుండిరి. సముద్రమధ్యముననున్న చీకటినిచూచి కాకోల విషమేమో అని జలదేవతలు కంగారుపడుచుండిరి. నదులలో నల్లకలువలనుకొని తుమ్మెదలు సన్ను లెత్తుచున్నవి. కైలాసముపై ప్రమథులునాట్యపుతొందరలో శివుడు మెడను చుట్టుకొన్న గజాజినమనుకొనునట్లు చీకటి దట్టనగా వ్యాపించెను.

తే. గాయువెన్నెల యానంద • కాననమునఁ, గాలభైరవు దంష్ట్రికు • డాలుకొలుపు
విధుఁడు వారాణశీసోమ • వీథిచక్కి. నభ్రఘంటాపథంబున • నరుగునపుడు. 44

సీ. రోహిణీగాఢోప • గూహనంబునఁ గన్న, కస్తూరికాస్థాస • కంబనంగ
రాహుదంష్ట్రాఘాత • రంధ్రమార్గంబున, లలిఁదోఁచు నాకాశ • లవమనంగ
నైర్మల్యమునఁజేసి నడుమఁ గానఁగవచ్చు, కమిచిమ్రింగిన యంధ • కారమనఁగ
జన్మవేళను మంథ • శైలాభిఘట్టన, సంభవించిన కిణ • స్థానమనఁగ

తే. విరహపరితాపవేదన • వేఁగుచున్న, చక్రవాకాంగనల కటా • క్షములయగ్గి
నావహిల్లినకజ్జదూప • మనఁగనొప్పు, నుడుగణాధీశబింబంబు • నడిమిమచ్చ. 45

సీ. కాలభైరవుఁడు ఢ • క్కాడిండిమము మ్రోయ, బహుభూతములుఁదానుఁ • బ్రహరిదిరు
జంద్రికామధు వాని • చాకోరములు చిక్క, దేవతాసౌధవీ • థికల సొగయ [గఁ
నానందకాననా • భ్యంతరంబులయందు, సిందువారమునఁ బూ • శిథిలపడఁగఁ
గడునివాతములైన • కలుషతంబులయందు, యతులు ప్రాణాయామ • మభ్యసింప

........................................................................................................................

44. అమృత...వృష్టిన్ = అమృతవర్షముతో; మదనాంతకుని = శివుని; ముక్తిమంటపికకున్ = ముక్తిమంటపమునకు, అలవోకగా = విలాసముగా; ఎరియించును = బాధించును; మిన్నేటి = గంగయొక్క; చక్ర...సముదయము = ఆడుచక్రవాకములను; కొదమ...రాజున్ = లేతచంద్రుని; కుస్తరించున్ = సవరించును; ఆనందకాననము = కాశీలోని యుద్యానము; దంష్ట్రి = కోఱ; డాలు కొలుపును = కాంతిచేకూర్చును; సోమవీథిచక్కి = సోమవీథిప్రాంతమున; అభ్రఘంటాపథమునన్ = ఆకాశవీథిలో. తా॥ కాశీనగరముపై కాయువెన్నెల ఒక్కొక్కచోట నొక్కొక్క యందము నిచ్చుచున్నది. శివుని ముక్తిమంటపమునకు నమృతధారల వర్షించి అభిషేకము చేయుచున్నది. విశాలాక్షి వెన్నెలలో విలాసగా చెక్కులనీడ జూచుకొనుచున్నది. గాంగసైకతములపై నాడు చక్రవాకములను బాధించుచున్నది. విఘ్నేశునిపైబడి యొకవింతచెల్వు గుమ్మరించుచున్నది. కాలభైరవుని కోరకు కాంతిని హెచ్చించుచున్నది. 45. గాఢోపగూహనము = గాఢాలింగనము; స్థాసకము = పూత; రాహు...మార్గంబునన్ = రాహువుకోఱదెబ్బతగిలిన చిల్లుగుండా; లలిన్ = బాగుగా; కమిచి = పట్టి; మంథ...ఘట్టనన్ = మందరపర్వతమురాపిడిచే; కిణస్థానము = కాయకాచినచోటు; ఆవహిల్లిన = కల్గిన; కజ్జదూపము = పొగచూరినందున నల్లనైన మచ్చ; ఉడు...మచ్చ = చంద్రునిలోనిమచ్చ. తా॥ చంద్రుని నడిమనున్నమచ్చ రోహిణిని కౌగిలించుకొన్నప్పు డంటిన కస్తూరిపూతవలెను, రాహువు కోర గ్రుచ్చుకొని చంద్రబింబమునకు పడిన చిల్లుగుండా కన్పించు నాకాశమువలెను, స్వచ్ఛముగా నున్నందున లోనికి క్రుంగిన చీకటివలెను, పుట్టినపుడు మందరపర్వతము రాపిడిచే నేర్పడిన కాయవలెను, విరహముచే బాధపడు చక్రవాకస్త్రీలకంటి నిప్పులయొక్క కజ్జదూపమువలెను కన్పడుచుండెను.

తే. దొడ్డవయసున శీతాంశుఁ • డొడ్డగిల్లెఁ, దఱపిచంద్రాతపమునేల • చఱచికాయ
వంత దురపిల్లి వెన్నెల • వగచివగచి, గంధవతిపట్టి యొకభంగిఁ గన్నుమోడ్చె. 46

వ. అంత. 47

—♦ సూర్యోదయ వర్ణనము ♦—

చం. వెలవెలఁబాఱెఁ జంద్రుఁడును • విన్ననఁ దారకచక్రవాళముల్
పలపలనయ్యె దీర్ఘికలఁ • బద్మవనంబుల షట్పదాంగనా
కలకలముల్ చెలంగె వెడ • కన్ను మొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపు • దిక్కునఁ దోఁచె ననూరురాగముల్. 48

సీ. ప్రథమసంధ్యాంగనా • ఫాలభాగంబునఁ, జెలువారు సిందూర • తిలక మనఁగఁ
గై సేసి పురుహూతు • గారాపుటిల్లాలు, పట్టిన రత్నద • ర్పణ మనంగ
నుదయాచలేంద్రంబు • తుదఁ బల్లవించిన, మంజుకంకేలి ని • కుంజ మనఁగ
శతమన్యుశుద్ధాంత • సౌధకూటముమీఁదఁ, గనుపట్టు కాంచన • కలశ మనఁగఁ

తే. గాలమనియెడు సిద్ధుండు • గమిచి మ్రింగి,
కుతుక మొప్పఁగ నుమిసిన • ఘుటికయనఁగ
గగనమందిరదీపికా • కళిక యనఁగ,
భానుఁ డుదయించె దేదీప్య • మానుఁ డగుచు. 49

46. ప్రహరి దిరుగన్ = గస్తీ తిరుగగా; చంద్రికామధువు = వెన్నెలలోని యమృతము; ఆని = త్రాగి; చాకోరముల్ = చకోరపక్షులు; నిక్కె = మత్తెక్కె; సొగయన్ = పరవశముకాగా; సిందువారమునన్ = వావిలిచెట్టునందు; పూ = పూవు; శిథిలపడగన్ = రాలగా; నివాతములు = గాలిచొరని; కలుమఠములు = ఱాతిమఠములు; యతులు = సన్యాసులు; 'ఒడ్డగిల్లెన్ = అతిశయించెను; తఱపిచంద్రాతపము = ముదురు వెన్నెల; వంతన్ = బాధతో; దురపిల్లి = బాధపడి; గంధవతిపట్టి = వ్యాసముని; ఒక భంగిన్ = అతికష్టముగా; కన్నుమోడ్చెన్ = నిద్రించెను. తా॥ రాత్రియైనందున కాశీ పట్టణమున కాలభైరవుడు ఢక్క-డిండిమము మ్రోయించుచు భూతములతో కలిసి గస్తీ తిరుగుచుండెను. చకోరపక్షులు వెన్నెల త్రాగి మత్తెక్కినవి. ఆనందకానన మున వావిలిపువ్వులు రాలుచున్నవి. గాలిచొరని రాతిమఠములలో సన్యాసులు ప్రాణాయామ మభ్యసించుచుండిరి. చంద్రునికి వయసు హెచ్చినది. ముదురు వెన్నెల కాయుచుండ వ్యాసుడు మనసులోని బాధతో నెట్టులో కన్నుమూసెను.
48. విన్ననన్ = ఆకాశమందు; తారకచక్రవాళముల్ = నక్షత్రమండలములు; దీర్ఘి కలన్ = దిగుడుబావులలో; షట్పదాంగనా = ఆడుతుమ్మెదల; వెడన్ = మెల్లగా; కన్నుమొగిడ్చెన్ = కన్నుమూసెను; కుముద్వతుల్ = కలువలు; జంభరిపుదిక్కునన్ = తూర్పున; అనూరురాగముల్ = అరుణకాంతులు. తా॥ తెల్లవారవచ్చినది. చంద్రుడు తెలతెలబోయెను. చుక్కలు పల్చనైనవి. సరస్సులందు తుమ్మెదల కలకలములు హెచ్చినవి. కలువలు ముడుచుకొనుచున్నవి. తూర్పున అరుణరేఖలుకన్పట్టుచున్నవి.

## —♦ వ్యాసమహర్షి యాత్రకు వెడలుట ♦—

వ. ఇట్లు సూర్యోదయంబగుటయు బాదరాయణుండు కాలోచితకృత్యంబులు నిర్వర్తించి గమనోన్ముఖుండై కాశీవియోగజనితవేదనాభరంబు దుస్సహంబై యంతరంగంబుఁ గుందింప నెట్టకేలకు నేటికెదురీఁదువిధంబున శిష్యులుం దానును గనద్ఘనకనక మణిమయసౌధాట్ట విలాసంబైన యప్పట్టణంబునకుఁ బ్రదక్షిణ క్రమంబునఁ జనువాఁడై లోలార్క కేశవులకు నభివాదనంబును భాగీరథికి నంజలిబంధంబును విశ్వనాథునకు వినుతియు విశాలాక్షికిఁ బ్రార్థనంబును మోక్షమంటపంబునకు జయకారంబును నంతర్గేహంబున కామంత్రణంబును గాలభైరవునకు జోహారును డుంఠి వినాయకులకు శరణార్థము దండపాణికి దండప్రణామంబును గుక్కుట చతుష్టయంబునకు మ్రొక్కును సకలదేవతాకోటికి నేటికోళ్లును జేసి చనునప్పుడు కతిపయదినప్రయాణంబున. 50

సీ. గంగానదీప్రవాహ • కణము మాధవదేవు, దోరంతరంబు శ్రీ • తులసి చిగురుఁ
బురుషోత్తమమునందుఁ • బుండరీకాక్షుని, దివ్యపాదాంభోజ • క్షేత్ర (తీర్థ) జలము
శ్రీ కూర్మమునయందు • శేషాహిపర్యంకు, కంఠంబు క్రొత్తచెం • గల్వదండ
సింహాద్రియందు ల • క్ష్మీనృకంఠీరవ, సార్వభౌము ప్రసాద • చందనంబుఁ

---

49. ప్రథమ...భాగంబునన్ = ప్రాతస్సంధ్యయను స్త్రీముఖమున; కైసేసి = అలంకరించి; పురుహూతు = ఇంద్రుని; రత్నదర్పణము = రత్నాల యద్దము; తుదన్ = చివర; పల్లవించిన = చిగిర్చిన; మంజు...నికుంజము = అశోకపుపొద; శత...కూటము = ఇంద్రుని యంతఃపురముమీద; కమచి = పట్టి; ఘుటిక = మాత్ర; దీపికాళిక = దీపము. తా॥ ఉదయించునట్టిసూర్యుడు ప్రాతస్సంధ్యయను స్త్రీ నుదుట పెట్టుకొన్న సిందూర తిలకమువలెను, శచీదేవి అలంకరించుకొనుటకై చేపట్టిన రత్నాల యద్దమువలెను, ఉదయగిరిచివర చిగిర్చిన అశోకపుగున్నవలెను, ఇంద్రప్రాసాదముమీది పసిడికుండ వలెను, కాలమను సిద్ధుడు మ్రింగి ఉమిసిన ఔషధపు టుండవలెను, ఆకాశమను నింటిలోని దీపమువలెను ప్రకాశించెను. 50. బాదరాయణుండు = వ్యాసుడు; సౌధ = మేడలు; అట్ట = మేడవెనుకటియిల్లు; ఆమంత్రణంబు = సెలవు; ఏటికోళ్లు = దండము; కతిపయ = కొన్ని. తా॥ ప్రొద్దుపొడువగానే వ్యాసమహర్షి నిత్యకృత్యములుతీర్చుకొని కాశిని వదలలేక వదలలేక ఏటికెదురీదునట్లు శిష్యులతో కలిసి కాశిక ప్రదక్షిణక్రమముగ వెళ్లుచు విశాలాక్షీ విశ్వనాథులకు, తక్కినదేవతలకు నమస్కారములుచేసి కాశివెడలి, కొన్నిరోజులు ప్రయాణము చేసెను.

తే. గాశికావిప్రయోగోరు • గాఢతాప, శాంతికొదవెను శిశిరోప • చార మగుచుఁ
జాయతెరువున శ్రీపాద • రాయణునకు, హరిహరధ్యానపూజా ప • రాయణునకు. 51

—♦ పీఠికాపుర వర్ణనము ♦—

సీ. ఏపట్టణము మ్రోల • నేలేఱు ప్రవహించుఁ, బృథివికి ముత్యాల • పేరువోలె
మున్నూట యఱువది • మూర్తిభేదములతో, విహరించు నేవీట • వేల్పుపిండు
పీతాంబచెలి యోగ • పీఠిహుంకృతిదుర్గ, ననిచి కాపుండు నే • నగరికెలనఁ
గుంతీమహాదేవి • కూర్మి మేసల్లుఁడు, మాధవుం డేవీట • మరగినాఁడు
తే. పెద్దగవఁకుల నే పుట • భేదనమున నెలమి నిలుచుండు వ్రీడావి • హీనజఘనుఁ
డట్టి పీఠాపురముఁ జేర • నరుగుదెంచెఁ, బరమశైవుండు శ్రీ పరా • శరసుతుండు. 52
తే. నారికేళంపుఁబుట్ట నె • న్నడిమిచాయ, దళములందును బోలె సం • తతముఁ బాఱు
వేణికాసారణులయందు • విస్మయముగ, జగతి నెక్కుడి వేలేటి • సాటినదులు. 53
సీ. ఏఁటేఁట విరినీట • నిరుగారునుం బండుఁ, బ్రాసంగువరి చేలఁ • బసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనస • పండులతావి, యిందిందిరములకు • విందు సేయు
వేఁబోఁకఁబొలుపారు • వింధ్యాద్రి పవనంబు, పోఁకపువ్వుల తావిఁ • బుక్కిలించు
వేశ్యవాటికలయందు • విహరించు వలరాజు, ననయంబుఁ జెఱకు వి • ల్లును ధరించు

51. ప్రవాశకణము=నీటిబిందువు; దోరంతరంబు=భుజ మధ్యమందలి; పురుషోత్తమము=క్షేత్రము; శేషాహిపర్యంకు=శేషశాయియొక్క; లక్ష్మీ...భౌము=వరాహలక్ష్మీనృసింహస్వామియొక్క; ప్రసాదచందనంబు=ప్రసాదమైన మంచి గంధము; కాశికా...శాంతికిన్=కాశి వియోగముచే కల్గిన తాపశాంతికి. చాయ తెరువున=నీడవలె. తా॥ కాశిని వదలి వ్యాసుడు చాల తీర్థముల సేవించెను. అప్పు డక్కడక్కడి తీర్థప్రసాదముల తనకు మనశ్శాంతి చేకూర్చినవి. మాధవునిమీది తులసిదళము, పుండరీకాక్షుని పాదతీర్థము, శ్రీ కూర్మములోని శేషశాయి మెడ లోని చెంగల్వదండ, సింహాద్రి లక్ష్మీనరసింహస్వామి చందనము నతనికి చలువ చేకూర్చి కాశీ వియోగాగ్నిని చల్లార్చినవి. 52. మ్రోల=ముందఱ; ఏవీటన్=ఏయూరిలో; వేల్పుపిండు=దేవతాజనము; అనిచి=నియోగించి; కాపుండు=కావలి యుండును; నగరికెలనన్=నగరము ప్రక్కన; పెద్దగవకులన్=గోపురములవద్ద; పుటభేదనము=పట్టణము; వ్రీడా...జఘనుఁడు=దిగంబరుడు(భైరవుడు); పీఠాపురము=పురము. తా॥ భూమికి ముత్యాలపేరువలె నే నగరముముందు ఏలేరు ప్రవహించునో, ఎచ్చట దేవతలు మున్నూటయఱువదిరూపముల తిరుగుదురో, ఏ నగరికి పీతాంబరు చెలియగు హుంకారదుర్గ కావలియుండునో, కుంతి మాధవు డెచటనుండునో, భైరవమూర్తి యెచ్చట నుండెనో వ్యాసుడు అట్టి పీఠాపురమును చేరెను. 53. నారికేళంబు...చాయన్=కొబ్బరితోటలమధ్యన; వేణికాసారణులు=బోదులు. తా॥ కొబ్బరితోటలలో ఆకుల సందునుండి ప్రవహించుచున్నట్లు ఏలేరు బోదుల గుండా ప్రవహించుచుండును.

తే. నారదంబుల వలపు పొ • న్నలఁ బెనంగి, విచికిలామోదములతోడ • వియ్యమందుఁ
పాటలీపుష్ప కేతకీ • పరిమళములు, పొదల విలసిల్లుఁ బీఠికా • పురమునందు. 54

వ. వెండియు నవఖండమండలంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుం బోలె భీమేశ్వరమండలంబుపొరువునఁ ద్రిలింగోత్కలతలంబులనంది వింధ్యాచలపాదంబునఁ గేదారకుంభకోణార్కస్థానంబులకుపమానంబనఁజాలి యేలేటి మేటి కాలువలవలన నదీమాతృకంబులగు పంటవలంతి సలిలధౌతకలధౌత శలాకాళికల సంకోచకరణంబులై యంకురించినవియును, గొదమపసరు తెక్కల పక్కిడాలు పుక్కిలించి యుమియంజాలు చాయలేర్పడం బసరుపాఱునవియును. దక్షారామ రామాజనంబుల చిఱుపిక్కల చక్కఁదనంబు నెకసక్కెంబాడు బిగువు పొట్టలం గనుపట్టునవియును, బథికనాసాపుటీకుటీరంబులకుఁ గుటుంబకములగు కమ్మదనంబులీని పాలుకుడిచి సుందరీప్రాయంబున నామువలచునవియును, బదియాఱువన్నె కుందనంపుఁదగడుఁ దెగడుచుఁ బండి యుద్దండ కేదారవలయ కుముదషండంబు లాఘ్రాణింపఁగుంబోలెఁ గ్రొవ్వాలునవియు నైకలమశాలిశారదా ముఖాది వ్రీహిసస్యంబులవలనను, నిరంతరనారి కేళచ్ఛదచ్ఛాయాచ్ఛన్న హరిదంతరంబుల భుజంగవల్లీమతల్లి కాలింగిత క్రముకకంఠోపకంఠంబులఁ గ్రీడించు క్రోడదళనదష్ట స్వాదిష్ఠపనసఫలరససారణీ పరంపరా సంపూర్ణచంపకద్రుమాలావాలవలయంబులు, వనదేవతావిలాసతాళ వృంతాయమాన రంభాపలాశసంభారంబులుఁ, దిలకతిలకితంబులు, విదేశవిచికిలంబులుఁ, గోరకితకురువకంబులు, నిబిడ రసకేసరంబులు, నఖిలభువనాభి రామంబులునైన యారామంబులవలనను గన్నులపండువై కుంతీమాధవదేవునకు విశ్రాంతి ప్రదేశంబును, హుంకారిణీ మహాదేవికి విహారసంకేత భవనంబును, బీఠాంబికాలక్ష్మి కాటకూటంబును, హేలాసానికి హాలాపాన గోష్ఠి మంటపంబును, ననందగి భూతబేతాళ డాకినీ ప్రేతరంక భైరవ వ్రాతనిర్మిత ప్రాకార వప్రహట్టకుట్టిమంబగు పీఠాపట్టణంబుఁ బ్రవేశించిరంత. 55

---

54. విరినీటన్ = పూనీటితో; ఇరుగారునన్ = రెండు సమయముల (తొలకరి-పైరులలో); ప్రాసంగువరి = ఒకరకపు ధాన్యము; వేరుపనస = వేరునంటి కాయు పనస; తావి = సువాసన; ఇందిందిరములు = తుమ్మెదలు; వేఁబోఁకన్ = తెల్లవారు జామున; వలరాజు = మన్మథుఁడు; నారదంబులన్ = నారింజలను; విచికిలామోదముల తోడన్ = మల్లెల (దమనముల) వాసనలతో; పొదలన్ = వ్యాపింపగా.
తా॥ పూదేనెతో నేటికి రెండుసార్లు ప్రాసంగువరిచేలు పండును. పసనై ముగ్గిన వేరుపనసపళ్ల సువాసన తుమ్మెదల కానందము కల్గఁజేయును. వేకువవేళల వింధ్యాద్రిపైనుండివచ్చు చల్లగాలి పోకపువ్వులగాలితో కలియును. వేశ్యవాటికలందెల్లప్పుడును మదనుడు విల్లు చేపట్టియేయుండును. మల్లెలు, పొన్నలు, మొగలిపువ్వుల పరిమళములు నెల్లవేళల నాపురిని గుబాళించుచుండును.

సీ. త్రపుసపుష్పలతామ • తల్లీపటోలికా, కారవేల్లకుడుంగ • కములతోడఁ
గూష్మాండ వృంతాక • కోలకచించికా, కాయమానకదంబ • కములతోడ
శాకినీ మూలకచ్ఛత్రాక • సారణీ, ధాన్యాక మేఘనా • దములతోడఁ
బిప్పల్యుపోదకీ • పీతపలాండుక, వాస్తుశాఖాకోటి • వాటితోడ

తే. రాజనలతోడ శృంగ బే రములతోడఁ. జిఱుగడఁపుఁ బెండలములతోడఁ • జేమతోడ
నొప్పునాలుగు పొలములం • దుపవనములు, భువనసారము పీఠికా•పురవరమున. 56

ఉ. హాటకపానపాత్రయును • నారఁగఁబండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొ • గింధరియించి పురోపకంఠశృం
గాటకభూమి భాగమునఁ • గాపురముండెడు పీఠికాంబకుం
గైటభదైత్యవైరి ప్రియ • కాంతకు మ్రొక్కె నతంబు భక్తితోన్. 57

శా. అంతర్వాణి భజించెఁ గుక్కుటపతిన్ • హాలాహల గ్రీవునిన్
గాంతస్వాంతుఁడు గొల్చె దానవచమూ • సంహారిణిన్ హుంకృతిన్

---

55. వింధ్యాచల పాదంబునన్ = వింధ్యపర్వతముప్రాంతమున; నదీమాతృకములు = నదీజలములతో పండెడిభూములు; పంటవలంతి = భూమి; పక్కిడాలు = పక్షిరంగు; రామాజనములు = స్త్రీలు; పథిక...కుటుంబకములు = బాటసారులకు హితమైన; ఈని = కలిగి; పాలుకుడిచి = పాలుపోసికొని; నాముపలచునవి = సొంపుగానున్నవి; కుందనంపుఁదగడు = బంగారురేకు; కుసుదషండములు = కలువప్రోగులు; కైవ్రాలునవి = నేలకువ్రాలునవి; వ్రీహిసస్యములు = వరిచేలు; నిరంతర = దట్టమైన; నారి...ఛన్న = కొబ్బరియాకుల నీడచే గప్పబడిన; హరిదంతరంబులన్ = ప్రదేశముల; భుజంగవల్లీ = తాంబూలపుతీగలు; క్రముక...కంఠంబులన్ = పోకతోటల ప్రక్కన; క్రోడ...వలయంబులు = పందులుకొరికిన రుచియైన వేరు పనసపళ్ల రసముల కాల్వలతోనిండిన సంపెంగ మొక్కలబోదెలుకలవి; వన...సంభారములు = వనదేవతల వింజామరలవలె నున్న అరటియాకులుకలవి; విదేశవిచికిలములు = విదేశపుమల్లెలుకలవి; కోరకిత = మొగ్గతొడిగిన; కేసరములు = పొన్నలు; ఆటకూటము = విహార ప్రదేశము; హేలాసాని = హేలాంబ; హాలా...మండపము = పానశాల. 56. త్రపుస = చేదు దోస; పటోలికా...తోడ = పొట్ల, కాకరపాదులతో, కూష్మాండ = గుమ్మడి; వృంతాక = నీరువంగ; కోలక = మిర్యము; చించికా = చింత; కాయమాన = పందిరి; శాకిని = పెరుగుతోటకూర; మూలక = ముల్లంగి; ఛత్రాక = పుట్టగొడుగు; సారణి = గొంతెమగోరుచెట్టు; ధాన్యాక = ధనియము; మేఘనాదము = చిట్టికూర; ఉపోదకి = దుంపబచ్చలి; పీత = పసుపు; పలాండుక = నీరుల్లి; వాస్తుశాఖా = ఆకుకూర; శృంగబేరము = అల్లము. తా॥ పిఠాపురమున భూభాగము మంచిది కనుక దోస, వంగ; మిరియము మొదలైనవి చక్కగా పండును. 57. మాతులుంగము = మాదీఫలపుచెట్టు; ఖేటము = డాలు; లోహదండము = ఇనుపకఱ్ఱ; పుర...భూమి = గ్రామకంఠమున; కైటభ...కాంత = లక్ష్మి; నతంబుభక్తి = ఎక్కువభక్తి. తా॥ ఆ గ్రామకంఠమున కావలియున్న పీఠాంబకు వ్యాసుడు మ్రొక్కెను.

జింతించెన్ మునిసార్వభౌముఁడు పుర • క్షేత్రాధిదైవంబులం
గుంతీమాధవుఁ బూజచేసె ఋషివా • క్పుష్పోప హారంబులన్. 58

తే. హేల నేలాతరంగిణీ • కూలనిలయ, బాల బాలారుణాశోక • పల్లవోష్ఠి
వేల వేలావనోద్దేశ • విహృతిలోల, నేల నేలాయనకపాడె • ఋషివరుండు. 59

వ. అనంతరంబ యొక్కింత మార్గాంతరం బతిక్రమించి. 60

—• కుమారారామవర్ణనము •—

శా. ఆలోకించె మహామునీంద్రుఁడు కుమా • రారామమున్ వింధ్యకు
ట్కీలోపాంతధరాలలామము బహు • క్రీడావనశ్యామమున్
బ్రాలేయాచలకన్యకాధవజటా • ధారాసనార్ధేందురే
ఖాలానాయితహేమకూటకలధౌ • తాట్టాలకగ్రామమున్. 61

సీ. కొమరేటి కల్యాణ • కమలషండంబుల, సౌరభ్యభారంబు • సంతరించి
నారికేళాటవీ • నవపుష్పకుహళికా, వితతికన్నెలికంబు • వీడుకొలిపి
యప్సరఃకాంతావి • హారహాటకహర్మ్య, శశికాంతమణిగవా • క్షములఁదూటి
భీమనాయకదేవు • పేరురంబునఁగ్రాలు, భుజగహారములకు • భుక్తివెట్టి

తే. రాజనారాయణస్వామి • రమ్యభవన, తార్క్ష్యకేతనపతికి న • ర్తనముగఅపి
పొలసె సత్వపరిశ్రాంతి • పొడవడంగ, మౌనివరుపైఁ గుమారవ • నానిలములు. 62

58. అంతర్వాణి=పండితుడు; ఋషి...ఉపహారంబులన్=స్తోత్రములతో.
తా॥ వ్యాసుడచ్చట కుక్కుటేశ్వరుని, హుంకారిణీదేవలను, కుంతీమాధవుని స్తుతించెను. 59. హేల, బాల, వేల, ఏల=దేవతలు; ఏలాతరంగిణి=ఏలేఱు. తా॥ ఆ ఋషి ఏలానదిదేవతలను స్తుతించెను. 60. మార్గాంతరము=కొంతదారి. 61. వింధ్య...లలామము=వింధ్యకు దగ్గఱభూమి; ప్రాలేయ...గ్రామమున్=శివుని జటలలోని చంద్రరేఖకు స్థానమైన బంగారుమేడల సముదాయము కలది; కుమారారామము=సామర్లకోటవద్దనున్న భీమవరము. తా॥ అతడు కుమారారామము (చాళుక్యభీమవరము, సామర్లకోటవద్ద నున్నది) చేరెను. అది వింధ్యప్రాంతమున నున్నది. దాని చుట్టు నుద్యానవనములున్నవి. శివుని తలమీది చంద్రుని వెన్నెలచే తెల్లనైన మేడలు కలది. అనగా నెల్లప్పుడును వెన్నెలలు కలది. 62. కమల...భారము=పద్మముల సువాసన; కుహళికా=పోకపొత్తి; పేరురంబునన్=పెద్దఱొమ్మున; క్రాలు=ప్రకాశించు; తార్క్ష్యకేతనపతి=విష్ణువు; పొలసెన్=వీచెను; అధ్వ...పొడవు=మార్గాయాసము. తా॥ కొమరేటిలోని పద్మముల వాసనగల్గి, కొబ్బరి పువ్వుల తావిగల్గి, భోగ్యస్త్రీల విహారప్రాసాదముల తిరిగి, భీమేశ్వరునికి సోకి, రాజనారాయణస్వామి జెండాను కదపెడి గాలులు వ్యాసునికి తగిలి మార్గాయాసమును పోగొట్టినవి.

తే. బాదరాయణుఁ డత్యంత • భక్తినియతి, దివ్యవాహినిఁ గౌమరేటఁ దీర్థమాడి
శిష్యవర్గంబుఁదాను ద • ర్శించి మ్రొక్కె, శాశ్వతునకుఁజాళుక్య భీ • మేశ్వరునకు. 63

వ. వెండియుఁ గొంత దవ్వుచని. 64

—♦ సర్పపుర వర్ణనము ♦—

శా. కాంచెన్ సర్పపురాభిధానముఁ ద్రిలిం • గక్షోణి వైకుంఠమున్
ముంచెన్ నారదకుండికాజలముల • న్మోదంబుతో దేహమున్
జించెన్ గాశివియోగ దుఃఖము మహా • క్షేత్రంబు వీక్షించి ద
ర్శించెన్ సన్ముని లోచనోత్సవముగా • శ్రీ భావనారాయణున్. 65

సీ. శ్రీ సుదర్శన శంఖ • చిహ్నాంకితముగాక, యెపుడు మిన్నకయున్న • యిల్లులేదు
బహులోర్ధ్వపుండ్ర సం • పదలేక వృథయైన, ఫాలలేఖలతోడి • ప్రజయులేదు
వైష్ణవోత్తమ భాగ • వతసాత్త్వికులగోష్ఠి, వెలియైనవాటికా • వేదిలేదు
నలినేక్షణుఁడు భావ • నారాయణస్వామిఁ, దప్పించి పరదైవ • తంబు లేదు

తే. పరమగీర్వాణయాగవై • భవము నెలవు, నిఖిల కల్యాణగుణకేలి • నిలయ మనఘ
దివ్యములు నూటయెనిమిది • తిరుపతులకుఁ, బరమపదమైన శ్రీసర్ప•పురమునందు. 66

మ. శనివారోత్సవ మాచరించె ముని శి • ష్య వ్రాతముందానుఁ గ
మ్మనిపణ్యారముతోడ బూరెగమితో • మండెంగ దండంబుతో
ననుగుంబాసెముదోడఁ బాండుకలమా • హారంబుతో నేతితో
ఘనరంభాఫలఖండశర్కరలతోఁ • గారుణ్యపాథోధికిన్. 67

63. తీర్థమాడి=స్నానముచేసి; తా॥ వ్యాసుడు శిష్యులతోకూడి భక్తితో కొమరేటిలో స్నానముచేసి భీమేశ్వరు దర్శించెను. 64. దవ్వు=దూరము. 65. త్రిలింగక్షోణి=తెలుఁగుదేశము; నారదకుండిక=నారదకుండము; చించెన్=తగ్గించుకొనెను; సన్ముని=వ్యాసర్షి. తా॥ అక్కడినుండి సర్పపురమున కేగెను. అది భూలోక వైకుంఠమే. అట నారదకుండములో తానమాడెను. భావనారాయణ స్వామిని దర్శించెను. దానితో కాశీవియోగ వ్యథ తగ్గినది. 66. మిన్నకయున్న=ఊరకున్న; బహుల...సంపద=ఎక్కువనామములు; గోష్ఠివెలియైన=గోష్ఠిలేని; వాటికావేది=వాడలందలి యరుగు; నెలవు=స్థానము. తా॥ అచ్చట శంఖచక్ర చిహ్నములులేని యిల్లులేదు. నామములులేని మొగములేదు. భగవద్భక్తులగోష్ఠిలేని అరుగులేదు. భావనారాయణస్వామి తప్ప వేరుదైవములేదు. నూటయెనిమిది పుణ్య క్షేత్రములకది నిలయమైనది. 67. శిష్యవ్రాతము=శిష్యసంఘము; పణ్యారము=నానపప్పు (పిండివంట); గమి=సమూహము; మండెంగ=గోధుమపూరీ; పాసెము=పాయసము; రంభాఫల=అరటిపండు; కారుణ్యపాథోధికిన్=దయాసముద్రుడైన దేవునికి. తా॥ అచ్చట వ్యాసముని శిష్యులతో కలిసి పంచభక్ష్యములతోను స్వామికి శనివారోత్సవము చేయించెను.

తే. ద్వాదశాక్షర దివ్యమం • త్రమునఁ బూన్చెఁ, జెంగలువ పువ్వుదండ ల • క్ష్మీధవునకు
శ్రీమదష్టాక్షరమున న • ర్చించెఁ దపసి, భావనారాయణస్వామిఁ • బసిఁడివిరుల. 68

వ. అనంతరంబ కతిపయప్రయాణంబులఁ దుల్యభాగాతీరంబున. 69

శా. చేతోమోదమెలర్పఁ గన్టెదురఁ గాం • చెన్ భారతామ్నాయ వి
ద్యాతంత్రగ్రథనాబ్జసంభవుఁడు వే • దవ్యాసుఁ డభ్యర్చిత
జ్యోతిర్లింగమయస్వరూపుల జటా • జూటావనార్ధేందులన్
వాతాపీల్వలవైరి గౌతమనదీ • వాస్సంగమేశానులన్. 70

తే. వేదశాఖావిభాగసం • పేదియతఁడు లలితబిల్వత్రి శాఖాస • లాశసమితి
సంగమేశఘటోద్భవ • శంకరులకు, నర్చనముసేయుఁ బ్రణవపం•చాక్షరముల. 71

వ. మఱియుఁ దుల్యభాగాతీరంబున సాంపరాయణగ్రామంబుచేరువ బిల్వాటవీ వాటిఁ
గపట భిల్లుండైన చలిగొండ జేని యల్లుని ముక్తీశ్వరు దర్శించి. 72

ఉ. వేదవిభాగముం బరిఢ • వించిన పుణ్యుఁడు వేడ్కఁ బూన్చె బి
ల్వీదళపూజనంబు గడు • లెస్సఁగఁ గూరిమి శిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరు • ణామృతపూరముఁ జల్లు పుండరీ
కోదరభిల్లు సృత్తకరి • యూథపుమల్లునిఁ గొండయల్లునిన్. 73

తే. పదియునార్వన్నె బంగారుఁ బరిహసించు, నవనవారగ్వధ ప్రసూ • నములు గోసి
సాంపరాయణమహాగ్రామ•సవిధనిలయు, నభవుఁ బూజించెఁ బుండరీ•కాక్షమూర్తి. 74

---

68. పూన్చెన్ = ధరింపజేసెను; పసిడివిరులన్ = బంగారు పువ్వులతో. తా॥ స్వామికి ద్వాదశాక్షరము మంత్రముతో చెంగల్వదండవేసి, అష్టాక్షరీ మంత్రముతో బంగారుపూల పూజచేసెను. 69, తుల్యభాగ = నది. 70. ఎలర్పన్ = ఎక్కువ కాగా; భారత...సంభవుఁడు = భారతస్రష్ట; అభ్యర్చిత = గౌరవింపబడిన; జటా... ఇందులన్ = జటులలో చంద్రరేఖలు కలవారు; వాతాపి...ఈశానులన్ = అగస్త్యేశ్వర, సంగమేశ్వరులను. తా॥ అటనుండి వ్యాసుడు తుల్యభాగాతీరమున వెళ్లుచు దారిలో అగస్త్యేశ్వర, సంగమేశ్వరుల దర్శించెను. 71. లలిత...సమితిన్ = అందమైనమారేడు దళములతో; ఘటోద్భవశంకరుడు = అగస్త్యేశ్వరుడు. తా॥ వ్యాసుడు దేవతలను బిల్వదళములతో ఓంకారయుక్తమైన పంచాక్షరీ మంత్రముతో పూజించెను. 72. కపటభిల్లుడు = మాయాకిరాతుఁడు; చలి...యల్లుని = శివుని; ముక్తీశ్వరుడు = అక్కడి దేవుడు. 73. పరిఢవించిన = నడపిన; ఆదిమభిల్లుడు = మొదటిబోయకవాడు; పుండరీకోదర భిల్లుకు = విష్ణువుబాణముగా కలవాడు; కొండయల్లుడు = శివుడు. తా॥ వ్యాసుడు సాంపరాయణ గ్రామమున ముక్తీశ్వరుని మారేడుదళములతో పూజించెను. 74. నవ...ప్రసూనములు = క్రొత్తరేలపువ్వులు; సవిధనిలయుడు = దగ్గరలోనున్నవాడు; పుండరీకాక్షమూర్తి = వ్యాసుడు. తా॥ అచ్చట మేలిమి బంగారురంగురేలపువ్వులతో పుండరీకాక్షుని పూజించెను.

కం. పంచబ్రహ్మంబులనున్, బంచాక్షర మంత్రములను • బంచాననునిం
బంచమవేదం బఖి ని.ర్మించినముని పూన్చెఁ బుండ • రీకకళికలన్. 75

వ. ఇవ్విధంబునఁ గాలకంఠునకుఁ బ్రభాతకాలపూజ నిర్వర్తించి సాత్యవతేయుండు
గమనోన్ముఖుండై యున్న సమయంబున. 76

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి • నిట్టింకులింకించె, గంభీర హుంకార • గర్జనమునఁ
బ్రణవ పంచాక్షరో • పనిషత్ప్రపంచంబు, లెవ్వాఁడు శివునిచే • నెఱిఁగికొనియె
గడసిల్లుధరయొద్ద • గెడమైన నెవ్వాఁడు, త్రాసుపైఁ గల్లైపం • దమునవంచె
నంభోధులేడింటి • నాపోశనంబెత్తి, కలిగించె నెవ్వాఁడు • క్రమ్మఱంగ

తే. భీమనాథేశ్వరుఁడు గౌరిఁ బెండ్లియాడి, దక్షిణాముఖకల్యాణ • దర్శనమున
వర్సరము వత్సరంబు నె • వ్వానిఁజూచు,నతఁడు గగనాగ్రమాణిక్య•పురుగుడెంచె. 77

తే. మలయదుర్దరగిరిగుహా • మందిరుండు,
తామ్రపర్ణీజలస్నాన • ధౌతమలుఁడు
కలుషితాంభః ప్రసాదైక • కతకఫలము,
కోమలియుఁ దాను నేతెంచెఁ • గుంభభవుఁడు. 78

75. పంచాననుడు=శివుడు; పంచమ వేదము=భారతము; కళిక=మొగ్గ. తా॥పంచబ్రహ్మ, పంచాక్షరీ మంత్రములతో వ్యాసుడు శివుని తెల్లతామర మొగ్గలతో పూజించెను. 76. కాలకంఠుడు=శివుడు; సాత్యవతేయుడు=వ్యాసుడు. 77. ఇట్టింకులు=మిక్కిలి ఇంకుట; గగనాగ్రమాణిక్యము=ఆకసముచివర మాణిక్యమువలె మెఱయువాడు; ఆపోశనము=అరచేతిలో పోసికొని త్రాగుట; కెడవు=పతనము. తా॥ ఒక్క హుంకారముతో వింధ్యపర్వతమునణచినవాడు, శివునివద్ద పంచాక్షరోపనిషత్తులనేర్చినవాడు భూమి తలక్రిందుకాకుండ దక్షిణపుదిక్కున త్రాసులో కల్లైవలె నున్నవాడు. (అన్నిటికన్న అగస్త్యుడు బరువు; అగస్త్యునికన్న వసిష్ఠుని కమండులువు బరువు' అని సామెత. ఒకప్పుడు వసిష్ఠ విశ్వామిత్రుల తారతమ్య పరీక్షరాగా బ్రహ్మ వారినివెళ్లి అగస్త్యుని తీర్పుచెప్పుటకై తీసికొనిరమ్మనెను. విశ్వామిత్రుడువెళ్లి అగస్త్యుని రమ్మని కోరగా అతడు 'నేను వచ్చినచో భూమి యొరిగి పోవును. దాని నాపగలిగినచో వత్తు'ననెను. అందులకు తగిన సామర్థ్యములేక విశ్వామిత్రుడు వెడలిపోయెను. అంతట వసిష్ఠుడు వెళ్లి తన కమండులువును అగస్త్యునిస్థానే ఉంచి అగస్త్యునితోడ్కొని వచ్చి తగవు తీర్పించుకొనెను. అట్లు అగస్త్యుడుభూమికి దక్షిణదిక్కున బరువుగానున్నవాడు.) ఏడు సముద్రములు నాపోశనముపట్టి మఱల నిండించినవాడు, భీమనాథుని కేటేట దర్శనమిచ్చునట్టి ముని. (ఏతెంచెను)

శా. ద్వీపాంతోద్భవుఁడైన సంయమికులా • ధీశుండు కాలోచిత
వ్యాపారంబులు దీర్చి రేపకడ ద • క్షారామయాత్రోద్యమం
బాపాదించుచు నోంక్రియానగర ప • ర్యంతార్ధమార్గంబునన్
లోపాముద్రయుఁ దాను వచ్చు ముని నా • లోకించె దౌదవ్వులన్. 79

తే. ద్వాదశక్షేత్రయాత్రావి • ధాననియతి, భీమమండలిఁ జరియింపఁ • బృథులభక్తిఁ
గుక్కుటేశ్వరు దర్శింపఁ • గోర్కిపుట్టి, యట్టి పీఠాపురంబున • కరుగువాని. 80

ఉ. తేపులు భీమలింగము గు • ణించి జపం బొనరించి నిచ్చలున్
మాపటిదాఁకఁ దీర్థముల • మజ్జనమాడుచు నుండు వానిఁ బీ
ఠాపురి కుక్కుటేశ్వరుని • డాయఁగఁ బోయెడువానిఁ దుల్యభా
గాపగ చెంత శంకరగృహాం • గణ బిల్వవనాంతరంబునన్. 81

వ. అప్పరమమాహేశ్వరుం గనుంగొని సాత్యవతేయుండు ప్రత్యుత్థానంబుచేసి యెదు
రొక్కనియె నతండును. 82

సీ. భస్మత్రిపుండ్రాంకి • ఫాలప్రదేశుని, రుద్రాక్షమాలికా • రూఢవక్ష
ముపవీతకృష్ణాజి • నోత్తరాంగునిఁ బల్లి, వారు బాంచితజటా • పటలధారుఁ

---

78. మలయ...మందిరుండు=మలయ, దుర్ధర(దర్దుర) పర్వతముల నుండువాడు. తామ్ర...మలుడు=తామ్రపర్ణిలో స్నానము చేయుటచే పవిత్రుడైనవాడు; కలుషిత...ఫలము=కలగిననీరు తేరుటకు ఇండుపకాయవంటివాడు; కోమలి=భార్య (లోపాముద్ర) తా॥ అగస్త్యుడు దక్షిణదిశనున్న మలయదుర్ధర(దర్దురగిరియని కాళిదాసు చెప్పెను.) గుహల దిరుగువాడు, తామ్రపర్ణీనదిలో స్నానము చేయువాడు, కలగిననీటిని తేర్చువాడు (శరత్కాలము వచ్చుటతో నగస్త్య నక్షత్రోదయమగును. అప్పటినుండి నీరు తేఱును) నైన అగస్త్యముని భార్యయగు లోపాముద్రతో కూడివచ్చెను. 79. ద్వీప... అధీశుండు=వ్యాసుడు; రేపకడ=ఉదయముననే; దౌదవ్వులన్=దూరదూరాన. తా॥ వ్యాసముని కాల్యకృత్యములు నిర్వర్తించుకొని, ప్రొద్దుననే దక్షారామమునకు ప్రయాణమగుసన్నాహముతో వెళ్లుచు నోంకారమార్గము దారిలో సపత్నీకుడై వచ్చు నగస్త్యుని దూరమునుండియే చూచెను. 80. నియతిన్=నియమముతో. తా॥ అగస్త్యుడు ద్వాదశక్షేత్రయాత్రలు చేయు నియమముతో భీమమండలమున సంచరించుచు కుక్కుటేశ్వరుని దర్శింపగోరి పిఠాపురమునకు వెళ్లుచుండెను. 81. తేపు=ప్రాతఃకాలము నిచ్చలున్=ఎల్లప్పుడును; మజ్జనమాడుచు=స్నానము చేయుచు॥ తుల్యభాగాపగ=తుల్యభాగానది. తా॥ ప్రొద్దుననే భీమేశ్వరజపము చేసి, నిత్యమును సాయంకాలము వరకు తీర్థస్నానములు చేయు నలవాటులో ఈనాడు కుక్కుటేశ్వరుని వద్దకు బోవుచునున్న అగస్త్యుని తుల్యభాగానదీతీరముననున్న మారేడుతోటలో వ్యాసుడు చూచెను. 82. ప్రత్యుత్థానము=ఎదురుగాలేచి వెళ్లుట.

దామ్రపాత్రాంగుళీ • దర్భమూలపవిత్రుఁ, దరుణకింశుకలతా • దండధారుఁ
బ్రావృషేణ్యావినీల • పాథోధరశ్యాము, సాలవృక్షప్రాంశుఁ, • జారుదేహుఁ

తే. బరమ భాగవతోత్తమ • ప్రథమగణ్యు, విపులమాహేశ్వరాచర • వీథిపథికు
నఖిలనీవారముష్టింప•చాగ్రవరునిఁ, బులినసంభవుఁ బొడగాంచెఁ • గలశజుండు. 83

ఉ. యోజనగంధనందనుఁడు • నూర్వశిపట్టియు నిర్నిరోధ ని
ర్వ్యాజనిరంకుశ ప్రణయ • వైభవసంపద సొంపు మానసాం
భోజములం దలిర్ప ముని • పుంగవు లొండొరుఁగౌఁగిలించి వి
భ్రాజితలీలఁ జల్పిరి ప • రస్పరముం గుశలప్రసంగముల్. 84

కం. వినయము భక్తియు సంభ్రమ, మును సౌహార్దంబు హృదయ • ముల మొలతేరన్
వినుతి యొనర్చి రగస్త్యున, కును వైశంపాయనాది • కులు మునిశిష్యుల్. 85

వ. అనంతరం బాతుల్య భాగాతీర బిల్వతరువనాంతరంబున శశికాంతశీతల శిలాతల ప్రదేశంబున నాసీనులై యిల్వలాసురదమనుండును బరాశరనందనుండును గొంత తడ విష్టకథావినోదంబులఁ బ్రొద్దువుచ్చి రప్పు డగస్త్యుడుసాత్యవతేయునకిట్టులనియె. 86

—♦ అగస్త్యుఁడు వ్యాసమహర్షిఁ గాశిఁ బాసి వచ్చుటకుఁ గారణంబడుగుట ♦—

తే. ఆననమునందు వైవర్ణ్య • మగ్గలించెఁ, గన్నుఁగవయందు దైన్యంబు • గానఁబడియె
నార్తి నేదేనియొకటి నీ•యంతరంగ,మూనియున్నది యిదియెట్టు•లొక్కొ-యనఘ. 87

83. భస్మ...ప్రదేశుని=మొగమున మూడురేకల విభూతిపెట్టుకొన్నవాని; ఉత్తరాంగుడు=పైదేహముకలవాడు; తరుణ...ధారున్=మోదుగదండమును ధరించినవాడు; ప్రావృషేణ్య...శ్యామున్=కారుమబ్బువలె నల్లనివాని; అఖిల...వరునిన్=నీవారబియ్యము గుప్పెడు వండుకొనువారిలో శ్రేష్ఠుని; పులినసంభవున్=ఇసుకతిన్నెపై పుట్టినవాని (వ్యాసుని); కలశజుడు=అగస్త్యుడు. తా॥ మొగమున విభూతి రేఖలు, మెడలో రుద్రాక్ష దండలు, ఉపవీతముగా కృష్ణాజినము, తలపై జటలు, చేతిలో రాగికమండలువు, దర్భపవిత్రము; పాలాశదండమును కలిగి, నల్లనిరంగు కల్గిన సాలవృక్షపుటెత్తుననున్న శరీరము కలిగి మహర్షిశ్రేష్ఠుడైన వ్యాసుని అగస్త్యుడు చూచెను. 84. యోజనగంధినందనుడు=వ్యాసుడు; ఊర్వశిపట్టి = అగస్త్యుడు. తా॥ వ్యాసాగస్త్యు లొకరినొకరు కౌగిలించుకొని గౌరవప్రతిపత్తులతో కుశలప్రశ్నలు వేసికొనిరి. 85. సౌహార్దము=మైత్రి; మొలతేరన్=పుట్టగా. తా॥ వైశంపాయనుడు మొదలైన వ్యాసశిష్యులు వినయము భక్తి యుట్టిపడునట్లు అగస్త్యునకు నమస్కరించిరి. 86. ఇల్వలాసురదమనుడు=అగస్త్యుడు. తా॥ తరువాత నా మారేడు తోటలో చల్లనిరాతిపై కూర్చుండి వారు కొంతసేపు ఇష్టాగోష్ఠితో కాలక్షేపము చేసిరి. 87. వైవర్ణ్యము=తెల్లపోవుట; అగ్గలించెన్=పెరిగెను. కన్నుగవ=రెండు కన్నులు; ఆర్తిన్=బాధతో; అంతరంగమూని=మనసునంటి. తా॥ నీముఖమున వెలవెలబాటు హెచ్చుగుచున్నది. కన్నులలో దైన్యము కన్పడుచున్నది. నీ మనస్సులో నేదైన బాధయున్నచో అదెట్లు వచ్చినది ?

సీ. లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ, బోటిపుట్టదు గదా • మాట మాట
వెనకయ్య శ్రీడుంఠి • విఘ్నేశ్వరస్వామి, ధిక్కరింపఁడు గదా • తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మ•ధ్యాహ్నకాలంబున, నరయకుండదు గదా • యన్నపూర్ణ
నెపమేమియును లేక • నీయెడాటమ్మునఁ, బాటిఁదప్పఁడు గదా • భైరవుండు

తే. ఎట్టుపాసితి మిన్నేటి • యిసుకతిప్ప, లెట్టుపాసితి వాస్తలం • బేసుకోసు
లెట్టుపాసితి నవిముక్త • హట్టభూమి, యెట్టుపాసితి విశ్వేశు • నిందుధరుని. 88

కం. కాశీనందన కంతే. కాలుర శిరములకు విరులు • కల్పించునొకో
లీలావనాంతరమునను, మాలోపాముద్రయిడిన • మల్లీవల్లుల్. 89

శా. ఆమందాకిని యాత్రివేణి వలనం • బా బాహ్యకక్ష్యాస్థలం
బామధ్యాంతరకక్ష లావిమలది • వ్యజ్యోతిరుజ్జృంభిణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం • జింతింపఁ గాశీ మహా
గ్రామంబిప్పుడు నాకనుంగవకు సా • క్షాత్కారముం గైకొనున్. 90

శా. ఆనందంబున నర్ధ రాత్రములఁజం • ద్రాలోకముల్ కాయఁగా
నానాసైకతవేదికాస్థలములన్ • నల్దిక్కులన్ శంభుఁ గా
సీనాథున్ దరుణేందుశేఖరు శివున్ • శ్రీకంఠునిన్ బాడుదు
న్మేనెల్లం బులకాంకురప్రకరముల్ • నిండార మిన్నేటిలోన్. 91

88. పోటి=స్పర్థ, మాటమాటన్=మాటిమాటికివచ్చి; వెనకయ్య=వినాయకుడు; ఆఁకొన్న=ఆకలివేసిన; అరయకుండదు=ఉపేక్షింపదు; ఎడాటమ్మునన్=వేళాకోళమున; పాటిన్=మర్యాదను; ఏసుకోసులు=పంచక్రోశమును; అవిముక్తహట్టభూమిన్=కాశిని. తా॥ లోలార్కునకును నీకును మాటమాట రాలేదు కదా! డుంఠిగణపతి నిన్ను సాహసించి ధిక్కరించలేదుగదా? మధ్యాహ్న వేళ ఆకలివేసిన నిన్ను అన్నపూర్ణ ఉపేక్షింపలేదుగదా? భైరవుడు కారణము లేకయే వేళాకోళమునకు మర్యాదతప్పి మాట్లాడలేదుగదా? ఆ పంచక్రోశమును, ఆ కాశీ నగరమును, గంగాసైకతముల నెట్లు వదలితివయ్యా? 89. కంఠేకాలుడు=శివుడు; విరులు=పువ్వులు; మల్లీవల్లుల్=మల్లెతీగలు. తా॥ అక్కడి లీలావనములో లోపాముద్ర వేసిన మల్లెతీగలు, శివునకు, పార్వతీపుత్రునకు తలపై పూలు చల్లుచున్నవా? 90. త్రివేణి వలనంబు=గంగా యమునా సరస్వతులు కలిసినచోటు. తా॥ ఆ గంగ ఆ త్రివేణి సంగమము, ఆ విశ్వేశ్వరుని ఆలయము లోపలిభాగములు ఆ విశ్వేశ్వర లింగము, అబ్బ! అవన్నియు కాశిని తలపగనే కన్నులకు కట్టినట్లు కనపడుచున్నవి. 91. చంద్రాలోకముల్=వెన్నెలలు; శ్రీకంఠుడు=నీలకంఠుడు; మేనెల్లన్=ఒళ్లంతయు; మిన్నేటిలోన్=గంగలో. తా॥ నేను బ్రహ్మానందముతో అర్ధరాత్రములందు వెన్నెలలు కాయుచుండగా, గాంగసైకతములలో కాశీవిశ్వేశ్వరునిగూర్చి పాడుకొనుచు ఒడలు గగురుపొడచునట్లు తిరుగువాడను.

కం. గంగాయమునాతీరో,త్సంగమునఁ బ్రయాగను న్న • దాశివు విశ్వే
శుం గూర్చి తపము చేసితి, నంగుష్ఠము ధరణి మోపి • యతిఘోరముగన్. 92

తే. విస్మయము నాకు మదిలోన • విస్తరిల్లెఁ, బరమధర్మజ్ఞ కాశికా • పట్టణమున
నుండు మూఢాత్ముఁడైనను,నొండుకడకుఁ, బోవఁ దలఁపఁడు నీ కెట్లు • బుద్ధిపుట్టె? 93

వ. అనినఁ బారాశర్యుండు వాతాపిదమనున కిట్లనియె. 94

—♦ వ్యాసులు తాను గాశిఁ బాసిన కారణంబుఁ జెప్పుట ♦—

చం. సమధికసత్కవీశ్వరులు • జైమినిపైలసుమంతు లాదిగా
శమదమసద్గుణాన్వితులు • సాధులు శిష్యులు తోడఁ గూడిరాఁ
గ్రమమున క్షేత్రయాత్రకు ధ • రాతలమం దఖిలంబు ద్రొక్కి భా
వము శివభక్తియుక్తముగ • వచ్చితిఁ గాశికిఁ బుణ్యరాశికిన్. 95

కం. ఏమిశకునమునఁ జొచ్చితి, మో మన్మథదమను వీ డ • హోరాత్రంబుల్
మేమేడునాళ్లదనుకను, స్వామీ! యుపవాసముండి • బడిసితిమి మదిన్. 96

కం. గేహములకేగి 'భిక్షాం, దేహి' యన న్వీట నొక వ • తిప్రతయైనన్
సౌహార్దంబునఁ దెడ్డెం, డాహారము పెట్టదయ్యె • నా దినములలోన్. 79

శా. శ్రీ విశ్వేశ్వరదేవదేవుని కృపా • శ్రీచే దివోదాసు బా
హావిక్రాంతబలంబుచేత ధవశ • న్యాయప్రజావృద్ధినో
పైప విశ్రామముగల్గి సుస్థిరతరం • బై యుండి భాసిల్లఁగా
నీ వారాణశిలోన.భిక్ష కఱవ • య్యెం జూడుమీ కుంభిజా. 98

---

92. తీరోత్సంగమునన్ = గట్టుదరిని; అంగుష్ఠము = బొటనవ్రేలు. తా॥ ప్రయాగలో గంగా యమునలు కలిసినచోట కాలి బొటనవ్రేలు నేలమోపి విశ్వేశ్వరు గూర్చి తపము చేసితిని. 93. ఒండుకడకున్ = మఱొకచోటికి. తా॥ నాకిది ఆశ్చర్యముగానున్నది. ఏమిటందువా? కాశిలోనుండు పరమమూఢుడైనను మరొక చోటికి పోవనొల్లడే? నీకెట్లు బుద్ధిపుట్టినదయ్యా? 94. వాతాపిదమనుడు = అగస్త్యుడు. 95. ద్రొక్కి = తిరిగి. తా॥ కవీశ్వరులగు జైమిని సుమంతపైలాదులగు శిష్యులు కూడిరాగా నేను క్షేత్రముల దిరుగుచు క్రమముగా కాశికి చేరితిని. 96. మన్మథ...వీడు = కాశి; ఏడునాళ్ల దనుకన్ = ఏడురోజులవఱకు. తా॥ ఆ కాశిని ఏ అపశకునమున జేరితిమో కాని స్వామీ! ఏడురోజులవరకు అహోరాత్రము లన్నము దొరకక ఉపవాసము చేసితిమి. 97. వీటన్ = నగరిలో; సౌహార్ధము = మంచిమనసు; తెడ్డెండు = గరిటెడు. తా॥ ఆ రోజులలో ఇంటింటికివెళ్లి 'భిక్షాందేహి!' అని యెంత పిలిచినను ఒక్కఅమ్మయైనను గరిటెడన్నమునుకూడ పెట్టలేదు.

శా. వైశంపాయనుఁ డెంతయున్ సుడివడె • న్వాడె న్సుమంతుం డతి
క్లేశం బందిరి పైలజైమినులు దుః • ఖించెన్ మదిన్ దేవలుం
డాశాంతంబులు చూచె దాల్భ్యుఁ డుదరో • దగ్రక్షుధాక్షోభచేఁ
గాశీపట్టణ విప్రవాటికల భి • క్షాలబ్ధి లేకుండుటన్. 99

తే. అక్కటా యేమి చెప్ప విం • ధ్యాద్రిదమన, కాశిలో నేడునాళ్లు ని • ష్కారణంబ
శిష్యులును నేనుని ట్రుపా • సెంబు వడితి, మమర గంగానదీ సైక • తములయందు. 100

వ. అష్టమదివసంబునం దరుణోదయ కాలంబున గంగాపులి నోత్సంగంబులం గుశ శయనంబున మేలుకాంచి యభ్యుదితంబైన మార్తాండమండలం బాఖండలదిశావేదండకంఠ గ్రైవేయకనకఘంటికాఠంకారంబునుం బోలె నుదయగిరి శిఖరతటసవిధంబునఁ గుంకుమరజస్త్రసరేణువిసరంబునుం బోని నిగనిగనుజిగిగిలుకొని కోమల జిలుఁగుజిగికొనలు గగనతల మలమికొనుకొలఁది మణికర్ణికాంభః ప్రవాహంబున నఘమర్షణస్నానంబాచరించి, యత్తీరవాసిజనవిరచితవాలుకాలింగంబులకుఁ బూజార్చనాశింఖులింగంబులకును మంత్రాక్షతపుష్పపూర్వకంబుగా నభివాదనంబుఁ జేసి పంచబ్రహ్మ పంచాక్షరీమంత్రప్రధానంబులు జపియించి సిద్ధముని పరంపరాసంకులంబైనఘంటాపథంబునం గంగాబహిర్గేహ దేహళీ విభాగంబునునంతర్గేహసౌధవీథి కాట్టకుట్టిమప్రఘణంబులును గడిచి, లోలార్క కాలభైరవ డుంఠివినాయక విశాలాక్షీ ప్రముఖ పరివార దేవతాకోటికి నేటికోళ్లు సమర్పించి, విశ్వేశ్వరు విరూపాక్షు సక్షీణ మోక్ష లక్ష్మీసామ్రాజ్య సింహాసనారూఢుం దారకోపదేశదేశికు దాక్షిణ్యపుణ్య కరుణాకటాక్షవీక్షాపేక్షునిఁ బ్రదక్షిణక్రమదండప్రణామపురస్సరంబుగా సేవించి, ముక్తిమంటపంబునఁ గొంతతడవుండి మధ్యాహ్నకాలంబగుట నిరూపించి, భిక్షా పాత్రంబులఁ గేలఁబూని, యతికఠోరజఠరక్షుధాగ్ని తాపంబునకుఁ దోడగు తపన

98. దివోదాసు=ఒకప్పుడు కాశినేలినరాజు; విశ్రామము=విశ్రాంతి; కుంభజుడు=అగస్త్యుడు. తా॥ విశ్వేశ్వరుని కరుణకలది, పూర్వము దివోదాసుడను రాజు ధర్మముగా పరిపాలించినప్పుడు న్యాయముకిరవై ప్రసిద్ధి పొందినది, శాశ్వతమైన కాశీపట్టణములో భిక్షకఱవైనది. అగస్త్యమునీ! చూడు ఎంతపని జరిగినదో? 99. సుడివడెను=బాధపడెను=; ఆశాంతంబులు=దిక్కులు; ఉదర...క్షోభ=మండుటాకలిబాధ; విప్రవాటికలన్=బ్రాహ్మణ గృహములందు. తా॥ ఇదుగో ఈ వైశంపాయనుడు తల్లడిల్లిపోయినాడు, సుమంతుడు వాడిపోయెను. పైల జైమినులు మహాబాధపడిరి. దేవలుడు దిక్కులుచూచెను. దాల్భ్యుడుకూడ కాశీపురిలోని బ్రాహ్మణ గృహములలో భిక్ష దొరకకపోవుటచే చాల దుఃఖించెను. 100. నిట్రుపాసెంబు=కటికి యుపవాసము. తా॥ ఓ అగస్త్యా! ఏమిచెప్పుదును? కాశిలో ఏడురోజులు నిష్కారణముగా కటికిఉపవాసముచేసి గంగానదిలోని ఇసుకతిన్నెలలో కాలక్షేపము చేసితిమి.

మయ ప్రచండ కిరణకాండ ప్రకాండంబులు నెత్తి మండింప 'లేదు, నడువుండు, పొండు, కూడ'దను నిషేధవాక్యంబులు చెవులు నిండికొన విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి వినికి విసిమాలి వేసరి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన. 101

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదు • ష్క్రోధాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీఁకటులుగా • సంరంభ శుంభద్గతిం
ప్రేక్షచ్ఛాత్రులు భీతిఁబొందఁ గడు ను • ద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము రాతిమీఁద శతధా • భిన్నంబుగా వైచితిన్. 102

---

101. గంగాపులి నోత్సంగంబునన్ = గంగయిసుక తిన్నెలపై; కుశశయనము = దర్భపక్క; ఆఖండల...ఠంకారము = తూర్పుదిక్కనెడి యేనుగు మెడలోని బంగారుగంట; ఉదయ...సవిధమునన్ = తూర్పుకొండశిఖరముదగ్గర; కుంకుమ...విసరంబు = కుంకుమపువ్వాడి; నిగ...జిగి = నిగనిగమను కాంతి; గీలుకొని = కలిగి; కోమల...కొనలు = మృదువైన కాంతులు; అలిమికొనుకొలదిన్ = వ్యాపించుచుండ; అఘమర్షణ స్నానము = మంత్రములతోడి స్నానము; వాలుకాలింగములు = ఇసుకతో చేయబడిన లింగములు; ఘంటాపథము = నలువీధుల మొగ; బహిర్గేహ = వెలుపలియిల్లు; దేహళీవిభాగములు = ద్వారములు; అట్టకుట్టిమ ప్రఘణంబులు = మేడవెనుకటియింటి చప్టా ప్రదేశమును, తలవాకిటనున్న చిన్నగదులను; ఏటికోళ్లు = నమస్కారములు, తారకోపదేశదేశికుడు = తారకోపదేశము చేయు గురువు (శివుడు); కొంతతడవు = కొంతసేపు; నిరూపించి = తెలిసికొని; కేలఁబూని = చేతపట్టి; తపన...ప్రకాండంబులు = మండుసూర్యుని కిరణములు; విప్రవాటంబులన్ = బ్రాహ్మణవీధులలో; పరిభ్రమించి = తిరిగి; విసిమాలి = మిక్కిలి విసిగి; ఆరట = పరితాపము; జూకించి = వగచి; దూపటిలి = దప్పిగొని. తా॥ ఆ నాడెన్మిదవరోజు. తెల్లవారినది. సూర్యుడుదయగిరి నెక్కెను. మేము మణికర్ణికలో అఘమర్షణస్నానముచేసికొని, అక్కడి జనులు చేసిన వాలుకాలింగముల కర్చనలు, అభిషేకములుచేసి; అందరిదేవతలకు మ్రొక్కి, విశ్వేశ్వరాలయమునకు ప్రదక్షిణములు చేసి, భిక్షాపాత్రలు చేబూని కడుపులో ఆకలిమంట, దానికితోడు పైన ఎండమంట బాధించగా ఇంటింటికి తిరిగితిమి. ఎక్కడవిన్నను 'లేదు, నడవండి, పొండి' అన్న మాటలే. అవి వినలేక చెవులు చిల్లులుపడినవి. విసిగి వేసారితిమి. నేను తూలిపోయితిని. మనస్సులో పట్టరాని కోపము పుట్టినది. 102. కుక్షి...కారంబునన్ = కడుపులోని యెక్కుడాకలియను కోపాంధకారముచే; చక్షుల్ = కన్నులు; సంరంభశుంభద్గతిన్ = తత్తరపాటుతో; ప్రేక్షచ్ఛాత్రులు = చూచుచున్న శిష్యులు; హట్టంబునన్ = నడివీధిలో; శతధాభిన్నంబుగాన్ = వందముక్కలగునట్లు. తా॥ కడుపులోని ఆకలిమంటతోవచ్చిన కోపావేశపు చీకటితో కన్నులు రెండును చీకట్లు క్రమ్మినవి. హడావిడి హెచ్చినది. నా స్థితిని చూచుచున్న శిష్యులు హడలిపోయినారు. వెంటనే నేనానడివీధిలో చేతిలోని భిక్షాపాత్రమును వందముక్కలగునట్లు నేలనువేసి కొట్టితిని.

కం. అటు పౌరవీథి చక్కటిఁ, బటుకునఁ బడవైచి క్రోధ • పరిపాటి మెయిం
గటములదరంగ భ్రూకుటి, నిటలములను జెమటనీరు • నిండ ఘటిల్లన్. 103

కం. ఏమియని చెప్పుదును లో,పాముద్రా ప్రాణనాథ • ప్రజ్ఞా విభవం
బేమోయయి చెడిపోఁవగ, నామది నెన్నండు లేని • నైచ్యము పొడమెన్, 104

సీ. ఏలా విచారింప • నిందురేఖామౌళి, వివిధమౌక్తికధాతు • విశ్వనాథు
నేలా వితర్కింప • హిమశైలశేఖరో, ష్ణీషకౌశేయంబు • సిద్ధ తటిని
నేలా పరీక్షింప • నిభరాజ వదనుని, ఢుంఠి విఘ్నేశు మం • దూకజఠరు
నేలా విలోకింప • వ్రీళాకళాశూన్య, కటిఁ గాలభైరవు • వటుకనాథు

తే. నిఖిలకైవల్యకల్యాణ • నిలయమైన, కాశిపైఁ గూడులేకుండు • కారణమున
నలిగి శపియింపఁగాఁ బూని • యందుకొంటి, ధృతకమండలు భాగీర•థీజలంబు. 105

ఉ. 'కోపము సంహరింపు ముని • కుంజర'యంచు లలాటదేశసం
స్థాపితపాణిపద్మయుగ • సంఘటితాంజలిబంధులై మహా
తాపస శిష్యబృందములు • ధర్మపథంబును దెల్పి చెప్పగా
శాపజలంబు పూనితిఁ బ్ర • శాంతివిహీనత నేమి చెప్పుదున్. 106

వ. ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాస సంభూతరోషావేశంబున నంగుళీపవిత్ర
సనాథంబైన హస్తంబున మణికర్ణికాజలంబులు ధరియించి యిట్లని శపియింప
నుద్యోగించితి. 107

103. అట=అట్లు; పౌరవీధి చక్కటిన్=నడివీధిలో; క్రోధ... మెయిన్=
కోపముచే; కటములు=చెంపలు; భ్రూకుటిన్=కనుబొమ్మలందు; నిటలము=
మొగము. తా॥ అట్లువేయగా ఆ కోపము తగ్గక నా కనుబొమ్మ లదరినవి. మొగ
మున చెమట పట్టినది. 104. ప్రజ్ఞా విభవంబు=తెలివి, నైచ్యము=తేలికతనము;
పొడమెన్=పుట్టెను. తా॥ ఓ మునీ! ఏమి చెప్పుదును? నా తెలివేమైచెడిపోయినదో
కాని అప్పుడు ఎక్కడలేని నీచభావము ఆవహించినది. 105. హిమ...కౌశేయంబు=
హిమవత్పర్వతమునకు తలపాగవంటిది; సిద్ధతటిని=గంగ; మందూకజఠరుడు=కప్ప
వంటి పొట్టకలవాడు; వ్రీళా...కటిన్=దిగంబరుని; వటుకనాథున్=బ్రహ్మచారిని
తా॥ విశ్వనాథునిగాని, గంగనుగాని, ఢుంఠిగణపతినిగాని, దిగంబరుడైన కాలభైర
వునిగాని తలపక కూడులేని కారణాన మోక్షనిలయమైన కాశిపై కోపించి శపించు
టకై కమండలువులోని గంగాజలము నందుకొంటిని. 106. లలాట...బంధులు=
మొగమున దోసిలులు కీలించినవారు. తా॥ నా శిష్యులప్పుడు 'మునీశ్వరా! కోపము
నుపసంహరింపు'మనుచు మొగములపై దోసిలులొగ్గి ప్రార్థించిరి. అయినను శాంతి
లేక శాపోదకము చేపట్టితిని. 107. సప్త...ఆవేశంబునన్=ఏడురోజులుపవాసము
చేసినందున కల్గిన కోపావేశముతో; అంగుళీ...సనాథము=తర్జనీపవిత్రముతో
కూడినది; ఉద్యోగించితిన్=ప్రయత్నించితిని.

—♦ వ్యాసులు కాశిని శపియింపఁబూనుట ♦—

శ్లో. మాభూత్త్రైపూరుషీ విద్యా, మాభూ త్త్రైపూరుషం ధనమ్
మాభూ త్త్రైపూరుషీ భక్తిః, కాశ్యాం నివసతాం సదా. 108

తే. అని శపింపఁగఁ బూను న • య్యవసరమున
నేమి చెప్పుదు నోసంయ • మీంద్రవంద్య
యుదిలగొని కంపమందుచు • నుండెఁ గాని
శాపజలమందుకోఁ గేలు • సాఁగదయ్యె. 109

వ. ఆ సమయంబునఁ గాశికానగర సోమవీథికాభవనవాటికా మధ్యంబున నొక్కయింటి మచ్చెకంటి పంచాశద్వర్షదేశీయ పలితసారంబైన వేణికాభారంబు గైవడ ముదుసలి చక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీఁగుచన్నుల వ్రేఁగుఁదనంబునఁ దనతనూవల్లి జలదరింపఁ గంకణ ఝణఝణత్కారంబు దోరంబుగాఁ గ్రక్కున గోపుర ద్వారంబు బోరుతలుపు వాయందట్టి యందియల రవళితోడం గూడి మట్టియల మ్రోఁత త్రిభువనంబులును రుజగొనం దేరుగడుపయోలం జరణపల్లవంబుఁ జాఁచి యనంగధ్వజపటకఠోరపాఠీనచ్ఛాయాదాయాదంబులైన వెడఁదకన్నులు తలచుట్టునుం బలిసి పొలయ కలమధుర వీణాక్వాణపాణింధమంబైన యెలుంగునెత్తి 'యో బ్రాహ్మణోత్తమా ! శాప ముపసంహరించి యిటు రమ్మని నన్నుఁ జేరంబిలిచిన. 110

---

108. త్రైపూరుషీ = మూడుతరములవరకు; విద్యా మా భూత్ = చదువు లేకుండుగాక ! త్రైపూరుషం = ముగ్గురివరకు; ధనంమాభూత్ = డబ్బు లేకుండుగాక! త్రైపూరుషీ = పురుషత్రయమువరకు; భక్తిర్మాభూత్ = భక్తిలేకుండుగాక ! కాశ్యాం = కాశియందు; నివసతాం = నివసించువారికి; సదా = ఎల్లప్పుడును. తా॥ 'కాశిలోనుండు వారికెల్లపుడును మూడుపురుషములవరకు విద్య, ధనము, భక్తియు లేకుండుగాక !'
109. అయ్యవసరమునన్ = అప్పుడు; ఉదిలగొని = భయపడి; అందుకోన్ = అందుకొను టకు; కేలు = చేయి. తా॥ అని శపింపదలపగా ఊరక చేయి కంపించుచుండెనేకాని నీటినందుకొనుటకై చేయి సాగుటలేదాయె. ఏమి చెప్పుదును ? 110. ఒక్కయింటి మచ్చెకంటి = ఒక యిల్లాలు; పంచాశద్వర్ష దేశీయ = ఏఁబదియేండ్లది; పలితసారము = నెరసిన; వేణికాభారము = కొప్పుముడి; కైవడ = చేతులపై పడగా; వీఁగు = వ్రేలాడు; వ్రేఁగుఁదనము = బరువు; తనూవల్లి = సన్నని శరీరము; తోరంబుగా = ఎక్కువగా; గ్రక్కునన్ = తొందరగా; గోపురద్వారము = సింహద్వారము; పాయందట్టి = తీసి; అందియలరవళి = అందెల చప్పుడు; రుజగొనన్ = బాధపడగా; అనంగ...దాయాదంబులు = మన్మథుని జెండామీది చేపలవంటి; వెడదకన్నులు = విశాల నేత్రములు; తల...పొలయన్ = ముఖము నాక్రమింపగా; కల...పాణింధమము = మధురమైన వీణాధ్వనివంటి; ఎలుంగు = కంఠధ్వని. తా॥ అప్పుడు కాశిలోని సోమవీధి మధ్యలో నొక్కయిల్లాలు; ఏబదేండ్లుండవచ్చు; కొప్పు భుజముమీదికి పడుచుండగా, స్తనములభారముచే నడుము వణకుచుండగా, తటాలున తలుపు తెరచి, ఈవలకు కాలు చాపి వీణవంటి ధ్వనితో 'ఓ మునీంద్రా ! శాపముపసంహరించి యిటురమ్మనిపిలిచినది.

ఉ. సంతసమంది యే నపుడు • శాపజలంబులు పాఱఁజల్లి వే
దాంతవచోమహోపనిష • దర్థమయిన్ శుభరూప వృద్ధసీ
మంతినిఁ గాశికానగర మధ్యనివాసిని విశ్వనాథు శు
ద్ధాంతము డాయఁబోయితిఁ బ్రి • యంబును భక్తియునుం దలిర్పఁగన్. 111

ఆ. డాయఁబోయి యప్పు•డాయమ్మ యెవ్వరో, యేకులంబునదియొ•యెఱుఁగకయును
నే ఖోహారునిడితి • హృదయంబ నేరుచు, నెదురు ప్రాభవంబు • నేర్పరింప. 112

వ. అంత నన్నుం జేరఁబిలిచి యక్కాంత యిట్లనియె. 113

తే. భిక్ష లేదని యింత కో • పింతురయ్య ? కాశికాపట్టణముమీఁదఁ • గానినేయ !
నీమనశ్శుద్ధిఁ దెలియంగ • నీలకంఠుఁ, డింతచేసెనుగాక కూ • డేమి బ్రాఁతి. 114

తే. శ్రీ విశాలాక్షి బంగారు • తెడ్డునందు, నమృతపాయస మొసఁగు న•భ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్న • కాలమనఁగ, వినియు నెఱుఁగవె యాతిథ్య • వేళలందు. 115

ఉ. ఏడు దినంబు లన్నమున • కెడ్డము పుట్టిన యంతమాత్రలో
నేడుచుచున్నవాఁడవు ము • నీశ్వర నేఁడును నీదు ధీరతల్
పాడటిపోయెనే శివుని • భార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం
గాడు నొనర్పఁ జూచెదవు • కంఠపుఁ గ్రోధము పెచ్చులెచ్చఁగన్. 116

---

111. ఏను = నేను; పాఱఁజల్లి = పారపోసి; వేదాంత...మయిన్ = ఉపనిష దర్థస్వరూపిణి; వృద్ధసీమంతిని = ముసలవ్వ; విశ్వనాథు శుద్ధాంతము = విశ్వనాథుని భార్య; తలిర్పగన్ = హెచ్చుకాగా. తా॥ నేనపుడు చేతిలోని శాపోదకముల నావలపారజల్లి కాశీమధ్యనుండు నా యన్నపూర్ణనుడాయబోయితిని. 112. ఆయమ్మ = ఆమె; ఏకులంబునది = ఏకులమునకు చెందినది; నేరుచున్ = సమర్థమగును; ఎదురుప్రాభవంబున్ = ఎగుటివారి గొప్పదనమును; ఏర్పరింపన్ = స్థాయి తెలిసికొనుటకు. తా॥ అప్పు డాయమ్మ యెవ్వరో ? ఏకులముదో? ఎరుగకపోయినను దండము పెట్టితిని. ఎదుటివారి శక్తి నిర్ణయించుటకు మనస్సే సమర్థమైనదగుచుండును. 114. కాని నేయడు = కన్యకకు పుట్టినవాడు; కూడు = అన్నము; ఏమిబ్రాతి = దుర్లభమా ? తా॥ బిచ్చము లేదని కాశిమీద నింత కోపింతురయ్య ? విశ్వేశ్వరుడు నీ మనశ్శుద్ధి తెలిసికొనుటకై యిట్లు చేసెనుగాని యిక్కడన్నమే దొరకదా ? 115. ఆతిథ్య వేళలందు = సంతర్పణాములలో; తా॥ 'కాశీపురిలో మధ్యాహ్న వేళల అభ్యాగతులకు అన్నపూర్ణ బంగారు తెడ్డుతో భిక్ష పెట్టు'నని అతిథ్యసమయాలలోనైనను వినలేదా ? 116. ఎడ్డము = అడ్డంకి; పాడటిపోయెనే = పాడై పోయెనా? కాడు = శ్మశానము; కంఠపుగ్రోధము = కంఠమువరకునున్న కోపము; పెచ్చులెచ్చగన్ = ఎక్కువకాగా. తా॥ మునీంద్రా ! ఏడురోజులన్నము దొరకనంతమాత్రాన ఇంతగా ఏడ్చుచుంటివే ? కుత్తుకంబటి కోపముతో శివుని కిష్టభార్యయు, పుణ్యరాశియునైన కాశిని కాడుచేయదలచితివే ?

ఉ. క్రొన్నెలపువ్వుదాల్పునకుఁ • గూరిమిభోగపురంధ్రి కక్కటా
యిన్నగరీలలామమున • కీపరిపాటికి నిట్టికోప మే
లన్న ! ఘటించె దో మునిక • లాగ్రణి నిక్కమువో 'బుభుక్షితః
కిన్నకరోతిపాప'మను • కేవలనీతిఁ దలంచిచూడఁగన్. 117

తే. కాశిపైఁ గోపగింపఁగఁ • గాదు నీకు. నెంతకోపించునో యింత • కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము•వెదకఁ దగదు. భిక్షఁ గొనరమ్మ మాటలుపెక్కు-లేల.• 118

వ. అనిన నవ్వాలుఁగంటికి నిట్లంటి. 119

శా. తల్లీ ! యిన్నిదినాలకేనియు సుధా • ధారారసస్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలు కె • ట్లోవింటి నిప్పేటిలోఁ
బెల్లాఁకొన్నతనాన నే నొకఁడనే • భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ నిజం • బేర్పాటుగాఁ జెప్పుమా. 120

తే. ఈవు పెట్టిన భిక్ష మే • మిందఱమును
బంచుకొని చేయువారము • ప్రాణరక్ష
నాతి యందఱవియును బ్రా • ణములుకావె ?
నాయదియె ప్రాణమని వత్తు • నా ? భుజింప. 121

వ. అనిన మందస్మిత వదనారవిందయై యయ్యిందుబింబానన యిట్లనియె. 122

శా. అంతేవాసులు నీవుఁ గూడుకొని మ • ధ్యాహ్నాభిషేక క్రియల్
శాంత స్వాంతత జాహ్నవిం జలిపి పె • ల్చన్ రండు నే నింతలో

---

117. క్రొన్నెల...దాల్పు=శివుడు; కూరిమి...పురంధ్రి = ముద్దుభార్య; ఈ పరిపాటికిన్=ఇంతమాత్రమునకు; నిక్కముపో=నిజమేమో ? బుభుక్షితః= ఆకలిగొన్నవాడు. కింపాపం=ఏ పాపమును; న కరోతి=చేయడు? తా॥ కాశి విశ్వేశ్వరునకు ప్రియభార్య. దానిపై నీవు కోపించితివి. 'ఆకలివేసినవా డేపాపముచేయడు? అన్నది నిజముసుమా ? 118. కాదు=మంచిదికాదు; ఇందుమౌళి=శివుడు. తా॥ కాశిపై నీవు కోపగించకూడదు. ఇంతకెంతగా శివుడు కోపించునో? బ్రాహ్మణుని నేరము లెన్నరాదు; కాని రమ్మ భిక్ష గైకొమ్ము. ఇక మాటలెందుకులే? 119. వాలుగంటి=స్త్రీ. 120. సుధా...స్యంది=అమృతమును స్రవించునదై; పెల్లాకొన్న తనానన్=మిక్కిలి ఆకలివేయుటచే. తా॥ అమ్మా ! ఇన్నాళ్లకీ నగరిలో అమృతో పమానములైన మాటల వినగలిగితిని. మనస్సునకు సుఖము కల్గినది. ఆక లెక్కువగా నున్నందున అడుగుచున్నాడను. 'నే నొక్కడ నేరానా ? శిష్యులందరిని తీసికొని రానా ? వైనముగా చెప్పుతల్లీ!' 121. ఈవు=నీవు; నాతి=స్త్రీ; నాయదియె= నాదే. తా॥ అమ్మా ! అందఱివిని ప్రాణములేకద ! నీవుపెట్టిన భిక్షాన్నము నందఱ మును పంచుకొని తిందుము. నా ఒక్కనిదే ప్రాణమా మఱి ?

నంతర్గేహమునన్ సమగ్రముగ మీ • కాహారము ల్వేగఁ గ
ల్పింతున్ భోజనమిష్ట మిందఱకుఁ దృ • ప్తిన్ బొందఁగాఁ బెట్టెదన్. 123

కం. ఆఁకొంటి రిన్నిదినములు, పోకంతయు భిక్ష వీటఁ • బుట్టక యునికిన్
ఆఁకట దూఁకట నలిగితి, రేఁకట వాయంగ భిక్ష • లిడియెద రండీ. 124

వ. అనిన నేమును వియల్లోకకల్లోలినికిం జని యాప్లవనం బాచరించి యుభయ పవిత్రం బులు ధరియించి వేదంబులు పఠియించుచువచ్చి యమ్మచ్చెకంటి యింటి మొగిసాల గూర్చుంటిమి. 125

కం. మున్నూఱు శిష్యులును నే, నన్నెలఁతుకతోడ మాట • లాడిన యయ్యా
భ్యున్నతసౌధముమీఁదను. సున్నము నిగిడించినట్టి • జోదరఁగులపై. 126

వ. ఉండి యాసార ప్రసాదంబులు చేయు సంభాళిజనంబులచేతను మారాక యెఱింగిం చిన నబ్బోటి హాటకమయంబైన గొడుగుపావలు గిలుకలు గులుకరింపఁ గుసుమ కోదండ సమ్మోహనకాండంబునుఁ బోని యొక్క రెండవవయసు తాంబూలకరండ వాహినిం గై దండపట్టుకొని యేతెంచి రండు విచ్చేయుండని సబహుమానంబుగాఁ దోడ్కొనిపోయి చంద్రికాసంకాశకౌశేయశతసహస్రసందానితవితానోప శోభితం బును, గాలాగురుధూపధూమవాసనాసనాథంబును, గర్పూరరచితరంగవల్లీ వేల్లితం బును, గస్తూరికాలేపనసురభిశశికాంతమణిశిలాకుట్టిమంబును నగు చతుశ్శాలా భోజనమందిరంబున వృద్ధానుపూర్వకంబుగ నుచితాసనంబులం గూర్చుండ నియ మించిన. 127

---

123. అంతేవాసులు = శిష్యులు; మధ్యాహ్నభిక్షైక క్రియల్ = మాధ్యాహ్నిక స్నానములు; శాంతస్వాంతతన్ = ప్రశాంతమైన మనసుతో; జాహ్నవిన్ = గంగలో; పెల్చన్ = వెంట నే; అంతర్గేహమునన్ = లోపలియింటిలో; భోజనమిష్టము = ఇష్ట మైన భోజనము. తా॥ నీవు శిష్యులును కలిసి గంగలో స్నానముచేసి రండు. ఇంతలో వేగముగా ఆహారములు కల్పింతును. ఇందఱకు తృప్తముగా కడుపార పెట్టెదను. 124. పోకంతయు = పోకచెక్కయంతయైనను; వీటన్ = నగరమున; పుట్టకయునికిన్ = పుట్టనందున; ఆకటదూకటన్ = ఆకలిబాధతో; ఏకట = బాధ; పాయంగన్ = పోవునట్లు. తా॥ ఈ నగరిలో ఇన్నాళ్లును పోకంతైన భిక్షాన్నము దొరకనందున ఆకలిగొన్నారు; మీ బాధ తీరునట్లు భిక్ష పెట్టెద; రండు. 25. వియల్లోక కల్లోలిని = గంగ; ఆప్లవనము = స్నానము; మొగసాల = సావడి. తా॥ మేము గంగలో స్నానముచేసి వేదము చదువుచు ఆ మొగసాలలో కూర్చుంటిమి. 126. అభ్యున్నత సౌధము = ఎత్తైనమేడ; సున్నము నిగిడించినట్టి = వెల్లవేసిన; జోడరగులపైన్ = రెండ రుగులమీదను. తా॥ మూడువందల శిష్యులు నేనును ఆమెతో మాట్లాడిన ఆ మేడ యొక్క సున్నముకొట్టిన అరుగులమీద కూర్చుండి.

కం. మొగి విరిసి కఱకుగూడక, పసులక వెడలుపును నిడుపుఁ • బసిమియుఁ గల లేఁ,
జిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ • దివ్యపురంధ్రుల్. 128

వ. అనంతరంబ. 129

తే. అర్చనలు చేసి గంధ • పుష్పాక్షతముల, ధూపమిచ్చెఁ గాలాగురు • ధూమరేఖఁ
గప్పురంబు నివాళించెఁ • గమలనేత్ర, పంక్తిపంక్తికి నేతెంచి • బ్రాహ్మణులకు. 130

ఉ. ఇందఱుఁ గూడి శాంతి పఠి • యింపుఁడు మజ్జన మాచరింపుఁ డ
ర్ధేందుకళా కిరీటునకు • నీ యమృతాన్నము లీ పదార్థముల్
మందగతిం భుజింపుఁడు స • మస్తజగత్పతి కాశికాపురీ
మందిర విశ్వనాయకుఁ డు • మాపతి ప్రీతి వహించుఁ గావుతన్. 131

వ. అని పంక్తిపంక్తి నడుమ నిలుచుచుఁ నయ్యింతి భక్తిశ్రద్ధా తాత్పర్య విశ్వాస పూర్వ
కంబుగా నుర్వీగిర్వాణవర్గంబులఁ బ్రార్థించుచు నాపోశనంబులు వోయింపనుండె

127. ఆసారప్రసారచులు = రాకపోకలు; శంభళీజనము = దాసీజనము; పావలు = జోళ్లు; రెండవ...వాహిని = యౌవనవతియగు తాంబూల పాత్రధారిణి; కైదండపట్టుకొని = చేయి గూతగొని; చంద్రికా...శోభితము = వెన్నెలతో సమమైన పట్టుబట్టల చాందినీలతో శోభించెడిది; కాల...సనాథము = అగురుధూపవాసనలుకలది; కర్పూర...వేల్లితము = కర్పూరముతో రచించిన ముగ్గులుకలది; కస్తూరికా...కుట్టిమము = కస్తూరిపూతతో పరిమళించు చంద్రకాంతపుఱాల చప్టాకలది; చతుశ్శాల = మండువా; వృద్ధానుపూర్వంబుగన్ = పెద్దవారు మొదలుగా. తా॥ లోపలికి వచ్చి పోవుచున్న దాసీలచే మా రాక తెలిపితిమి. అప్పుడామె బంగారు గొడుగు, పావలు ధరించి యొక తరుణి తాంబూలపుపాత్ర పట్టునామె బుజముపై చేయివేసికొని వచ్చి 'లోపలికి రమ్మ'ని మమ్ములను తోడ్కొని వెళ్లెను. లోపల కొన్నివేల వెన్నెలలు వలె నొప్పు చాందినీలుకలిగి, అగరుధూపవాసనలు కలిగి, కర్పూరపు ముగ్గులు పెట్టి కస్తూరిపూసిన చంద్రకాంతపురాలు పరుపబడిన మండువాలో పెద్దలు ముందు, పిన్నలు తర్వాతగా, తగిన పీటలపై కూర్చుండుమన్నది. 128. మొగి = మొత్తము; విరిసి = వికసించి; కఱకుగూడక = పెళుసుగాలేక; పసిమి = పచ్చదనము; దిగదిగన్ = చరచర; దివ్యపురంధ్రుల్ = దివ్యస్త్రీలు. తా॥ అంత దివ్యస్త్రీలువచ్చి, విరుగక, చిట్లక చక్కగానున్న అరటాకులు వేసిరి. 130. అర్చన = పూజ; నివాళించెన్ = హారతిచ్చెను. తా॥ ఆమె పంక్తిపంక్తికి వచ్చి మాకు పూజలుచేసి గంధములిచ్చి; ధూపములు వేసి, కప్పురపు నివాళులిచ్చినది. 131. శాంతి = శాంతికై చెప్పు మంత్రములు; మజ్జనము = అభిషేకము; మందగతిన్ = మెల్లగా. తా॥ 'అయ్యా! మీరు శాంతి పఠింపుడు! శివున కభిషేకముచేయుడు! కాశివిశ్వేశ్వరప్రీతిగా నీ పదార్థముల భుజింపుడు!'

నప్పు డేను బైలసుమంతు జైమిని వైశంపాయనాది శిష్యప్రకరంబు నెమ్మనంబుల నిట్లని వితర్కించుచుంటిమి. 132

ఉ. వండిన చొప్పునుం బొగపు • వాసనయుం బొగపాఱు చందమున్
భాండసమృద్ధి సంపదయుఁ • బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్తప్రియ • మాడెడు నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె నసి • తోత్పలగంధియు నేమిమాయయో. 133

ఉ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్ర • సాదము మాధురియు న్వివేకము
న్వెల్లఁదనంబు మౌగ్ధ్యమును • నిర్మలినత్వముఁ జూడవచ్చినం
గల్ల యొకింతయేనిఁ బొడ • గానఁగరా దరఁటాకుఁ జూచినన్
ఝల్లనె గుండె యోగిరము • శాకములుం బొడగానరామికిన్. 134

తే. పాత్రసంశుద్ధి కాజ్యంబు • పస్తరించి, యూరకుండిరి యిదియేమి • యొక్కొ వీరు
కానరావిప్డు శాకపాకములు నెదుర, మనకు నిజమయ్యె నలచందమామఘుటిక. 135

మ. అవుగాకేమి నిజంబు తేటపడఁగా • నర్చించె గంధాక్షతా
ది విశేషంబుల శాంతిపాఠమును సం • దీపించె విశ్వేశ్వరున్
శివు నుద్దేశము చేసి మ్రొక్కి వివిధా • శీర్వాదముల్ గైకొనెం
ధవళాంభోరుహనేత్ర యింతయును మి • థ్యాదృష్టి గానేర్చునే. 136

---

132. అయ్యింతి=ఆ స్త్రీ; తాత్పర్య=ఆసక్తి; ఉర్వీగీర్వాణవర్గమును=బ్రాహ్మణులను; ఆపోశనము=భోజనమునందు త్రాగు నీరు. తా॥ ఆమె యెంతో భక్తితాత్పర్యములతో ఆపోశనములు పోయుటకు సిద్ధముగా నున్నది. 133. చొప్పు=రీతి; పొగపు=తాలింపు; పొగపాఱుచందము=పొగవచ్చినరీతి; సర్వమంగళంబు=సున్న; రిత్తప్రియము=ప్రియమైన ఉత్తమాటలు; అసితోత్పలగంధి=స్త్రీ. తా॥ "వండినట్టులేదు, పోపువాసనలేదు, పొగవచ్చుటలేదు. వంటగిన్నెలు కన్పడవు. ఈమెమాత్రము ప్రియముగా మాట్లాడుచున్నది. ఈవేళకూడ భోజనము లేదేమో? ఇదేమిమాయయో? 134. ప్రసాదము=దయ; వెల్లదనము=స్వచ్ఛత; మౌగ్ధ్యము=అమాయకత; ఓగిరము = అన్నము; పొడగానరామికిన్ = కనపడకుండుటచే. తా॥ ఈమెయొక్క ప్రశాంతమూర్తి, చల్లనిదృష్టి చూచినచో కల్ల-కపటములు లేనట్లే యున్నది. కాని అరటాకుకేసి చూచుసరికి గుండె జల్లుమనుచున్నది. అందేవియు లేవుగా. 135. ఆజ్యము=నేయి; పస్తరించి=అభిఘరించి; చందమామఘుటిక=చందమామను పట్టగోరుట (అలభ్యము) తా॥ వడ్డనసేయువారు పాత్రశుద్ధికై నేతినభిఘరించి యూరకుండిరే కాని పదార్థములేవియు వడ్డింపలేదు. ఇప్పుడు నిజముగా చందమామనుచూచి గుటకలు మ్రింగినట్లుండవలసినదేమో? 136. మిథ్యాదృష్టి=అసత్యము; కానేర్చునే=అగునా? తా॥ అయ్యో! ఈమె భక్తితో పూజించినదే. ఆ దీవనలందినదే. శాంతి చెప్పించినదే. ఇదంతయును అబద్ధమే అగునా?

కం. కానీ యీదివసంబును, నే నిన్నఁటి యట్లకాక • యేమనఁగ నపో
సానంబులు వడ్డించిరి, మానవతీజనులు లీల • మహిదివిజులకున్. 137

తే. పోసిరా యెల్లవారి కా • పోశనములు, నారగింపుఁడు లెండు మీ • కమృతమస్తు
ప్రొద్దుపోయెనుజుండని • బుజ్జగించి, మ్రొక్కి యంజలియెత్తె నఁమ్ముదుకపణఁతి. 138

శా. అమ్ముత్తైదువ యాజ్ఞ విప్రనికరం • బాపోశనం బెత్తినన్
సామర్థ్యం బది యెట్టిదో నిఖిలమున్ • సంపూర్ణమై పత్రపా
త్రీమధ్యంబునఁ బిండివంటకములుం • దివ్యాన్నముల్ షడ్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయము • ల్సంధిల్లె నొక్కుమ్మడిన్. 139

ఉ. పప్పును బిండివంటలును • బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలుగాఁగఁ జట్టునను • గూర్పఁగఁ గూడిన యేరుఁద్రాల తె
ల్లప్పురభోగివంటకము • గమ్మని వాలిపు సొజ్జెపిండితో
నొప్పులుగా భుజించిరి బు • ధోత్తము లాఁకటిచిచ్చు పెచ్చునన్. 140

కం. తరుణి యిది యన్నపూర్ణా, పరమేశ్వరి గాని యితర • భామిని గాదం
చరవాయి గొనక మెసఁగిరి, పరమ మునీశ్వరులు పంచ • భక్ష్యాన్నంబుల్. 141

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో • రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ • గ్రొన్నేతితోఁ బప్పుతోఁ

---

137. అపోసానంబులు = ఆపోశనములు; మహిదివిజులు = మునులు. తా॥ "కానిండు ఏది కానున్నదో ?" అనుకొనుచుండగనే స్త్రీలు వచ్చి మాకు ఆపోశనములు వడ్డించిరి. 138. అమృతమస్తు = భోజనముముందు నీరు త్రాగునపుడు చెప్పెడి మాట. ముదుక పణతి = ముదుసలి స్త్రీ. తా॥ 'ఆఁ, అందఱికి ఆపోశనములు వడ్డించిరా ? బాగున్నది. ఇక 'అమృతమస్తు, పుచ్చుకొనండి' అనుచు ఆ ముసలవ్వ చేయెత్తి మ్రొక్కినది. 139. పత్రపాత్రీమధ్యంబునన్ = ఆకులలో; షట్...చయముల్ = ఆఱురుచులుకల పదార్థములు; సంధిల్లెన్ = ఒనగూడెను; ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా. తా॥ మే మామె చెప్పినట్లు ఆపోశనములు లోనికి పుచ్చుకొనగానే ఆ మహత్త్వ మెట్టిదోకాని ఆరటాకుల నిండుగా దివ్యరసాన్నములు, పిండివంటలు ఒక్కసారిగా నిండిపోయినవి. 140. ఏరు...వంటకము = ఏరిన తెల్లని కర్పూరభోగి బియ్యపుటన్నము; బుధోత్తములు = మునులు. తా॥ పప్పు పాయసము, పిండివంటలు తెల్లని కర్పూరభోగుల అన్నము కుప్పలు తిప్పలుగా వచ్చినవి. మేము ఎక్కువ ఆకలి బాధతో నున్నందున చరచర భుజించితిమి. 141. అరవాయిగొనక = సందేహింపక; మెసగిరి = తినిరి; పంచభక్ష్యములు = భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయములు. తా॥ 'ఈమె అన్నపూర్ణా పరమేశ్వరియే; కాని మఱొకతె కాద'నుచు అందరును నోరు మెదపకుండ తినిరి.

నక్షయ్యంబగు నేరు(ద్రాలకలమా • హారంబు నిశ్శంకతం
గుక్షుల్ నిండఁగ నారగించితిమి య • క్షుద్రక్షుధాశాంతికిన్. 142

ఆ. ఎవ్వఁ డే పదార్థ • మెంతేనిఁ జింతించు, నతని కా పదార్థ • మంత గలిగి
యరఁటియాకు మీఁద • నవతారమై యుండు, నిట్టి మహిమ చూడ•మెన్నఁడేని. 143

ఉ. వేలుపుగిడ్డియుం బరుస • వేదియుఁ గల్పకుజంబుఁ దోడ రా
లాలితపాదనూపురఝ • ళంఝళనాదము లుల్లసిల్లఁ బైఁ
జేలచెఱంగు దూలఁగ వి • శృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృ • తాన్నముఁ బెట్టుచు నన్నిపంక్తులన్. 144

వ. ఇవ్విధంబున నాజ్యధారా ప్రవాహంబును, శర్కరాక్షోదసికతాంచితంబును, బాయ
సాపూప సంపన్నంబగు కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీర క్షౌద్రపుండ్రేక్షుఖండ
మండితంబును, రంభానారికేళఫలపాకశాక సాకల్యకల్యంబును, షాడబ రసావళీ
పానక ప్రచురంబును, శరచ్చంద్రచంద్రికాధవళదధిసమృద్ధంబును నైన భోజ
నోత్సవంబు వైశంపాయనమనః ప్రమోదసంపత్సంపాదనలంపటంబును, సుమంతు
సంతోషకారణంబును, బైలరసనాతపఃఫలంబును, జైమినికామనాకామధేనువును,
దేవలముదావహంబును, రోమహర్షణహర్షోత్కర్షావహంబును, సూతకౌతూహల
హేతుభూతంబును, నస్మన్మనోరథవిహార ఘంటాపథంబునునై ప్రవర్తిల్లెఁ దద
నంతరంబ. 145

---

142. రంభాఫల = అరటిపళ్లు; మండెగ = గోధుమపూరీ; ఏరు...ఆహారము = ఏరినకలమబియ్యపుటన్నము; కుక్షుల్ = పొట్టలు; అక్షుద్ర...శాంతి = ఎక్కువనైన ఆకలి తగ్గుట. తా॥ ద్రాక్షాపానకము; కండచక్కెర, అప్పుడుకాచిన నేయి, పప్పు, ఆవుపాలతో కడుపార నిశ్శంకముగా తింటిమి. 143. చింతించున్ = తలచును; అవతారమై = మొలిచి. తా॥ ఎవరేది కావలెననుకొన్న అది అంతయు వచ్చి అరటాకు మీద పుట్టుచుండెను. అట్టిమహిమ మెన్నడును చూడము. 144. వేలుపుగిడ్డి = కామధేనువు; పరుసవేది = స్పర్శవేది; కల్పకుజము = కల్పవృక్షము; తోడరాన్ = కూడరాగా; నూపుర = అందెలయొక్క; పైఁజేలచెఱగు = పైటచెంగు; తూలగన్ = జాఱగ; విశృంఖలవృత్తిన్ = స్వేచ్ఛగా; నీలాలక = స్త్రీ. తా॥ ఆ అన్నపూర్ణ కల్పవృక్షము, కామధేనువు, స్పర్శవేది వెనుక వచ్చుచుండగా కాలి అందెలు గల్లు గల్లున మ్రోయుచుండ, పైట ఇటుసటు సూగుచుండ స్వేచ్ఛగా పంక్తులమధ్య తిరుగుచు అన్నము వడ్డించుచుండెను. 145. శర్కరా...అంచితము = పంచదార యిసుకతిన్నెలుకలది; గోక్షీర = ఆవుపాలు; క్షౌద్ర = తేనె; పుండ్రేక్షు = నామాల చెఱకు; రంభాఫల = అరటిపళ్లు; షాడబరసావళీ = భక్ష్యములు; పైల...ఫలము = పైలుని నాలుకపుణ్యము; కామనా = కోరిక. తా॥ నేతిప్రవాహములు. చక్కెర ఇసుకతిప్పలు. తెల్లని పెరుగుగడ్డలు బోలెడుగా మా కందఱికి మనస్తృప్తిగా ఆ సంతర్పణము ఎంతో హాయిగా జరిగినది.

ఆ. హస్తములను గడిగి • యాచమనక్రియా, వ్యాప్తిదీర్చి దేవి • యాజ్ఞ మేము
విమలసౌధమధ్య • వేదికాస్థలమున, విశ్రమించియున్న • వేళయందు. 146

వ. అభ్యంతర భవనంబునందుండి. 147

-• విశ్వనాథుఁడు పార్వతితోడ వ్యాసాగులుండిన వేదికకడకు విజయముచేయుట •-

సీ. చంద్రబింబానన • చంద్రరేఖామౌళి, నీలకుంతలభార • నీలగళుఁడు
ధవళాయతేక్షణ • ధవళాఖిలాంగుండు, మదనసంజీవని . మదనహరుఁడు
నాగేంద్రనిభయాన • నాగకుండలధారి, భువనమోహనగాత్ర • భువనకర్త
గిరిరాజకన్యక • గిరిరాజనిలయుండు, సర్వాంగసుందరి • సర్వగురుఁడు

తే. గౌరి శ్రీ విశ్వనాథుండు • కనకరత్న, పాదుకలు మెట్టి చట్టలు • పట్టికొనుచు
నేగుదెంచిరి యొయ్యార • మెసకమెసఁగ, విహరణక్రీడ మాయున్న•వేది కపుడు. 148

తే. జయయు విజయయు నొకవంక • సరస రారు
నందికేశుండు ముందర • నడచి రాఁడు
ప్రథమదంపతు లేమి సం • భ్రమములేక
యరుగుదెంచుట యద్భుత • మయ్యెమాకు. 149

శా. గౌరిం జూచినయప్పు • డంచితమహా కారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁజూచినపుడు • ద్యత్క్రోధసంరంభముం
దోరంబై యపు డంతరంగముల సం • తోషంబు సంత్రాసముం
బూరించె న్వీను మేమి చెప్పుదు మహా • పుణ్యాత్మ కుంభోద్భవా. 150

146. ఆచమన...తీర్చి = ఆచమనములుచేసి; వేదికాస్థలమునన్ = అరుగుపై. తా॥ తర్వాత మేము చేతులు కడిగికొని ఆచనమనముచేసి (ఇది శిష్టాచారము) ఆమె ఆజ్ఞప్రకారము మేడమధ్యనున్న అరుగుమీద విశ్రమించితిమి. 147. అభ్యంతర భవనము=లోపలియిల్లు. 148. మదన సంజీవని=మన్మథుడు జీవించుటకు కారణ మైనది. (పార్వతి); మెట్టి=తొడిగికొని; చట్టలుపట్టుకొని=చట్టాపట్టాలుగా ఒండొరుల భుజములపై చేతులువేసికొని; ఎసకమెసగన్=అతిశయింపగా; విహరణ క్రీడన్=విహరించునట్లు. తా॥ అంత అన్నపూర్ణా విశ్వేశ్వరులు రత్నపాదుకలు తొడిగికొని చట్టాపట్టాలువేసికొని ఒయ్యారముగా వచ్చిరి, 149. జయ, విజయ= దాసీలు; సరసన్=కూడ; సంభ్రమము=హడావిడి. తా॥ ఇటునటు జయ విజయలు లేరు. నందీశ్వరుడు ముందులేడు. వారట్లు వచ్చుట మాకాశ్చర్యము వేసినది. 150. అంచిత...సంపత్తి=ఎక్కువదయ; తారా...మౌళిన్=శివుని; ఉద్యత్క్రోధ సంరంభము=ఎక్కువ కోపావేశము; తోరంబై=ఎక్కువై; సంత్రాసము=భయము. తా॥ అందులో గౌరిని చూచినప్పుడు దయారసము, శివుని మొగమున కోపాటోపము కన్పడుటచే మా మనస్సులలో సంతోషము, భయము నొక్కసారిగా కల్గినవి.

తే. కాశి శివునకు శుద్ధాంత • కాంతగాన
దానిపై నల్గి కోప పా • త్రంబ నైతిఁ
గాశి గౌరికి సవతియౌఁ • గాన నేను
దానిపై నల్గి ప్రేమ పా • త్రంబ నైతి. 151

వ. అనంతరంబ యేము ప్రత్యుత్థానంబు చేసి యా పురాణ దంపతులకుఁ బ్రణామంబు లాచరించి మడిసందులం జేతులిడి యొక్క కెలన నిలిచి యుండితిమి. పార్వతీ పరమేశ్వరులు వేదికాస్థలంబున విజయంచేసి కూర్చుండి రప్పుడు నంభుండు కోప సంరంభంబున నా దిక్కు చూచి ధిక్కరించి యిట్లనియె. 152

—♦ శంభుండు వ్యాసుని శిష్యులతోడఁ గాశి వెడలిపొమ్మనుట ♦—

సీ. ఓరి దురాత్మ! నీ • వారముష్టింపచా, భాస! యోజనగంధి • ప్రథమపుత్ర!
దేవరన్యాయ దు • ర్భావనాపరతంత్ర! బహుసంహితాస్పృహా • పాఠపఠన!
భారతగ్రంథ గుం • ఫనపండితంమన్య! నీవా మదీయాప • త్నికి నశేష
కైవల్య కల్యాణ • ఘంటాపథమునకుఁ, గాశికాపురికి • నిష్కారణంబ

తే. శాపమిచ్చెదనని యనా • చారసరణి
నడుగువెట్టినవాఁడ వ • హంకరించి
పొమ్ము నిర్భాగ్య మాయూరి • పొలము వెడలి
యెచటికేన్ శిష్యులును నీవు • నీక్షణంబ. 153

---

151. శుద్ధాంతకాంత = భార్య; కోపపాత్రము = కోపింపదగినవాఁడు; అల్గి = కోపించి. తా॥ అందుకు కారణమున్నది. శివునకుభార్యయైన కాశిపై కోపించినందున శివునకు కోపమును, సవతిపై కోపించినందున గౌరికి సంతోషమును కల్గినవి. 152. ప్రత్యుత్థానము = ఎదురుగాలేచివెళ్లుట; పురాణదంపతులు = ప్రాచీనకాలపు జంటలు; మడిసందులన్ = చంకలలో; ఒక్క కెలనన్ = ఒకప్రక్కన; విజయంచేసి = వచ్చి; నాదిక్కు = నావైపు. 153. నీవారముష్టింపచాభాసుడు = పిడికెడు నెవ్వరిధాన్యమును వండుకొనితిను మునులట్లున్నవాడు; దేవర...తంత్రుడు = అన్న చనిపోయిన వెనుక వదినెను కలిసినతడు; బహు...పఠనుడు = వృథాగా వేదములు వల్లించినవాడు; భారత...మన్యుడు = భారతమును రచించుటతో పండితుడననుకొనువాడు; అశేష... పథము = సమస్తమోక్షమంగళములకు రాచబాటయైనది; అనాచారసరణిన్ = అవినీతి మార్గమున; అహంకరించి = పొగరెక్కి; పొలము = ప్రదేశము; ఎచటికేన్ = ఎచ్చటికైనను; ఈ క్షణంబ = ఈక్షణమే. తా॥ ఓరీ దురాత్మా! మహర్షివేషము వేసికొన్నవాడా! నీవు సత్యవతికి పెండ్లికానిక్రితము పుట్టినవాడవు; దేవరన్యాయమున తమ్ముల భార్యలవద్దకేగినవాడవు; వృథాగా ఎన్నో వేదములు చదివినాడవు; భారతమును వ్రాసితిననుగర్వము హెచ్చుగా కలిగిన నీవు నా భార్యకు, ఘంటాపథముగా మోక్షమునిచ్చు కాశికి నిష్కారణముగా శాపమియ్యనుంకించితివే? ఎంత అనాచారము! ఎంత అహంకారము? నిర్భాగ్యుడా! పో నీవు నీ శిష్యులు కలిసి ఈ యూరి సరిహద్దులు దాటి పొమ్ము!

కం. పోక నడగొట్టితేనియు. రాకింతుఁ జుమీ మొగంబు • రాచట్టుపయిం
శ్రీకాశిక నిందించిన, నీకింతట నేలపోవు • నీచచరిత్రా. 154

కం. వడి విడువక యివ్వడువున, నుడుపతిమకుటుండు చెవుల • కొనరని నుడుగుల్
నొడివిన నే నయ్యిరువుర, యడుగులఁ బడి కాశివెడలి • యరిగెడు వేళన్, 155

చం. వెఱవకుమో కుమార ! పది • వేలవిధంబులనైన నిన్ను నే
మఱవ మఱెడకుం జనుట • మాని సుఖంబున దక్షవాటికన్
దుఱఁగలి గొన్న సమ్మదము • తో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేని వేల్పు నిఖి • లాభ్యుదయంబులు నీకు నియ్యెడున్. 156

వ. అనిన నంబవచనంబులు విని విశ్వేశ్వరదేవ రచితతిరస్కార మహోపద్రవ సంభూత వేదనాదూయమాన మానసుండనయ్యును భవానీకృపాపాంగవీక్షావిక్షేపదాక్షిణ్యం బున నొక్కింత యంకిలిదెలిసి శిష్యసహితుండనై యెన్నఁడెన్నఁడు భీమేశ్వరుఁ దర్శింతునో యని యువ్విళ్లూరి యేతెంచుచున్నవాఁడఁ బరమమాహేశ్వరుండవైన నిన్నుం గనుంగొంటి నింక నా మనోరథం బవ్యాహతగతిం బ్రవర్తింపఁగలయది. 157

తే. అనవధానత నావగిం • జంతసూవె, పర్వతంబంత యపరాధ • భరము కొలిపి
కాశి వెడలంగ మొత్తినఁ • గానిబొంది, తిరుగుచున్నాఁడ నిదె యేను • దిక్కుమాలి. 158

---

154. పోక = వెళ్లక; నడగొట్టితేనియున్ = నిలిచినచో; రాకింతుఁజుమీ = కొట్టింతునుసుమా; రాచట్టుపయిన్ = రాతిమీద. తా॥ పోక, ఇంకను నడయాడి తివా ? నీ మొగము రాతిమీదవేసి రాపింతునుసుమా ! కాశిని నిందించిన ఫలము నీకింతటితో పోవునా ? 155. వడి = వేగము; ఇవ్వడువునన్ = ఈరీతిగా; నుడుగుల్ = మాటలు; నొడివినన్ = పల్కగా; అడుగులబడి = కాళ్లపైబడి. తా॥ అనుచు చరచర శివుడు చెవులు వినలేని మాటలు పలుకగా, నేనా యిద్దరికాళ్లమీద పడితిని. ఇక కాశినుండిబయల్దేరనుంటిని. అప్పుడు 156. మఱెడకున్ = మఱియెక్కడకును; దక్షవాటిక = దక్షారామము; తుఱఁగలిగొన్న = అతిశయించిన; గమనింపుము = వెళ్లుము; అఱగొఱలేని = తక్కువలేని. తా॥ 'ఓ కుమారా ! భయపడవలదు. నిన్ను నే మరువను. ఎక్కడికిని వెళ్లవలదు. దక్షవాటి కేగుము. అక్కడ భీమేశుడు అఱమఱిక లేనివాడు. నీకు మేలు చేకూరును.' 157. విశ్వేశ్వర...మానసుడు = శివునిచే చేయ బడిన తిరస్కారమువలన బాధచే కుములుచున్న మనస్సుకలవాడు; అంకిలి = సాధక బాధకములు; అవ్యాహతగతిన్ = అడ్డులేనిరీతిగా. తా॥ అనిన అంబమాటలతో విశ్వేశ్వరుని కోపమువలన కలిగిన బాధ సగముతగ్గినది. శిష్యులతో కలిసి ఎన్నడు భీమేశుని సందర్శింతునా ? అని యువ్విళ్లూరుచు వచ్చుచుంటిని. మహేశ్వర భక్తు లలో శ్రేష్ఠుడవైన నిన్ను చూచితి; నింక నాకోరిక అడ్డులేక తీరును.

తే. కడుదయాళురు దేవతా • గణములెల్లఁ, గాలభైరవు చిత్తంబు • కఠినపాక
మీరసము పెద్ద డుంఠివిఘ్నేశ్వరునకుఁ, గాశి మనబోంట్లకెల్లను•గానిబ్రతుకు. 159

కం. అని కుంభసంభవునకును, దన వృత్తాంతంబు చెప్పి • దైన్యమునొందెన్
గనుఁగవ నశ్రులుదొరుఁగఁగ, ననఘుఁడు సత్యవతిసూనుఁ•డని చెప్పుటయున్. 160

వ. అటమీఁది వృత్తాంతం బెయ్యది యని యడిగిన. 161

మ. స్మర జిద్భూధరదిక్కరిద్రుహిణయో • షాచంద్రికాభ్రాపగా
శరదభ్రాభ్రమువల్లభ ప్రతిభట • స్ఫాయస్ఫురత్కీర్తి ని
ర్భరగర్భోదయభూర్భువస్స్వరఖిల • బ్రహ్మాండభాండోదరా!
యరివేదండఘటావిఘట్టనకతో • రాటోపకంఠీరవా! 162

కం. అసమసమవిషమసమర, ప్రసృమరరిపు సుభటనిటల • పట్టవిఘట్ట
వ్యసనదృఢదోఃకఠారా. కుసుమశరాసనసమాన • కోమలమూర్తీ. 163

స్రగ్విణీ. రామమాంబాసుతా • రాజవిద్యాధరా
కామితార్థైకసం • కల్పకల్పద్రుమా
వేమనక్షోణిభృ • ద్వీరభద్రేశ్వరా
స్వామికార్యాభిర • క్షక్రియాదక్షిణా. 164

గద్య. ఇది శ్రీ కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.

---

158. అనవధానతన్ = ముందువెనుకలాలోచించనందున; చూవె = కదా; గాసి=కష్టము. తా॥ మనసునిబ్బరము లేనందున ఆవగింజంత తప్పు కొండంతై నన్ను కాశి వెడలగొట్టించినది. ఆ బాధతో దిక్కులేక తిరుగుచున్నాడను. 159. దయాళుడు=దయాశీలుడు; ఈరసము=ఈర్ష్య; కానిబ్రతుకు=బ్రతుకచోటుకానిది. తా॥ దేవతలందఱు దయాశీలురైననేమి? కాలభైరవునిచిత్తము కఠినమైనది. డుంఠికి ఈర్ష్య యెక్కువ. ఇక కాశి మనవంటివారికి కానిదై పోయినది. 160. అని వ్యాసుడగస్త్యునితో కన్నుల నీరు గ్రమ్మునట్లు తన కథనెల్ల చెప్పెను.

శ్రీరస్తు
శ్రీమహా గణాధిపతయేనమః
శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## తృతీయాశ్వాసము



భీమేశ్వరకరుణా
లాభసముజ్జృంభమాణ ♦ లక్ష్మీవిభవా
ప్రాభవకశ్యపమునివం
శాభరణా ! బెండపూఁడి ♦ యన్నామాత్యా. 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పందొడంగె. 2

గీ. అవ్విధంబున బాష్పధా ♦ రాకులాక్షుఁ
డగుచు సత్యవతీసూనుఁ ♦ డడలుటయును
నెలఁతయును దాను గన్నుల ♦ నీరునించెఁ
గరుణ చిత్తంబులో నుబ్బఁ ♦ గలశభవుఁడు. 3

వ. అనంతరంబ యంతరంగంబున సంతాపంబు డిందుపఱచుకొని సత్యవతీనందనుండు కమండలుజలంబులు కన్నులఁ దుడుపుకొని నిట్టూర్పు నిగిడించి కాశికావియోగక్లేశంబున సమానవ్యసనుండైన కుంభసంభవున కిట్లనియె. 4

ఉ. ఈవును నేనపోలెను ము ♦ నీశ్వర భాగ్యము లేమిఁజేసి కా
శీవిరహాగ్నితాపమునఁ ♦ జేద్పడినాఁడవు చెప్పవయ్య నా
త్రోవ మహాత్మ దక్షపురి ♦ ధూర్జటి శంభుఁడు భీమనాథుఁ డా
ర్యావిభుఁ డాశ్రయార్హుఁడగు ♦ నా ? నను నేలికొనం దలంచునా ? 5

---

3. అడలుటయును = బాధపడగా; నెలత = భార్య; ఉబ్బన్ = ఎక్కువకాగా; కలశభవుడు = అగస్త్యుడు. 4. డింపుపఱచుకొని = తగ్గించుకొని; సమానవ్యసనుండు = సమమైనబాధ కలవాడు; 5. ఈవు = నీవు; నేనపోలె = నావలె; లేమిజేసి = లేనందున; చేద్పడినాడవు = బాధపడితివి; ఆర్యావిభుడు = పార్వతీపతి.

మ. జగతీమౌళివతంసభూషణము వి • శ్వఖ్యాతముం గాశికా
నగరంబు న్విడఁబాసి నీకును జగ • న్మాన్యైకచారిత్ర యీ
చిగురుంబోఁడికి నాకునుం గటకటా • చేట్పాటు వాటిల్లె నీ
ముగురం గూర్చిన ముండమైవమునకున్ • మోమోట లేదో సుమీ ? 6

సీ. నిండి పాఱుచు నుండు • నే నిదాఘములందుఁ, దసకొత్తు సప్తగో • దావరంబు ?
షట్కాలకంబు పూ • జావిధానములకుఁ, బల్లవప్రసవద • ర్భలును గలవె ?
కాంతాజనంబులు • కమియార నిడుదురే, పురములోఁ దక్కాల • పుణ్యభిక్ష ?
ఘనతపంబునకు వి • ఘ్నంబు సేయరుగదా, యమరేంద్రుఁడొసఁగిన • యప్సరసలు ?

తే. కాలభైరవవిఘ్నేశ • కార్తికేయ, వీరభద్రాదిపరివార • వీరగణము
స్వాగతము సేయునే కార్య•సాధకులకు,దక్షవాటికయందు వా•లాయిదమున ? 7

ఉ. ముక్కు మొగంబుచూడ కొక • మోసపుమాటకు విశ్వనాయకుం
డెక్కడికైనఁ బొమ్మనుచు • నెట్టనిచూపులఁ జూచె నల్కతో
ధిక్కరణంబు సేయఁ జను • డెంచితిఁ గాశినిసుండి నాకుఁ దా
దిక్కయి భీమనాయకుఁడు • దీర్చునొకో యవమానదుఃఖముల్. 8

తే. నన్నుఁ గన్నతల్లి • యన్నపూర్ణామహా, దేవి విశ్వనాథ •దేవు తరుణి
గుఱుతుచెప్పి తన్నుఁ • గొలుపంగఁ బుత్తేర, వచ్చినాఁడ • నేలవలదె తనకు ? 9

సీ. భీమేశ్వరేశ్వర • శ్రీ మహాదేవుండు, కరుణించునె నన్నుఁ • బరమశైవ ?
సప్తగోదావరో • త్సంగధాముఁడు నన్ను, నాదరించునె యిల్వ • లాసురారి ?
సప్తపాతాళ వి • ష్కంభమూలస్తంభ, మూరడించునె నన్ను • నుపరతాత్మ ?
దక్షిణాంభోరాశి • తటమేదినీభర్త, రక్షించునే నన్ను • బ్రహ్మవాది ?

తే. స్వాగతము సేయునే నాపఁ• జంద్రమౌళి, కాంక్షితంబిచ్చునే నాకుఁ • గాళగళుఁడు ?
కాశిలోఁ బద్ధ మానభం • గంబువాయఁ, గుస్తరించునె నను ధూర్జ • కుంభజన్మ? 10

ఉ. దోసము పెద్దలేదనక • ధూర్జటి నిష్ఠురకంఠహుంక్రియా
భ్యాసముమై నదల్చి యద • యస్థితిఁ గాశివెలార్చె నింక నే
నా సరిసంయమీంద్రుల న • నాథత నేమెయిఁ జూతు దక్షవా
టీసదనుండు ప్రేమ ఘటి • యింపక తాను నుపేక్షచేసినన్. 11

6. జగతీ...భూషణము = భూమికి శిరోభూషణము; పెడఁబాసి = వదలి; చేట్పాటు = బాధ. 7. నిదాఘములు = గ్రీష్మములు; ప్రసవ = పువ్వులు; కమియార = గుప్పిలినిండార; కార్తికేయ = కుమారస్వామి, వాతాపిదమనుడు = అగస్త్యుడు. 8. తీర్చునొకో = తీర్చునుకదా ! 9. పుత్తేర = పంపగా; 10. ఉపరతాత్మ = మునీ !; కాళగళుడు = శివుడు; కుస్తరించునె = ఊరడించునె.

—♦ కలశభవుఁడు పారాశర్యునకు దక్షారామమహిమంబు చెప్పుట ♦—

వ. అనినఁ బారాశర్యునకు నత్తపోధనవర్యుం డిట్లనియె. 12

మ. వితతాష్టాదశసంహితాగమకథా • వీథీసహస్రంబు భా
రతతంత్రంబఖిలంబు నీయది యపా • రంబైనయామ్నాయసం
తతి నీచే వివరింపఁగాఁబడియె వి • ద్యావర్ధనా నీవు నీ
క్షితిలోఁ గానని క్షేత్రముల్ గలవె? యీ • చింతాభరం బేటికిన్. 13

వ. భీమలింగంబు మాహాత్మ్యంబు నీ వెఱుంగనియదియునుం గలదె? దక్షారామపుణ్య క్షేత్రం బఖిలపురాణప్రసిద్ధంబు కాదే? నీమనోవిషాదంబునంజేసి యెఱుఁగని వాఁడవుంబలె నడిగెదవుగాక, యైన నడిగిన యర్థంబు చెప్పెద నాకర్ణింపుము. 14

శా. మోక్షస్థానము భోగభూమియును నై • మున్నూఱు క్షేత్రంబులన్
సాక్షాద్బ్రహ్మపదంబసంగ నపర • స్వర్గంబునా నొప్పగున్
దక్షారామము భీమనాయకమహా • ధామంబు లోకత్రయీ
చక్షుః ప్రాఘుణకాయమానసుషమా • సంపత్సముద్దామమై 15

తే. రాజవంశజుఁడగు భగీరథునివెనుకఁ, బాఱుతెంచిన చదలేఱు • పాటియగునె
సప్తమునిరాట్ప్రతాప సం • ప్రాప్తమైన, సప్తగోదావరంబుతో • సారమహిమ. 16

సీ. దక్షప్రజాధినా • థమహాధ్వర క్రియా, దీక్షాధిగమపుణ్య • దేశమునకు
బ్రహ్మవిష్ణుపురంద • ర ప్రధానసుపర్వ, పరమసంయమిసభా • భవనమునకు
దాక్షాయణీయోగ • దహనార్చిరున్మేష, సామిధేనీమంత్ర • జాతమునకు
వీరభద్రభుజావి • హారహేలాసమా, రంభనాటక నాట్య • రంగమునకు

---

11. నిష్ఠుర...మైన్ = కఠోరమగు హుంకారముతో; అదయస్థితిన్ = దయలేక; వెలార్చెన్ = వెడలించెను; అనాథతన్ = దిక్కులేక; ఏమెయిన్ = ఎట్లు. తా॥ ఎక్కువ దోషము లేదుకదా అని మన్నించక యుగ్రుడై పరుషముగా హుంకరించు నలవాటులో నన్నదల్చి కాశి వెడలగొట్టినాడు. భీమేశుడుకదా దయచూడకపోయినచో ఇంక నేను నాతో సరియైన మునుల నే మొగము పెట్టుకొని చూతును?
12. పారాశర్యుడు = వ్యాసుడు. 13. వితత...సహస్రంబు = పదునెనిమిది పర్వములును, కథలు నెన్నో కలది; ఆమ్నాయసంతతి = వేదములు. తా॥ భారతము పదునెనిమిది పర్వములు నీవు రచించినవే కద; వేదముల విభజించితివి. విద్యావర్ధనా! నీవు చూడని క్షేత్రము లున్నవా? ఇంత చింతేటికి? 14. అర్థంబు = విషయము.
15. లోక...సముద్ధామము = ముల్లోకముల జనుల నేత్రముల కతిథియగు శోభ కలది. తా॥ దక్షారామము మూడువందల క్షేత్రాలలో భోగమోక్షముల నిచ్చునదై సాక్షాత్తు బ్రహ్మపదమా అన్నట్లు మూడులోకములవారికిని కన్నులపండువుగా నుండునది. 16. చదలేఱు = గంగ.

తే. నమృతమయదివ్యతేజస్స్వ • యంభులింగ, శాంతభీమేశ్వరేశ్వర • స్థానమునకు
దక్షవాటంబునకు మోక్ష•ధామమునకు, భోగజన్మస్థలమున కే•పురము సరియె? 17

వ. వెండియుఁ జండభానుకృతప్రతిష్ఠుండును, నాఖండలముఖనిఖిలబర్హిర్ముఖ శిఖామణి
మయూఖకిమ్మీరిత చరణారవిందుండును, సప్తపాతాళభువనవిష్కంభనిర్భేద సమా
సాదితావిర్భావుండును: దివ్యామృతస్వయంభూరుజ్జ్యోతిర్లింగమయ మూర్తిధరుండు
నైన, భీమేశ్వరుండు భోగమోక్షప్రధాన దీక్షాధురంధరుండై యందువసించియుండు;
నమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు భీమమండలంబనఁ బంద్రెండు యోజనంబు
మేర కైవల్యకల్యాణ మండపంబును భోగలక్ష్మీవిలాస భవన పుండరీకంబునునై
కుండలాముఖ సంవేద్య శార్దూల క్షేత్రంబులు మొదలుగాఁగల శాఖోపశాఖాక్షేత్రం
బులం గరిగి దక్షిణజలధివేలావనోపకంఠంబున వేదండవదనకుండా కాండచుళికి
తోన్ముక్తసప్తగోదావరసలిలధారాయుధత్కారబృంహిత బ్రహ్మాండ గోళంబును.
పుల్యభాగాప్రవాహ లహరికాఘోషఘుమఘుమాయమాన దిగ్విభాగంబును, నేలా
నదీ మాతృకాయమాన కేదారక్షేత్రసంవర్ధితానేక వ్రీహిభేద సంపత్సంపన్నంబును,
ఫలభరితనారికేళషండమండిత ప్రౌఢపీఠాపురోపకంఠసీమా బహిర్భాగంబును,
మాతృకాయమాన గోదావరీక్షేత్ర పుణ్యాగ్రహార పరంపరాభూనిలింప సంపత్సం
పాదితాధ్వరక్రియాసమాహూతాది దేవతాసదంబ సంబాధ సంచరితంబును, గౌం
తేయ వాహినీ ప్రాంత సంతప్యమాన మునిమండలంబును, సహకార కాంతార
ఫలరసాస్వాదమోదమానపుంస్కోకిలకుటుంబ సంతతాకోపుల సహకార
కోలాహల ప్రపంచితపంచమంబును, హరిపంచంబునుంబోలె బలభద్రప్రద్యుమ్నా
నిరుద్ధపురుషోత్తమాధిష్ఠితంబునునై. మహాక్షేత్రంబన, మహాలింగస్థానంబన,
దక్షిణకాశియనఁ, గళ్యాణనిలయంబనఁ, గైలాసప్రతిబింబంబన, ననశ్వరమహైశ్వ
ర్యంబును, నప్రతిమవైభవంబును, నవాఙ్మానస గోచరంబును, ననంఖ్యాత ప్రమథ
గణసమాకీర్ణంబునునై, యశేషకల్యాణనిలయంబై యొప్పు నమ్మహాస్థానంబునందు. 18

17. పురందర ప్రధాన సుపర్వ=ఇంద్రాదిదేవతలు; దాక్షాయణీ...జాతము=
సతీదేవి యోగాగ్నిజ్వాల బయల్వెడలుటకు అగ్న్యతేజకమంత్రమైనగి; మోక్ష
ధామము=మోక్షనిలయము. 18. చండ...ప్రతిష్ఠుడు=సూర్యునిచే ప్రతిష్ఠింపబడిన
వాడు; ఆఖండల...అరవిందుడు=ఇంద్రాదిదేవతల కిరీటములందలి మణులచే చిత్ర
వర్ణముకలిగింపబడిన పాదములు కలవాడు; విష్కంభ=అడ్డంకు; వేదండ...
గోళంబు=వినాయకుని తొండముతో పుక్కిలింపబడిన సప్తగోదావరజలముల
చప్పుడుతో ప్రతిధ్వనించు బ్రహ్మాండము కలది. షండ=తోటలు; భూనిలింప=
బ్రాహ్మణులు; ఆదిదేవతా...సంచరితము=దేవతలచే క్రిక్కిరిసి తిరుగాడబడినది;
గౌంతేయవాహినీ=గౌంతేయనది; అనశ్వర=నశించని; అసంఖ్యాత=లెక్కలేని.

సీ. పాటలంబగుజటా • జూటంబునడునట్టు. పూపచుక్కలరాజు • పొడవుచూపు
వెడఁద యైన లలాట • వీథీవిటంకంబు. కట్టెట్ట్రకొవ్వేఁడి కన్నుఁగూర్పఁ
గంబుసన్నిభ మైన • కంఠప్రదేశంబు, గరళకూటముఛాయఁ • గ్రాఁచి యుమియఁ
గడుమనోజ్ఞములైన • కర్ణపార్శ్వంబులఁ, బెనుపాఁపపోఁగులు • బిత్తరించు
తే. భీమమండలికా పుణ్య • భూమియందు, వివిధకైవల్యకళ్యాణ • వేది ననఁగఁ
గీటపక్షిసరీసృప • క్రిమిచరాది, జంతుకోటికిఁ బ్రాణావ • సానవేళ, 19

సీ. ఒకచోటఁ గోటీవ • ల్ల్యాడురాజకోటీర, విభ్రాజితోత్సంగ • వృద్ధగంగ
యొకచోటఁ బీఠాంబి • కోన్నత స్తనభరా, స్ఫాలజర్ఝరితక • ల్లోల యేల
యొకచోటఁ జటులన • క్రకుళీరపాఠీన, తోయగర్భాభోగ • తుల్యభాగ
యొకచోటనప్సరో • నికరసంసేవితాం, తరము త్రిసప్తగో • దావరంబు
తే. నమరు నాగరఖండని • ద్ధాంతజాతి, నాగవల్లీసమాక్రాంత • పూగఖండ
మండితోద్యానవాటికా • ఖండవిభవ, పాత్రమగుభీమమండలీ • క్షేత్రమునకు. 20

సీ. త్ర్యంబకాచలశిఖా • గ్రమునందునుదయించి, పొదలి యార్యావర్త • భూమిఁదటిసి
మలఁగిదండకవనీ • మధ్యభాగమునసా, ప్రస్రవణాచల • ప్రస్థమొఱసి
పట్టిస శ్రీవీర • భద్రేశు సేవించి. క్షేత్రసోమేశుమం • దిరము దాసి
యేచియనంతభో • గేశ్వరస్థానంబు, రుద్రపాదములపైఁ • ద్రోవగాఁగఁ
తే. గోటిపల్లీశు కోమలాం • ఘ్రులకుమ్రొక్కి, కుండలాముఖక్షేత్రంబుఁ • గుస్తరించి
భీమమండలి డాపలఁ • బెట్టుకొనుచు, గౌతమీగంగ లవణాబ్ధిఁ • గౌఁగిలించె. 21

19. నడునట్టుపూప=నడిప్రదేశముననున్న బాలుడు; వెడద=విశాలము; కట్టెట్ట్రకొవ్వేడికన్ను=లలాటనేత్రమైన అగ్ని; గ్రాంచి=వెచ్చచేసి; పెనుపాపపోగులు=పెద్దపాములను చెవ్వులకమ్మలు; బిత్తరించు=ప్రకాశించు; సరీసృప=సర్పము. తా॥ మోక్షనిలయమైన దక్షవాటికలో జంతువులకు ప్రాణావసానసమయమందు శివుని రూపము వచ్చును. అందుచే జటాజూటమునకు పువ్వైన చంద్రరేఖయు లలాటమున మూడవకన్నును, కంఠమున గరళఛాయయు, చెవులకు సర్పకుండలములును వచ్చును. 20. కోటి...ఉత్సంగ=కోటిపల్లిలోని శివునిచే ప్రకాశించు; ఏల=ఏలానది; నాగరఖండ=గోరింటలు; జాతి=జాజి; నాగవల్లీ=తమలపాకులతీగ; పూగఖండ=పోకచెట్లతో. 21. త్ర్యంబక...అగ్రమున=త్ర్యంబకగిరిశిఖరమున; పొదలి=వృద్ధిపొంది; తటిసి=సమీపించి; మలఁగి=వంకరతిరిగి; దండకవనీ=దండకారణ్యము; ప్రస్థము=ప్రాంతము; పట్టిస=పట్టిసమను గ్రామమందలి; డాపలన్=ఎడమవైపున; లవణాబ్ధిన్=ఉప్పుసముద్రమును; కౌగిలించెన్=కలిసెను. తా॥ గౌతమీనది త్ర్యంబకాచలశిఖరమునపుట్టి, ఆర్యావర్తమును (వింధ్యకుత్తర దేశము) సమీపించి, దండకారణ్య భూములందు మలపులు తిరిగి, ప్రస్రవణపర్వత ప్రాంతములు తాకి, పట్టిసములోని శ్రీ వీరభద్రుని సేవించి, భీమేశ్వరునిగుడి తాకి; అనంతభోగేశ్వరస్థానముమీదుగారుద్రపాదములనుతాకి, కోటిపల్లీశ్వరుని పాదములాని, కుండలాముఖక్షేత్రముగుండా, భీమమండలమునకు కుడివైపునుండి ప్రవహించి లవణసముద్రములో కలిసెను.

తే. నీరుకడఁగోల్లఁగూడిమ • న్నీటిఁగవయు
మొగులుబడి వాహినులకెట్లు • మొరయవచ్చు
వార్ధులేఁడింటికివలపు • పనితమైన
మంగళోత్సంగగౌతమీ • గంగయెదుర. 22

ఉ. ఎక్కడజూచినం సరసి • యెక్కడఁ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని • యెక్కడఁ జూచినఁ బుష్పవాటికల్
ఎక్కడఁ జూచిన న్నది మ • హీవలయంబున భీమమండలం
బెక్కడ యన్యమండలము • నెక్కడ భావన చేసి చూచినన్. 23

తే. బ్రహ్మహత్యాదులగు మహా • పాతకములు
ధాత్రిజనులకు నిమిష మా • త్రమునఁబాయు
భీమనాథమహాదేవు • పెండ్లినాఁటి
దక్షిణాముఖమండప • దర్శనమున. 24

తే. కార్తికవేళ భీమశం • కరునినగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుఱ • తోరణంబు
నతఁడు దూఱఁడు ప్రాణని • ర్యాణవేళ
ఘోరయమపట్టణద్వార • తోరణంబు. 25

తే. ద్వాదశక్షేత్రపుణ్యక్షే • త్రములతోడ, రమ్యమగు సప్తగోదావ • రంబుతోడ
వరదభీమేశ్వరేశ్వరా • వాసమైన, దక్షవాటంబుకళ్యాణ • ధామమమరు. 26

తే. అప్పురంబు ప్రభావంబుఁ • జెప్పనేల, తిరిగిపాఱుంగయోజన • త్రితయభూమి
వాపికాకూపగర్తప • ల్వలతటాక, క్షేత్రజలములు భాగీర • థీజలములు. 27

---

22. నీరుకడన్ = వానకాలమున; మున్నీటిన్ = సంద్రమును; కవయు = కలిసెడి; మొగులుబడివాహినులు = వానకాలమునమాత్రమే ప్రవహించు సెలయేళ్లు; మొరయుట = మాట్లాడుట; వార్ధులు = సంద్రములు. తా॥ వాననీటితో బయల్దేరి సంద్రములో కలియు సెలయేళ్లు, నిత్యప్రవాహము కలిగి ఏడుపాయలుగా సముద్రములో (దానినే సప్తసముద్రములనినాడు. సప్తసాగరయాత్ర అనికూడ ప్రతీతియున్నది) కలిసిన గౌతమి ముందేమి మాటాడకలవు? 23. సరసి = కొలను; తటిని = నది. 25. కార్తికవేళ = కార్తికపూర్ణిమనాడు; చిచ్చుఱ తోరణము = జ్వాలాతోరణము. తా. కార్తిక పూర్ణమినాడు భీమేశ్వరుని నగరాన జ్వాలాతోరణము దూరినచో ఇక నతడు యమపట్టణద్వార తోరణము దూరడు. 26. కళ్యాణధామము = మంగళకర స్థానము. 27. యోజనత్రితయ = మూడామడ; వాపికా = దిగుడుబావి; గర్త = గోయి; పల్వల = చెలమ; భాగీరథి = గంగ.

సీ. పంచాక్షరీమంత్ర • పారాయణంబులు, జపియించు శారికా • సముదయములు
నీలకంఠస్తోత్ర • కోలాహలప్రౌఢిఁ, జూపు నున్మత్తపుం • స్కోకిలములు
శతరుద్రసచ్ఛ్రుతి • స్వాధ్యాయపాఠంబుఁ, బరిఢవించుఁ గిశోర • బంభరములు
ప్రణవాక్షరాభ్యాస • పరిపాటిఁ బాటించు, నానావిధంబుల • నమిలిపిండు
తే. సప్తగోదావరాంబు ని • ర్ఝరసహస్ర, సారణీసేకసాంతత్య • సంప్రవృద్ధ
వివిధతరుగుల్మవల్లికా • వేలమైన, తత్పురోద్యానవీథికాం • తంబునందు. 28

సీ. నిఖిలపుణ్యక్షేత్ర • నివహంబునందును. నత్యంతమాశ్రయం • బనఁగ నెగడి
యైంద్రసంపదకెల్ల • నాధారభూత మై, దక్షనియజ్ఞంబు • తానకమయి
ద్వాదశపుణ్యక్షే • త్రములతో సంధిల్లి, భోగమోక్షవిహార • భూమి యగుచు
నియమయాత్రామాత్ర • నిశ్శేషదోషాప,హరణం బొనర్ప స • మర్థమగుచు
తే. సిద్ధనిర్మలనిరవధి • శ్రీస్వయంభు, ధన్యభీమేశ్వరేశ్వర • స్థాణులింగ
దైవతస్థితిసంభవ • స్థానమైన, దక్షవాటంబు వర్ణింపఁ • దరమె మనకు. 29

కం. దక్షిణకాశీనగరము, దక్షారామంబు ఏమ • ధామము ధన్య
త్కుక్షిక్షోణీమండల, రక్షామణి దానిఁ బొగడ • బ్రహ్మకు వశమే. 30

సీ. భీమేశ్వరేశ్వర • శ్రీమహాదేవుండు, హిమధామమౌళి వి • శ్వేశ్వరుండు
సప్తగోదావర • సలిలప్రవాహంబు. సాక్షాత్కరించిన • జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ • దిరమైనగణపతి, యేకాంతదుంఠి వి • ఘ్నేశ్వరుండు
దక్షిణంబుననున్న • దండపాణీశుఁ డూ,హింపంగ దండపా • ణీశ్వరుండు
తే. భైరవస్వామి శ్రీకాల • భైరవుండు, నంది నందీశ్వరుం డేమి • నందియంబు
దక్షవాటంబు కాశికా • స్థలముగాదె, తీవ్రకరతేజ సత్యవ • తీతనూజ. 31

28. శారిక = గోరువంక; ఉన్మత్తపుంస్కోకిలములు = మదించిన మగకోకిలలు; శతరుద్రసచ్ఛ్రుతి = నమకమను వేదము (దీనితో రుద్రాభిషేకముచేయుదురు) కిశోరబంభరములు = తుమ్మెదపిల్లలు; నమిలిపిండు = నెమళ్లగుంపు; నిర్ఝర... వేలము = అనేకప్రవాహములైన కాలువలతో తడుపబడి నిత్యము పెరుగుచున్న చెట్లు, పొదలు కలది. తా. దక్షారామమునయెల్లపుడును రుద్రసంబంధమైన పారాయణలు జరుగుచుండుటచే అవన్నియు అక్కడి పక్షులకు వచ్చినవని చెప్పుచున్నాడు. గోరువంకలు పంచాక్షరీమంత్రమును, కోకిలలు నీలకంఠస్తోత్రమును, తుమ్మెదలు నమకమును; నెమళ్లు ప్రణవమును ఉచ్చరించుచుండును. గౌతమి యెల్లవేళల ప్రవహించుచు అక్కడి యుద్యానములోని చెట్లను, తీగెలను పెంచుచున్నది. 29. నెగడి = వృద్ధిపొంది; ఇంద్రసంపద = ఇంద్రుని సంపత్తు; తానకము = స్థానము; స్వయంభు = స్వయముగా నుద్భవించిన. 30. ధన్యత్ ... మణి = ధన్యముగా చేయబడినమధ్యభూమికలది. 31. తా॥ భీమేశ్వరుడే విశ్వేశ్వరుడు; గోదావరియే గంగ; గణపతియే డుంఠిగణపతి; దండపాణియే కాశిలోని దండపాణి; భైరవుడే భైరవుడును; నంది, నందీశుడునైన దక్షవాటిక కాశిగదా!

వ. మఱియు భీమేశ్వరమండలమునకు సీమాసంవిభాగంబు. 32

తే. జంభరిపుదిక్కునకు సీమ • సలిలరాశి, పశ్చిమమునకు సీమ త్ర్యం • బకతనూజ
ద్యుమ్నపతిదిక్కునకు సీమ • తుల్యభాగ, దక్షిణమునకు వృద్ధగౌ • తమియెసీమ. 33

తే. భోగమోక్షమహైశ్వర్య • యోగకాంక్ష, భీమమండలిఁగావూఁదఁ • బ్రియమువుట్ట
మర్త్యయోని జనింపంగ • మదిఁదలంత్రు, వివిధగంధర్వకిన్నర • విబుధవరులు. 34

తే. భీమమండలికాపుణ్య • భూమియందుఁ, దేఁజరిల్లెడు పంద్రెండు • క్షేత్రములకు
జాతరలు సేయు నప్సర • స్సతులతోడ, నాకమునసుండి యేతెంచి•నముచివైరి. 35

సీ. ఏడురసాతల • క్రోడంబులును వ్రిని, ర్భేదించి వెడలిన • పెద్దవేల్పు
మార్తాండుచే నభో • మణిచేత రవిచేఁ బ్రతిష్ఠఁ బొందిన మహా • దివ్యమూర్తి
సప్తర్షు లరుదేర • సప్తగోదావరం, బవగాహనము చేసి • నట్టిప్రోడ
తొలుమామయగుదక్షు • నెలదోఁటనడుచక్కి, విహరణంబొనరించు • వేడ్కకాఁడు

తే. విశ్వపతి భీమనాథేశ్వ • రేశ్వరుండు, కర్తయై యుండి భోగమో • క్షములనిచ్చు
భక్తజనులకు నట్టివై • భవపదంబు, మండనము మేదినికి భీమ • మండలంబు. 36

సీ. ఎచ్చోటఁ దాఁ బాతె • నిట్టిరూపముఁ దాల్చి, యతిసాధ్వసంబుతో • సధ్వరంబు
పాటిల్లె నెచ్చోట • భాషావధూటికి, నతిజుగుప్సితమైన • యంగవికృతి
యెచ్చోట ముచ్చిచ్చు • నేదేసినాల్కలు, కొండనాల్కలదాఁకఁ • గోఁతవడియె
నెచ్చోట నులివేఁడి • యెండఁ బండులురాలి, పూషారుకవదనంబు • బోసిపడియె

తే. దక్షుఁ డెచ్చోటఁబొట్టేలి•తల ధరించెఁ,జిందువందమ్యె నెచ్చోట • నిందుఁడసుచుఁ
జెప్పుదురు వీరభద్రుని • జృంభణంబు, భీమమండలి నుండు ప్రాఁ•బెద్దమునులు. 37

వ. నీవు విశ్వేశ్వరదేవవిరచితావమాన మన శ్శల్యంబున డస్సి ఖిన్నుండవై యున్న
వాడవు; నిన్ను విడిచి పోవుట నాకు నుచితంబు గాదు; నీవు నేనునుంగూడి ద్వాదశ
పుణ్యక్షేత్రయాత్రాప్రసంగమునఁ గుక్కుటేశ్వరదేవు దర్శింపగలవార మీవేళ

---

32. సీమాసంవిభాగము = హద్దులవిభాగము. 33. జంభరిపు దిక్కు = తూర్పు; త్ర్యంబకతనూజ = గౌతమి; ద్యుమ్నపతిదిక్కు = ఉత్తరము; వృద్ధగౌతమి = గోదావరీ పాయలలోని గౌతమిపాయకు వృద్ధగౌతమియను పేరు ప్రసిద్ధమైయున్నది. 34. తా॥ గంధర్వకిన్నర దేవతలు భోగమోక్షముల ననుభవించు కోరికతో మర్త్యులై భీమ మండలమున పుట్టగోరుదురు. 35. జాతర = యాత్ర; నముచివైరి = ఇంద్రుడు. 36. ఏడురసాతలక్రోడములు = సప్తఅధోలోకములు; వినిర్భేదించి = పగులగొట్టి; పెద్దవేల్పు = ఆదిదేవుడు; నభోమణి = సూర్యుడు; అరుదేరన్ = తేగా; అవగాహనము = స్నానము; ప్రోడ = గొప్పవాడు; తొలుమారు = మొదటిమారు; నడుచక్కి = నడిప్రదేశము; వైభవపదము = వైభవస్థానము; మండనము = అలంకారము.

దక్షారామంబునకు మగిడి పోదము రెమ్మని యతండును దానును లోపాముద్ర
యును శిష్యమండలంబును గదలి యుష్టాలాపంబులఁ బ్రొద్దుపుచ్చుచుండ నిచని. 38

సీ. తుల్యభాగాతటీ • ద్రుమమండలం బైన, సాంపరాయపురంబు • సరణిఁ బట్టి
చూతాటవీవాటి • శోభమానం బైన, పులుగుర్తిసోమేశు • పలపలించి
యోంకారపురిఁద్రికూ • టోపరిస్థితులైన, హరిహరబ్రహ్మల • నభినుతించి
శిలామహాగ్రామ • సింహాసనస్థున, నురగహారుని రెదు • రుండి మ్రొక్కి

తే. యరుగువారు మునుల్ పరా • శరసుతునకు
దక్షవాటిఁ బ్రవేశింపఁ • దగినయట్టి
శుభముహూర్తంబునకుఁ గాల • శుద్ధిదెలియఁ
దలఁచికూర్చుండిరొక వివి • క్తస్థలమున. 39

వ. అప్పుడు కాలశుద్ధి విమర్శించి మైత్రావరుణుండు పరాశరసుతున కిట్లనియె. 40

తే. గార్గ్యసిద్ధాంతమత ముషః • కాలకలన, శకున మూనుట యది బృహ • స్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ • విష్ణుమతము. సర్వసిద్ధాంత మభిజిత్తు • సమ్మత మగు. 41

తే. అసురపురములు సాధించె • నంధకారి, యమరపాథోధి మథియించి • రమరవరులు
దివ్యసింహాసనంబెక్కె • దివిజభర్త, సిద్ధమధ్యాహ్నవేళాభి • జిత్తునందు. 42

వ. ఇంక నొక్క విచారంబు. 43

తే. నాభిమండలమిచ్చోటు • నడుముగాన, భీమమండలికాపుణ్య • భూమినెల్ల
నిచ్చటనెయుండివీక్షింత•మేః మునీంద్ర. యాకసంబెక్కి యోగవి•ద్యాబలమున. 44

37. పాటెను=పడుగత్తెను; ఇట్టి=జింక; అధ్వరము=యజ్ఞము; భాషావధూటి=సరస్వతీదేవి; అంగవికృతి=అవయవ వికారముకల్గుట; ముచ్చిచ్చు=త్రేతాగ్ని, ఏడేసి నాల్కలు=అగ్ని కేడు నాల్కలుండును; నులివేడిబోసివడియె=సూర్యునికి పళ్లురాలి నోరు బోసినదైనదో; చింబువందు=అల్లరి; ప్రాఁబెద్దమునులు=ఎక్కువవయస్సున్న మునులు. 38. మనశ్శల్యంబు=మనస్సులోనిబాధ; మగిడి=మరలి. 39. సరణి=త్రోవ; చూత...మానంబు=మామిడితోటలతో శోభించునది; పలపలించి=కుడివైపునవుండునట్లుచేసి; ఉరగహారుడు=శివుడు; పరాశరసుతుడు=వ్యాసుడు; వివిక్తస్థలము=విజనప్రదేశము. 40. విమర్శించి=పరిశీలించి; మైత్రావరుణుడు=అగస్త్యుడు. 41. ఉషఃకాలము=సూర్యోదయమునకు ముందు రెండు ఘడియలకాలము; ఊనుట=పనిచేయుట; అభిజిత్తు = మధ్యాహ్నసమయమున రెం 2 ఘ. లు. 42. అసురపురములు=త్రిపురాసురులు; అంధకారి=శివుడు; పాథోధి=సముద్రము; దివిజభర్త=ఇంద్రుడు. 43. విచారము=ఆలోచన. 44. నాభిమండలము—మధ్యమండలము.

కం. భద్రగతి నేను లోపా, ముద్రయు నిర్నిద్రయోగ • ముద్రాశక్తిం
రుద్రవిహారాలయము స, ముద్రములోఁ గూడఁ జూతు • మోమునిపర్యా. 45

తే. ఇపుడు ఘటికాద్వయం బయ్యె • నినుఁడు పొడిచి, దవ్వుచాలదిచోటికి • దక్షవాటి
కేవలము మంచినడకైనఁ • గీసపెత్తి, రెండు జాములు నిట సూర • కుండనేల. 46

వ. ఈ యోంకారపురపుణ్యక్షేత్రంబునం ద్రికూటదివ్యభవనవాటంబున మునిసంఘం బుండునది; మనము నభోమండలంబున నెగసి ముహూర్తమాత్రంబునఁ గస్తురి పండువులుగా భీమమండలి పుణ్యక్షేత్రంబు గనుఁగొంచ మనుటయుఁ బారాశర్యుండు సబహుమానంబుగా సమ్మతించిన. 47

—♦ వ్యాసాదు లాకసంబుననుండి భీమమండలంబుఁ గనుఁగొనుట ♦—

మ. పరమర్షుల్ భృతరోమహర్షమున లో • పాముద్రయుం దారు సం
బరమధ్యంబున నావహం బను జగ • త్ప్రాణప్రవాహంబుపైఁ
బరిలంఘించిరి భుక్తిముక్తిరసదీ • ప్రత్యగ్రలీలాస్వయం
వరసౌధంబగు భీమమండలము స • ర్వంబున్ విలోకింపఁగన్. 48

వ. ఇవ్విధంబున నావహస్కంధగంధవాహప్రవాహమధ్యంబునఁ దపః ప్రభావావష్టంభంబున నిలిచి కుంభసంభవుండు బాదరాయణున కిట్లనియె. 49

సీ. అంధ్రభూభువనమ • ధ్యము పుండరీకంబు, సప్తగోదావర • జలము తేనె
బ్రహ్మసంవేద్యాది • బహుతీర్థములు రేకు • లకరులు చారుది • వ్యస్థలములు
నాళంబు లవణాబ్ధి • వేలావిభాగంబు, కల్యాణభోగమో • క్షములు తావి
దక్షవాటీమహా • స్థానంబు కర్ణిక, హంసంబు భీమనా • యకుఁడు శివుఁడు

తే. గౌతమీసింధుకౌంతేయ • కణ్వనదులు, తుల్యభాగయు నేలేఱు • తుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీ • పుణ్యభూమి, యనఘ సంసారతాపశాం • త్యౌషధంబు. 50

45. భద్రగతిన్ = బాగుగా; నిర్నిద్ర...శక్తిన్ = గొప్పదైన యోగశక్తివలన; రుద్రవిహారాలయము = భీమమండలము. 46. ఘటికాద్వయము = రెండు ఘడియలు (48 ని.) ఇనుడుపొడిచి = ప్రొద్దుపొడిచి; దవ్వు = దూరము; కీసవెత్తి = కొద్దితక్కువ. 47. ఎగసి = ఎగిరి. 48. తారు = తాము; జగత్ప్రాణప్రవాహము = గాలి. తా॥ లోపాముద్రతోసహా ఋషు లాకాశమున కెగిరి, అక్కడ వీచెడి ఆవహమను గాలిలోనికి భీమమండలమును చూచుటకై ప్రవేశించిరి. 49. గంధవాహ = గాలి; తపః...అవష్టంభంబునన్ = తపశ్శక్తివలన వాయు స్తంభనచేసి. 50. అకరులు = కింజల్కములు; కర్ణిక = తామరపూవుమధ్యమునుండు గిమ్మ; తుమ్మికొనలు = తుమ్మిపువ్వులవంటివి. తా॥ అంధ్రభూమికి మధ్యదేశమే తెల్లతామరపువ్వు. అందు గోదావరీ జలము తేనె. తీర్థములు రేకులు, దివ్యస్థలములు కింజల్కములు, సముద్రపుటొడ్డు నాళము. కల్యాణ భోగమోక్షములే పరిమళము, దక్షవాటిక కర్ణిక; భీమేశుడు = హంస, తక్కిన నదులు తుమ్మిపూలవంటివి. ఈ పుణ్యభూమి సంసారమువలని తాపశాంతికౌషధమువంటిది.

సీ. సర్వంసహకుఁ గాసె • సమకట్టుపుట్టంబు, గగనంబునకు నెల్లఁ • గలువసెజ్జ
యవటంబు మేఘవా • హనుగంధకరటికి, నభ్యవహార మౌ • ర్వాగ్నిశిఖకు
వంటిల్లు యామినీ • శ్వరకళామౌళికిఁ, దరిచోటు నిఖిలబ్రం • దారకులకుఁ
గూటకచ్ఛపనాయ • కునకు నిశాంతంబు. మరుజనకునికిని • మనికిపట్టు

తే. ఘనతరోద్దండపాఠీన • కమఠనక్ర, తిమితిమింగిలచక్రవి • క్రమహార
ఘుమఘుమారంభ గంభీర • ఘోషఘటిత, తటదిశాప్రతిశబ్దోప • లబ్ధియబ్ధి, 51

సీ. జనమేజయారబ్ధ • సర్పాధ్వరాహూత, చక్షుశ్శ్రవస్సహ • స్రములఁ బోలి
బ్రహ్మాండమండల • ప్రాసాదసంభార, హరిమణిస్తంభసం • హతులనంగ
జంభారిదోస్స్తంభ దంభోళిఖండితాం, బస్శైలశిఖరపుం • జములఁ బెనఁగి
సంహారసమయఝం • ఝామారుతోద్ధూత,కాలాంబువాహసం • ఘములఁగెలిచి

తే. యాడుచున్నవి తీండ్రిల్లి • యంబరమునఁ, జేయుచున్నవి త్రిభువనా • శ్లేషకంబు
నబ్జనాభుని తూఁగుటు • య్యాలలుగంటె, వేనవేలు పయోరాశి • వీచిఘటలు, 52

శా. 'కాశిం జచ్చిన యంతఁ గాని సడయం • గారాని కైవల్యమ
శ్లేశం బౌనటు వేద్యనాయకునిచే • లీలాగతిం జేరు రా
రో శీఘ్రంబున మర్త్యులార' యను నా • రూపంబునన్ ప్రోయు నా
కాశాస్ఫాలనగౌరమీ జలధిసం • గస్థానకల్లోలముల్. 53

మ. అదె సంపేచ్చపు; కోటిపల్లి యదె; ద • క్షారామమన్ పట్టణం
బదె; యభ్రంకషసౌధకూటఘనహే • లావాస ముత్ప్రాయసం

---

51. సర్వంసహ = భూమి; కౌసె = నడుముకు చుట్టుకొనుబట్ట; సెజ్జ = శయ్య; అవటంబు = చెలమ; మేఘ...కరటి = ఇంద్రుడను సేనుగు; ఔర్వాగ్నిశిఖ = బడబాగ్ని; అభ్యవహారము = ఆహారము; యామినీ...మౌళి = శివుడు; కూట...నాయకుడు = ఆదికూర్మము; నిశాంతము = ఇల్లు; మరుజనకునికి = విష్ణునకు; మనికిపట్టు = నివాసము; ఘనతర...ఉపలబ్ధి = పెద్దవైనచేపలు, తాబేళ్లు, మొసళ్లు, తిమింగిలములు నెగురగానగు ఘుమఘుమయను చప్పుళ్లచే ప్రతిధ్వనించు దిక్కులు కలది; అబ్ధి = సంద్రము. 52. చక్షుశ్శ్రవస్సహస్రములు = పాముల మందలు; హరిమణి = ఇంద్రనీలమణి; దంభోళి = వజ్రము; తీండ్రిల్లి = బలిసి; త్రిభువనాశ్లేషకము = ముల్లోకముల నంటునవి; కంటె = చూచితివే; పయో...ఘటలు = సంద్రములోని కెరటముల సంతతులు. తా॥ సముద్రములోని కెరటములు జనమేజయుడు చేయు సర్పయాగమున కాహూతములైన పాములవలెను, బ్రహ్మాండమను ప్రాసాదముయొక్క ఇంద్రనీల స్తంభములవలెను, ఇంద్రుడు వజ్రముతో నరికిన కాటుకపర్వతపు శిఖరములవలెను, ప్రళయకాలమున లేచు కాలమేఘములవలెను, ముల్లోకముల ముట్టుచు నాకాశమున ఆడుచున్నవి. అవిగో విష్ణుమూర్తి ఉయ్యేలలు; చూచితివా?

పద సొంపారెడు భీమలింగము మహా • ప్రాసాదభూమీధరం
బిదె; సప్తర్షినదీప్రవాహ మిదె; సం • వీక్షింపు మేకాగ్రతన్. 54

సీ. అదె పట్టిసస్థాన • మందుండు వీరభద్రేశ్వరస్వామి య • ర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి • యచట మార్కండేయు,నిలువేల్పు ముక్కంటి• వెలసెఁదొల్లి
యదె కుమారారామ • మాహర్మ్యరేఖయ, చాళుక్యభీమేశు • సదనవాటి
యదె కుక్కుటేశ్వరం • బయ్యుపాంతము మేడ, హుంకారిణీదేవి • యోలగంబు

తే. వాఁడె మాయింటివేల్పు ప • ల్వాలపురమున
నుండులింగంబు ఫణిరాజ • కుండలుండు
సప్తమునిసింధుసంగమే • శ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మదె మౌని • కులవరేణ్య. 55

కం. అని చూపి చెప్పి కుంభజుఁ, డనుఁ గనుఁగొని శుభముహూర్త • మిదె యేతెంచెన్
మనము దిగవలయు ననుచును, మునిమండలి మ్రోల దిగిరి • ముగురుం దడకున్. 56

వ. అనంతరంబ కుంభపులినసంభవులు సంబవులు దొడిగికొని, కదలి, కదళికారామం బుల రామణీయకంబును, సుల్లసిత బిల్వచిరిబిల్వవిటపంబుల పొల్పును, ద్రాక్షా రుద్రాక్షఖర్జూరకేసరసరళపున్నాగనారంగంబులరంగంబును, లవంగలుంగలవలీమ ల్లీవల్లీమతల్లి వేల్లనంబుల యుల్లాసంబును, ఘోంటాకురంటక ఝుంటికాకంటక ఫలకపిత్థ లోధ్ర జంబూజంబీరపారిభద్రభద్రదారుశాల్మలీగుల్మ లీలాహేవాకంబు సుద్రేకంబును, గోమలతరతమాలమాలాకారశాకోట విటపిషండంబుల మెండును, జెఱకుమడుకంబును, బ్రాసంగుమిసిమియుఁ, జెంగల్వతావిఠేవయుఁ గుసుమవాటి యొసకంబును, నుభయపార్శ్వంబులం గల ఘంటామార్గంబుననా నెడనెడంగుసుమ ధారారంభ సంభారకుసుమగుచ్ఛచ్ఛాయావిభాసిత సంధ్యారాగ సరభసంబును, గంది యుందంబును, పెసరసిరియును, మినుమునలువును, గోధూమ శ్యామాక వరగ యును, మాషలోరసమున్మేషంబును, నేసియేపును, ననంబినన కేతనంబును; నువ్వు మవ్వంబును, గుళుత్థశుద్ధార్థమానవృద్ధియుఁ, బ్రత్తిసంపత్తియు, బొబ్బర యుబ్బ

53. ఆకాశాస్ఫాలన = ఆకాశమునంటు; గౌతమీసంగ = గౌతమీసాగర సంగమ ప్రదేశము. తా; 'కాశిలో చచ్చినగాని దొరకని ముక్తి ఇచ్చుట తేలికగా దొరకును. వేగ గండోయి! మనుజులారా!' అన్నట్లు గౌతమీసాగర సంగమ ప్రదేశమందలి కెరటము లాకాశమునంటుచు ధ్వనించుచున్నవి. 54. సంవేద్యము, కోటిపల్లి = క్షేత్రములు; అభ్రంకష...వాసము = ఆకాశమునంటు మేడల పైనుండుటను; ఉద్గ్రాచ్ఛాయసంపదన్ = ఎత్తులో; భూమిధరము = కొండ. 55. పుండరీకాద్రి = రాజ మండ్రివద్దనున్న కొండ; సదనవాటి = దేవళము; ఉపాంతము మేడ = దగ్గరలోని మేడ; పల్వాలపురము = పలివెలయను గ్రామము; కుండలాముఖము = క్షేత్రము. 56. ముని మండలి = మునిమండలము; మ్రోలన్ = ఎదుట; ముగురున్ = ముగ్గురును.

రంబును. నందసందర్భంబును. యవయావనాళప్రియంగుగుళుజతిలపరిస్ఫూర్తియు, దవ్వింఁదలసందడియు, గంటెకొఱ్ఱతఅచును, గసగసలివయును, జెంగలించు జాంగలి క్షేత్రంబునన్క్షేత్రంబులకు నింపునొంపు సంపాదింప ననంతాంతరాంతంబులు. తరతరంబు తరళతర తరంగరింఛోళికాంచలంబులం జెంగులందువాళించుచు నతిశిశిర సలిలశీకరవికర నిరతకరణపరిణతింగోల్పిపోఁక మోఁకల పూవుఁబాలల నెత్తావికిం దావలంబులై కేవలంబు పొలయు సప్తగోదావర సమీరణంబులు నాసికా పుట కుటీరంబులకుఁ గుటుంబకంబుగా మందమందగమనంబున నహిమకరబింబం బంబరవీథీ సౌధకూటంబున హాటకకలశభంగినంగీకరించుకొలఁది నభిజిద్వేళవేలావ నోపకంఠకంఠాల కారహారధామంబైన దక్షారామంబుఁ బ్రవేశించి రంత. 57

—♦ వ్యాసాగులు దక్షారామంబుఁ బ్రవేశించుట ♦—

కం. ఇటు కృష్ణద్వైపాయన, ఘటజన్ములు భీమనాయ • క స్వామిమహా
కటకము ముక్తివధూటీ, కటకాభరణంబుఁ జొచ్చి • కడు వేడుకతోన్. 58

తే. కర్ణికారాంబికామహా • కాశిగుడికి, నందముగ నూలుపట్టిన • యట్టిచాయ
సూర్యవీథికిఁ జనిరిసం • శుద్ధమతులఁ, బశ్చిమద్వారమునకునై • పరమమునులు. 59

వ. అప్పుడు ఘటోద్భవుం డమ్మహాస్థానంబు సత్యవతీసూనునకుఁ జూపి వెండియు నిట్లనియె. 60

సీ. లీలావిలాసలా • లితలోకహర్షంబు, గోమేధికాక్లప్త • గోపురంబు
గోపురస్థితశాత • కుంభకుంభశతంబు, దివ్యరత్ననిబద్ధ • దేవగృహము
దేవగేహాకీర్ణ • దివిజాప్సరశ్శ్రేణి, యఖిలవస్తుప్రపూ • ర్ణాపణంబు
వివిధాపణస్వర్ణ • వేదికాధ్యాసిత, యక్షగంధర్వవి • ద్యాధరంబు

---

57. సంబవులు=పావుకోళ్లు; కదళికారామములు=అరటితోటలు; కేసర=పొన్న; సరళ=తెల్లతెగడ; పున్నాగ=సురపొన్న; నారంగ=నారింజ; లుంగ=మాదీఫలము; ఘోంటా = పోకచెట్టు; కురంటక = గోరింట; కంటకఫల=పనస; కపిత్థ = వెలగ; లోధ్ర=లొద్దుగ; జంబీర = నిమ్మ; పారిభద్ర=దేవదారు; చెఱకుముఱుకము=చెఱకు ఎక్కువగా నుండుట; ప్రాసంగు=వరి; శ్యామాక=చామలు; మాషతోర=మినుపచేలు; అనంతి=ఉసరిక; కుళుత్థ=ఉలవ; బొబ్బర=అలసందె; తవ్వింఁదల=రాగులయొక్క; అహిమకరబింబము=సూర్యబింబము; హాటకకలశభంగిన్=పసిడికుండవలె; అభిజిద్వేళన్ = మధ్యాహ్నమున. 58. కటకము=దుర్గము; ముక్తివధూటీ=ముక్తికాంత. 59. సూర్యవీధి=ఒకవీధి, అట్టిచాయన్=వలె.

తే. శంఖభేరీమృదంగని • స్సాణపటహ, ఝల్లరీవేణువీణాది • శబ్దనివహ
కలకలోద్వేజితాశేష•కల్మషంబు, నయనభాగ్యంబు దక్షిణా•నందవనము. 61

సీ. ఘల్లుఘల్లనిరత్న • కంకణంబులు మ్రోయ, గంధవాహునియాలు కసవునూడ్చు
లక్ష్మి కెంగేలిలీ • లారవిందమ్మునఁ, గలయంపి చిలికించుఁ గమ్మఁ జేసెఁ
దామ్రపర్ణియుఁ దాను • తాంకాపథగంగ, వలిముత్యముల రంగ • వల్లిఁదీర్చు
నధివాసమును జేయు • యముని శుద్ధాంతంబు, ధూపార్తిమహిసాక్షి • ధూమఘటిక
తే. సప్తపాతాళనాగేంద్ర • చంద్రముఖులు, ఫణమణిజ్యోత్స్న దివియగం•బము లగుదురు
సోమమకుటుని గారాబు • జోటిమైన, దక్షవాటికిఁ బ్రతిమహో • త్సవముసందు 62

మ. ధనకోటీవినిబద్ధ కేతనశత • ద్రాఘిష్ఠ వైశ్యాలయం
బనువేలధ్వనితార్థదానవిధిఘం • టారావవేశ్యాగృహం
బనిమేషాక్షినిరీక్షితేశ్వరమహా • ద్యక్షోణి బృందారకం
బనుసంధ్యాగతలోకపాలకము ద • క్షారామ మధ్యున్నతిన్. 63

61. క్లృప్త=రచింపబడిన; గోపుర...శతంబు=గోపురమందున్న పసిడికుండలు కలది; దేవగృహము=దేవాలయము; దేవ...శ్రేణి = దేవాలయమందున్న దేవతలు, అప్సరసలు కలది; అఖిల...ఆపణంబు=వస్తువులతో నిండిన బజారుకలది; స్వర్ణ వేదికా ధ్యాసిత=బంగారు వేదికల పైకూర్చున్న; శంఖ...వీణా=వాద్యవిశేషములు; శబ్ద... కల్మషంబు=వాద్యధ్వనిచే పోగొట్టబడిన పాపముకలది; దక్షిణానందవనము= దక్షిణకాశీవంటి దక్షవాటి. 62. గంధవాహునియాలు = వాయుదేవుని భార్య; కలయంపి=శుద్ధనీరు; కమ్మఁజేసె=పూచెసె; వలిముత్యములన్=అతిముత్యములతో; రంగవల్లి=ముగ్గులు; సప్త...ముఖులు=పాతాళవాసులందలి నాగేంద్రుల భార్యలు; ఫణ...జ్యోత్స్నన్=పడగలమీది మాణిక్యకాంతులతో; దివియగంబములు=దీప స్తంభములు; సోమ...జోటి=శివునికిల్లాలు. తా॥ దక్షారామమున ప్రతి మహోత్సవమునను దేవతల భార్యలు వచ్చి యూడిగములు చేయుదురు. వాయుభార్య కసవూడ్చును; లక్ష్మి కమ్మదేసె చల్లును; తామ్రపర్ణి, గంగ వచ్చి ముగ్గులు పెట్టును. యమునిభార్య ధూపము వేయును; నాగవనితలు పడగలమీది మణులు వెలుగుచుండ దీపస్తంభములవలె నుందురు. 63. ధన ..ఆలయంబు=ధనకోటులచే కట్టింపబడిన కొండాలచే పొడువైన బజారు కలది; అనువేల...గృహంబు=ఎప్పుడును చప్పుడగు చున్నదానవేళను తెల్పు గంట చప్పుడుకల వేశ్యాగృహములుకలది; అనిమేష... బృందారకంబు=కనురెప్ప వేయక చూడబడు నీశ్వరుడుకల బ్రాహ్మణులు కలది; అను...పాలకము=ప్రతి సంధ్యవేళల వచ్చు లోకపాలకులు కలది. తా॥ దక్షారామమున పెద్ద అంగడి యున్నది. వేశ్యలయిండ్లలో సైతము దానమిచ్చువేళ మ్రోయించు గంట లెప్పుడును మ్రోగుచునే యుండును. బ్రాహ్మణు లెప్పుడును నీశ్వర దర్శనము చేయుచునేయుందురు. లోకపాలకులు ప్రతి సంధ్యవేళను వచ్చుచుందురు.

తే. మొగులుముట్టిన సురసద్మ • మూర్ధవీథిఁ; గోటిపడగలఁ బొలుపారుఁ • గూటకోటి
పట్టణమ్ము నిజాంగుళీ • పల్లవముల, నెట్టుకొని పాపములఁ బాయఁ • దట్టుకరణి. 64

సీ. ఎచ్చోటక్షేత్రంబు • లేఁకారుజనుల కీ,చ్ఛామాత్రభోగమో • క్షప్రదములు
కీర్తింతురెద్దాని • కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్ష • గానసరణి
జంకించు నెద్దాని • శబలసౌధోపరి, ధ్వజపటంబులు దేవతాగృహముల
వసియింతు రెద్దాన • వాలఖిల్యాములు. తపసులష్టాశీతి • దశశతములు

తే. నెద్ది యమరేంద్రుపురలక్ష్మి • కింతపెద్ద, యట్టిశ్రీదక్షవాటీమ • హాపురంబు
నద్భుతంబందిచూచిరి • యాదిమునులు,సత్యవతినందనుఁడు గుంభ•సంభవుండు. 65

సీ. దక్షాధ్వరానల • త్రయతీర్థమొక్కటి, యోగాగ్నినొందెని • సురిసెగౌరి
యభిలేష్ట సంసిద్ధి యందు చెండవతీర్థ, మొందేని సుమగాంచె • నిష్టసిద్ధి
సోమేశ్వరం బంద్రు • సొరిది మూఁడవతీర్థ, మొందేని సఘము లి • ట్టింపలింప
హైమవతం బందు • రదినాలుగవతీర్థ, మొందేని హిమవంతుఁ • డొందెవరము

తే. సప్తగోదావరంబు పంచమసుతీర్థ, మఖిల శుభములు నొందేని • నావహిల్లఁ
బంచతీర్థంబులివియాడి • పంచజనుఁడు,పాయుఁబంచేంద్రియోద్భవ • పాతకములు. 66

గీ. శిష్టమునిలోక విబుధాభి • సేవ్యమైన, యిమ్మహాతీర్థము శక్తి • నేమి చెప్ప
వానిపైఁబాటివెదలెడు • వాయువేనిఁ, జీమకైనను గైవల్య • సీమనొసఁగు. 67

వ. అని దక్షారామ మాహాత్మ్యంబు వర్ణించుచుఁ బ్రదక్షిణక్రమంబున భీమేశ్వరు దివ్య
మందిరంబు వలసలించి సప్తగోదావరంబునకు డిగ్గి కృతస్నానులై రప్పుడు సాత్య
వతేయుండు కుంభసంభవునకిట్లనియె. 68

---

64. మొగులు ముట్టిన=మేఘములంకల; సుర...వీథి=స్వర్గవీధిని; కోటిపడగ
లన్=కోటి జెండాలతో; కూటకోటి=మేడల యంచులతో; నిజ...పల్లవములన్=
తనవ్రేళ్లతో; పాయఁదట్టుకరణిన్=వెడలద్రోచునట్లు. తా॥ ఆకాశమునంటు మేడ
లతో నాపట్టణము తన వ్రేళ్లతో పాపమును వెడలద్రోచుచున్నట్లున్నది. 65.
ఏఁకారు=బాధపడు; గాంధర్వమునన్=సంగీతముతో; శబల...పటంబులు=
చిత్రవర్ణములైన జెండాలు; దేవతాగృహములన్=స్వర్గమందలి దేవతల యిండ్లను;
తపసులు=మునులు; అష్టాశీతిదశశతములు=88 వేలు. 66. ఉరిసెన్=విడిచెను.
సొరిది=వరుస; అఘములు=పాపములు; పంచజనుడు=మనుజుడు. తా॥ అచ్చట
పంచతీర్థములు కలవు. 1. గౌరి యోగాగ్నిని విడిచిన ముక్తతీర్థము, 2. పార్వతిఇష్టార్థ
సిద్ధిపొందిన సిద్ధతీర్థము; 3. పాపములుపోవు సోమేశ్వర తీర్థము; 4. హిమవంతుడు
వరములందిన హైమవతము; 5. శుభములుచేకూర్చు సప్తగోదావరము. వీటి నైదిం
టిలో స్నానముచేసిన మనుజుని పంచేంద్రియ కృతపాతకములును పోవును. 67.శిష్ట...
సేవ్యము=శిష్టులగు మునులు, దేవతలచే సేవింపబడునది; కైవల్యసీమ=ఉన్నత
మోక్షము. 68. వలసలించి=కుడివైపుననుండునట్లుచేసి.

తే. ద్వాదశక్షేత్రశివలింగ • దర్శనంబు, మొదలఁ జేయంగవలయుట • ముఖ్యపక్ష
మానతీఁదగు నాకు నీ • వానుపూర్వి శంభులింగంబు లవియెవ్వి • కుంభజన్మ. 69

కం. ఇటమున్న దక్షవాటీ, కటకంబునయందుఁ బెద్ద • కాలంబువసిం
చుటఁ దీర్థంబులు నీకున్, ఘటసంభవ యాడినవియె • కావె తలంపన్. 70

వ. అనిన విని యగస్త్యుండు సాత్యవతేయున కిట్లనియె. 71

తే. పూర్వజన్మకృతంబైన • పుణ్యరాశి, పాకదశఁ బొందు నెప్పుడ,ప్పాటఁగాని
సకలసంసారదురితని • స్తారమైన, శివకథాగోష్ఠి చెవులకుఁ • జెలువుగాదు. 72

వ. అని పలికి సత్యవతీసూనునకుఁ గుమారవక్త్రింబునఁ దాను విన్నప్రకారంబున
మైత్రావరుణుండు ద్వాదశతీర్థమాహాత్మ్యంబు నిట్లని చెప్పందొడంగె. 73

సీ. ఇంద్రేశతీర్థంబు • ఋషిసమాకీర్ణంబు, సిద్ధేశ్వరము సర్వ • సిద్ధికరము
యోగీశతీర్థంబు • యోగలక్ష్మీదాయి, కాలేశ్వరము భక్త • కల్పతరువు
శమనేశతీర్థంబు • శాంతిదాంతివిధాయి, వీరభద్రేశంబు • విశ్వనుతము
బ్రహ్మేశతీర్థంబు • బ్రహ్మర్షి సేవ్యము, మైశ్వర్యదము కపా • లేశ్వరంబు

తే. కుక్కుటేశంబు కాశికిఁ • గొంతవెలితి, సోమనాథేశ్వరము ముక్తి • సూచకంబు
శ్రీ మహేశ్వరుతీర్థంబు•శివునిమెచ్చు, త్రిభువనాభ్యర్చితము రామ•తీర్థమనఘ. 74

కం. గూఢములు నిగూఢంబులు, గూఢాగూఢములు నగుచుఁ • గోటుల సంఖ్యల్
గాఢమహేశ్వరభక్తిని, రూఢిం దీర్థములు గలవు • రుద్రునివాటిన్. 75

తే. గరుడగంధర్వయక్షకి • న్నరులచేత, దివిజఖేచరదైత్యదా • నవులచేత
ద్వాదశక్షేత్ర తీర్థమ • ధ్యంబునందు, భక్తి శివలింగకోటి ని • ల్పంగఁబడియె. 76

కం. ద్వాదశతీర్థకపరివే, షోదరమున భీమనాథుఁ • డుజ్జ్వల తేజః
ప్రాదుర్భావుం దొప్పగు, నాదిత్యుఁడు పరిధినడుమ • నమరెడుభంగిన్. 77

తే. ద్వాదశక్షేత్రవికచప • త్రములలోఁతి, దక్షవాటిక యనెడి కెం • దమ్మివిరికి
సప్తగోదావరంబు ని • ర్ఝరము తేనె, నడుమ రాయంచ శ్రీభీమ • నాయకుండు. 78

69. ఆనతీఈఁదగున్ = ఆజ్ఞయియ్యదగును; ఆనుపూర్విన్ = క్రమముగా. 70. దక్షవాటీకటకంబున = దక్షారామమున. 72. పాకదశన్ = పరిణామమున; అప్పాటఁగాని = అప్పుడుగాని; దురితనిస్తారకము = పాపములు పోగొట్టునది; చెలువు = హితవు. 73. కుమారవక్త్రింబునన్ = కుమారస్వామివలన. 74. శమనేశ = యముడు ప్రతిష్ఠించినయీశుడు; కొంతవెలితి = కొంచెముతక్కువ; మెచ్చు = హితమైనది. 77. ద్వాదశ...ఉదరమునన్ = పండ్రెండు తీర్థములమధ్యమున; పరిధి = ఆకాశమున సూర్యునిచుట్టున కట్టెడు గుడి. 78. వికచపత్రములు = వికసించిన రేకులు; కెందమ్మివిరి = ఎఱ్ఱతామరపువ్వు; నిర్ఝరము = ప్రవాహము; రాయంచ = రాజహంస.

తే. భైమమహేశానలింగం బ • పారతేజ, మక్షయం బప్రధృష్యం బ • నాదినిధన
మమ్మహాజ్యోతి రత్నదీ • పాంకురంబు, కనకగర్భాండభవన వి • ష్కంభమునకు. 79

చం. అమృతపయోనిధానమున • యం దుదయించెఁ గళాసమృద్ధిఁ ద
న్నమరఁ సుధాకరుండు నిజ • మారఁగఁ జూచిన దక్షవాటికా
రమణుఁడు భీమనాథుఁడు • రాజశిఖాభరణుండు గానినాఁ
డమరమునీంద్రసంఘము క • రాంబుజముల్ మొగుడంగ నేర్చునే. 80

తే. విమలపాథోధిఁ బుట్టిన • యమృతమూర్తి, భీమనాథుఁ డుమా స్వామి • కేమిచోద్య
మహరహంబును పాదసే • వానురక్త, భక్తజనలోకభవరోగ • భంజనంబు. 81

తే. భీమనాథునిఁ ద్రిభువన • స్వామినాథుఁ, బార్వతీనాథు శశ్వత్కృ • పాసనాథు
దక్షవాటాధినాథు వే • దత్రయైక, నాథునానాథుఁ గొలుతు శ్రీ • నాథునాథు. 82

సీ. భవు భవానీభర్త • భావసంభవవైరి, భవరోగభంజను • ఫాలనయను
భోగప్రదుని భోగి • భోగిరాజవిభూషు, భూనభోభివ్యాప్తు • భువనవంద్యు
భగవంతు భర్గుని • భసితాంగరాగుని, భానుకోటిప్రభా • భాసమాను
భాగీరథీమౌళి • భగదృగ్విపాటను, భూరథాంగుని భద్ర • భూతిధరుని

తే. భామినీసువిలాసార్ధ • వామభాగు, భక్తితోడ భజింపరో • భవ్యమతులు
భావనాభాజుల కతండు • ఫలములొసఁగు, భాగ్యసౌభాగ్యవైభవ • ప్రాభవములు. 83

కం. తేజితవిష్ణుశిలీముఖుఁ, దేజఃప్రదు దక్షవాటి • తీర్థైకమహా
రాజాధిరాజరాజును, రాజకళాధరు భజింప • రారో విబుధుల్. 84

---

79. భైమము=భీమసంబంధమైన; అప్రధృష్యము=అదలించరానిది; కనక... విష్కంభమునకు=బ్రహ్మాండమను నింటికి; రత్నదీపాంకురంబు=రత్నదీపమువంటిది. 80. అమృత...యందు=అమృతసముద్రమున; కళాసమృద్ధిన్=కళలసంపదతో; తన్నమరన్=పెంపుగా; సుధాకరుండు=చంద్రుడు; రాజశిఖాభరణుండు=చంద్రుడు శిరోభూషణముగాకలవాడు; కరాంబుజముల్=చేతులను పద్మములు; మొగుడంగ నేర్చునే=ముడుచుకొనునా? (జోడింతురా) తా॥ భీమేశ్వరుడు సంద్రమున పుట్టిన రాజశ్రేష్ఠుడు కనుకనే మునుల చేతులనెడి పద్మములు ముడుచుకొనుచున్నవి. మునులు నమస్కరించుచుండిరి. 81. అహరహంబును=ప్రతిదినము; పాద...భంజనంబు=పాదసేవచేయు భక్తుల సంసారరోగమును పోగొట్టువాడు. 82. శశ్వత్కృపాసనాథుడు=ఎక్కువదయకలవాడు. శ్రీనాథునాథున్=విష్ణువునకు ప్రభువు; శ్రీనాథుడను కవికి ప్రభువు. 83. భావసంభవవైరి=మదనువైరి; భోగి=భోగముకలవాడు; భోగిరాజవిభూషుడు=సర్పాలంకారుడు; భూనభోభివ్యాప్తుడు=భూమ్యాకాశముల వ్యాపించినవాడు; భసితాంగరాగుడు=విభూతియే అంగరాగముగాకలవాడు; భగదృగ్విపాటనుడు=భగునిదృష్టిని పోగొట్టినవాడు; భామినీ...భాగుడు=భార్యచే శోభించు ఎడమభాగముకలవాడు; భావనాభాజులకున్=భావించువారికి.

కం. రారో ప్రియశుద్ధాంతవ, రారో హంసహాలు విబుధు • లంబుజహంస
క్షీరామలదేహుని ద, క్షారామపురీనివాసు • నభవునిఁ గొలువన్. 85

ఉ. నందివినాయకాదిగణ • నాథులు గూడి ధృతా ప్రశస్త్రులై
యెందఱు పాలెముందురు మ • హీధరకన్యక సావధానులై
నందివినాయకాది గణ • నాథులు గూడి ధృతాప్రశస్త్రులై
యందఱు పాలెముందురు మ • హాప్రభుపీటికి దక్షవాటికిన్. 86

సీ. భానుమండలములు • పండ్రెండునుదయించి, కరసాళిఁ బిట్టెండ • గాయకుండ
సంరంభముననేడు • ఝుంఝూనిలంబులు, వెగ్గలంబగు మ్రోఁత • విసరకుండఁ
బుష్కలావర్తకం • బులుకోనుగాఁగల, క్రొమ్మేఘములు వృష్టి • గురియకుండఁ
బరపి లంఘించి స • ప్తమహార్ణవంబులు, విన్నంది పెనువెల్లి • విరియకుండ
తే. నాజ్ఞవెట్టించుఁ బ్రమథనా • యకులచేత, విశ్వపతియైన భీమేశ్వ • రేశ్వరుండు
దక్షవాటికి నాత్మశు • ద్ధాంతమునకు, నవహితస్వాంతుఁ డగుచుఁ గా • లాంతవేళ. 87

తే. భైరవుం డర్ధరాత్రంబు • ప్రహరిఁ దిరుగుఁ
బాయకుండును నెదురేయి • ప్రమథగణము
గవనికాపులవారది • క్షాలవరులు
దక్షవాటికి భీమేశు • ధామమునకు. 88

వ. అని ప్రసంగించి శివలింగార్చనాపరాయణుండైన మైత్రావరుణుండు త్రిలింగవిషయ మంగళాలంకారంబగు భీమేశ్వరమండలంబునఁ బండ్రెండుశివలింగస్థానంబులు వివరించువాఁడై యిట్లనియె. 89

తే. ఉత్సవం బుత్సవము దప్ప • కుండసురలు, పత్తు రౌత్సుక్యమున దక్ష • వాటమునకు
శాంభవీభక్తి మూర్త్యపే • క్షంబు దాల్చి, భీమలింగంబుఁ ద్రిభువన • స్వామిఁ గొలువ. 90

---

84. తేజిత...ముఖున్ = విష్ణువు బాణముకలవాని, రాజకళాధరున్ = చంద్రకళాధరుని. 85. విబుధులు = దేవతలు; అంబుజ...దేహుని = పద్మము, హంస, పాలు వలె తెల్లని దేహముకలవాని. 86. పాలెముందురు = కావలియుందురు; సావధానులై = శ్రద్ధతో. 87. కరసాళిన్ = కిరణ సముదాయముతో; బిట్టెండ = గట్టియెండ; వెగ్గలంబగు = ఎక్కువైన; పుష్కలావర్తకములు = ప్రళయకాల మేఘములు; విన్నంది = ఆకాశమంటి; పెనువెల్లి = పెద్దప్రవాహము; ఆత్మశుద్ధాంతము = తనభార్య; అవహితస్వాంతుడు = శ్రద్ధకలవాడు; కాలాంతవేళన్ = ప్రళయకాలమున. తా॥ ప్రళయకాలమునసైతము దక్షవాటికకేబాధయు రాకుండ భీమనాయకుడు చూచును. 88. పాయకుండును = పాయకుండును; గవని కాపులవారు = ద్వారపాలకులు; ధామము = నివాసము. 89. త్రిలింగవిషయ = తెలుఁగుదేశమునకు. 90. శాంభవీశక్తి = శివునిశక్తి.

కం. తాండవమాడుఁ గుమారశిఖండి మహోత్సవము వేళ • గంభీరములై
డిండిమనిర్ఘోషంబులు, పండువుపండువున నుఱుము • భంగి వహింపన్. 91

తే. మర్త్యభామలు విబుధ • భామలును గలసి
యుత్సవములందు నర్తించు • చున్న నపుడు
దక్షవాటంబు వీట భే • దంబు దెలియు
దృఙ్నిమేషానిమేషప్ర • దీప్తివలన. 92

శా. అర్కేందూపలరత్ననిర్మితమహా • హర్మ్యాగ్రభాగంబులం
దార్కొన్ తారక మండలంబుగని ము • గ్ధస్త్రీలు రేలప్పురిం
గర్కంధూఫలసన్నిభంబయిన ము • క్తాజాలమన్ చింతచేఁ
దర్కింపం దిలకించి నవ్వుదురు గం • ధర్వాంగనాపల్లవుల్. 93

తే. దక్షమునిరాజు నంతరు • ద్యానవనము, దక్షవాటంబు శివుని యు • త్తమపురంబు
బహుళకైవల్యఫలధర్మ • పాదపంబు, దీనిఁ గాచుక చుట్టును • దిరిగి సురలు. 94

తే. గౌరి యొక్కతె యాకాశ • గంగయొకతె
కాశి యొక్కతె దక్షిణ • కాశి యొకతె
నలుగురును శంభునకు లోక • నాయకునకు
రాణివాసంబు లనురాగ • రసముపేర్మి. 95

---

91. కుమారశిఖండి = కుమారస్వామియొక్క నెమలి; నిర్ఘోషంబులు = ధ్వనులు; ఉఱుముభంగి = ఉరుముదీతిని. తా॥ ఉత్సవవేళలలో డిండిమములు మోతలు విని ఉరుములనుకొని కుమారస్వామి నెమలి నాట్యమాడును. 92. వీటన్ = పట్టణమందు; దృక్...ప్రదీప్తి = కనురెప్పపాటు వేయుట, వేయకపోవుటవలన. తా॥ ఉత్సవములలో దివ్యవనితలు మర్త్యవనితలు కలిసి యాడుచుందురు. అప్పుడు రెప్పపాటు కలవారు మనుష్యస్త్రీలనియు, లేనివారు దేవతలనియు గుర్తింపవలయునేకాని లేకున్న భేదము తెలియుట కష్టము. 93. అర్క...భాగంబులన్ = సూర్యకాంత మాణిక్యములచే నిర్మింపబడిన మేడల పైభాగములందు; తార్కొన్ = సమీపించు; తారకమండలము = నక్షత్రమండలము; ముగ్ధస్త్రీలు = ఏమియు తెలియని స్త్రీలు; రేలు = రాత్రులందు; అప్పురిన్ = ఆయూరిలో; కర్కంధూఫలసన్నిభంబు = రేగుపళ్లవంటి; ముక్తాజాలమున్ = ముత్యాలతోరణములను; చింతచే = ఆలోచనతో; తర్కింపన్ = ఊహింపగా; తిలకించి = తెలిసికొని; గంధర్వాంగనాపల్లవుల్ = గంధర్వస్త్రీల విటులు. తా॥ ఆ పట్టణములోని మేడలుచాలయెత్తుగానున్నందున నక్షత్రములుముత్యాల జాలరులవలె నుండును. గంధర్వులుకూడ వాటికి దాదాపుననే సంచరించుచున్నందున అక్కడి స్త్రీల సంభాషణల వినుచు నవ్వుచుందురని అతిశయోక్తిగా వర్ణింపబడినది. 94. బహుళ...పాదపంబు = మోక్షమను ఫలమునిచ్చు ధర్మవృక్షమైనది. 95. తా॥ శివునకు 'గౌరి, గంగ, కాశి, దక్షవాటి' యీ నల్గురును భార్యలు.

వ. ఒక్క సమయమ్మున దక్షారామమున కేతెంచి భీమమండలంబునందు. 96

కం. శోభనముహూర్తమున భుజ, గాభరణుఁ బ్రతిష్ఠచేసి • యర్చించి మహా
వైభవమొనర్చి పొందె మ, నోభిమతము విబుధనాథుఁ • డధికస్ఫురణన్. 97

తే. దేవతాభర్త శంభుప్ర • తిష్ఠచేసి, సురగణంబుల లోకపా • లురను జూచి
యనియె మీరును భీమనా • యకుని పీట, సిద్ధశివలింగములఁ బ్రతి•ష్ఠింపవలయు. 98

—• ఇంద్రుఁడు దేవతలకు శివలింగమాహాత్మ్యంబుఁ జెప్పుట •—

సీ. శ్రీకంఠుని బ్రతి • ష్ఠించు నెవ్వాఁడు వాఁడు, పాపియైనను శంభు • పదముఁ గాంచు
శివలింగపదయాత్ర • శివలింగసంవీక్ష. శివలింగసంస్పృష్టి • శివసమర్చ
నాకలోకాధి రా • జ్యైకతారణములౌ, నయమార సాధార • ణస్థలములఁ
గళ్యాణభోగమో • క్షనివాసమైనయీ, దక్షవాటీపుర • స్థానభూమిఁ

తే. జెప్పనేటికి సకల సం • సిద్ధిఁ గోరి, దక్షిణాంభోనిధానంబు • తటమునందు
సంప్రతిష్ఠింపుఁ డీశానుఁ • జంద్రమౌళి, విశ్వలోకాధినాథు నో • విబుధులార. 99

కం. సిద్ధించు మీ కభీష్టము, సిద్ధ మిది యమర్త్యులార • శీఘ్రమున జటా
రుద్ధశశి మహోపనిష, త్సిద్ధాంతరహస్యమును బ్ర • తిష్ఠింపుఁ డిపన్. 100

తే. దర్శనముకంటె మేలు స్ప • స్పర్శనంబు, సంస్పృశించుటకంటె న • ర్చనము చెప్ప
యర్చనము సేయుకంటె న • నంతఫలద, మసితగళుని బ్రతిష్ఠించు•టమరులార. 101

సీ. సకలలోక ప్రపం•చమును లింగమయంబు, త్రిజగంబు లింగప్ర • తిష్ఠితంబు
సంభవస్థితిలయ • స్థానంబు లింగంబు, లీనార్థగమకంబు • లింగ మనఁగ
లింగప్రసాదంబు • లేక సిద్ధింపవు, భోగమోక్షంబు లే • యోగములను
లింగాజ్ఞవెలిగాఁగ • లేశమాత్రంబును, సంచలింపదుపో త్ర • ణాంచలంబు

తే. మంటినైనను లింగంబు • మలిచికొలుఁడు, ఇసుకనైనను లింగంబు • నేర్చికొలుఁడు
పేడనైనను లింగంబుఁ • బెట్టికొలుఁడు, పిటనైనను లింగంబు•నిలిపి కొలుఁడు. 102

వ. అని యునన్యసించి యింద్రుండు తానును లోకపాలకులును దివిజులునుం దమ తమ
పేర శివలింగంబులఁ బ్రతిష్ఠించిరి. 103

---

97. భుజగాభరణునన్ = శివుని; మనః + అభిమతము = కోరిక. 98, దేవతాభర్త = ఇంద్రుడు; పీటన్ = పట్టణమందు. 99. శ్రీకంఠుడు = శివుడు; శంభుపదము = కైలాసము; సంస్పృష్టి = ముట్టుకొనుట; సమర్చ = పూజ; దక్షిణాంభోనిధానము = దక్షిణసముద్రము. 100. జటారుద్ధశశి = జటలందు కట్టబడిన చంద్రుడు కలవాడు; 191. అసితగళుని = శివుని. 102. లీనార్థ గమకంబు = లయమగుట యను వర్థమిచ్చునది. వెలిగాగ = లేకుండ; మంటినైన = మట్టితోనైన; మలిచి = చేసి; కొలుడు = కొలువుడు. 103. దివిజులు = దేవతలు.

మ. హిమధామార్ధజటాకిరీటుఁ డభవుం • డింద్రేశ్వరుం డింద్రుచే
నమరవ్రాతముతోడఁ గూడఁగఁ బ్రతి • ష్ఠాంతంబునం భక్తిసం
భ్రమతాత్పర్యసమగ్రుచేఁ గయికొనెన్ • బాథోధివధ్వాపగా
విమలస్వర్ణసరోజపూజ హృదయా • విర్భూతసంతుష్టుఁడై. 104

ఉ. ఆగమమంత్రతంత్రములు • సాంగములై నడువంగ సర్వవి
ద్యాగురుఁడైన ప్రెగ్గడ బృ • హస్పతితోడుగ వీతిహోత్రది
గ్భాగమునం బురందరుఁడు • భక్తిఘటించిన వాసవేశ్వరున్
భోగివిభూషణుం గొలుచు • పుణ్యుల కబ్బును భోగమోక్షముల్. 105

తే. ఇంద్రుఁడేఁటేఁట జాతర • కేగుదెంచి, సప్తగోదావరమున ను • స్నాతుఁ డగుచు
భుజగభూషణు నింద్రేశుఁ•బూజసేయు. ధవళమందారతరుపుష్ప•దామములను. 106

కం. ఇంద్రప్రతిష్ఠితుం డగు. నింద్రేశ్వరుఁ గొలువ నెవ్వఁ • డేకాగ్రతమై
రుంద్రమతిస ప్తసింధువు.నం ద్రిషవణమాడునతఁడు • నాకం బెక్కున్. 107

శిం. సకృదాలోకనమున మతి, సకృదర్చన సకృదుపాస • సకృదానతులన్
సకృదాలయప్రదక్షిణ, సకృజ్జపంబుల మహేంద్ర • శంభుఁడు మెచ్చున్. 108

తే. ఐంద్రపదభోగ మెవ్వఁడే • నభిలషించు, నాతఁ డింద్రేశ్వరేశ్వరు • నాలయమునఁ
బ్రణవపంచాక్షరీమంత్ర•పాఠనియతి,నమ్మహాఫల మొందుఁ దఽత్త్వార్థ మిదియు. 109

తే. స్నానదానాగ్నిహోత్రదీ • క్షవిధాన, మంత్రవాదములైనక • ర్మంబులొకటి
కోటిగుణితంబు శ్రీదక్ష • వాటియందు. సప్తగోదావరేంద్రేశ • సవిధభూమి. 110

వ. అటమీఁద సిద్ధేశ్వరస్థానంబు సిద్ధలింగాధిష్ఠితంబు ధర్మార్థకామమోక్షపురుషార్థ సంసిద్ధికై యాసిద్ధలింగంబు సిద్ధులచేతఁ బ్రతిష్ఠింపంబడి సిద్ధసాధ్యగంధర్వ గీర్వాణ విద్యాధరారాధ్యంబై యుండు నా స్థానంబు దక్షయజ్ఞ ప్రాగ్వంశక్షేత్రంబు. 111

---

104. హిమ...కిరీటుఁడు = శివుడు; అమరవ్రాతము = దేవతాసమూహము; కయికొనెన్ = స్వీకరించెను; పాథోధి...పూజ = మందాకినిలోని బంగారుతామర పూలపూజ. 105. ప్రెగ్గడ = మంత్రి; వీతిహోత్రదిగ్భాగమునన్ = ఆగ్నేయమూల; పురందరుడు = ఇంద్రుడు; భోగివిభూషణుడు = శివుడు. 106. ధవళ...దామములు = తెల్లని మందారమాలలు; జాతర = ఉత్సవము, 107. రుంద్రమతిన్ = మంచి తెలివితో; సప్తసింధువునన్ = సప్తగోదావరమున; త్రిషవణము = త్రికాలస్నానము; నాకంబు = స్వర్గము. 108. సకృదాలోకనము = ఒక్కసారి చూచుట; సకృదుపాస = ఒక్కసారి యుపాసన చేయుట. 109. నియతిన్ = నియమముతో; తత్త్వార్థము = నిజము. 110. సవిధభూమి = దగ్గర. తా॥ ఇంద్రేశునికి దగ్గర స్నానము, దానము, అగ్నిహోత్రము, దీక్ష, మంత్రపురశ్చరణలు కోటిరెట్లు ఫలితము నిచ్చును. 111. ప్రాగ్వంశక్షేత్రంబు = యజ్ఞశాల ప్రాంతగృహమున్న క్షేత్రము.

కం. జపహోమదానయజ్ఞము, లుపవాసాదివ్రతంబు • లొక్కొక్కటి కో
టిపరిమితంబులు సిద్ధే, శపదంబున సాధకులకు • సత్యం బరయన్. 112

వ. మఱి యోగీశ్వరంబను స్థానంబునందు యోగీశ్వరేశ్వరుండు సనకసనందనాది
యోగీశ్వరులచేతఁ బ్రతిష్ఠితుండని చెప్పంబడును. 113

గీ. అది భవాబ్ధితరణి • యదిసాధకవ్రాత, కల్పవృక్ష మది య • గణ్యసిద్ధ
మది యుపాసకులకు • నణిమాదికైశ్వర్య, లాభమునకుఁ గరత•లంబుపసిఁడి. 114

సీ. మంకణుం డను మహా • మౌనియోగీశ్వర, శ్రీమహాదేవుని • శివు భజించి
బ్రహ్మ సాక్షాత్కార • పర్యంతమైనప్ర,బోధసంపదముక్తి • బొలుపుఁగాంచె
నొకమాఱు సప్తసిం • ధూదకంబులఁ గ్రుంకి, నరుఁడు యోగీశ్వరే • శ్వరునిఁగాంచి
నణిమాదికాష్టవి • భైశ్వర్యసంసిద్ధిఁ, బొందు యోగీశున • ర్ధేందుధరుని

తే. సప్తగోదావరమునీట • జలకమార్చి, పుష్పగంధాక్షతంబులఁ • బూజచేసి
కలిభవంబైన కలుషంబుఁ•గ్రాచిపుచ్చి,మర్త్యుఁడొందును వేగం బ•మర్త్యపదవి. 115

వ. మఱియు యమేశ్వరలింగంబు యమప్రతిష్ఠితంబు సకృద్దర్శనమాత్రంబున మర్త్యుం
డు యమభయంబునం బాయు వెండియు. 116

సీ. యజ్ఞతటాకంబు • నందుఁ గ్రుంకులు వెట్టి, బ్రహ్మర్షిపితృతృప్తిఁ • బ్రస్తరించి
యమలింగసన్నిధి • నష్టోత్తరసహస్ర, సంఖ్య మృత్యుంజయ • జపముఁ జేసి
జపవిధానమునందు • సరవిమృత్యుంజయు, నపమృత్యుభయశాంతి • నర్థి నడుగ
నపమృత్యుదేవతా • హంకారభవమైన, సంత్రాస మొందఁడు • సాధకుండు

తే. శ్రాద్ధపిండోదకాదివి • శ్రాణనముల, శ్రీయమేశ్వరతీర్థానఁ • జేసి మనుజుఁ
డుద్ధరించును నరకకూ • పోదరముల, బెగ్గడిలు నేడుతరముల•పితృగణముల. 117

కం. శ్రీకాలేశ్వరుసన్నిధి, నేకాంతము జపమువ్రేల్మి • యీగియు శ్రాద్ధం
బేకైకము కోటిగుణం, బై కలిగించును సమగ్ర • మైన ఫలంబుల్. 118

112. సాధకులకు = మంత్రాదిసాధనచేయువారికి. 114. భవాబ్ధితరణి = సంసారసాగరమును దాటుటకు సాధనము; కరతలంబుపసిఁడి = చాల సులభమైనది. 115. ప్రబోధసంపదన్ = జ్ఞానముతో; ముక్తిపొలుపు = ముక్తిని; సప్తసింధూదకంబులన్ = సప్తగోదావరజలములందు; అర్ధేందుధరుడు = చంద్రకళాధరుడు; కలిభవము = కలియుగమున పుట్టిన; క్రాచిపుచ్చి = పోగొట్టి; అమర్త్యపదవి = స్వర్గము. 117. క్రుంకులు = స్నానము; బ్రహ్మర్షి పితృతృప్తిన్ = బ్రహ్మ, ఋషి, పితృతర్పణములను; ప్రస్తరించి = చేసి; సరవిన్ = వరుసగా; విశ్రాణనము = ఇచ్చుట; నరకకూపోదరములన్ = నరకకూపములందు; బెగ్గడిలు = బాధపడు. 118. కాలేశ్వరుడు = యమేశ్వరుడు; వ్రేల్మి = హోమము; ఈగి = దానము.

తే. వీరభద్రాదిదేవతా • వీరగణము, శంభులింగంబు నిలిపెఁ బ్ర • శస్తవేళ
దక్షవాటిఁదదాఖ్యసం • స్థాపనమున. వీరభద్రేశుఁడయ్యెన • వ్వేల్పుఱేఁడు. 119

కం. శ్రీ వీరభద్రలింగము, సేవించిన మానవుండు • చిరకాలమునం
గేవలగాణాపత్యమహావిభవము నొందు శివుని • యాస్థానమునన్. 120

తే. వీరభద్రేశదేవతా • విభునియాజ్ఞఁ, గలుగుధర్మార్థ కామ మో•క్షములు జనుల
కక్షయంబైన దక్షవా•టాభిధాన. భోగమోక్షరమాజన్మ • భూమియందు. 121

తే. అగ్నిహోత్రంబు దాన మ • ధ్యయనజపము, లాదియగునిత్యనైమిత్తి•కాదివిధులు
బహుఫలంబుల నొసఁగు స • ద్భక్తియుక్తి, దక్షవాటికవీరభ•ద్రస్థలమున, 122

ఉ. యాగతటాకతీర్థమున • యందును నంబుధిసార్వభౌమది
గ్భాగవిభూషణం బయిన • పద్మినియందును దీర్ఘమాడి ని
ష్ఠాగరిమంబునం ద్రిపుర • శాసను దక్షపురోపకంఠధా
త్రీగృహమేధిఁ గొల్వఁడు ప్ర • తిష్ఠితభర్గుని వీరభద్రునిన్. 123

వ. తొల్లి బ్రహ్మాదులగు దేవతలు సురేంద్రవిహితవిభవుండైన భీమనాథేశ్వరు దర్శించు వేడుకంజేసి బ్రహ్మలోకంబునుండి భోగమోక్షక్షేత్రంబైన దక్షారామంబునకు వచ్చి సప్తగోదావరంబునఁ బంచతీర్థంబులాడి పంద్రెండు దివ్యలింగస్థానంబులు దర్శించి యమృతమయస్వయంభూజ్యోతిర్లింగమూర్తి నిఖిలదేవతాచక్రవర్తియగు భీమేశ్వరేశ్వరు దర్శించి పరమానందకందళితస్వాంతులై యిట్లనిరి. 124

—• బ్రహ్మాదులు భీమేశ్వరు వర్ణించుట •—

శా. ఆహా ! యింతమనోహరంబగునె ద • క్షారామ మివ్వీటిలో
నీహారాంశుకళాకిరీటుఁడు భవా • నీభర్త దివ్యాప్సరో
వ్యూహంబుల్ ప్రతిసంధ్యముం గొలువఁగా • నున్నాఁడు గోదావరీ
వాహిన్యబ్ధిసమీరపానకలనా • వర్ధిష్ణు కేయూరుఁడై. 125

---

119. తదాఖ్యసంస్థాపనమునన్ = ఆతని పేరుతో స్థాపించినందున; వేల్పుఱేఁడు = శివుడు; తా॥ వీరభద్రాది వీరులం తమ పేరుతో ప్రతిష్ఠించిన లింగమే వీరభద్రేశ్వరుడయ్యెను. 120. కేవల...విభవము = గణపతి పదవిని. 121. దక్ష... భూమి = దక్షారామమను భోగమోక్షములిచ్చుచోటు. 122. అధ్యయనము = వేద పఠనము; సద్భక్తియుక్తిన్ = మంచి భక్తితోకూడి. 123. అంబుధి...విభూషణము = పడమటదిక్కునకున్న; పద్మిని — తటాకము; దక్ష... మేధి = శివుడు. 125. ఇవ్వీటిలో = ఈ నగరిలో; నీహార...కిరీటుడు = శివుడు; దివ్య...వ్యూహంబుల్ = అప్సరసలు; ప్రతిసంధ్యమున్ = ప్రతిసంధ్య వేళలను; గోదావరీ... కేయూరుడు = గోదావరి, సముద్రములమీదనుండి వచ్చుగాలి తిని పెరిగెడి (సర్పములు) భుజకీర్తులు కలవాడు.

కం. ముంగిటను సప్తసింధువు, చెంగటఁ గ్రతుసరసి నడుమ • శ్రీభీమమహా
లింగము దక్షారామము. సంగతి నెన్నంగఁ బురము • జగతిం గలదే. 126

తే. శివశివా! యెంత భాగ్యంబు చేసినారొ, దక్షవాటీపురీమహా • స్థానజనులు
కన్నులారంగ వీక్షించు • చున్నవారు, భీమనాథేశ్వరేశ్వర • స్వామిమూర్తి. 127

చం. అహహ! దయారసానుగత • మైన మనంబున దక్షవాటికా
గృహపతి భీమనాయకుఁడు • కీటపతంగసరీసృపాళికిన్
సహజగళత్సమీరమగు • సంకటకాలము వీనులం దను
గ్రహమొనరించునట్టి మధు • రంబగు తారకమంత్రరాజమున్. 128

సీ. భీమనాథేశ్వర • శ్రీమన్మహాలింగ, శాశ్వతపరబ్రహ్మ • భువనమునకు
గల్పాంతసమయభీ • కరసాగరోద్ధత్య, భీతత్రిలోకము • హోతరికిని
ద్వాదశక్షేత్రతీ • ర్థపలాశమండల, వ్యాకోచనవపుండ • రీకమునకు
జంబూతరుద్వీప • సర్వసర్వంసహా, పాటీరలేపనై • పథ్యమునకు

గీ. శివకళత్రమునకు శివ • క్షేత్రమునకు, శివునిమూర్తికి శ్రీసదా • శివునికీర్తి
కితరతీర్థంబు సరిపోల్ప • నెట్లువచ్చు, దక్షవాటంబునకు మహా•స్థానమునకు. 129

కం. మంకణమహామునీశ్వర, సంకల్పవితీర్ణకల్ప • శాఖికి భువనా
లంకృతికి దక్షవాటికి, శంకరనటనటననాట్య • శాలకు జేజే. 130

కం. కాశీప్రతిబింబమునకుఁ, గాశీప్రతినిధికిఁ గాశి • కాప్రకృతికినిం
గాశీప్రతిమకు దక్షిణ, కాశికి శ్రీదక్షవాటి • కటకంబునకున్. 131

కం. మోక్షస్థానంబునకున్, దక్షారామమున దమృత • ధామంబునకున్
దక్షాధ్వరక్రియోచిత, దీక్షాక్షేత్రమున కభవు • దేవికి జేజే. 132

వ. అని నమస్కరించి శతానందుండు. 133

126. ముంగిటన్ = ముందఱివాకిలిలో; క్రతుసరసి = యజ్ఞగుండము. 128. గృహపతి = యజమానుడు; కీటపతంగసరీసృపాళికిన్ = క్రిములు, పక్షులు, పాముల కును; సహజగళత్సమీరము = సహజముగాపోవుచున్న గాలి కలది; సంకటకాలము = ప్రాణావసాన సమయము. 129. కల్పాంత...తరి = ప్రళయకాలమందు వచ్చు భయంకర సాగరమునుచూచి భయపడిన జనులకు తెప్పవంటిది; ద్వాదశ...పుండరీకము = పంద్రెండు క్షేత్రములు, తీర్థములునను రేకులు వికసించిన క్రొత్తతామర పువ్వు; జంబూనైపథ్యము = జంబూద్వీపమునకు మంచిగంధపుబూతవంటిది; శివకళత్రము = శివునిభార్య. 130. మంకణ...శాఖి = మంకణునికోరికలుతీర్చునట్టిది; శంకర...శాల = శివుడను నటునికి నాట్యశాల; జేజే = దండము. 131. ప్రతిబింబము, ప్రకృతి, ప్రతిమ = సరియైనది; కటకము = పట్టణము. 132. అమృతధామము = ముక్తిక్షేత్రము. 133. శతానందుడు = బ్రహ్మ.

మ. శివలింగంబుఁ బ్రతిష్ఠచేసి కణఁకన్ • శ్రీసప్తగోదావరాం
బువులం జేసెను మంత్రపూర్వకముగాఁ • బుణ్యాభిషేకంబు వై
భవముల్ పెక్కువిధంబులం జరపె శ్రీ • బ్రహ్మేశ్వరుం డంబుజో
ద్భవవంద్యుం డది యాదిగాఁ గరుణమైఁ • బాలించు భక్తావళిన్. 134

వ. అంత దేవసిద్ధసాధ్యవిద్యాధరగంధర్వోరగాదులును దమతమ నామధేయంబుల లింగం
బులఁ బ్రతిష్ఠించిరి తదనంతరంబ. 135

సీ. బ్రహ్మప్రతిష్ఠిత • బాలేందుశేఖరుఁ, బురుహూతుఁ డతిభక్తిఁ • బూజచేసె
నలువ యర్చించె నా • నాప్రకారంబుల, హరిహయస్థాపితుం • డగు మహేశు
దక్షవాటికఁ జూచి • దక్షప్రజాపతిఁ, బొగడె నల్మోర్గ్ల నం • భోజభవుఁడు
ప్రణమిల్లె దక్షుఁడు • భారతీభర్తకు, నాత్మప్రశంసకు • నలఁగి మదిని
తే. వేల్పులందఱు దారును • నిల్పినట్టి, శంభులింగంబులకు మ్రొక్కి • చనిరి దివికి
సరసిజాసనుచే నను • జ్ఞాతులగుచు, సత్యలోకంబునకు నర్థిఁ • జనియె విధియు. 103

కం. బ్రహ్మప్రతిష్ఠితుండగు, బ్రహ్మేశ్వరదేవుఁ గొలుచు • భాగ్యాఢ్యులకుం
బ్రహ్మక్షత్రాదులకును, బ్రహ్మాచ్యుతశంభుభవన • పదవులు గలుగున్. 137

కం. అధ్యయనశ్రుతదానత, పోధ్యానసమాధిమంత్ర • పూజాదిమహా
విధ్యనుసంధానమున న,సాధ్యంబులు లేవు బ్రహ్మ • శంకరుపదవిన్. 138

వ. మఱియుఁ గపాలేశ్వరస్థానంబు. 139

ఉ. చిక్కఱి కాలభైరవుని • చేతివిధాతృకపాలపాత్ర యే
చక్కటియందు జాఱిపడె • సప్తనదీతటభీమభూమియం
దక్కడ నుద్భవించిన శ • శాంకకిరీటుఁ గపాలి శంభు స
మ్యక్కృతిఁ గొల్చు మానవుల • మానుగఁ జేరవు పాతకౌఘముల్. 140

తే. ఆకపాలమోచనాభిధానంబైన పుణ్యతీర్థరాజ • మునను జలుపఁ
గడిఁది గోటిఫలముఁ • గాంచునొక్కొక్కటి, దానహోమయజ్ఞతంత్రవిధులు. 141

---

134. కణఁకన్ = పూనికతో; కరుణమైన్ = దయతో; 136. పురుహూతుడు = ఇంద్రుడు; నలువ = బ్రహ్మ; హరిహయస్థాపితుడు = ఇంద్రునిచే స్థాపింపబడినవాడు; నల్మోర్గ్లన్ = నాలుగుముఖములతో; అంభోజభవుడు = బ్రహ్మ; తారును = తామునుకూడ; విధియు = బ్రహ్మయు. 138. బ్రహ్మశంకరుపదవిన్ = బ్రహ్మేశుని పదవియందు. 140; చిక్కఱి = పట్టుతప్పి; కాల...పాత్ర = కాలభైరవుని చేతిలోని బ్రహ్మకపాలపాత్ర; చక్కటియందు = ప్రదేశమందు; కపాలిశంభున్ = కపాలీశ్వరుని; సమ్యక్కృతిన్ = మంచిభక్తితో; పాతకౌఘముల్ = పాతకముల గుంపులు. 141. కడిఁది = గొప్ప.

చం. అట వరుణేశ్వరం బన న • నాదిఁ బ్రచేతసుచేత వాహినీ
తటమునఁ దొంటి నిల్పఁబడి • దక్షమహోళకరారవిందసం
పుటమునకున్ వరాటకము వోలె • వెలింగెడు బాలతారకా
విటమకుటావతంసమునకు • విశ్రమకారణ మై తపోనిధీ. 142

తే. వరుణలింగంబునకుఁ దీర్థ • వారిధార, వేయిఘటముల నభిషేక • విధియొనర్ప
వఱపుదోసంబు వాయంగ • వానగురియుఁ, గొండ్రలంబడు నారబటోటులెల్ల. 143

ఉ. కుక్కుటపక్షిసంఘము ల • కుంఠితభక్తిఁ బ్రదక్షిణంబు స
మ్యక్కృతిఁ జేసి యెవ్వని కృ • పాతిశయంబున మోక్షసత్పదం
బెక్కె సమస్తలోకముల • కెల్లఁ బ్రియుం డరుణేందు శేఖరుం
గుక్కుటనాథదేవు ఫణి • కుండలునిం గొలువుండు మానవుల్. 144

తే. ఒక్కపక్షంబు వెంతయు • నుర్వి మోవ
గుడిఁ బ్రదక్షిణ మొనరించు • కుక్కుటముల
కక్షయంబగు మోక్షమే • యయ్యెనొసఁగె
నట్టిశివుఁ గుక్కుటేశ్వరు • నాశ్రయింతు. 145

కం. చరణాయుధేశ్వరేశ్వరు, శరణాగతకల్పతరువు • సంపూర్ణమహా
కరుణావరుణాలయునిం, గరుణామృతకిరణధరుని • దర్శింపవనా. 146

కం. కోణార్కక్షేత్రము వారాణశి కేదారతీర్థ • రాజము కుంభీ
కోణంబు కుక్కుటేశస్థాణుస్థాలంబు మోక్ష • ధామము వెంకున్. 147

తే. అచట దానంబుహోమ • మధ్యయనవిధులు
శ్రాద్ధమును దేవతాసమ • ర్చనము వ్రతము
లొక్కటొక్కటి కోటిగు • ణోపలబ్ధి
సంభవించును సతతంబు • సాధకులకు. 148

వ. మఱియు సోమేశ్వర తీర్థంబు సర్వదేవతా నమస్కృతంబు. 149

---

142. అనాదిన్ = ముందుగా; ప్రచేతసుచేతన్ = వరుణుని చేత; వాహినీతటమునన్ = నదియొడ్డున; తొంటి = మున్నుగా; దక్ష...సంపుటమునకున్ = దక్షేశలింగమునకు; వరాటకము = తామరపూస; బాల...వతంసునకున్ = శివునకు. 143. వఱపుదోసంబు = అనావృష్టిదోషము; కొండ్రలన్ = చేలలో; అరబటోటులు = చాల పైరులు. 144. కుక్కుటపక్షి = కోడి; ఫణికుండలుడు = పాములు చెవులపోగుగా కలవాడు. 145. తా॥ ఒక్కరెక్కలుమాత్రమే భూమిపై మోయునట్లు తిరుగుచు ప్రదక్షిణము చేసినందున కుక్కుట పక్షులకే అక్షయమోక్షము నిచ్చినయయ్యయైన శివునాశ్రయింతును. 146. చరణాయుధ = కోడి; కరుణావరుణాలయుడు = దయా సముద్రుడు; దర్శింపవనా = అన్నా ! దర్శింపవా ?

కం. అమృతమయుఁ డైనసోముఁడు, సమయంబున నే మహేశు • సంస్థాపించెన్
విమలసుధాజ్యోతిర్లింగము సోమేశ్వరుని గరళ • కంఠు భజింతున్. 150

సీ. సోమతీర్థమునందు • సుస్నాన మొనరించి, శ్రీసోమశంభు భ • జించు ధన్యుఁ
డిహజన్మమునయందు•నేపాప మొనరించెఁ, బాప మెద్ది యొనర్చెఁ•బ్రాగ్భవమున
నది యశేషంబును • నాశనంబునఁబాసి, దేహాంతమునఁగూడుఁ•ద్రిపురహరునిఁ
ద్యాగంబు భోగంబు • దానంబు సత్యంబు, భాగ్యంబు కీర్తి సౌ • భాగ్యలక్ష్మి

తే. బుద్ధి తత్సేవ నత్యంత • వృద్ధిఁ బొందు, సతతధర్మంబు నిచ్చు నక్షయఫలంబు
దతఫలంబులు పిత్రౌర్ధ్వ•దైహికములు, సత్య మిది సోమనాథప్ర•సాదమహిమ. 151

కం. సురలును విద్యాధరులును, గరుడోరగకిన్నరులును • గంధర్వులు కిం
పురుషులు యక్షులు సోమేశ్వరదేవునిఁ గొల్తు రధిక • వరభక్తిమెయిన్. 152

వ. మఱియు మాహేశ్వరతీర్థంబు సర్వదేవనమస్కృతంబు మునిసిద్ధచారణ విద్యాధరులచేతఁ బ్రతిష్ఠితంబైనయది పితృపిండదానం బేకవింశతికులంబునకుఁ దృప్తికరంబు. 153

తే. సప్తగోదావరంబును • సారతీర్థ, ముత్తమోత్తమ మందు • మర్త్యుండు చేయు
శ్రాద్ధతిలతర్పణాదు ల•క్షయఫలములు, తత్సదాసేవనము శివ•స్థానదంబు. 154

తే. దత్త మిష్టంబు హుత మధీ • తంబు నరుల, కచట నక్షయఫలముఁ జే • యంగఁజాలు
శ్రాద్ధపిండప్రదానాది•సకలవిధులు, నందు ఫలియించు నగ్గయ•యందుఁబోలె. 155

కం. మఱి రామేశ్వరతీర్థము, కఱకంఠున కాటపట్టు • కామితఫలముల్
తఱుఁగని ధాన్యములగుచును, నెఱయంగ ఫలించు నందు • నిష్ఠయుఁ గలుగున్. 156

కం. శ్రీరుద్రపాదయుగళీ, శ్రీరామేశ్వరసమీప • సీమం బితృయ
జ్ఞారంభం బొనరింప న,పారఫలప్రాప్తిచెందుఁ • బంచజనులకున్. 157

తే. ప్రథిత మగు సప్తగోదావ • రంబునకును, నభవునకు భీమనాథున•కంతరమున
నేమి సుకృతంబు చేసిన•నేకతంబ, వేయు విధముల ఫలియించు•వేయునేల. 158

149. సర్వ...కృతంబు = అందఱిదేవతలచేతను నమస్కరింపబడినది. 150. అమృతమయుఁడు=అమృతస్వరూపుఁడు. 151. ఇహజన్మను = ఈ జన్మ; ప్రాగ్భవము=క్రితముజన్మ; తత్సేవన్=ఆతని సేవచే; తతఫలంబులు=ఎక్కువఫలముకలవి; తౌర్ధ్వదైహికము=పితృశ్రాద్ధములు. 153. ఏకవింశతికులంబునకు=21 కులములకు. 154. తత్సదాసేవనము=దాని నెల్లప్పుడు సేవించుట; శివస్థానదంబు=శివుని స్థానము నిచ్చునది. 155. దత్తము=దానముచేయబడినది; ఇష్టము=యాగము; హుతము=హోమము చేయబడినది; అధీతము=జపింపబడినది; అగ్గయయందువోలె=ఆగయలోవలె. 156. కఱకంఠుడు=శివుడు. 157. పంచజనులు=మానవులు. 158. ప్రథితమగు=ప్రసిద్ధమైన; అంతరమునకు=మధ్యలో; ఏకతంబ=ఒక్కటే.

సీ. వినుము పారాశర్య • వేవేలమాడలఁ, బనియేమి తీర్థముల్ • పదియు రెండు
నని చెప్పనేల ద • క్షారామమండలిఁ, దీర్థంబుగాని ప్ర • దేశ మెద్ది
సప్తగోదావరో • త్సంగస్థలమునకుఁ, గాశి కేదార మ • క్షయవటంబు
తరముగా కితరతీ • ర్థమ్ములు సాటియే, భోగమోక్షములకుఁ • బుట్టినిల్లు
తే. రుద్రవాటిక భీమేశ్వ • రునినివాస, మందు రామేశ్వరస్థాన • మధ్యధికము
రామతీర్థంబునందు సా • రంబుసాటి, ధర్మ మర్మంబు రుద్రపా • దస్థలంబు. 159

—• అగస్త్యుండు వ్యాసునకుఁ బంచతీర్థంబుల వివరించుట •—

వ. మఱియుఁ బంచతీర్థంబులు వివరించెద నవహితుండవై యాకర్ణింపుము. 160
చం. అహిపతికంకణుండు తన • యల్లుఁడుగా మదిఁ గోరి నిష్ఠతోఁ
దుహినధరాధరేంద్రుఁడు చ • తుర్దశదివ్యమహాబ్దముల్ సుదు
స్సహముగఁ జేసె నయ్యెడఁ బ్ర • చండతపం బచటన్ శివుం డను
గ్రహమున నుద్భవించె నని • క్రచ్చఱఁ బల్కుఁ బురాణసంహితల్. 161.
కం. అదియాదిగఁ దీర్థంబులు, పదియును రెండయినఁదీర్థ • పాలీజాతం
బదియ పదునెక్కువై యున్నది సప్తతటంబునందు • నస్మనివర్యా. 162
కం. లంకించి యరుంధతీపతి, మంకణునకుఁ జెప్పె ననుఁగు • మామడు గిరికిన్
సంకల్పసిద్ధిదుండగు, శంకరుఁ డఖిలార్థిపారి • జాతంబనుచున్. 163
కం. గిరిసార్వభౌమకన్యా, కరగ్రహణసుమంగళైక • కౌతుకసంప
త్పరిపూర్ణహృదయు శంకరుఁ, గరుణాకింకరుని నుపగ • తంకణుఁ గొలుతున్. 164
కం. నీహారభూధరేశ్వరు, నీహారమణీయమూర్తి • నిందుకర హిమా
నీ హార హీర కుముద సు,ధాహార సమానకాంతి • నభివర్ణింతున్. 165
సీ. భూధరేశ్వరతీర్థ • మునఁ గృతస్నానుఁడై, భూధరేశ్వరుఁ గొల్చు • బోధఘనుఁడు
నిత్యమంగళుఁడు నిర్భిద్రభద్రుండును, లక్ష్మీవిలాసైక • లక్ష్మయుతుఁడు
నగుఁ దీర్థములలోన • నత్యుత్తమం బైన, తీర్థంబు భుక్తిము • క్తిప్రదంబు
మంగళమంగళా • త్మకము కళ్యాణక,ళ్యాణస్వరూప మీ • యాస్పదంబు

---

159. ఉత్సంగస్థలము = తీరము; తరముగాక = సాటిగాక. 161. అహిపతి కంకణుండు = శివుడు; తుహిన...ఇంద్రుడు = హిమవంతుడు; చతుర్...అబ్దముల్ = 14 దివ్యసంవత్సరములు; ప్రచండతపంబు = ఘోరతపస్సు; క్రచ్చఱ = హితవుగా; 162. తీర్థపాలీజాతంబు = తీర్థముల వరుస. 163. లంకించి = ఆరంభించి. 164. గిరి...హృదయున్ = పార్వతీపరిణయమున సంతోషించినవాడు. 165. నీహార...మూర్తి = హిమవంతునికి మనోహరమైనమూర్తి; ఇందుకర...కాంతిన్ = వెన్నెల, మంచు, ముత్యాలహారము, ముత్యపుచిప్ప, కలువ, దేవతలతో సమమైన కాంతికలవాని.

తే. ధరణీధరనాయకునకుఁ బ్ర • త్యక్ష మైన, యవ్విరూపాక్షునగర మ • ధ్యాహ్నవేళ
భోగఘంటాస్వనము విన్న • భూజనులకు, నవల వినవచ్చు ముక్తిక•ల్యాణఘంట. 166

మ. హిమవద్భూధరసార్వభౌమవరవి • శ్వేశోపహారక్రియా
క్రమసంతాడితఘంటికాఘణఘణ • త్కారంబు విన్నట్టి యు
త్తమపుణ్యుండు వినండు ప్రాణపవనో • త్క్రాంతివ్యథావేళ దు
ర్దమవైవస్వతవాహ్యఘోరమహిష • గ్రైవేయఘంటాధ్వనుల్. 167

తే. శ్రాద్ధపిండప్రదానాది • సకలవిధులు, నొక్కటొక్కటికోటిగు • ణోదయమునఁ
దృప్తిఁ గల్పించు దివి పితృ • దేవతలకు, ధరణీధరరాజశంభుతీ•ర్థంబునందు. 168

తే. సప్తగోదావరముఁ దెచ్చి • సప్తమునులు, సప్తసప్తీందుశిఖివిలో • చనుని నిలిపి
రమ్మహాశంభులింగ ము • ఖ్యర్చితులకుఁ, గామితార్థప్రదానైక • కల్పకంబు. 169

కం. ఒకమాటు జలకమార్చిన, నొకమాటొకపువ్వు మౌళి • నునిచిన నొకమా
టకుటిలమతి గుడిఁ దిరిగిన, సకలేప్సితముల నతండు • సంపాదించున్. 170

తే. భీమనాథేశ్వరునిపార్శ్వ • భూమియందుఁ, బంచశివలింగములకు నా•స్పదములైన
పంచతీర్థంబులను నాడు•పంచజనులు,పాయుదురు పంచవిధమహా•పాతకముల. 171

తే. అందు వాపితటాక కు • ల్యాదులందుఁ, దీర్ఘమాడ వివేకి బు ద్ధిం దలంపఁ
బంచతీర్థంబు లందిచ్చుఁ • బంచజనుల, కాత్మసలిలావగాహపు•ణ్యాతిశయము. 172

వ. అగస్త్యేశ్వర, రామేశ్వర, నాకుపేశ్వర, గణేశ్వర, పాతాళభైరవేశ్వరులను దేవతాపంచకంబుఁ బంచతీర్థంబులను దర్శించి మానవుఁడు పంద్రెండు పుణ్యతీర్థంబులు దర్శించిన ఫలంబులందు మూలస్థానేశ్వరలింగం బాదిమూలం బద్దివ్యలింగంబు దర్శించి భీమమండలంబునందు శివలింగస్థానంబులెన్నిగల వన్నియు దర్శించిన ఫలంబు గైకొను వెండియు. 173

---

166. బోధఘనుడు=ఎక్కువ తెలివికలాడు; నిర్నిద్రభద్రుడు=నిత్యమంగళములు కలాడు; ఆస్పదంబు=చోటు; అవ్విరూపాక్షునగరన్ = దక్షారామమున. 167. హిమవత్...కారంబు=హిమవదీశుని గుడిలోని నైవేద్యవేళ వాయించు గంట చప్పుడు; ప్రాణ...వేళ=చనిపోవునప్పుడు; దుర్దమ...ధ్వనుల్=వినరాని యముని వాహనమగు దున్నపోతు మెడలోని గంటచప్పుళ్లను. 168. దివిన్ = స్వర్గమున. 169. సప్త...విలోచనుని=సూర్యచంద్రాగ్నులు నేత్రములు గాకల శివుని; అభ్యర్చితులకున్=పూజించువారికి. 170. మౌళిన్=తలపై; ఉనిచినన్=ఉంచినను; గుడిఁ దిరిగినన్—ప్రదక్షిణము చేసినను. 171. పంచజనులు=మానవులు. 172. వాపి=బావి; తటాక=కొలను; కుల్య=కాల్వ; అందు+ఇచ్చును; ఆత్మ...అతిశయము=తమలో స్నానము చేసిన ఫలము.

తే. సప్తగోదావరము భీమ • శంకరునివి, నాకు వేశిస్వయంభు వి • నాయకాణి
శుద్రపాదంబులును సమారూఢభక్తిఁ దలతురెవ్వారు వారపో ధన్యమతులు. 174

వ. అని దక్షారామమాహాత్మ్యంబును భీమలింగమహిమంబును సప్తగోదావర ప్రశస్తియు ద్వాదశతీర్థప్రభావంబును బంచతీర్థప్రయోజనంబును వినిపించి కుంభసంభవుండు. 175

తే. భీమనాథునిఁ ద్రిభువన • స్వామిఁ గొలువఁ
బోదమే యిప్డు మధ్యాహ్న • భోగవేళ
నదెవిజృంభించె నాట్యసౌ • ధాంతరమున
నృత్యజాగరుకంకృతమృదంగ • నిస్వనంబు. 176

వ. అని పలికి అనంతరం బయ్యిరువురు రాజమార్గంబున. 177

—• అగస్త్యవ్యాసులు భీమేశ్వరాలయంబుఁ బ్రవేశించుట •—

సీ. త్రిపురసంహారంబు • దివిజనాయకభుజా, స్తంభదంభోళిసం • స్తంభనంబు
గరళకూటమహాగ్ని • కబళనాటోపంబు, దక్షాధ్వరక్రియా • ధ్వంసనంబు
మత్స్యలాంఛనదర్ప • మథనసంరంభంబు, దేవదారువనప్రదేశవిహృతి
నురులింగమూర్తివి • స్ఫురణవిలాసంబుఁ, గాత్యాయనీకర • గ్రహణకేలి

తే. గండవేదండదానవ • ఖండనంబు, దండపాణిజలంధరాం • ధకవధంబుఁ
బాడు గంధర్వపతులచే • భరిత మైన, మొగలివాకిలి సొచ్చి రమ్మునిపుంగవులు. 178

సీ. పంచాంగశుద్ధిగాఁ బరిఢవించుచు శృంగి. మతినాడు నెందేని • ప్రతిదినంబు
త్రిదశవర్గంబు ముప్పదిమూఁడుకోట్లును, నేకదేశమున నెందేనియుండుఁ
బలుకుపూఁబోణి యుర్వదినాల్గుకళలతో, విహరించు చెందేని • విద్యచూపు
సాని యీశానియై • సవరించు నెందేని, మహితపించాలీల • మరులు వీట

తే. నెద్ది కైలాసశిఖరికిఁ • బెద్దయుద్ది, పాలమున్నీటి కెయ్యది • ప్రసవభూమి
చంద్రలోకంబునకు నెద్ది • సాటియట్టి, భువనికళ్యాణ(విధి)మంట • పంబుఁ గనిరి. 179

174. వారపో = వారేకదా ! 176. నృత్య...నిస్వనంబు = నాట్యమందిరమునఁజేయు మద్దెల చప్పుడు. 178. దివిజ... స్తంభనంబు = ఇంద్రుని వజ్రాయుధముతో గొట్టుట; మత్స్య...సంరంభంబు = మన్మథ గర్వభంగము; విహృతి = విహారము; గండ...ఖండనంబు = గజాసుర సంహారము; మునిపుంగవులు = ముని శ్రేష్ఠులు. 179 మతినాడున్ = తెలివిగా నాట్యము చేయును; త్రిదశవర్గంబు = దేవతలు; ఏకదేశమునన్ = ఒక్కచోట; పలుకుపూఁబోణి = సరస్వతి; సాని = రాణి; ఈశాని = పార్వతి; మరులున్ = తిరుగును; పెద్దయుద్ది = పెద్దఉపమానము; పాలమున్నీటికి = క్షీరసముద్రమునకు; ప్రసవభూమి = పుట్టినచోటు.

ఉ. దానికిఁ దూర్పుదిక్కున సు • ధాకరబింబసహస్రకోటి శో
భానిభకాంతితో గగన • భాగము రాయుచు భీమనాయకే
శానమహాట్టహాసరుచి • సంపద సొంపువహించి నట్టిశ్రీ
భానుజవైరిమండపము • దివ్యమునీంద్రులు గాంచి రయ్యెడన్. 180

వ. అనంతరం బా బహిర్గేహప్రదేశంబున. 181

తే. నిఖిలపరివారదేవతా • నివహమునకు, వందనమొనర్చి యుత్తర • ద్వారభూమి
శశికళామండనునకును • శంకరునకుఁ, జేసి రభివాదనంబులు • సిద్ధమునులు. 182

ఉ. తండుభుజార్గళాకలిత • తప్తమహాకలధౌతఘంటికా
మండితవేత్రదండపరి • మర్దనభీతివశాత్పలాయితా
ఖండలముఖ్యదైవతని • కాయముసంయమిభాగధేయముం
ఖండకుఠారు మోసల సు • ఖంబునఁ జొచ్చిరి శైవపుంగవుల్. 183

వ. ప్రవేశించి భక్తిశ్రద్ధానుపూర్వకంబుగా నంతర్భవన ప్రదక్షిణంబుచేయువప్పుడు తిరుచుట్టు మాలికయందు. 184

సీ. వణఁకుగుబ్బలిరాచ • వారికూరిమికన్య, భీమయ్య శుద్ధాంత • భామఁ గొలిచి
కంధరంబుననుండి • గంధసింధురమైన, గుజ్జువేల్పుఁ గుమార • గురుని గొలిచి
కైవల్యనిధికి దు • ర్గామహాదేవికి, సర్వమంగళకు నం • జలిఘటించి
యాశాతటీపట • లీశాటికాకటు, వటుకభైరవు నిష్ట • వరదుఁ జూచి

తే. నలువ సేవించి యిందిరా • నాథుఁ గాంచి, యితరపరివారదేవతా • వితతి కెల్ల
నేటికోళ్లిచ్చియెక్కి ర • మ్మేటిమునులు, మృడునిహాటకశైలంబు • మీఁదినిలువు. 185

శా. సందర్శించిరి భీమనాథుఁ ద్రిజగ • త్సమ్మోహనాకారు న
ర్ధేందూత్తంసుని దక్షిణాబ్ధిలహరీ • హేలావిహారక్రమా
స్పందాయాగతగంధవాహపరిష • త్పానాతిరేకస్ఫుర
త్తుందిస్వాంగక దందశూకకటకా • స్తోకేష్ట బాహార్గళున్. 186

---

180. సుధా...కాంతి = కొన్ని వేలకోట్ల చంద్రబింబముల కాంతి; రాయుచు = అంటుచు; భీమ...సంపదన్ = భీమేశుని అట్టహాస కాంతి; భానుజవైరి = యమునకు శత్రువు (మృత్యువులేనివాడు). 183. తండు...నికాయము = తండుఁడను ప్రమథుడు చేతితో పుచ్చుకొన్న బంగారుగంట గల్గిన దండముతోడి దెబ్బలకు జంకి పారిపోయెడి ఇంద్రాదిదేవతలుకలది; సంయమిభాగధేయము = మునుల యదృష్టము; ఖండకుఠారుఁడు = శివుఁడు; మోసలన్ = మొగసాలను. 184. తిరుచుట్టుమాలిక = గుడిచుట్టుప్రదేశము. 185. వణకు...కన్య = హిమవంతుని కూతురు; శుద్ధాంత భామ = భార్య; కంధరము = కంఠము; గంధసింధురము = ఏనుగు; గుజ్జువేల్పు = వినాయకుడు; ఆశా...కటువు = దిగంబరుని, ఏటికోళ్లు = నమస్కారములు; మృడుని = శివునియొక్క; హాటక...నిలువు = బంగారుగుడి పై అంతస్థు.

కం. దృష్టించి భక్తిపరతను, సాష్టాంగం బెరఁగి యమ్మ • హాదేవుని నా
శిష్టమునుల్ పూజించిరి, యష్టాపదనిర్మితంబు • లగుకుసుమములన్. 187

ఉ. కేవలభక్తిసంపదలు • గీలుకొనన్ హృదయాంబుజంబులన్
దేవరకుం గృపానిధికి • దేవశిఖామణి కర్థి సప్తగో
దావరవాహినీకనక • తామరసంబులఁ బూజచేసె పై
త్రావరుఁడుండు దానును బ • రాశరసూనుఁడుఁ గూడి వేడుకన్. 188

వ. అప్పుడు పారాశర్యుండు పెన్నిధానంబుఁగన్న పేదయుం బోలెఁబరమానందంబునుం బొంది కుంభసంభవుం జూచి మునీంద్రా నీ ప్రసాదంబున భీమమండలంబవలోకిఁచితి. ద్వాదశక్షేత్రతీర్థంబులు చూచితిఁ, బంచతీర్థంబులాడితి, దక్షారామంబుఁ గంటి, భీమేశ్వరు దర్శించితి, ధన్యుఁడనైతిఁ గృతార్థుండనైతి నింక నీవు పత్నీసహితంబుగా నేవలనైన నుండి తపంబు సేయుము. నేనును విశ్వనాథ విరచితావమాన ఖేదంబువాయ నీ స్వామిని సేవించెద నని వలికి సముచిత ప్రకారంబున నమ్మహాత్ముని వీడుకొలిపి యనంతరంబ శిష్యులుం దానును, 189

—♦ వ్యాసుఁడు భీమేశ్వరార్చనంబు సలుపుట ♦—

సీ. పంచతీర్థములాడి • శివలింగసన్నిధిఁ, బ్రాసాద పంచాక్ష • రము జపించి
సొరిది నల్ దిక్కుల • సోమేశ్వరములందు, భక్తిఁ బ్రదక్షిణం • బాచరించి
కుక్కుటేశ్వరు కేళి • కూళి నుద్భవమైన, మణికర్ణిక నొనర్చి • మజ్జనంబు
నోంకారపురత్రికూ • టోదరస్థితులైన, హరిహరబ్రహ్మల • నభినుతించి
తే. తుల్యగోదావరీనదిఁ • దోయనిధిని, సప్తగోదావరంబున • స్నానమాడి
యాచరించు శివార్చనం • బనుదినంబు, దక్షవాటికనుండి సత్యవతిసుతుఁడు. 190

కం. భీమేశ్వరమహిమంబున, నామోదముతోడ నోల • లాడుచు నుండున్
భీమేశ్వరచరణారుణ. తామరసంబులకు సంత • తముఁ బ్రణమిల్లున్. 191

సీ. మాతృగర్భాగార • జాతఖేదమువాయ, హరునిగర్భాగార • మాశ్రయించుఁ
బరమేశ్వరార్చనా • పరత నించుక తన్ను, నత్యంతధన్యుఁగా • నాత్మఁదలఁచు
హర్షించిహర శివ • త్ర్యంబకాచలగర్వ,శివయంచు రోమాంచ•పటలిఁదాల్చుఁ
గరతాళకలన శం • కరగీతములువాడు, లజ్జాభిమానంబు • లుజ్జగించి

---

186. దక్షిణ...అర్గళున్ = దక్షిణసముద్రమునుండి వచ్చు గాలిని యథేచ్ఛముగా త్రాగినందున బలిసిన సర్పములే కంకణములుగాగల భుజములు కలవాని. 187. దృష్టించి = చూచి; ఎరగి = నమస్కరించి; అష్టాపదనిర్మితములు = బంగారుతో చేయబడినవి. 188. అర్థిన్ = బాగుగా; తామరసంబులన్ = పద్మములతో; పరాశరసూనుడు = వ్యాసుడు. 189. ఏవలనైన = ఎక్కడనైనను; వీడుకొలిపి = సాగనంపి. 190. సొరిదిన్ = వరుసగా; కేళికూళిన్ = చెరువులో; తోయనిధి = సముద్రము.

తే. 'భీమ భీమేశ్వరేశ్వర • భీమనాథ, దక్షవాటిపురాధ్యక్ష • దర్పకారి
సప్తగోదావరోత్సంగ • జయమహేశ, నన్నురక్షింపు'మనుచువి • న్నపము సేయు. 192

కం. బాలోన్మత్తపిశాచద, శాలంబనమునఁ జరించు • నంగడివీథిన్
వ్రీళాశూన్యతఁ గంతే; కాలునిపాదములమీఁదఁ • గలుగువిరాళిన్. 193

సీ. పరిరంభి మొనరించు • బాహాద్వయంబున, దేవదేవునిసుధా • దివ్యమూర్తిఁ
దాఁకింపుకొను జటా • స్తబకంబు విరియంగఁ, బానవట్టముతోడ • ఫాలతలము
గురుదక్షపురిలోడఁ • గూడఁ బట్టణమున, కంగప్రదక్షిణం • బాచరించుఁ
బాతాళభైరవ • ప్రముఖనానాదిశా, పరివారదేవతా • ప్రతతిఁదెలుచుఁ

తే. గాశికాపట్టణద్రోహిఁ • గావు మనుచు, విశ్వపతిదూషితుని బ్రోవు • విశ్వనాథ
కల్లచేసితి రక్షింపు•కాలకంఠ,•యనుచుఁ బ్రార్థించు భీమనా•యకునిఁ దపసి. 194

సీ. అఘముల కొండంప్రా • యశ్చిత్తములు లేవు, నిన్నుఁజూచుటకంటె • నీలకంఠ
నీమండలంబున • నిఖిలజంతువులకుఁ, దారకం బల భ్రాంతి • దశను దోఁచుఁ
గలియుగంబునయందుఁ • గడుదుర్లభంబులు, భవదీయదర్శన • స్పర్శనములు
నీదక్షవాటికా • నిలయంబునందుండు, జనులకు భోగమో • క్షములు వలఁతి

తే. శిష్యులును నేను మిమ్ముఁగొ•ల్చెదము భక్తి, విశ్వపతికోపమునఁగాశి • వెడలివచ్చి
తరసి రక్షింపు మమ్ము ద • యార్ద్రహృదయ, శాంతభీమేశ్వరేశ్వర• స్వామినాథ. 195

వ. అని మఱియుఁ గృష్ణద్వైపాయనుండు భక్తితృష్ణాతిశయంబున. 196

— వ్యాసు డీశ్వరు నుతించుట —

సీ. దేవదేవునకు నా • దికి నాదియగువాని, కంబికాపతికి ద • క్షాధ్వరారి
కహితపురత్రయా • ధ్యక్షసంహరునకు, హరిలోచనాంబుజా • భ్యర్చితునకు
బ్రహ్మాదిదేవతో • పాస్యసన్మూర్తికి, నమృతమూర్తికిని స్వ • యంభువునకు
నిగమార్థవిద్యోప • నిషదంగనామౌళి, చుంబితశ్రీచర • ణాంబుజునకు

192. మాతృ...ఖేదము=తల్లికడుపునపుట్టుటవలనిబాధ; రోమాంచపటలిన్=గరిపాటును; కరతాళకలనన్=చప్పట్లు చరచుచు; దర్పకారి=మన్మథునిశత్రువు. 193. బాల...ఆలంబనమునన్ = పిల్లవాడు, పిచ్చివాడు, పిశాచములయవస్థపట్టి; వ్రీళాశూన్యతన్=సిగ్గులేక; విరాళి=వియోగవ్యథ. 194. పరిరంభము=కౌగిలింత; బాహాద్వయము=రెండుచేతులు; జటాస్తబకము=జడలగుంపు; ప్రతతి=సముదాయము; తెలుచున్=ప్రార్థించును; కల్లచేసితిన్=పొరపాటుచేసితిని. 195. అఘములు=పాపములు; ఒండు=మరొక; తారకంబు=తారకమంత్రము; అల భ్రాంతి దశను=తెలివితప్పినవేళ; వలఁతి=తేలిక; వచ్చితి+అరసి=వచ్చితరసి.

తే. భోగమోక్షంబు లతిపాప • బుద్ధులకును, గనుటనొసఁగెడు ప్రత్యక్ష • కల్పశాఖి
కఖిలగంధర్వయక్షసి • ద్ధాదిదివ్య, వంద్యునకు మ్రొక్కెదను భక్తవత్సలునకు. 197

సీ. శ్రీభీమనాయక • శివనామధేయంబుఁ. జింతింపనేర్చిన • జిహ్వజిహ్వ
దక్షవాటీపురా • ధ్యక్షమోహనమూర్తిఁ, జూడంగనేర్చిన • చూపుచూపు
దక్షిణాంబుధితట • స్థాయిపావనకీర్తి.చే నింపనేర్చిన • చెవులుచెవులు
తారకబ్రహ్మవి • ద్యాదాతయౌదల, విరులు పూన్పఁగనేర్చు • కరము కరము

తే. ధవళకరశేఖరునకుఁ బ్ర • దక్షిణంబు, సర్థిఁ దిరుగంగనేర్చిన • యడుగు లడుగు
లంబికానాయకధ్యాన • హర్షజలధి, మధ్యమునఁ దేలియాడెడు•మనసుమనసు. 198

ఉ. మాటలు పెక్కులేటికిని • మందరభూధరమంథనక్రియా
పాటలఘూర్ణమానజల • రాశిమహోదధికాలకూటసం
ఘాటకృపీటసంభవవి • శావిశటస్ఫుటవిస్ఫులింగవి
స్ఫోటపవిత్రసద్భువన • భూతభయాపహు నాశ్రయించెదన్. 199

స్రగ్ధర. కౌక్షింభర్యంబుదీర్పం • గడుపున కిడుదుం • గాలసంప్రాప్తభిక్ష
న్వీక్షింతుం బోధశక్తి • న్విషయముల మదిన్ • నిస్పృహత్వంబు దాల్తున్
దక్షారామాధినాథున్ • ధవళవరకరో • త్తంసజూటీవిటంకు
న్వీక్షింతున్ భీమనాథుం • ద్రిభువననమితున్ • నేత్రముల్ తృప్తిపొందన్. 200

శా. అష్టాశీతిసహస్రసంయమిజన • వ్యాకీర్ణతీరద్వయీ
జుష్టోదంచితసప్తసింధుసలిల • స్రోతోవగాహక్రియా
తుష్టస్వాంతుఁడనై భజింతుఁ గరుణా • దుగ్ధాబ్ధి భీమేశ్వరున్
దృష్టాదృష్టఫలప్రదానవిభవా • ధిష్ఠానచేతస్కునిన్. 201

ఉత్సాహము. యక్షసిద్ధసాధ్యఖేచ • రోరగడకిన్న రా
ధ్యక్షమణికిరీటకోటి • తరుణకిరణమంజరీ
ప్రేక్షణీయచరణకమలు • భీమనాథ దేవునిన్
దక్షవాటికాపురైక • ధాము నాశ్రయించెదన్. 202

---

197. నిగమార్థ...అంబుజుఁడు = ఉపనిషద్విద్యలను స్త్రీలకిరీటములచే చుంబింపబడిన పాదపద్మములు కలవాఁడు; కల్పశాఖి = కల్పవృక్షము. 199. మందర...భయాపహున్ = మందరపర్వతముచే మథింపగా వచ్చిన కాలకూటపు నిప్పుచే భయపడిన లోకులను చిటికలో రక్షించినవానిని. 200. కౌక్షింభర్యము = పొట్టనింపుకొనుట; కాల...భిక్షన్ = వేళకుదొరికిన భిక్షను; బోధశక్తిన్ = తెలివిచే; నిస్పృహత్వము = కోరికలేకుండుట; ధవళ...విటంకున్ = చంద్రకిరణభూషితమైన జటాజూటముకలవాని; త్రిభువననమితున్ = ముల్లోకములవారిచే నమస్కరింపబడువాని.

ఉత్సాహము. నిష్ఠతో భజింతు భీము • నిం భుజంగహారునిన్
దిష్ఠునిన్ రవిష్టసంప్ర • తిష్ఠునిం గరిష్ఠ భూ
యిష్ఠ దక్షవాటికాష్ఠ • లీశు దేవతాకుల
జ్యేష్ఠునిం వసిష్ఠముఖ్య • శిష్టమునిజనార్చితున్. 203

లయగ్రాహి.

నీమమునె మ్మొక్కెదను • హేమగిరిచాపునకు•సామజజలంధరము•ఖామరవిరోధి
గ్రామమదహారి కభి • రామశుభనిర్మలను•ధామయశరీరునకుఁ•గామితవితీర్ణ
శ్రీమహిమశాలికి జ•రామరణదోషపరి•శామకనిజాంఘ్రియుగ•శీమృతికి దక్ష
రామపురధామునకుఁ•గోమలజటామకుట•ధామహిమధామునకు•భీమునకుభక్తిన్. 204

సీ. కొలుతు సద్యోజాతుఁ • గోమలైందవతనుఁ, బెద్దగుబ్బలిరాజు • బెండ్లికొడుకు
సేవింతు శ్రీవామ • దేవు మహాదేవు. నేడులోకంబులు • నేలుతేనిఁ
వెలుతుఁ దత్పురుషు నిం•దీవరవర్ణనీల, చారుకంధరుని బ • శ్యల్లలాటుఁ
బ్రణుతింతు నీశాను • ఫాలనేత్రానల, జ్వాలాసమాలీఢ • శంబరారి

తే. సర్గసంసారశూన్యుని • సంస్తుతింతు, సర్గసంసారహేతువు • సంస్మరింతు
సర్గసంసారరూపిని • సంశ్రయింతు, నభవు భీమేశ్వరేశ్వరు • నభిలషింతు. 205

సీ. ఎవ్వనియాజ్ఞ నీ • రేడులోకంబులు, వర్తించు నట్టిదే • వరకుఁగాక
గ్రహతారకములు ని • క్కముగ నెవ్వని యాజ్ఞ, వర్తిల్లునట్టిదే • వరకుఁగాక
మనువులుపదునాల్గు • రును యదాజ్ఞాయుక్తి, వర్తింతురట్టిదే • వరకుఁగాక
భువనపాలకులు య • ద్భూలతాజ్ఞాయుక్తి, వర్తింతురట్టి • దేవరకుఁగాక

---

201. అష్టాశీతిసహస్ర=88 వేల; సంయమిజనవ్యాకీర్ణ=మునులచే నిండిన; తీరద్వయీ=రెండుతీరములను; జుష్టోదంచిత=కలిసెను; సప్త...క్రియా=సప్తగోదావరజలస్నానముచే; తుష్టస్వాంతుడు = సంతోషించినమనస్సుకలవాడు; కరుణాదుగ్ధాబ్ధి=కరుణాసముద్రుడు; దృష్ట...చేతస్కునిన్ = అదృష్టఫలమునిచ్చుమనస్సు కలవాడు. 202. ఖేవిహార=ఖేచరులు; మణికిరీట...కములన్=మాణిక్య కిరీటముల కాంతులచేచూడనొప్పు పాదకమలములు కలవాని. 203. భీమునిన్=శివుని; తిష్ఠుడు=శాశ్వతుడు; రవిష్టసంప్రతిష్ఠుడు=సూర్యుని కోరిక తీర్చినవాడు. 204. నీమము=నియమము; హేమగిరిచాపుడు=మేరువు విల్లుగాకలవాడు; సామజ=గజాసురుడు; గ్రామమదహారి=త్రిపురసంహర్త; కామిత...శాలి=కోరికల నిచ్చువాడు; జరా...మృతి=జరామరణములను దోషముల నుపశమించు పాదద్వంద్వమును మృత్యుదేవత కలాడు (అతని పాదముల ధ్యానించినవారికి జరామరణము లుండవు) హిమధాముడు=చంద్రుడు. 205. కోమలైందవతనున్=లేతవెన్నెలవంటి శరీరముకలాడు; పెద్ద...కొడుకు=హిమవంతుని యల్లుడు; పశ్యల్లలాటుడు=లలాటనేత్రముకలాడు; శంబరారి=మన్మథుడు; సర్గ=సృష్టి.

తే. ధూర్జటికిఁగాక భీమనా • థునకుఁగాక, నిఖిలకారుణ్యకల్యాణ • నిధికిఁగాక
యన్యదైవంబులకు నేల • యధికభక్తి, సంఘటింతుఁ గరాంబుజాంఁజలిపుటంబు. 206

కం. క్షమియింపు భీమనాయక, కమలభవాద్యమరరాజ • కాంచనమకుటీ
సముదయమణిఘృణిరేఖా, కమనీయపదాంబుజోప • కంఠోద్దేశా. 207

కం. కావుము దక్షారామపు,రీవల్లభ భీమనాథ • త్రిజగదధీశా
కైవల్యభోగలక్ష్మీ, ప్రావీణ్యప్రదకటాక్ష • భక్తాధీనా. 208

కం. కృపగల్గి భీమనాయక, యపరాధము సైఁపు తండ్రి • వోమువో కావో
కృపగల్గి సుతుఁడు చేసిన, యపరాధము తండ్రిసైఁచు • టర్హంబె కదా. 209

వ. అని ప్రార్థించి భక్త్యావేశంబున గద్గదస్వరకంఠుండును బాష్పకలితలోచనుండును
రోమాంచపటలకంచుకితనిఖిలావయవుండును నై వెండియును. 210

సీ. గరళకూటవినీల • కంఠాయ శంభవే, మదనాంతకా యోన్న • మశ్శివాయ
కాద్రవేయాధిప • గ్రైవేయభూషాయ, మధుభిత్సఖా యోన్న • మశ్శివాయ
కుంభినీధరసుతా • కుచకుంభపరిరంభ, మహాలోలుపా యోన్న • మశ్శివాయ
వేదాదినిశ్శేష • విద్యావధూమౌళి, మణికలాపా యోన్న • మశ్శివాయ

తే. గంధదంతావళజలంధ • రాంధకారి, విబుధపరిపంథివాహినీ • నిబిడవర్గ
ఖండఘోరాంధకారసం • భారకిరణ, మాలినే శాశ్వతా యోన్న • మశ్శివాయ. 211

వ. ఓం జయజయ దేవదేవ గంధర్వసిద్ధ విద్యాధరచారణకిన్నర కింపురుష లహం
పూర్వికాసంపుల్లపుటంబు లగుచేతస్సంపుటంబులం బుటబుట నగుభక్తివిశేషంబుల
శేషాహిరటకభూషావిశేషాభిరామంబు లగు మీ కోమల శ్రీపాదకిసలయంబుల
ఘుసృణమణికోటీర కోటీవిటంక సంఘనిత మందారమాలికామకరందబిందుధారా
ధోరణీప్రవాహంబుల నహరహంబును నభిషేకింతురు; దంతేకాలా ! మీ కంఠ
మూలంబునం గలుపదండ కైవడిం గనుపట్టు కరాళకాలకూటవిషమషీకళంక పంక
చ్ఛాయాచ్ఛటాగుళుచ్ఛంబులవలన నిఖిలలోక సంరక్షణంబు నిగమవ్యాఖ్యాతంబు;
మహానటా ! మీ జటాజూటపటలంబున డిగిన వియద్గంగా నిర్ఝరస్రోతశ్శలా కా
నికాయంబులఁ త్రిలోకీ కంఠోపకంఠంబులు తారహారవల్లీమతల్లిభంగి నంగీకరించు;
శంకరా ! నీవు సంకర్షణరుద్రావతారంబునఁ బాతాళగోళంబు వెడలి విషదహనవిస్ఫు

206. ఈ లేదు = 14; యదాజ్ఞాయుక్తికే = ఎవనియాజ్ఞచే; కర...పుటంబు = దోసిలి. 207. కమల...ఉద్దేశా = బ్రహ్మాదిదేవతల కిరీటములందలి మణులచే నంద మైనపాదప్రాంతముకలవాడా ! 209. సైచుట = మన్నించుట. 210. రోమ...అవ యవుడు = గగుర్పొడిచిన అఖిలావయవములుకలవాడు. 211. కాద్రవేయ = సర్పములు; కుంభినీధర = పర్వతము; మహ = ఉత్సవము; విబుధ...మాలినే = రాక్షససేనల నెడి చీకటికి కిరణమాలయైనవాడు.

లింగవికటదంష్ట్రాటంకకిటకిటత్కారఘోరంబును జిహ్మాలంబును నగువదనగహ్వ
రంబునఁ బుండరీక శవాండపిండంబు లొండొండనణంగఁ గవిసి మ్రింగుదు;
ధూర్జటీ! విలయపర్జన్యగర్జాడంబరంబును విడంబించు కహకహాట్టహాసంబునన్
బిట్టుధట్టించి యవష్టంభసంభారదుర్వారగర్వారంభసముజ్జృంభితుండగు జంభారిభుజా
ర్గళవిజృంభణంబు హస్తధృతదంభోళితోడన స్తంభించితి; ధనదసఖా! నిఖిలకకుభ
వధిపరిధివలయంబులఁ గలయఁ గనత్కనకనఖశలాకానికాయచ్ఛాయాదాయాదంబు
లగుసముజ్జ్వలజ్వాలాజాలంబులు విజృంభింప ననలస్తంభ దివ్యలింగాకారంబున
నావిర్భవించి నిలువుభూభువన చక్రవాళ పర్యంతం బాక్రమించి పెరిఁగినప్పుడు
విరించి రాయంచయుఁ గైటభారి కిటియును నై యెగసియుడిగియును దుదమొదలుఁ
దెలియరైరి; రుద్రా! నీవు భద్రదేవద్రుమాటవీ వాటియందు దిసమొలదూఁబయి
దిండిమిండజంగంబవైబుధులపుణ్యాంగనల యీలువు లపాంగరంగస్థలీలాస్యలంపటం
బులగు కటాక్షవీక్షణంబుల హరించుచు భిక్షాటనక్రీడను నటించితి; చండీశ్వరా!
నీవు మేరుకోదండంబునఁ బుండరీకాక్ష కాండంబు దొడిగి కుండలిజ్వాలావల్లరీ
ఝల్లరుంకారంబునఁ బంకరుహభవాండంబు బీఁటగిల్ల నిశాటపుటభేదనంబు లొక్క
యేటున చటచ్చట నేసితివి; నీలలోహితా! యహరహోవధిసంధ్యా సమయారంభం
బుల నుద్దేశదినావసానంబుల సానందంబుగాఁ బరిఢవించు జగఝుంకారంబైన యార
భటీతాండవసముద్దండ పాదభ్రమణవిభ్రమంబునఁ ద్రిభువనభయంకరంబు గావించితి;
సర్వజ్ఞా! నిర్వికల్పంబు నిరస్తసమస్తోపాధికంబును సత్యజ్ఞానానందంబునకు నికేత
నంబును నగు నిష్కళంకస్వరూపం బగువేదానువచనశాంతిదాంతిక్షాంతిశ్రవణ నిధి
ధ్యాసనాదులగుసాధనంబుల నిర్ణిరోధనిరవగాధనిరవబోధకక్ష్యావిభాగంబునం దక్షీభ
వించి ముముక్షులు లాభలక్ష్యంబును నభీక్షణంబును నభీప్సితంబును ననుభవింతురు;
భర్గా! భార్గవభృంగ్వంగీరసప్రధాననానామునిసమూహవిహితచరితాఘమర్షణ స్నానా
హ్నికౌఘయు నిజజలావగాహాపహనిఖిలాఘయు జాహ్నవీసపత్నియు నగు గోదా
వరీమహానది నీకుంగేలీవిహారం బగు కేళాకూళి; నిటలనయనా! గిటగిటని నడుగు
నడుగునడుఁకునడుములు, వెణఁదలగు తెలికన్నులును నెటిసురులును, వలుదకుచ
ములును గలిగి ననవిల్తునకుఁ బసగలపసిండి మెఱుంగు ములుకులనం గలికిచిలు
కల కొలుకులగుబిసరుహదళనయనలు ముసురుకొని బలసి నిలిచి కొలువఁ బ్రతి
సంక్రమణ వారోత్సవాదులయందుఁ బేరోలగం బవధరింతువు; శర్వా! నీవుశర్వరీ
సార్వభౌము నొక్కహజ్జునగుజ్జురూపంబునమట్టితివి; కుసుమశరమథనా! బిసరు
హాభవుని కివలయోష్ఠి నాసికాతిలప్రసూనంబు నఖశిఖరాగ్రంబున మొదలంటం
జిదిమితి; వృషభధ్వజా! నీవు పూషుండనుపేరి రవి పండ్లురాలఁగ్రుద్దితి; యీశ్వరా!
నీవు వైశ్వానరుని సప్తజిహ్వాపల్లవంబులు పెల్లగిలగిల్లితి; విరూపాక్ష! నీవు దక్ష
ప్రజాపతి కంఠంబున మేషంబుతల నిల్పితి; మృగవ్యాధా! నీవధ్వరమృగంబు మస్త

కంబు నిఖస్తలంబున వ్రేలంగట్టితి; ముక్కంటీ ! నీకు మ్రొక్కెదను; శివా ! నీకు నవాంజలి; భవా ! నీకు నభివాదంబు; పాండురాంగా ! నీకు దండంబు; రాజశేఖరా ! నీకు జేజే; హరా ! నీకు జోహారు; గిరీశా ! నీకు వరివస్య; యష్టమూర్తీ ! నీకుం బ్రతిష్ఠ; యీశానా ! నీకుదాస్యంబు; త్రిపురహరా ! నీ కుపాసన; మృడా ! నీకు శరణు; మృత్యుంజయా ! నీకుం బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ ! నీకు నమస్కారంబు; కైలాసనిలయా ! నీకుం గోపులు; పశ్యల్లలాటా ! నీకు నేటి కోళ్లు; గౌరీమనోహరా ! నీకు నమస్కారంబు; జయజయ జలంధరాంతకా ! గంధ సింధురాదిదనుజకంధరాపీఠధమనీగళితరక్తధారాభిషిక్త ప్రచండఖండపరశుభిండివాల శూల ప్రముఖబహువిధప్రహరణపరంపరాభీలమహాకారా ! జయజయ జగత్సం భారకుంభికల్పనాకుంభకారా ! కుంభీనసభూషణభీషణభూత ప్రేతపిశాచశాకినీ డాకినీ ప్రౌఢపరీవారా ! జయజయ వియద్వాయుధరణీతరణిశీతభానుబృహద్భాను సలిల యజమానమూర్తి కల్పితాష్టభేదప్రపంచిత విశ్వప్రపంచపంచవదన పంచాక్షరీ మూలమంత్రకారణ పాంచభౌతికవ్యవహారా ! నిర్మల జ్యోతిర్లింగమయమంగళా కారా ! జయజయ! సప్తపాతాళ భువనవిష్కంభనిర్భేదనసమాసాదితావిర్భావదానవ సంహారా ! సర్వమంగళాకుచకలశపాళికేళీతూలికాకారమకరికాముద్రికా భీమముద్రి తోరః ప్రదేశః మహేశః జయజయ భక్తభావనాసులభస్వభావనాతీతపావనాకార భా వశ్యవిగ్రహా: శ్రీమన్మహాదేవ ! దేవదేవతారాధ్య! దక్షవాటీపురాధ్యక్ష! ఆపద్ధ్వాంత దివాకరా ! పరమదయాకరా ! జయజయ శ్రీభీమేశ్వరా ! నమస్తే నమస్తే నమస్తే నమః. 212

మ. అహమం దాండవ మాడుచుండె శివభి • క్త్యావేశలీలార్భటి
స్మునిశార్దూలము దక్షవాటినడుమ • న్లోలజ్జటాభాగుఁడై
వినిపించెన్ వశరీరభారతి వభో • వీథీవిటంకంబునన్
'నినురక్షించెను భీమనాయకుఁడు కా • నీనా ! సుఖం బుండుమీ. 213

తే. కాచె నీతప్పుకల్మష • కంధరుండు, శిశిరకరశేఖరుండు ర • క్షించె నిన్ను
భీమనాథుని ద్రిభువనస్వామిఁ గొలుము, కార్యసంసిద్ధిఁ బొందెదు కానినేయ.' 214

వ. అని యివ్విధంబున నశరీరవాణి పలికిన విని యయ్యంతర్వాణి శర్వాణీవల్లభుం దలంచి పునః పునః ప్రణామంబునాచేసి నితాంతసంతోషతరంగితాంతరంగుండై. 215

సీ. పైల ! దక్షారామ • పతిభీమనాథుండు, మనపాలికల్పక • మ్మగుచు మమ్మె
నోనుమంతుఁడ ! దక్షి • ణోద్యానవాటికా, నిలయుండు మనపాలి • ఫలమునువ్వె

---

212. అహంపూర్వికె = నేను ముందనుమాట; 213. మునిశార్దూలము = ముని శ్రేష్ఠుడు; లోలజ్జటాభాగుడు = ఊగుచున్న జటలుకలవాడు; కానీనుడు, కానినేయుడు = కన్యకొడుకుడు (వ్యాసుడు); 214. కల్మషకంధరుడు = శివుడు; కొలుము = సేవింపుము. 215. అంతర్వాణి = పండితుడు.

జైమినీ! దేవతా • సార్వభౌముఁడు విరూపాక్షుండు ప్రత్యక్ష • మయ్యెఁ జువ్వె
దేవల! సప్తగో • దావరతీరైక వాసుండు మనవంక • వ్రాలెఁ జువ్వె

తే. భారతాదిబహుగ్రంథ • పారవశ్య యోయి జనమేజయుండ! యీ • యుక్షగమనుఁ
డంబికాభర్త యఖిలకల్యాణములును మనకుఁ గృపసేయగలఁడు సమ్మదముతోడ. 216

వ. ఇంకఁ గృతార్థులమైతి మని శిష్యవర్గంబునుం దానును దక్షారామంబున నభిరామం
బైన పరమజ్ఞానానందసుఖం బనుభవించుచుండె. 217

కం. శ్రీరామాయణమును దక్షారామాయణముఁ గలిమలాపహములు స
త్సారములు వాల్మీకికిఁ బారాశర్యునకు వినుతి • పాత్రములయ్యెన్. 218

వ. అని చెప్పిన విని యభినందించుటయు భీమేశ్వరమాహాత్మ్యంబు వినువేడుకం బర
మేశ్వరుం డుద్భవించిన విధంబును సప్తఋషులు సప్తగోదావరంబుఁ దెచ్చిన విధం
బును నాస్వామినిఁ బ్రతిష్ఠచేసిన భంగియు, నెఱింగింపవే యని ప్రార్థించిన. 219

శా. గాంధర్వోపనిషన్మతంగ రసవ • త్కావ్యానుసారానుధా
రంధర్యాపరభోజరాజ రమణీ • ప్రద్యుమ్న దోర్వీర్యగ
ర్వాంధారాతివరూథినీపరివృఢ • ప్రాణానిలాహారవా
తాంధక్రూరకృపాణ రాజహితకా • ర్యారంభపారంగతా. 220

కం. దక్షారామవధూటీ, వక్షోరుహమృగమదాది • వాంఛితవిలస
ద్వక్షఃకవాటబాంధవ, రక్షావిధివజ్రపంజ • ర కృపాజలధీ. 221

పంచచామరము. అభంగవీరవిక్రమార్క • యాజిగాండివాయుధా
ప్రభాతకాలభానుసన్ని • భప్రభావిభాస్వరా
యిభద్విడుగ్రవిక్రమా! స • మిద్ధనర్తనక్రమ
న్నభస్సరిత్పయఃపృషద్గ • ణాచ్ఛవిస్ఫురద్యశా. 222

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథ
నామధేయప్రణీతంబైన భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

216. ఉక్షగమనుడు = వృషభవాహనుడు. 218. దక్షారామాయణము = దక్షా
రామచరిత్ర (భీమఖండము) కలిమలాపహములు = కలిదోషమును పోగొట్టునవి.

శ్రీరస్తు

శ్రీమహా గణాధిపతయేనమః

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## చతుర్థాశ్వాసము



ధామ యశేషదిశా
సౌధాగ్రస్ఫటికకుంభ • సంధారకళా
సాధీయస్థ్సితకీర్తి బు
ధాధార యరేటియన్న • యామాత్యమణీ. 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. 2

సీ. బాదరాయణునకుఁ గుంభ • శివుఁడు చెప్పి
నట్టి యాత్రాక్రమం బిది • యనఘులార
యమరమునినారదుఁడు మునీం • ద్రాదులకును
సర్థిఁజెప్పినపరిపాటి • యదివినుండు. 3

వ. మీర లడిగినయర్థంబుఁ బర్యాయక్రమంబున వినిపించెద. 4

తే. పోయె వారణాశికి బాద • రాయణుండు, శిష్యులును దాను గైవల్య • సిద్ధిఁగోరి
మనసు పోదము గాకంచు•మనను వేడ్క•నరిగి రభ్యర్హితులు వసి•ష్ఠాదిమునులు. 5

కం. యాత్రాజిగీషఁ బుణ్య• క్షేత్రంబులమీఁదఁ దీర్ఘ • సేవాపరులై
మైత్రావరుణబృహస్ప•త్యత్రిభరద్వాజముఖ్య • లగుమునిబుధుల్. 6

ఉ. కాశికి నేగుదెంచి మణి • కర్ణికయందుఁ బ్రయాగయందు నా
కాశనదీప్రవాహమునఁ • గాయము దొప్పఁగఁదోఁగి శంభు వి
శ్వేశు శశాంకశేఖరు న • నేకవిధంబులఁ గొల్చి సంతత
క్లేశవినాశహేతువునఁ • గేవలతాసుఖ మిచ్చఁ గోరుచున్. 7

కం. కేవలతాయకరంబును, భావలతావాటిమలయ • పవనాగమమై
కేవలతాలీలావతి, కే వల దాకాశి మరగు • కృతమతి మనసా. 8

4. అర్థంబు = విషయము. 5. అభ్యర్హితులు = పూజ్యులు. 7. తోఁగి = మునిగి.
8. కేవలతాసుఖము = మోక్షసుఖము.

వ. అని కాశీనగరంబునందుఁ గైవల్యాపేక్షఁ బెద్దగాలం బుండ నిశ్చయించి సాత్యవ
తేయు వెదకి యెచ్చటం గానక. 9

శా. కాశీస్థాననివాసులన్ యతుల భి • క్షాన్నృత్తులం గాంచి పా
రాశర్యుం డెటఁ బోయె నంచు నడుగం • బ్రహ్మవిహీనాత్మకుం
డాశుంఠుం డెటఁబోయెనో యెఱుఁగ మ • య్యా మీరు పోపొండు వి
శ్వేశద్రోహి నెఱుంగ నేమిపని వాఁ • డెచ్చోటికిం బోయెనో. 10

వ. అని సాత్యవతేయుండు చేసిన యపరాధంబు తేటపడం జెప్పిన. 11

తే. కూడుపెట్టక యేన్నాళ్లు • కుతిలపఱచి. గాసిసేయుట యిది తప్పు•గాదె తనకు
నెదురు కెదురేల కోపించె•నిందుధరుఁడు. అకట గ్రుడ్డెఱ్ఱ బాదరా•యణునిమీఁద. 12

కం. ద్వైపాయనముని వెడలం, ద్రోపించిన కోపగాఁడు • ధూర్జటి యీ కా
శీపతి మనలను నసుకం, పాపరుఁడై యిచట నేల • బ్రతుకఁగ నిచ్చున్. 13

వ. కృష్ణద్వైపాయనుతోడిద లోకంబుగాక యనుచు నమ్మునిలోకంబు కాశికానగరంబు
వెలువడి శాఖోపశాఖల నతని చొప్పుపట్టికొని దక్షారామంబు ప్రవేశించి. 14

తే. తీర్థయాత్రాక్రమంబులు • తెలియలేక, నారదుండు నానాపురా • ణజ్ఞుఁడగుట
నతనిఁ బూజించి యందఱు•నడిగి రప్పు•డత్రిజమదగ్నిభృగువసి•ష్ఠాదిమునులు. 15

మత్తకోకిలము. నీవెఱుంగనితీర్థముల్ ధర • ణీతలంబున లేవు స
ద్భావ మొప్పఁగఁ జెప్పు దైవత • తాపసోత్తమ తీర్థయా
త్రావిధానము దక్షవాటిక • థాక్రమంబును సప్త గో
దావరప్రథిమంబు భీమస • దాశివోద్భవు లీలయున్. 16

వ. అని యడిగిన నారదుం డి ట్లనియె. 17

తే. అఖిలతీర్థోత్తమోత్తమం • బనఘులార, పావనం బైనసప్తగో • దావరంబు
తనకుఁదాన మహానదీ•తటమునందు, నెలమినున్నాఁడు భీమేశ్వ•రేశ్వరుండు. 18

తే. సప్తగోదావరంబు ని • ర్ఝరమనంగ భీమనాథేశ్వరస్వామి • వేలుపనఁగ
ధర్మపరులార శబ్దభే • దంబ గాని, యర్థభేదంబు లేదు ప • దార్థసరణి. 19

తే. విమలమతి సప్తగోదావ • రమునఁ గ్రుంకి, సప్తసప్తిప్రతిష్ఠఁ బ్ర • సన్నుఁడైన
భీమనాథేశ్వరేశ్వర•స్వామిఁ జూచు, మనుజులకుఁ బాయు సప్తజ•న్మములయఘము. 20

---

10. శుంఠుండు = మొద్దు. 12. ఏన్నాళ్లు = ఏడురోజులు; కుతిలపఱచి = బాధపెట్టి; గాసిసేయుట = నాశనముచేయుట; గ్రుడ్డెఱ్ఱ = కన్నెఱ్ఱ (కోపము). 13. త్రోపించిన = త్రోయించిన. 14. శాఖోపశాఖలన్ = గుంపులు గుంపులుగా. 16. ప్రథిమంబు = గొప్ప. 19. తా॥ సప్తగోదావరము నదియని భీమేశుడు దేవుడునని శబ్దములు వేరుతప్ప అర్థమొక్కటే. మోక్షమిచ్చుటలో రెండు నొక్కటే. 20. సప్తసప్తిప్రతిష్ఠన్ = సూర్యప్రతిష్ఠచే.

వ. సప్తగోదావరస్నానమంత్రద్వయ శ్లోకములు. 21

శ్లో. సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్తమోత్తమమ్
అత్రసన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః. 22

శ్లో. నమస్తే భీమనాథాయ, సప్తగోదావరాంభసే
పాపేంధనాగ్నయేతుభ్యం, నిమజ్జామి హర త్వయి. 23

ఉ. అతతభక్తిభావమున • నాదియుగంబున సప్తసంయము
ల్గౌతమముఖ్యు లైందవక • ళాధరు భీమయదేవు భక్తి వి
స్ఫీతిఁ బ్రతిష్ఠచేసి యభి • షేకజలార్థము తోడితెచ్చి వి
స్ఖ్యాతసమస్తతీర్థమయి • విశ్రుతి కెక్కిన సప్తసింధువున్. 24

మ. తనతీరంబునఁ బాయకున్నఁ దనపా • థఃపూరముల్ గ్రోలినం
దనవీచీతతిఁ దేలినం దనమరు • ద్వ్రాతంబు సేవించినం
దనుఁగీర్తించిన లోకపావనునిఁగా • ధన్యాత్ముఁగాఁ బుణ్యుఁగా
నొనరించున్ సరు సప్తసింధు పతి యం • హోభంజన ప్రౌఢిమన్. 25

కం. చూడుం డాస్వాదింపుం, డాడుఁడు భీమేశ్వరేశ్వ • రాకృతిఁ దటినీ
చూడారత్నము జలధి, క్రోడాభరణంబు సప్తగోదావరమున్. 26

సీ. పాతాళశ్రీకాల • భైరవస్వామికి, నందికి నభివాద • నం బొనర్చి
నాకులేశ్వరదేవు • నకుఁ దాండవాకార, గణనాయకునకును • బ్రణతిచేసి
కొమరసామిని విష్ణుఁ • గొల్చివిరూపాక్ష, నాగేంద్రులకు వంద • నంబునడిపి
నీహారగిరినంద • నికిమహాలింగంబు, భీమనాథేశ్వర • స్వామి కెరఁగి

తే. మర్త్యుఁ డేకాదశేంద్రియ • మదవికార, సంభృతములైయనన్యైక • సాధ్యములయి
జన్మజన్మాంతరంబులఁ • జాగుచుండు, కల్మషంబులఁబాయుఁదత్క్షణమునంద. 27

22. తా॥ సప్తగోదావరమనుతీర్థ మన్ని తీర్థములలో నుత్తమమైనది. ఇచ్చట భీమేశుడు నిత్యసన్నిహితుడు. 23. తా॥ భీమనాథునికి దండము; పాపములను కట్టెలకు నిప్పువంటి సప్తగోదావరజలమునకు నమస్కారము; నీలో మునుగుచుంటి; నా పాపముల పోగొట్టుము! 24. సప్తసంయములు = సప్తర్షులు; అన్వితసమస్త తీర్థము = అన్ని తీర్థములుకూడినది; సప్తసింధువు = సప్తగోదావరము. 25. పాథఃపూరముల్ = నీరు; వీచీతతి = కెరటములు; మరుద్వ్రాతంబు = గాలి; అంహోభంజనప్రౌఢిమన్ = పాపములు పోగొట్టు నేర్పుతో. 26. జలధిక్రోడాభరణంబు = సముద్రపు కౌగిటనలంకారమైనది. 27. కొమరసామి = కుమారస్వామి; నీహారగిరినందని = పార్వతి; ఎరగి = నమస్కరించి; అనన్యైకసాధ్యములు = ఇతరులచే సాధ్యము కానివి.

శా. జ్ఞానాజ్ఞానకృతంబు లైన యఘముల్ • సర్వంబునొక్కుత్తున
న్మాను న్మానవకోటి కుద్ధురగతి • న్సప్తాపగాతీరసం
స్థానావాసుని రామనాథుని జటా • ఝూటాటవీవాటికా
స్థానాధిష్ఠితదుర్గకంఠ నవ షు • గ్ధస్నిగ్ధకీర్తిద్యుతిన్. 28

తే. ద్వాదశక్షేత్రశివలింగ • దర్శనమున, నెట్టి సుకృతంబు సిద్ధించు • నట్టిసుకృత
మాక్షణంబున సిద్ధించు • దక్షవాటి, రామనాథేశుఁగన్నులా•రంగఁగనిన. 29

తే. ద్వాదశక్షేత్రతీర్థయా • త్రాభివృద్ధి, నిర్జితేంద్రియులై సేయ • నేర్చరేని
పాపములుచేసినట్టి ని • ర్భాగ్యులైన, డాయఁ బోవరు జమునిప • ట్టణముగవిని. 30

ఉ. దక్షిణకాశికాసుహిమ • ధామకిరీటునిచిక్కు సీమగా
దక్షపురంబునందు బహు • ధామములన్ శివలింగముల్ సహ
స్రాక్షహుతాశనాదివివి • ధామరముఖ్య ప్రతిష్ఠితంబులై
లక్షలసంఖ్యలున్నవి య • లక్ష్యములయ్యును గానవచ్చియున్. 31

సీ. పలువ దగ్నిష్టోమ • వాజపేయాదుల, ధూమపానముఁజేసి • దుఃఖపడఁగఁ
దీర్థసేవార్థమై • దేశాంతరంబులు, గాలుచేడ్పడఁ దన • కేల తిరుగ
సశ్వగోమహిషరూ•ప్యసువర్ణవస్త్రంబు, లెన్ని వెచ్చించిన • నేమిఫలము
సంతతంబును గృచ్ఛ • చాంద్రాయణాదుల, వరటుచునుంట యే • వ్వారికిమెచ్చు

తే. దూరమునసనుండితలఁచిన • దురితహరుని, జేరికొలిచిన సకలార్థ • సిద్ధికరుని
సంత్యమావస్థమోక్షదీ•క్షైకగురుని, భీమనాథేశ్వరేశ్వర • స్వామిఁగొలుఁడు. 32

సీ. నేఁ గొమ్ముతేనుఁగు • నే విహగంబను, నే స్తబ్ధరోమంబ • నేను గౌళియ
నేను బకంబను • నేను గర్కటకంబ, నే నచ్ఛభల్లంబ • నేను నక్క
నేను మండూకంబ • నేను గించులికంబ, నేను గీటంబ • నే వానరంబ
నే శుకకీటంబ • నేఁ బుండరీకంబ, నే ఖంజరీటంబ • నేను దోమ

తే. నేను మానిసిమున్నంచు•నేకతమున, నొండొరులతోడుతనుచెప్పు•కొందు రుబుసుఁ
దారకబ్రహ్మమణిపేటి • దక్షవాటి, సంభవించినప్రత్యగ్ర • చంద్రధరులు. 33

తే. అఖిలతీర్థప్రదేశంబు • లడవు లిండ్లు, యజ్ఞవాటిక•పల్లికా • శమవిభేద
మించుకయులేదు భీమనా•థేశభూమి, జంతువులు శంభు లగుదురు•చచ్చినపుడు. 34

28. ఒక్కుత్తునన్ = ఒక్కసారిగా; జటా...ద్యుతిన్ = జటాజూటముననున్న కీర్తికలవాని. 30. జముని...గవిని = యమపురద్వారమున. 31. అలక్ష్యములు = కన్పడనివి. 32. వరటుచు = శుష్కించుచు; 33. కించులికము = వానపాము; ఖంజరీటము = కాటుకపిట్ట; మున్నంచు = క్రితముజన్మలోనని; రుబుసున్ = కబుర్లలో; ప్రత్యగ్రచంద్రధరులు = ముక్తివచ్చి శివరూపమును ధరించిన నూతన శివులు.

శా. సాక్షాద్దక్షిణకాశికానగరి ద • క్షస్థాన మవ్వీటిలో
మోక్షార్థాక్షరదీక్ష నక్షయసుఖం • బుం బ్రాణికిన్ సత్కృపా
వీక్షాసంకలితానురాగుఁడగుచున్ • విశ్వేశుచందంబునం
ద్ర్యక్షుండీశుఁడు భీమనాథుఁ డొసఁగుం • బ్రాణావసానంబునన్. 35

శా. శ్రీభీమేశ్వరపాదపీఠవిలుఠ • చ్ఛ్రీసప్తగోదావర
వ్యాఘుగ్నోర్మిపరంపరాఘుమఘుమ • ప్రారంభకోలాహల
క్షోభోద్వేజితపాతకౌఘము జగ • చ్చూడావతంసంబు ల
క్ష్మీభద్రాసన మొప్పు దక్షనగరీ క్షేత్రంబు ధాత్రీస్థలిన్. 36

వ. అని నారదుండు చెప్పిన విని తపోధనులు భీమనాథుమాహాత్మ్యంబునకు దక్షారామ ప్రభావంబునకు సప్తగోదావరమహిమంబునకు విస్మయంబందియు దర్శించియు నమస్కరించియు ధన్యులైన యాత్మారాము లమ్మహారామంబునఁ జరియించువారు సునగుచు సత్యవతీసుతుం గాంచి దక్షారామాయణుండైన బాదరాయణుపలస నప్పుణ్యస్థానంబున మఱియుం గల యశేషవిశేషంబు లెఱింగి. 37

చం. అటఁజనియొక్కచోటఁ గమలాసనబంధముపూని వాహినీ
తటమున బిల్వకాననల • తాగృహమధ్యమునందు నాసికా
పుటశిఖరాగ్రదృష్టి యగు • పుణ్యుని గాంచిరి మౌనిపుంగవుల్
ఘటమున సుద్భవించిన య • గస్త్యు యశోనిధి బిల్వలాంతకున్. 38

వ. తదనంతరంబ యతనితో సల్లాపంబుల నపనయించి తీర్థమాహాత్మ్యంబడిగిన నతం డిట్లనియె. 39

—♦ అగస్త్యుఁడు తీర్థమాహాత్మ్యంబుఁ జెప్పుట ♦—

సీ. జహ్నుకన్యాతీర • సన్నివేశమునకు, దక్షిణాంభోరాశి • తటముసాటి
రమణీయమణికర్ణి • కాప్రవాహమునకు, సప్తగోదావర • జలముసాటి
కటకరక్షకుఁ డైన • కాలభైరవునకుఁ, బ్రకటపాతాళభై • రవుఁడుసాటి
విశ్వాధిపతియైన • విశ్వనాయకునకు, భీమనాథేశ్వర • స్వామిసాటి

గీ. మోక్షవిభవంబునకు సాటి • మోక్షలక్ష్మి
భోగమహిమంబునకుసాటి • భోగమహిమ
వారణాశికి శ్రీదక్ష • వాటమునకుఁ
దారతమ్యంబుఁజర్చింప • ధర్మమగునె. 40

35. త్ర్యక్షుండు = శివుడు; మోక్షార్థాక్షరదీక్షన్ = మోక్షమునకై తారక మంత్రోపదేశమును. 36. శ్రీ...ఓఘము = భీమేశుని పాదపీఠమును తాకు గోదావరీతరంగశబ్దములచే క్షోభించు పాతకములుకలది; జగచ్చూడావతంసంబు = లోకములో గొప్పది. 38. కమలాసనబంధము = పద్మాసనము. 39. అపనయించి = మాని.

తే. తరమె వర్ణింప సప్తగో • దావరంబు
సలిలకల్లోలశిఖరహ • స్తంబులెత్తి
పాతకంబుల జంకించు • బహువిధముల
ఘుమఘుమారంభహుంకార • ఘోషమెసఁగ. 41

వ. అని కుంభసంభవుండు చెప్పిన విని యమ్మహాత్ముఁడొక్కని నగర ప్రదక్షిణ పూర్వకంబుగా భీమేశ్వరు దర్శించి కృతార్థులై యొక్కరమ్యస్థలంబున నమ్మహామునులు గూర్చుండిరి; యనంతరంబ, 42

ఉ. ఆమునిమండలంబునకు • నంజలి బంధముతోఁ బ్రదక్షిణ
ప్రామనమస్కృతుల్ గడపి • గారవమారఁగ మంకణుండు బు
క్సామయజుర్విశారదుఁడు • శైవపురాణకథారహస్యగో
ష్ఠీముదితాంతరంగుఁడు ప్ర • సన్నుఁడు భక్తి దలిర్ప నిట్లనున్. 43

సీ. పరమపుణ్యుఁడ నైతి • భాగ్యవంతుఁడ నైతి, ధన్యుండనైతి నా • తనసుపండెఁ
దీర్థంబులన్నియుఁ • దిరిగిచూడఁగఁజాల, నొక్కజన్మముననీ • యుర్విలోన
దిగ్దేశముల సర్వ • తీర్థంబులనునాడి, తీర్థభూతత్వప్ర • తిష్ఠఁగన్న
మిమ్మందఱను గంటి • మీకృపాబలమున, నేనుదీర్థమనైతి • నింతనిజము

తే. భీమనాథమాహాత్మ్యంబు • పెంపువినఁగ, వేడ్కయగుచుండు నాకునీ • వేళయందుఁ
బ్రార్థనముచేసివేఁడెద • భవ్యులార, యానతీఁదగు నాకు మీ • లోన నొకఁడు. 44

వ. అనిన విని యందఱు వసిష్ఠమహామునిం బ్రార్థించిన సకల మునిజనానుమతంబునఁ గుంభసంభవుని నియోగంబున నప్పుడు మైత్రావరుణుండు మంకణున కిట్లనియె. 45

కం. భీమ మగుగరళకూటము, భూమియు గగనమును దిశలఁ • బొడచూపినచో
భీమగతి గ్రమింగెఁ గావున, భీమేశ్వరుఁ డయ్యె నితఁడు • బిరుదాంకమునన్. 46

—• క్షీరసాగర మథనకథ ప్రారంభము •—

వ అనిన విని మంకణుండు పంకజాసనసంభవునితో మునీంద్రా దక్షవాటికాధీశ్వరుండు కాలకూటంబు నెట్లుంగి నుపసంహరించె నక్కథాక్రమంబు పరిపాటిందేటపడ నాకెఱింగింపవే యనుటయు నతం డిట్లని చెప్పం దొడంగెఁ దొల్లిజలంధరాంధక మహిషాసుర బిడాలాక్షధూమ్రాక్ష గంధసింధురాసురవిద్యున్మాలితారక బలిబాణ పౌలోమనివాతకవచకాలకేయాదులగు రాక్షసులును పాకశాసన పావకపరేతరాజపల లాశిప్రాచేతసపవనపౌలస్త్యపశుపతి ప్రధాను లగు వేల్పులునుం దమలోన దాయాద

41. సలిల...హస్తంబులు = కెరటములను చేతులు. 43. శైవ...అంతరంగుడు = శైవపురాణకథల వినుటచే సంతుష్టుడైనవాడు. 45. మైత్రావరుణుడు = వసిష్ఠుడు. 46. భీమము = భయంకరమైనది; బిరుదాంకమునన్ = బిరుదు పేరుతో.

సంబంధంబునం బొదమిన వైరానుబంధంబునం బరస్పరవిజిగీషులై రోషంబున నెదురువేలంబులు పెట్టి కట్టుపకాసులై ప్రతిఘటించి బెట్టయి నెట్టుకొని యున్న సమయంబున. 47

సీ. దివ్యాయుధములైదు • ధృతిచేతనంబులై, శత్రుసంహారంబు • సంస్తుతింపఁ
బులుఁగుతేఁడుకరాబ్జ•ములురెండుమొగిడించి, భ్రూలతాదేశంబు•పొలుపునరయ
సౌఖశాయనికులై • సనకాది యోగీంద్రు, లనురాగవీక్షణం • బభిలషింప
నూరు రంభా స్తంభ • యుగళంబుపైనుంచి. లక్ష్మి శ్రీపాదప • ల్లవములొత్తఁ

తే. బన్నగాధీశభోగ త • ల్పంబు మీఁదఁ, దత్ఫణారత్న దీప్తి పై • దళుకుఁ జూపఁ
బాలమున్నీటిలోనిద్ర•మేలుకొన్న,హరికిఁ బొడచూప నేతెంచె•హరిహయుండు, 48

వ. ఇట్లు చనుదెంచి. 49

తే. ఒంటి నేతెంచి మంతనం • బుండి నిలిచి, చక్రధరుతోడ హితకార్య • చర్చచేసి
యేగ దేవేంద్రుఁడిరుచెవి•నెఱుఁగకుండ, సిద్ధసంకల్పుఁడై యాత్మ•శిబిరమునకు. 50

వ. తదనంతరం బాశ్రీమన్నారాయణుండును. 51

కం. ఓ వెఱ్ఱులార యేటికి. నీవెడఁగు విచారములు స • హింపఁగ రాదా
యేవారి కైన మేలా, చావు లతర్కితము లుగ్ర • సంగ్రామములన్. 52

తే. కుడిచికూర్చుండి మీరేల • కొఱఁతమైన, కుష్మలాడెద రో యన్న•దమ్ములార
గొట్టెక్రొవ్వియు నెలగట్టెఁ•గొటికినట్లు.కటకటా మీవివేకంబు•గాడుపడఁగ. 53

ఉ. భద్రము మీకుఁగాపదె స • పారముగా సురదైత్యులార యా
విద్రవ ముజ్జగింపుఁడు వి • వేకము పాడము దప్పకుండఁగా
భద్రసువర్ణపీఠికల • పైఁ గొలువుండి త్రిలోకరాజ్య మ
చ్ఛిద్రముగాఁగనేలుట వి • శేషము చచ్చుట తా విశేషమో. 54

వ. అది గావున సుధాపానంబున జరామరణంబు లుజ్జగించి సుఖం బనుభవింపుఁడు; క్షీరసముద్రమథనంబునం గాని సుధారసంబు సంభవింపదు గావున. 55

---

47. ప్రాచేతస=వరుణుడు; పౌలస్త్య=కుబేరుడు; ఎదురు వేలంబులు—ఎదురుగా నిల్చుండి; కట్టుపకాసులై=యుద్ధమునకు సిద్ధమైనశూరులై. 48. పులుగు రేడు=గరుత్మంతుడు; సౌఖశాయనికులు=సుఖముగా నిద్రించిరా? అని ప్రశ్నించు వారు; ధృతిచేతనంబులు=ప్రాణముకలవి; పన్నగ...తల్పంబు=ఆదిశేషుని శరీర మనుశయ్య; తత్ఫణారత్నదీప్తిన్=అతని పడగలవిూఁది రత్నకాంతితో; పై=శరీరము; పాలమున్నీటిలో=క్షీరసముద్రములో; హరిహయుడు=ఇంద్రుడు; 50. ఇరుచెవి=రెండవవాడు. 52. అతర్కితములు=అనుకోకుండ వచ్చునవి. 53. సెలగట్టెన్=బాణమును; గాడుపడగన్=పోగా. 54. విద్రవము=సంరంభము; అచ్ఛిద్రముగాగన్=సంపూర్ణముగా.

శా. క్షీరాంభోధి మథింపఁ గావలయు న • క్షీణప్రతాపప్రభా
వారంభంబున నాదికచ్ఛపము మూ • లాధారకుండంబుగా
సారోదారము మందరాచలము చం• చన్మంథదండంబుగా
గారామార రసాతలాధిపతిదృ • క్కర్ణుండు సూత్రంబుగన్. 56

గీ. అనిన శౌరిపల్కు • వినిసమ్మతించి యా, దేవతలును బూర్వ • దేవతలును
నమృతమథనమునకు • నారంభమొనరించి, రుల్లమునఁ బ్రమోద•ముప్పతిల్ల. 57

శా. బాహాస్తంభచతుష్టయంబున మురు • ప్రధ్వంసి లంఘించి యు
త్సాహంబొప్పఁగ నెత్తె మందరమహీ • ధ్రంబుద్ధతిం గూటసం
దోహంబుల్ ద్రుహిణాండకర్పరము ను • న్మీలింప దిక్సీమలం
గ్రాహింపం బతయాళునిష్ఠురమహా • గండోపలధ్వానముల్. 58

సీ. కపటకచ్ఛపమైన • కైటభాంతకువీఁపు, కొమరు మీఱిన చుట్టు • కుదురుగాఁగ
నారసాతలమూల • మైనమందరమహా, ధరణీధరంబు మం • థానకముగ
పందశూకాన్వయా • ధ్యక్షుండువాసుకి, తతపరిగ్రహణసూ • త్రంబుగాఁగ
నావహప్రవహాదు • లగుమారుతంబులు, తగులఁగట్టినయాక • త్రాళ్లుగాఁగ

తే. బలిపురోగములగు దైత్య • పరివృఢులును, దివిజనాయకుఁడాదిగా • దేవతలును
దరిచి రంభోధి ఘుమఘుమ•ధ్వానరవము, భువనగోళంబుదిక్కులు•చెవుడువడఁగ. 59

వ. ఇవ్విధంబున సురాసురవ్యూహంబు లుత్సాహంబులు మదంబులు ముదంబులు శౌర్యంబులు ధైర్యంబులు క్రౌర్యంబులు వీర్యంబులు హంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు ప్రహాసంబులు బలంబులు చలంబులు జవంబులు రవంబులు నదల్పులు విదల్పులు వీపులు తాఁపులు జూఁకలు కూఁకలు మూఁకలు పీఁకలు తెగింపులు నగింపులు నింపులు సొంపులు పెంపులు గుంపులు పరువులు మురువులు గెలయ మెలయ బాహావష్టంభసంరంభ విజృంభణంబునఁ దరతరంబు తరువందరువఁ దరిత్రాడు పాఁపతేనియొడలి మలకలుపురులు విడి తరులువడి దిర్దిరం దిరుగు మందరగిరి కందరాఘాతంబులం గలగుండువడి కరిమకరితిమింగిల మత్స్యకచ్ఛప ఢులీకుళీరంబులు సవ్యాపసవ్యయాతాయాత పరిభ్రమణంబులచేత విచేతనావస్థఁ బరిభ్రమించి

56. మంథదండము=కవ్వపుకర్ర; గారాము+అరన్=ప్రేమహెచ్చగా; రసా...కర్ణుండు=వాసుకి; సూత్రంబుగన్=త్రాడుగా. 57. పూర్వదేవతలు=రాక్షసులు. 58. మురప్రధ్వంసి=విష్ణువు; మహీధ్రము=కొండ; ద్రుహిణాండకర్పరము=బ్రహ్మాండము; కోటసందోహముల్=శిఖరపంక్తులు; గ్రాహింపన్=గ్రహించగా; పతయాళు...ధ్వానముల్=పడబోవు గండశిలాలచప్పుళ్లు. 59. దందశూక=సర్పము; ఆకత్రాళ్లు=కవ్వమునకు రాటికి గట్టినత్రాళ్లు; దైత్యపరివృఢులు=దానవశ్రేష్ఠులు.

యంతర్నిమగ్నంబులయిన పక్షక్షోణీధరంబులు పెక్కులు మునుఁగుకొని క్రుంగి
యణంగి తరంబులనొందుగ దుగ్ధార్ణవంబు ఘూర్ణమానంబయ్యె నప్పుడు భుజంగ
పుంగవవదన నాసానిష్ఠ్యూతనిష్ఠురవిషనిశ్శ్వాసపవన ధారాసంధుక్షణంబున నభి
స్యంద జ్వలనంబు ప్రజ్వలించెనో యన భుగభుగధ్వనితోడం గూడి సుడిగొన
నెగయు క్రొంబొగల వెంబడి విస్ఫులింగంబు లాస్ఫాటించి దిక్కులంజాల పుచ్ఛం
బిచ్చి పెచ్చుపెరిఁగి కోమలతమతమాలపల్లవంబుల యుల్లాసంబు నుల్లసందాడు
నల్లనినాలుకలు విషం బుమియుచుం గమియుచు భృంగ సంకాశంబును నీలజీమూత
సన్నిభంబును గల్పాంతసమయవహ్నికల్పంబును గాలమృత్యు ప్రతిమంబును
యుగాంతాగ్నివర్ణంబును నై ఛటచ్ఛటాశబ్దంబులతో నసహ్యవిష జిహ్వాలకలాపం
బులు బ్రహ్మాండకర్పరంబు నప్పళింప నిప్పులు చెదరి చదలు దరికొల్పు నుల్కా
పాతంబులుం బోలె దిక్కులం జురజుర స్రుక్కి లావెక్క సప్తపాతాళభువనచక్ర
వాళంబు పురపురం బొక్కి వెక్కసంబయి కోలాహలాభీలంబయి హాలాహలం
బుద్భవించిన. 60

సీ. పంకజప్రభవుఁడ • బ్రహ్మణ్య మొనరించెఁ, దాలసన్నిభభుజా • స్తంభమెత్తె
తరిత్రాడువిడిచిబృం • దారకాసురకోటి, పంచబంగాళమై • పాఱిపోయె
హాహానినాదకో • లాహలోత్తాలమై, త్రైలోక్యమునుభీతిఁ • దల్లడిల్లెఁ
గనకవస్త్రుండైన • కైటభాసురవైరి, పొగచూరినల్లనై • దొగ్గుపడియెఁ

తే. పెటిలె బ్రహ్మాండభాండంబు • పిటిలెదిక్కు
లురలెపాతాళభువనంబు • లుదిరెనభము
మేటి ధాటీజనితకాల • కూటవిషము
చిచ్చు విడివడి యంతంత • పెచ్చుపెరుఁగ. 61

వ. అప్పుడు మిసిమింతుడునుంగాక పయోధిప్రాంతంబున దక్షవాటంబున హాటక
సింహాసనాసీనుండయిన లలాటలోచను భవబంధమోచను సోమశేఖరుని శరణంబు
సొచ్చి హరివిరించి పురందరాది బృందారకు లిట్లనిరి. 62

చం. అభయము పార్వతీశ యభ • యంబు మహేశ శశాంకశేఖరా
యభయము శూలపాణి యభ • యంబు మదాంధకృతాంతమర్దనా
యభయము ఫాలనేత్ర యభయంబు కృపామయదివ్యమానసా
యభయము భీమనాథ యభ • యం బభయం బభయంబు శంకరా. 63

---

60. వ్యూహములు = గుంపులు; జూఁక = కంగారు; మీఁక = పొగరు; తరిత్రాడు = కవ్వపుత్రాడు; చదలు = ఆకాశము. 61. అబ్రహ్మణ్యము = చంపకుమనుకేక; పంచబంగాళమై = అదృశ్యమై; పెటిలెన్ = ప్రేలెను; ఉరలె = విడిపోయె; ఉదిరె = భయపడె; చిచ్చు = మంట. 62. మిసిమంతుడునుంగాక = అలసినవాడుకాక; హాటక = బంగారు.

తే. అనిభయక్రాంతులగుచు శ • క్రాదిసురలు. బలిపురోగములగుదైత్య • పరివృఢులును
శరణుచొచ్చిన నభయహ• స్తంబుసాఁచి, 'వెఱవకుండుఁడు మీ'రని•విశ్వవిభుఁడు. 64

## —♦ శివుఁడు హాలాహలము మ్రింగుట ♦—

మ. పటుహుంకారమహాట్టహాసనినదం • బాతాళభూస్వర్గసం
కటసన్నాహసముద్భవం బయినయా • కాకోలకాలాగ్ని ధూ
ర్జటి హస్తాబ్జమునందుఁగైకొనియె నా • జ్వాలాకులజ్వాళ మ
ప్పటివేళన్ మదభృంగమయ్యె శశిభృ • త్పాణ్యబ్జమధ్యంబునన్. 65

కం. కటుతమగువిషము విషధర, కటకం బగు కేలఁ బూని • కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస, ఘుటికయునుంబోలెశివుఁడు • గుటుకన మ్రింగెన్. 66

కం. అపుడు హిమాచలకన్యక, యుపగూహనమాచరించు • నొఱపునఁ జుట్టెం
త్రిపురాంతకుకంఠంబునఁ, దపనీయచ్ఛాయనొప్పు • తనదోర్వల్లిన్. 67

ఉ. చుట్టిబిగించిపట్టి పుర • సూదన యీ గరళాగ్నిఁ గంధరా
ఘట్టమునందు నిల్పు మది • గాక దిగంబడనిచ్చితేని లో
పట్టుననున్న లోకముల • భస్మము సేయు వెలార్చితేని వె
ల్పట్టుననున్నలోకముల • భస్మముచేయు నిజంబు చెప్పితిన్. 68

వ. అనుటయు. 69

శా. శంభుం డంబికపల్కుఁ గైకొని జగ • త్సంరక్షణార్థంబు సం
స్తంభించెన్ నిజకంఠగోళమున వి • శ్వక్షోభసంత్రాస సం
రంభారంభవిజృంభణోద్భటకలా • రౌద్రంబుఁ గాకోలమున్
జంభారాతి మణిప్రకల్పితవిశే • షానిర్విశేషంబుగన్. 70

వ. అప్పుడు మహాదేవుని దేవత లిట్లని స్తుతియించిరి. 71

---

65. తా॥ శివుని హుంకారము, మహాట్టహాసముతో, పాతాళభూస్వర్గముల బాధకల్గించిన హాలాహలమును శివుడు చేతిలోనికి తీసికొనగా, అప్పుడది తుమ్మెద వలె మెరసినది. 66. కటకము=చేయి; విషధరకటకంబగు=సర్పములు కంకణములు గాగల; ఘుటికాసంసిద్ధుడు=రసకట్టులోసిద్ధుడు; రసఘుటిక = పాదరసపుమాత్ర. 67. ఉపగూహనము=కౌగిలింత; దోర్వల్లి=తీగవంటి చేతులు. 68. పురసూదన= త్రిపురాసురహరా! కంధరాఘట్టము=కంఠప్రదేశము; వెలార్చితేని=వెలువడనిచ్చినచో. 70. విశ్వ...రౌద్రంబు—జగత్తునకు భయముపుట్టించు మంటలుకలది; కాకోలము=హాలాహలము; జంభ...నిర్విశేషంబుగన్=ఇంద్రనీలమణి పెట్టుకొన్నదాని కంటె భేదము లేకుండునట్లు.

—• దేవత లీశ్వరుని స్తుతించుట •—

సీ. సచరాచరం బైన • జగము రక్షించితి, హాలాహలానలం • బారగించి
శరణాగతత్రాణ • పరతంత్రభావంబు, నిఖిలలోకేశ్వర • నీకె యొప్పు
భువనైకరక్షణ వ్యవహారచిహ్నంబు, గుఱుతయ్యె నీకంఠ • కోణచిహ్న
త్రైలోక్యభీమంబు • గాలకూటము మ్రింగి, కైకొంటి భీమాఖ్యఁ గాలకంఠ
తే. యఖిలదిక్పాలకులును నీ • యాజ్ఞవారు, నీదునిశ్వాసపవనంబు • నిగమరాశి
యమరకులసార్వభౌమ లో • కాభిరామ, దక్షవాటీపురీకేళి • ధామ భీమ. 72

తే. దేవదేవ మహాదేవ • దివిజవంద్య, సర్వలోకైకరక్షణ • చతుర శర్వ
హాలహలకూటసంపర్క • నీలకంఠ, మ్రొక్కెదము దేవ నీకిని [illegible]. 73

మ. బహిరంతస్స్థితలోకరక్షణకళా పారీణ శైలాత్మజన్
బహిరంతస్స్థితలోకరక్షణకళా • పారీణునిన్ దేవర
న్మహనీయస్థిరసత్కృపాగుణనిధా • నం బైనదాక్షాయణీ
న్మహనీయస్థిరసత్కృపానిధి నిను • న్వర్ణింతు మే మీశ్వరా. 74

తే. సంహరించితి భువనశో • షకము విషము, నభయమిచ్చితి రక్షించి • తఖిలజగము
శాంతమయ్యె నరిష్ట మి•ష్టంబు ప్రబలె, దక్షిణాబ్ధితటావని • ధామ భీమ. 75

కం. ధరణియు గగనము దిక్కులు, బదికొని మండెడు విషాగ్నిఁ • దత్క్షణమాత్రం
గరమున ధరించి మ్రింగిన, నిరుపమధృతి నీక యొప్పు • నీలగ్రీవా. 76

ఉ. ఆయతసత్కృపామహిమ • హాలహలాగ్నిభయంబు నీమహో
పాయముచేతఁ బాపితి వి• ప్రాల్గలవాఁడవు దక్షవాటికా
నాయక భీమలింగ శివ • నం బొనరించితి గాక యింతకుం
గోయిలవన్నెఁ జెంది మఱిఁ • గొక్కెరవంతర పోపె లోకముల్. 77

కం. లోకత్రయమైకసంరక్షకల్పన మాచరింప • సద్భుకులువేల్పుల్
నీ కితరులు లే రధికులు, లేకుంటఁ జెప్పనేల • లేఖాధ్యక్షా. 78

తే. మమ్ము రక్షించి తని యేల • మాటిమాటి, కభినుతింపంగ దక్షవా • టాధినాథ
తల్లిదండ్రులు రక్షింపఁ • దలఁపకుండ్రె, ప్రజల భీమేశ బహువిధో•పద్రవముల. 79

సీ. శ్రీభీమనాయకా • శివ మమ్ము రక్షింపు, విశ్వైకనాథ దే • వియును నీవు
శ్రీనీలకంధరా • శేషాహిభూషణ, మమ్ము రక్షింపు మ • మ్మయును నీవు

---

72. త్రైలోక్యభీమము = ముల్లోకములకు భయంకరమైనది; భీమాఖ్య = భీముడను పేరు. 75. భువనశోషకము = లోకముల నెండించునది. 76. ధృతి = ధైర్యము. 77. ప్రాల్గలవాడవు = ధైర్యవంతుడవు. 78. లేఖాధ్యక్షా = దేవదేవా!

రక్షింపు మమ్ము శ్రీ • దక్షవాటీశ్వరా, వేదాంతవేద్య దే • వియును నీవు
దక్షిణాంబుధితటీ • ధామ నిర్జితకామ, మమ్ము రక్షింపు మ•మ్మయును నీవు

తే. వేడ్కరక్షింపు దేవ దే • వియును నీవు, ప్రతిభరక్షింపు గిరిశ యం•బయును నీవు
దుగ్ధపాథోధిభవ విని • ర్ధూమధామ, కాలకూటాగ్నిసంహార•కారి యభవ. 80

కం. శరణము భజింతు మభవుని, శరణము భజియింతు మద్రి • చంద్రాభరణుఁ
శరణము భజింతు మీశుని, శరణము భజియింతు మద్రి • జావల్లభునిన్. 81

తే. సిరియు వాణియు మొదలైన • సురపురంధ్రు, లట్టుగడుపునుజల్లఁగా • నభిలషించి
నియమమునఁ గొల్తు రెవ్వని•నిత్యకలన, నట్టిభీమేశు నిసుఁ గొల్తు•మహరహంబు. 82

సీ. విశ్వంబుసృజియించు•విధి మహేంద్రుఁడుగొను, వివిధాధ్వరముల హ•విర్విభాగ
మగ్నియాహుతిమోయు•నమసంఘమునకుఁ, బాపపుణ్యాంబులే•ర్పఱచుయముఁడు
ప్రత్యవాయములచే • బ్రతుకురాక్షసతతి, వర్షించుఁబర్జన్య • వరుణమూర్తి
గ్రహచక్రవాళంబు • గాలియెప్పుడు మోచుఁ, గొంద్రుసంతృప్తిల•గ్గునఁబితరులు

తే. నవనిధానములును యక్ష•నాథుఁడేలు, నాసదాశివుఁ డీశానుఁ•డై తనర్చుఁ
బరఁగనేనాజ్ఞనింద్రియ•ప్రతతినడుచు, నట్టిభీమేశ్వరుఁడు మాకు•నభయమొసగు. 83

సీ. వరుణుఁడెవ్వనియాజ్ఞ • వారాశిఁబాలించు, గాలియెవ్వనియాజ్ఞఁ•గంపమొందు
నవనిధానములుచిం•తారత్నసురభులు, యక్షరా జెవ్వని • యాజ్ఞనేలు
నెవ్వని యాజ్ఞ న•ర్కేందుగ్రహంబులు•చదలమార్గంబున • సంచరించు
శైలకాననవార్ధి • సహితమౌ నీధాత్రి, సహినాథుఁడెవ్వని • యాజ్ఞఁ దాల్చు

తే. నట్టి భీమేశు వేదవే • దాంతవేద్యు, సర్వకేయూరు దేవతా • సార్వభౌము
సప్తగోదావరోత్సంగ • సన్నివిష్టు, నాశ్రయింతుము నిన్నుఁజం•ద్రార్ధమౌళి. 84

వ. దేవదేవ మహాదేవ సదాశివ యీశ యీశాన తత్పురుష యఘోర సద్యోజాత వామదేవాఖ్యాన పంచవదనమూర్తివిశేషప్రకృతి ప్రధానకారణ! మీకు సాష్టాంగ నమస్కారంబు. 85

కం. నీమహిమార్ణవమునకును, సీమాంతము గలదె రాజ • శేఖర దక్ష
ధామపురధామ శంకర, భీమేశ్వర నీలకంఠ • పేశలకరుణా 86

వ. అని యనేకప్రకారంబుల బృందారకదైత్యులు తన్నుఁ బ్రస్తుతింపఁ గాలకూటంబు హరించినపంచాననుండగు భీమేశ్వరుండు హరి విరించిపురందరాదుల నాలోకించి యిట్లనియె.

---

80. గిరిశ=శివా! 81. అద్రిజావల్లభుడు=పార్వతీపతి. 82. సురపురంధ్రులు=దేవతాస్త్రీలు; అట్టు=మెడ; అహరహంబు=ప్రతిదినము. 83. ప్రత్యవాయము=దోషము; చక్రవాళము=మండలము; లగ్గునన్=మేలుగా. 84. నిధానములు=నిధులు; చింతారత్నసురభులు=చింతామణి, కామధేనువును.

—♦ శివునియాజ్ఞను సురాసురులు విఘ్నేశుని బూజించి పాల్కడలిఁ దరియించి చంద్రాదులఁ బడయుట. ♦—

తే. మనము విఘ్నేశు సేవింప • మఱచినార, మతని సేవింపకున్న నే • లా ఫలించు
నఖిలకార్యంబులును నవ • శ్యము ఫలించు, నర్థిఁ గార్యార్థ మిభవక్త్రు • ననుసరింపుఁ. 88

మ. అని యంభోధితటోపకంఠమున ద • క్షారామమధ్యంబునన్
ఘనునిం దాండవవిఘ్ననాయకు మహా • కాయున్ సముత్తప్తకాం
చనసంకాశు ననేకరత్నఖచిత • స్వర్ణాగ్రసింహాసనం
బునఁ గూర్చుండఁగఁ బెట్టి భక్తిపరతం • బూజించి రవ్యగ్రులై. 89

సీ. జలకమార్చె బలారి • సప్తగోదావర, సలిలధారాహోమ • కలశసమితిఁ
గర్పూరకస్తూరి • కాగంధసారంబు, నలఁదె వైవస్వతుం • డంగకములఁ
బ్రన్నఁగాఁ బెనగొన్న • బ్రహ్మసూత్రంబులఁ, బసపూన్చి యర్పించెఁ • బద్మభవుఁడు
పారిజాతకతరు • ప్రసవమాల్యంబులు, వక్షస్స్థలంబున • వైచె శౌరి

తే. ధూమకేతుండు మహిసాక్షి • ధూపమిచ్చెఁ, బూన్చె యక్షాధిపతి మణి • భూషణముల
నంధకాసురుఁ డిడియె దూ • ర్వాంకురములు, వీచెఁ బవనుండు కుంచియ • విఘ్నపతికి. 90

వ. అనంతరం బామోదకాపూపపాయసఘృతమధుక్షీరశర్కరాసూపజంబూకపిత్థ చూత ఖర్జూరకదళీనారికేళఫలపుండ్రేక్షు సమన్వితంబుగా మహోపహారంబులఁ గల్పించి వేల్పులుఁ బ్రావేల్పులును ననల్పభావనావిశేషంబుల నశేషవిధంబుల మూషకవాహను నకుఁ బ్రదక్షిణంబులు ప్రణామంబులుం జేసి వలగొని క్రమ్మఱ పయోనిధి మథనంబు నకుఁ బ్రారంభించిన. 91

తే. మందరాచలమంథాన • మథ్యమాన, దుగ్ధపాథోధిలో నను • ద్భూతమయ్యె
బాలశశిరేఖ యసురులు • వేలుపులును, నిచ్చి రవ్వస్తు వర్థి భీ • మేశ్వరునకు. 92

వ. వెండియుఁ దరువందరువఁ గల్పతరువును నప్సరస్సతులును గౌస్తుభమాణిక్యంబును నుచ్చైశ్శ్రవం బను హయంబును నైరావతం బను ధవళగజంబును నాదిగా సకల కామదంబులు సర్వమంగళాస్పదంబులు నిఖిలభువనమోహనంబులు నైన పదార్థంబు లుద్భవించెఁ దదనంతరంబ. 93

కం. తరతరమ దరువఁ దరువం, దరియం దుదయంబు నొందె • ధన్వంతరి సా
గరమునఁ గడుగరగరనై, కరమునఁ గరమమరు నమృత • కలశముఁ దాల్పన్. 94

---

85. ఈశానాదులైనను శివునిముఖముల పేర్లు. 89. అవ్యగ్రులు = తొందర లేనివారు. 90. బలారి = ఇంద్రుడు; వైవస్వతుడు = యముడు; కుంచియ = వింజామర. 94. తరతరమ = వరుసగా; తరియందు = సంభ్రమమందు; మణికర్ణిక = మాణిక్యమయమైన పద్మకర్ణిక.

సీ. సంపూర్ణపూర్ణిమా • చంద్రబింబంబుతోఁ, బుట్టెఁ దెల్లనితమ్మి • పువ్వు మొగ్గ
విరిసె నొయ్యొయ్యన • వేలావనీవాటి, పవమానకోమలా • స్ఫాలనమున
వాసించెనఖిలది • గ్వలయంబు మధురవి, స్తారకేసరధూళి • సౌరభములు
నంభోజమధ్యంబు • నందుద్భవంబొందె, మహితకాంతిచ్ఛటా • మండలంబు
తే. అందుమణికర్ణికాగ్రసిం•హాసనమున, లక్ష్మియుదయించిహ స్తపల్లవమునందుఁ
బసిఁడిపూదండఁబూ•జించెఁ బద్మనయను, నర్థి వరియించెలీలాస్వ•యంవరమున. 95

దేవాసురు లమృతమునకై పోరుటయు శ్రీమన్నారాయణుండు దేవారులవంచించుట.

ఉ. అంతులుమీఱి మిక్కిలిగ • జాఁగతనంబున దొమ్మిచేసి దు
ర్దాంతపరాక్రమోన్నతులు • దానవదైత్యులు వేల్పువెజ్జు ధ
న్వంతరిచేలి దుగ్ధమయ • వార్ధిసుధారసపూర్ణకుంభముఁ
జెంతనకట్టి పుచ్చుకొని • చయ్యన నేగిరి నిర్విశంకతన్. 96

వ. అప్పుడు. 97

కం. నారాయణుండు మాయా, నారీరూపమునఁ గపట • నాటకలీలా
పారాయణత హరించె సు, రారులచే నమృతకలశ • మాసయమునన్. 98

చం. అమృతముఁ గోలుపోయి విబు • ధారులు గంధగజాసురాంధక
ప్రముఖులు మోములందు వినఁ • బాటు దలిర్పఁగఁ గూడియున్నచో
నమరఁగ నారదుండు గగ • నాగ్రమునం జనుదెంచి వారికిం
బ్రమదముతోడ నిట్లనుచుఁ • బల్కెను వాక్పరిపాటి యొప్పఁగన్. 99

—♦ నారదోక్తిచసురు లీశ్వరుని బూజించి వరంబులు వడసి లోకముల బాధించుట ♦—

శా. రక్షోనాయకులార నిర్జరవర • వ్రాతంబుచేతన్ సుధా
భిక్షాపాత్రము వోయెనంచు మదిలో • బెగ్గిల్లఁగా నేటికిన్
రక్షార్థంబు భజింపరాదె యభవుం • ద్రైలోక్యకుక్షింభరున్
దక్షారామపురాధినాథుని సుధా • ధామార్ధచూడామణిన్. 100

కం. అని నారదుండు పల్కిన, విని యందఱు భీమనాథు • విశ్వేశ్వరునిఁ
ఘనభక్తి దక్షమునిరా, ట్వనమధ్యమునందుఁగొల్చి • వర్ధితబలులై. 101

మ. త్రిపురావాసులతోడఁ గూడి కడిమిఁ • దేవాహితుల్ లోకముల్
తపియింపంగఁ దపంబు చేసిరి దృఢ • స్థైర్యంబు పాటించి పా

96. జాఁగతనము = గయ్యాళితనము; దొమ్మి = కొట్లాట; వెజ్జు = వైద్యుడు. 98. మాయానారి = జగన్మోహిని. 99. విబుధారులు = రాక్షసులు. 100. సుధాభిక్షాపాత్రము = అమృతకలశము; బెగ్గిల్ల గాన్ = విచారింప గా; త్రైలోక్యకుక్షింభరున్ = ముల్లోకములవారికిని రక్షకుని; సుధా...మణిన్ = చంద్రరేఖాధరుని.

శుపతాచారనిరూఢి నందఱును సం • శుద్ధాంతరంగంబులం
దుపమాతీతుని భీమనాయకుని నా • ద్యున్ శంభు సేవించుచున్. 102

సీ. అరుణోదయంబున • నాకాశవాహినీ, హేమాంబుజంబుల • నిందుధరుని
మిహిరోదయంబున • మహిసాక్షిగుగ్గుల, ధూపధూమంబుల • దురితహరుని
సంగమంబున గంధ • సారకుంకుమచంద్ర, జంబాలములఁ బుష్ప•చాపమథను
మధ్యాహ్నమునఁ బక్వ•మధురాన్నపాయసా•పూపాజ్యదధిఫలం•బులఁ ద్రినేత్రుఁ

తే. బరమసంధ్యాగమంబునఁ • బటహశంఖ, ఝల్లరీమడ్డుడమరుఘం•ట్టరులఁ బ్రమోఁద
నర్ధరాత్రంబులందు వీ•ణారవముల, హరుని బూజింతు రచలభ•క్తి•నసురవరులు. 103

శా. పంచబ్రహ్మషడంగమంత్రములసం • ప్రాసాదపంచాక్షరిం
బంచాస్యున్ బహుబిల్వపత్రముల న • ర్చింతు రవ్యగ్రత
న్మంచుంగొండయనుంగుఁ బెండ్లికొడుకున్ • స్వర్గింతు రేకాగ్రతం
బంచద్వేదపురాణమంత్రముల ని • ష్ఠాయుక్తి నక్తంచరుల్. 104

వ. ఇవ్విధంబున నిష్టార్థప్రదుం డైనయమ్మహాదేవు శ్రీభీమనాథు సేవించి యద్దేవుని ప్రసాదంబున ననశ్వరంబును నత్యూర్జితంబును నసాధారణంబును నగునైశ్వర్యంబునుం బొంది. 105

తే. అపుడు గర్వించి నిర్జించి • రఖిలజనుల, నిర్జరుల బాధ పెట్టిరి • నిరపరాధ
మప్రతీకమహాప్రతా • పాతిరేక, నిర్విశంకావలేపులై • పూర్వసురులు. 106

—♦ బ్రహ్మవిష్ణ్వాదులు శివునికడ కేగి మొఱ పెట్టుట ♦—

సీ. వజ్రహస్తునిచేతి • వజ్రాయుధముధార, దుర్దీప్తి పాదరి • మొద్దుపోయె
నతితీక్ష్ణతరమైన • యాశుశుక్షణి తేజ, మింగాలతేజమై • యింకిపోయెఁ
జండభీషణమైన • జముగదాదండంబు, చిఱుసంతయును గాని • బెండుపడియెఁ
బాథోధివల్లభు • పాశవల్లిమతల్లి, దర్పంబు దిగద్రావి • త్రాడుపడియె

తే. గాలిదూలెను ధనపతి•ఘనతయణఁగె, గ్రహములకునిగ్రహమువుట్టెఁ • గాలవశతఁ
గాలకేయాదిరాక్షస • గణముచెల్ల, భీమలింగంబుకృపఁబెచ్చు•పెరుగునపుడు. 107

102. కడిమిన్ = పట్టుదలతో; పాశుపతాచారనిరూఢిన్ = శైవాచారముప్రకారము; ఉపమాతీతుడు = నిరుపమానుడు. 103. మిహిరోదయము = సూర్యోదయము; సంగమంబు = ఉదయమునకు మధ్యాహ్నమునకు మధ్యకాలము. 104. పెండ్లికొడుకు = అల్లుడు; నక్తంచరుల్ = రాక్షసులు. 105. అత్యూర్జితము = మిక్కిలిగొప్పది. 106. అప్రతీక = అడ్డులేని; అతిరేక = అతిశయము; అవలేపము = గర్వము. 107. పాదరి = పాఁడై; ఆశుశుక్షణి = అగ్ని; ఇంగాల = బొగ్గు; పాథోధివల్లభుడు = వరుణుడు; నిగ్రహము = ఆటంకము.

వ. అప్పుడు హరి విరించులు పురందరాదులతోడ నక్తంచరులచేతఁ బంచకరపాట్లువడి యంతఃకరణంబులఁ జింతించి, రాయంచనుంగాంచనవర్ణగరుడుంచలంబగుపులుఁగు తేనినెక్కి దక్షిణజలధిపంచ దక్షారామంబున నధివసించిన మంచుఁగొండయల్లునిఁ బంచబాణవిరోధిని దాయంజనుదెంచి పంచాక్షరీపంచబ్రహ్మమంత్రంబుల మంత్రోచ్చారణపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబులాచరించి ప్రపంచ రక్షణార్థంబుగా నిట్లని స్తుతియించిరి. 108

సీ. అవధారు దేవ ద • క్షారామవల్లభ, సప్తగోదావరో • త్సంగనిలయ
కాలకూటానల • జ్వాలానలముఁ బాపి, మమ్ము రక్షించిన • మహితకరుణ
భీమేశ్వరేశ్వర • స్వామిమహాదేవ! త్రిపురదైత్యులబాధ • దీలుపడితి
మత్యంతదుఃఖము • లనుభవించితిమి య, నాథులమైతి మ • నాథనాథ

తే. మొదల దేవారులను గాచి • పిదపసురలఁ, గాచి పిమ్మట నసురులఁ గాచినాఁడ
వింక మముఁగావువరుస • భోగీంద్రకటక, నీవెఱుంగవె ధర్మంబు నీలకంఠ. 109

తే. చటులతరకాలకూటాగ్ని • సంజహర్ష, పాల్కడలి నట్టనడుమ సం • ప్రభవమైన
యమృతలింగంబవగునిన్ను • నాశ్రయింతు, మభవ భీమేశ దక్షవా • టాధినాథ. 110

కం. ప్రణవోత్తమాంగ ఫణిభూ, షణ గగనమణీందువహ్ని • చక్షుస్త్రితయా
ఫణికటక జితమనోభవ, యణిమాదివిశేషదా ప • దాశ్రయచరణా. 111

ఉత్సాహము. నీలకంఠ భక్తలోక • నిధి భవాబ్ధితారణా
ఫాలభాగమత్కృపీట • ఘనశిఖా హతస్మరా
శూలపాణి మమ్ముఁ గరుణఁ • జూడు త్రిపురదానవుల్
జాలిఁ బెట్టు చున్నవా ర • సహ్యవిక్రమోద్ధతిన్. 112

సీ. అర్కేందుహవ్యవా • హనలోచనత్రయా, త్రిపురదైత్యులబాధ • నపనయింపు
మంబికాహృదయాంబు • జాకరకలహంస, త్రిపురదైత్యులబాధ • నపనయింపు
నిత్యనిర్మలశుద్ధ • నిరవద్యనిర్ద్వంద్వ, త్రిపురదైత్యులబాధ • నపనయింపు
దీప్తదీప్తాయుధ • స్థిరమహాదోర్దండ, త్రిపురదైత్యులబాధ • నపనయింపు

తే. డమరుపట్టసపరశుఖ • డ్గత్రిశూల, చాపఖట్వాంగధర నీవె • శరణుమాకు
నన్యథాశరణంబులే దభవ భీమ యపనయింపుము త్రిపురాసు • రాదిబాధ. 113

కం. ముక్తవిశుద్ధ నిరంజన, ముక్తప్రియ నిత్య యష్ట • మూర్తి ప్రతాపో
ద్వీక్షత్రినగరపరివృఢ, నక్తంచరబాధమాన్పు • నాగాభరణా. 114

కం. దగ్ధస్మరాంగశంకర, ముగ్ధేందుకళాకలాప • మూర్ధాయన ను
స్నిగ్ధవిధాతృకపాల, స్రగ్ధారి ఘటింపు త్రిపుర • సంహారంబున్. 115

---

108. పంచకరపాట్లు=బాధలు; దక్షిణజలధిపంచ = దక్షిణసముద్రము దగ్గర. 109. భోగీంద్రకటక = సర్పకంకణ; సంజహర్ష =సంహరించినవాడా! 115. స్నిగ్ధ...ధారి=ప్రియమైన బ్రహ్మకపాలమాలికను ధరించినవాడా.

కం. అద్వయ సత్య క్షరాక్షర, సద్వంద్య యనాదినిధన • సర్వేశ్వర కృ
ష్ణద్వైపాయనశుకముఖ, విద్వన్నుత సంహరింప • వే త్రిపురంబుల్. 116

కం. సర్వేశ్వరసర్వాత్మక, శర్వ సదాశివ మహేశ • శాశ్వత రుద్రా
సర్వజ్ఞ భీమనాయక, గర్వాంధులనణఁపు త్రిపుర • కర్బురపతులన్. 117

సీ. ప్రణతార్తిహర దేవ • పరమేశదక్షవా, టాధీశ యభవ మా • కభయమిమ్ము!
మంత్రోపనిషదర్థ • మన్మథాంతకగంధ, సింధురాసురవైరి • సేమమిమ్ము
భక్తవత్సలశూల • పాణి దక్షిణవార్ధి, వేలాతటీవాస • విజయమిమ్ము
సంసారమాయాను • షంగశాశ్వతతమ, స్కంధమార్తాండ యై • శ్వర్యమిమ్ము

తే. సద్యరక్షింపువామదే•వాద్య ఘోవు•జయజయాఘోరతత్పురు•షజయమొసఁగు
భద్రమీశానసేయుము•ప్రబలులైన, త్రిపురదైత్యులగర్వంబు • దిక్కరింపు. 118

శా. త్రైలోక్యంబు భుజాప్రతాపమున ని • ర్వక్రమంబుగా నేలుచుఁ
హేలాహుంకృతిఁ గామగత్రినగరీ • హృద్యప్రచారంబులఁ
వాలాయింబును మమ్ము వెట్టిగొనుచున్ • వర్తించుచున్నారు మీ
రాలస్యం బొనరించినన్ బ్రతుక శ • క్యంబెట్లు మాకోంట్లకుఁ. 119

కం. లోకంబులు త్రిపురాసురు, లేకచ్ఛత్రంబుగాఁగ • నేలఁగ నున్నా
రో కాలకంఠ యింకిటు, మా కావులుగావు ధర్మ • మార్గము దలఁగెన్. 120

మ. అభయం బిందుకళాకిరీట శివదా • యామ్నాయచూడామణీ
యిభరాట్చర్మపటీకటీర యభవా • యీశాన మొట్టో గిరి
ప్రభవామానసపద్మపద్మహిత య • బ్రహ్మణ్యమాలింపు మా
కభిమానచ్యుతి పాటిలెం ద్రిపురదై • త్యగ్రామణీశ్రేణిచేస్. 121

కం. కరుణింపు దక్షవాటీ, పురనాయక భీమలింగ • భోగికులేంద్రా
భిరణవిషదహనభయమును, బురదనుజభయంబు సరియ • భువనంబులకున్. 122

—• ఈశ్వరుఁడు త్రిపురాసురుల నిర్జించుట •—

వ. అని యీప్రకారంబున బ్రహ్మవిష్ణువులు పురందరపురోగములగు బృందారకుల
తోడంగూడి యభినందింభివం బరమానందంబునుం బొంది యబ్భువనగోప్తసప్త
పాతాళభువనగర్భగోళంబువందుండి యావిర్భవంబునొందిన దివ్యస్వయంభూజ్యోతి
ర్లింగమూర్తి భీమేశ్వరుండు విర్వికల్పంబును విరస్తసమస్తోపాధికంబును నైన

117. కర్బురపతి=రాక్షసరాజు. 118. సద్య=ఇప్పుడు; భద్రము=మేలు.
120. కాపులు=యజమానులు; కావు=కాపును. 121. అబ్రహ్మణ్యము=చావ
కుండజూడుము.

నిష్కళంకస్వరూపంబు విడిచి యారకూటపాటలంబై కుసుంభచ్ఛాయ నగు జటా
పటలంబును, పాండురపుండరీకముకుళడుండుభంబులను శంక నంకురింపం జేయం
జాలు బ్రహ్మకపాలమాల్యంబును, జిఱునవ్వుజిగి మెఱుంగిడిన చెక్కుటద్దంబుల
నీడచూచునిద్దంపు నాగకుండలంబులును, గ్రొత్త యఱసంజకెంజాయ రంజిలుకాఱు
మొగులు కైవడిం జిలుపచిలుపని నెత్తురులజొత్తిల్లిన పచ్చియేనికతోలుపచ్ఛడంబును,
గంఠోత్కంఠభువన భువనరక్షణ దాక్షిణ్యలక్షణ కస్తూరికాలేపననైపథ్యంబునుం
బోని కాలకూటవిషమషీ కంఠంబును, సాయాహ్న సమయ సంఫుల్ల మల్లికా
కుసుమసముల్లాసంబు నుల్లసంబాడు తెల్లనిమేనును, మొఱకుందనంబున నేతెంచిన
కఱకుచెఱకు విల్తునిజూఱంబుచ్చినదైచిగురుతేలన నుప్పతిల్లుచు మినుకుమినుకు మను
నులివేఁడిచూపువలనఁ గోపాటోపావార్యహవ్యవాహనాడంబరంబగు లలాటలోచ
నజ్వలనంబు ప్రజ్వలించి నికటజటాటవీవాటంబు నాస్ఫోటించునోయని యవధ
రించిన చందనంబున నందం బగుమందాకినీసలిలపూరసంభరితం బైన శాతకుంభ
కుంభంబునుం బోని కిరీటకటాహంబును, జంద్రఖండంబులు మూఁగినభంగి సంగీక
రించిన యకించన శశాంకరేఖాలంకారంబును, జెంగలువ తెక్కడాలుం జక్కనేలిన
కేలియంగుటంబునం జవమత్ఖురపుటంబుల మోపి నింగికి నెగయ నంజచాఁచులీలా
కురంగ శాబకంబును గనుపట్టు సర్వకళారూపంబు ధరియించి సర్వమంగళా
కుచకలశలేపనానైపుణ్య కుంకుమాంగరాగవాసనాసనాథంబును, గరళకూట పావ
కోత్పత్తి నిరస్త మణికులప్రశస్తంబును నైన శ్రీహస్తంబు విస్తరించి యభ
యంబు ప్రసాదించి సజలజలధరధ్వానగంభీరోదారంబైన కంఠస్వనంబున నిట్లని
యానతిచ్చె. 123

మ. అరవిందాసనతార్క్ష్యవాహనసహ • స్రాక్షాదిబృందారకుల్
చిరకాలంబును బద్ధపాట్లు మదిలోఁ • జింతించుచున్నాఁడ ని
ర్భరదర్పోద్ధతులం బురాసురుల నే • భంజించెదన్ మీరునుం
బరిపాటిన్ ననుఁగొల్చి రండు సమర • ప్రారంభసన్నద్ధులై 124

ఆ. అని ముహూర్తమాత్ర • మద్దేవతాచక్ర, వర్తి దక్షవాటి • వల్లభుండు
మనమునందుఁ దలఁచె • మదనాంధకారాతి, శత్రునగరవిజయ•సాధనంబు. 125

వ. అనంతరంబ తదభిజ్ఞానప్రభామహామహిమంబునఁ దదాజ్ఞాతిశయంబున. 126

---

123. బృందారకులు = దేవతలు; భువనగోప్త = లోకరక్షకుడు; ఆరకూట పాటలము = ఇత్తడివలె నున్నది; డుండుభము = రెండుతలలపాము; కాఱుమొగులు = కారుమబ్బు; పచ్ఛడము = కండువా; నులివేడి = కొద్ది వేడి; ఆస్ఫోటించుట = ముట్టుకొనుట; కటాహము = గుండిగ; అకించన = ఎక్కువైన; చెంగలువతెక్కడాలు = చెంగల్వరేకుకాంతి; అంగుటము = అంగుష్ఠము; అంజ = అంగ. 124. అరవింద... బృందారకుల్ = బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదిదేవతలు.

సీ. జలరాశిమేఖలా • వలయంబు రథమయ్యె, రవియుఁ జందురుఁడుఁ జ•క్రంబు లైరి
శారదాజీవితే•శ్వరుఁడు సారథియయ్యెఁ, గ్రుతులు నాలుగును వా•రువములయ్యెఁ
బ్రణవమంత్రైత్రికాక్ష • రము ప్రతోదం బయ్యెఁ, దారకావీథి ప • తాక మయ్యె
రత్నసానుధరాధ • రము ధనుర్లత యయ్యె, నాగప్రధానుండు • నారియయ్యె

తే. గంధవాహుంబు లేదును • గఱులుగాఁగ, విలయకాలానలజ్వాల • ములికి గాఁగ
లచ్చిచనుదోయికుంకుమ•బచ్చనయుగఁ, బాలమున్నీటియల్లుండు•బాణమయ్యె. 127

వ. ఇవ్విధంబున సకలసాధనంబులు సన్నిహితంబులై నక్షణంబ దక్షారామంబున నయనాభిరాముండు భీమేశ్వరుండు త్రిపురవిజయార్థంబు దివ్యస్యందనం బెక్కి-నప్పుడు. 128

సీ. సరిబ్రాహ్మి మొదలైన • సప్తమాతృకలు దక్షిణాద సేసలు చల్లె • గోఁగులమ్మ
పసిఁడివేత్రము పట్టె • పాతాళభైరవుండ•దండండసందడి • నపనయించె
దివ్యదుందుభినాద • దీర్ఘగర్జితముతోఁ, గురిసెమిన్ను నెనుండి • కుసుమవృష్టి
జయజయధ్వని దేవ • సంయమీశ్వరకోటి•సంఘటించెఁగరాంబు•జంబు నొసలఁ

తే. త్రిపురసంహార మొనరింప • దీక్షచేసి, భీమనాథేశ్వరేశ్వర • స్వామి శివుఁడు
దక్షవాటీవిభుఁడు మేరు•ధనువు పట్టి, యేచి పంటవలంతితే•రెక్కినపుడు. 129

సీ. రమ్మినూకినమాత్ర • కలధౌతముకుటోతెఁ, జక్కంగ నిక్కి మై•సొక్కమాన
నంతరాంతరములం•దస్థిబృందంబులు, పెళపెళమనియెడు•గిలుకు లెసఁగెఁ
బిగిలి బీటలువాటి • తగడెత్తెఁ గుబుసంబు, తోరంపు వెల్లుల్లి•టుసళలట్ల
మహనీయతరఫణా•మండలంబులు లేఁత, చిగురుటాకులచాయ • జేగురించె

తే. హాటకాద్రిధనుర్దండ • కూటకోటి, వంచి బాహావలేప దు • ర్వారలీలఁ
గాలకంఠుండు త్రిపురసం•క్షయమొనర్ప, నెక్కువెట్టినయపుడు భో•గీశ్వరునకు. 130

కం. ముక్కంటి మేరుచాపం, బెక్కిడిసారించెఁ బన్న • గేంద్రగుణంబుగా
మక్కువ హిమగిరికన్యక, క్రిక్కిఱిసిన కుచము లలము • కేలుందన్మిన్. 131

కం. తాటించి నిటలనయనుఁడు, హాటకగిరిచాపవల్లి • వహిశింజిని నా
స్ఫోటించెఁ దక్కెరోరమ, హాటంకృతి కమలజాండ • మటఁబగులంగన్. 132

127. జల...వలయము = భూమి. వారువము = గుఱ్ఱము; ప్రతోదము = కొరడా; తారకావీథి = ఆకాశము; రత్న...ధరము = మేరుగిరి; గంధవాహుము = గాలి; గఱులు = బాణపురెక్కలు; ములికి = బాణము. 128. స్యందనము = రథము. 129. సేసలు = అక్షతలు; అపనయించెను = తగ్గించెను; పంటవలంతి = భూమి; తేరు = రథము. 130. కమ్మినూకిన = సానపట్టిన; కలధౌతము = వెండి; తగడు = రేకు; ఫణా = పడగ; హాటకాద్రి = మేరుగిరి; భోగీశ్వరుడు = శేషుడు. 131. గుణము = నారి; అలము = రాపిడి. 132. అహిశింజిని = పాము నారి; ఆస్ఫోటించెను = మ్రోయించెను.

మ. గిరిశస్థూలభుజాపరీతవిభవ • క్రీడాసమాస్ఫాలిత
స్థిరబాణాసనగూఢపార్శ్వగుణలతా • దీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బా • తాళంబు ఘూర్ణిల్లె నం
బరముం దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెన్ • బ్రహ్మాండభాండంబులున్. 133

కం. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసువడం దివియఁ గూడి • కుశలప్రశ్నం
బడిగిరి యొండొరులను గని, కడకొమ్ముల నున్న యదితి • కద్రువతనయుల్. 134

కం. తెగనిండ శాలనయనుఁడు, నగచాపము దిగిచినపుడు • నాగేంద్రుండు
న్నిగువున మొగంబులదరుటఁ బొగలెగయఁగవిషముభుగులుభుగులనఁ గ్రక్కెన్. 135

కం. విషధరపరివృఢనాసా, సుషిరవినిశ్వాసపవన • ఘూత్కారరవ
ద్విషవహ్నిజ్వాలంబులు, వృషభధ్వజుచేతి కొండవింట • జనించెన్. 136

కం. శ్రీకంఠకఠినభుజపరి, ఘాకృష్టసువర్ణగిరి శ • రాసనమౌర్వీ
కాకోదరముఖసంభవ, కాకోలానలము పుజ్జ • గము దరికొనియెన్. 137

కం. కటకాముఖహస్తంబున, నిటలాక్షుఁడు కొండవిల్లు • నెవ్వడిఁ దివియన్
ఘటియిల్లె నుపగరాజ, స్ఫుటహాలాహలకృపీట • భవకీల లటన్. 138

వ. ఇవ్విధంబున భీమనాథుండు త్రిపురదమనారంభసంరంభంబున శాతకుంభకుంభినీ ధరకోదండం బుద్దండభుజాదండచండిమంబునఁ గుడుసువడం దిగిచినఁదత్సమాకృష్టభారంబున భుజంగపుంగవుండు వేయుపడగలను విషంబుఁ గ్రక్కుదృక్కర్ణ వదన నాసారంధ్ర, సముదీర్ణసంభవం బయినయక్కాలకూటవిషంబు కృపీటభవ జిహ్వాకలాపంబులు గ్రోయుచుఁ దోయధిమథనంబున సంభవించిన హాలాహలంబు నుంబోలెఁ బ్రజ్వరిల్లి సముజ్జ్వలజ్వాలాజాలంబులఁ త్రైలోక్యంబు నాక్రమింపం దొడంగిన దెగ యుడిపి ఖట్వాంగపాణి యుత్తమాంగంబుజాడించి గంగాంభః ప్రవాహనిర్ఝరవారిపూరంబులు చల్లియు వామలోచనహిమధామ కిరణ వ్రాతంబులం బ్రోక్షించియు నమ్మహోపద్రవం బుపశమింపం జేసి దుర్గాసహాయుండును విఘ్నరాజప్రసాదోపలబ్ధసంభావితుండును నై విషమ లక్ష్యంబులయిన త్రిపురంబులు వీక్షించి వెండియు నాది నారాయణునిం బురాణపురుషునిఁ బురుషోత్తము ననాదినిధ నునిబాణంబుచేసి యరింబోసి పాశుపతాస్త్రంబుసమంత్రకంబుగా నభిమంత్రించి యాక

133. గిరిశ...ఘోషంబు = శివునిభుజబలముచే నూగబడిన పాము నారియొక్క చప్పుడుతో. 134. గుడుసువడన్ = గుండ్రనగునట్లు; కడకొమ్ములన్ = మేరువునకు రెండుచివళ్లను; అదితికద్రువతనయుల్ = దేవతలు; నాగులును. (స్వర్గపాతాళములు దగ్గరపడినవి) 136. విష...జ్వాలంబులు = వాసుకి ముక్కురంధ్రములనుండి వచ్చు ఘూత్కారరవముతోడి విషాగ్నిజ్వాలలు; కొండవింటన్ = కొండయను వింటినుండి. 138. కటకాముఖహస్తము = అనేకముద్ర; స్ఫుట = పడగ; కృపీటభవ = అగ్ని.

ర్ణాంతంబుగాఁ దిగిచి ఫాలేక్షణజ్వాలాజాలంబు మునుముట్ట నిగిడించి బిట్టుహుంక
రించి యట్టహాసంబుచేసి యేసిన నమ్మహాస్త్రంబు. 139

సీ. కరపల్లవంబులఁ • గబళించుఁ గబళించి, ప్రబలనితంబభారములఁ ద్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి, శ్రవణావతంస మంజరులుముట్టు
వలిచన్నుఁగవలపైఁ • దొలసాడుఁ దొలసాడి, నాభిరంధ్రములపై • నటనసేయు
వేణీభరములపై • విహరించు విహరించి, బింబాధరములపై • బిత్తరించు

తే. నభవు కరముక్తనారాయ • ణాస్త్రవహ్ని, కాముకునికోమలాంతసం • గంబుపగిదిఁ
దెగువమీఱంగఁ ద్రిపురదై • తేయరాజ, సదనశుద్ధాంతభామినీ • జనములందు. 140

కం. లోహమయదైత్యనగరీ, గేహంబులు హరశరాగ్ని • కీలాజ్వాలా
దాహమునఁ గరఁగి మూఁడు స, మూహములై పెద్దపెద్ద • ముద్దలునయ్యెన్. 141

వ. అంత. 142

సీ. భస్మరేణువులయ్యెఁ • బ్రాకారగోపుర, ప్రాసాదకుట్టిమ • ప్రాంగణములు
మసిబూడిదయ్యెని • ర్మలకేలిదీర్ఘికా, కమలినీకల్హార • కైరవములు
దగ్ధమయ్యెను సమ • స్తప్రశస్తమహాస, భాభ్యంతరాంతఃపు • రాంగణములు
ధూళయ్యె మారుతో • ద్ధూతపుష్పపరాగ, వాసనాదిశలగు • వనచయములు

తే. కాలకంఠభుజాదండ • గర్వభార, కుండలీకృతమేరుకో • దండపరిధి
వలయనిష్ఠ్యూతకైటభ • ధ్వంసిబాణ, దహనసంధానమునఁ బుర • త్రయమునందు. 143

కం. ఫాలేక్షణాస్త్రవహ్ని, జ్వాలాజాలముల నసుర • వరనగరంబుల్
కాలిన నప్పుడు కాలక, కాలాంతక లింగ మొకటి • కడు నొప్పారెన్. 144

తే. ఆదిలింగోద్భవమునాఁటి • యభవుభంగి, నింగిమోచిన యాశంభు • లింగమూర్తి
భీమవరవహ్నిపురములఁ • బ్రేల్చునపుడు, వహ్ని పెగడాఁక కేమియు • వడలకుండె 145

మ. అసురాధీశసమర్పితంబులగు లీ • లారామకల్పద్రుమ
ప్రసవంబుల్ కసుగందవయ్యె విలస • త్పాటీరగోరోచనా
ఘుసృణాలేపనవంకితాకలనమై • గుంఫించె నారాయణా
స్త్రసముజ్జృంభణభీమలింగమునకున్ • దైతేయరాట్స్వామికిన్. 146

---

139. శాత...కోదండము=మేరుగిరివిల్లు; దృక్కర్ణ=సర్పము; ఖట్వాంగపాణి=శివుడు; ఉత్తమాంగము=తల; వామ...ధామ=ఎడమకన్నైన చంద్రుని; అరింబోసి=శత్రువును గుఱిచూచి; మునుముట్ట=ముందుగా తగులునట్లు. 140. పొలసాడున్=సంచరించును; త్రిపుర...జనములు=త్రిపురాసురుల అంతఃపురస్త్రీలు. 143. ధూళి+అయ్యెన్; కాల...సంధానమునన్=శివుని భుజబలముచే కుండలముగా చేయబడిన మేరుధనువునుండి వెలికివచ్చిన విష్ణువను బాణవహ్నితో. 144. కాలక=కాలకుండ; కాలాంతకలింగము=శివలింగము. 145. నింగిమోచిన=ఆకాశమునంటిన.

వ. ఇవ్విధంబుననున్నం జూచి భీమేశ్వరుండు ఋక్సామయజురథర్వణవేదపారాయణ తురంగకంబును రవిశశాంకరథాంగకంబును గమలభవసారథికంబునునగు విశ్వం భరారథంబెక్కి భుజంగమరాజశింజినీకం బయిన కాంచనధరాధరధనుర్దండంబును బుండరీకాక్ష బాణంబును సంధించి పురత్రయంబుల దహించి విజయలక్ష్మిం బరి గ్రహించి విశ్వావసుప్రధాన నానాగంధర్వజేగీయమాన భుజావదానుండై ప్రమో దాతిశయంబున, 147

శా. ఆడెం దాండవ మార్భటీపటహలీ • లాటోప విస్ఫూర్జిత
క్రీడాడంబరముల్లసిల్ల గరళ • గ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాతకఠోరకోటకరుటీ • కోటీలుఠచ్చిందు వీ
చీడోలాపటలీపరిస్ఫుటతర • స్ఫీతధ్వనిప్రౌఢిమన్. 148

వ. ఇట్లు త్రిపురవిజయానంతరంబునం గృతాంతదమనుండు వెండియు. 149

చం. డమరుకడిండిమప్రకట • శంకృతియుం గిరినాట్టహాసవి
భ్రమమును దాండవారభట • పాటవముం ఘటియిల్ల మాతృకా
సముదయభూతభైరవ పి • శాచనిశాచరడాకినీగణ
ప్రమథసమూహముల్ పొగడ • భర్గుఁడు సంతస మందె నెంతయున్. 150

వ. అనంతరం బాయంబికావల్లభుండు జాంబూనదశైలకోదండం బెక్కు డించి యథా స్థానంబున నునిచి నారి యగుపాపతేనిని విశ్వంభరాభరణంబునకు నియోగించి క్షీరాంభోరాశితూణీరంబున వైకుంఠబాణంబు చేర్చి వేల్పుల వీడ్కొలిపి బ్రహ్మను సత్యలోకంబున కనిచి వేదంబులం దన నిట్టూర్పు గాడ్పులలోనం గలిపి చంద్ర సూర్యులం గాలంబుగడుప నియోగించి కృతకృత్యుండై త్రిపురదైతేయుల కుల దైవతంబైన యద్దివ్యలింగంబును బంచబ్రహ్మ పంచాక్షరీపంచతత్వ పంచభూత మయంబగుటంజేసి పంచఖండంబులుగా ఖండించి కృష్ణవేణీమహానదీ తీరంబున ధరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమ రలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీ తీరంబున దక్షిణ కూలంబున గుణపూడియను గ్రామంబున సోమునిచేతఁ బ్రతిష్ఠితంబు సేయంబడు టంజేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, బాలకోటయను

---

146. ప్రసవంబుల్ = పువ్వులు; కసుగందవయ్యో = వాడవు; విలసత్ ... కల నమై = చందన, గోరోచనాదిలేపములతో పంకిలమై; గుంఫించెన్ = చేకూరెను. 147. సంధించి = కూర్చుకొని; విశ్వావసు ... అవధానుండు = విశ్వావసువు మొదలైన గంధర్వు లచే పొడబడిన భుజబలముకలవాడై; అవదానము = జరిగినపని. 148. జూటాటవీ ... ప్రౌఢిమన్ = జటాజూటపుటంచులకు కొట్టుకొను గంగాతరంగధ్వనులతో. 149. కృతాంతదమనుండు = శివుడు.

గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటం జేసి రామలింగంబనాఁ బ్రసి
ద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశరాజధానియగు చాళుక్యభీమవరనామ గ్రామం
బునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటం జేసి కుమార
భీమలింగంబనఁ బ్రఖ్యాతంబునొందిన భీమారామంబును, మొదలిమామ యగు దక్ష
ప్రజాపతి యునికిపట్టైన యారామంబగుట దక్షారామంబునఁ శివసన్నిధానంబై తానుండు
నట్టుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులను ప్రతిష్ఠ
నొందించి తాను దక్షవాటంబున మున్నీటితటంబున విశుద్ధస్ఫటిక సంకాశంబును
త్రిదశలోకభామినీ విలోకన చ్ఛాయాగుణచ్ఛాయ జ్యోత్స్నాభిషిక్తయుక్తాంగంబగు
శ్రీ భీమేశ్వరలింగంబునం దధివసించె నిది త్రిపురవిజయోపాఖ్యానంబు దీని వి
నను బఠించిన వ్రాసినఁ బ్రశ్నచేసిన బోధించినవారికి సకలపాతకనివృత్తసంపై
భుక్తిముక్తులు గలుగును సకల కళ్యాణ కరంబనిన విని. 151

ఉ. అప్పుడు సప్తదివ్యయును • లంచితభక్తిరసప్రయుక్తులై
చప్పటతాళము ల్మొరయ • సంస్తుతిపూర్వముగాఁగ నాడుచున్
ముప్పిరిగొన్న మోదమున • మ్రొక్కుచు మైఁ బులకాంకురావళుల్
కుప్పలుగా భజించిరి య • కుంఠితధామున భీమలింగమున్. 152

సీ. ఆ ఖండపంచకం • బాఖండలాదిక, విబుధమండల నిషే • వితము చంద్ర
మార్తాండశతకోటి • మహనీయతేజంబు, కుండలిగ్రామణీ • కుండలంబు
పుండరీకత్వక్ప్ర • కాండాతిమండిత, కటిమండలంబు శ్రీ • ఖండఘటిత
పాండురబ్రహ్మర • పాలసంపుటము బ్ర. బ్రహ్మాండకోటిస్ఫుర • దస్పృతాండ

తే. మతిప మద్వయ మాద్యం బనాదినిధన, మప్రమేయం బజయ్యంబున ప్రధర్ష్య
మఖిలవేదాంతవేద్య • మత్యంతభక్తి, భావనాయుక్తి గలవారి • పాలి సురభి. 153

శా. ఎంచన్ బెక్కు విశేషముల్ ధరణిలో • నింపారుచున్నట్టి శ్రీ
పంచారామములందు దక్షిణమహా • పాథోధితీరంబునన్
బంచబ్రహ్మమయామృతప్రకటశుం • భ ద్దివ్యలింగాకృతిన్
మంచుంగుబ్బలియల్లుఁ డొప్పెసఁగు భీ • మస్వామి యుద్దాముఁడై. 154

151. విశ్వంభరాభరణము = భూమిని మోయుట; తూణీరము = అమ్ముల పొది. తా॥ త్రిపురాసురుల కులదేవతయగు లింగము నైదుభాగములుచేసి శివుడు కృష్ణయొడ్డున అమరావతిలోను, పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరముదగ్గర గునుపూడిలోను, ఆ జిల్లాలోనే పాలకొల్లులోను, సామర్లకోటదగ్గర భీమవరములోను, దక్షారామములోను, ఆ లింగములను ప్రతిష్ఠించెను. అవే పంచారామములు. 153. ఆ ఖండపంచకంబు = ఆ ముక్కలైదు; ఆఖండలాదిక = ఇంద్రాది; కుండలిగ్రామణీ = సర్పశ్రేష్ఠము; పుండరీక...మండలంబు = వ్యాఘ్రాజినముచే శోభించు మొలకలవాడు; సురభి = కామధేనువు.

శ్లో. కాశీక్షేత్రమృతో జీవీ పునర్జన్మశివాకృతిః
చిత్రం దక్షపురీజీవీ న జన్మసశివాకృతిః. 1

శ్లో. మత్తో నాస్త్యపరం దైవం న దేవీ గిరిజా సమా
దక్షారామా త్పరం క్షేత్రం న భూతి న్న భవిష్యతి. 2

శ్లో. రత్యంతరేమూత్రపురీషమధ్యే । చండాల వేశ్మన్యథవాశ్మశానే ।
కృతప్రయత్నో ప్యకృతప్రయత్నో । శ్రీదక్షపుర్యధ్వపరో పి ముక్తః॥ 3

వ. అట్టి దివ్యక్షేత్రంబునందు. 155

కం. ఆలింగమూర్తి శిఖ్యె. జ్వాలామాలాకరాళ • సందీప్తంబై
యాలోకింపంబడినం. దేలిరి యానందజలధి • దివ్యమునీంద్రుల్. 156

తే. సంస్మితం బైన మదన శా • సనునిముఖము
చూచి యానందమునఁబొంది • సురలు మునులు
రాక్షసకృదావరోధసం • రంభ మింకఁ
చమకు లేదని తెలిసిరి • తత్వబుద్ధి. 157

శా. కారాగారనిబద్ధ లైన దివిష • త్కాంతాజనుల్ వారికిం
గారా మైనతనూజులున్ బతులు దుః • ఖంబాఱ గోదావరి
వారిం దీర్ఘములాడి కాంచిరి జగ • ద్వంద్యుం బురారాతి ద
క్షారామాధిపు భీమనాయకుఁ ద్రిలో • కాహ్లాదసంధాయకున్. 158

వ. తదనంతరం బాభరద్వాజాదిమహామునులు శివున కర్ఘ్యపాద్యాచమనీయార్ఘంబు భీమ
నాథమహాదేవుని సమీపంబున గోదావరీవాహినిం బ్రవహింపఁ జేయువారై
ప్రారంభించి. 159

సీ. పంచభూతమయంబు • పరమపంచబ్రహ్మ. తత్త్వతేజస్సము • ద్భాసితంబు
పంచాక్షరీమహా • పరమంత్రమూలంబు. శాశ్వతంబజరంబ • నశ్వరంబు

1. తా॥ కాశీక్షేత్రమున చనిపోయినప్రాణి పునర్జన్మ కలిగి శివాకృతి కల్గి యుండ, దక్షవాటికలోనిప్రాణి ఇక జన్మరహితుడై, శివాకృతికలవాడగుచున్నాడు. 2. నాకంటె నెక్కుడుదైవము లేడు; మాణిక్యాంబతో సరియైన దేవిలేదు; దక్షారామముకంటె క్షేత్రము లేదు; ఇక నుండదు. 3. రతిమధ్యనగాని, మూత్రపురీషోత్సర్జనమధ్యగాని; చండాలగృహమునగాని, శ్మశానమునగాని; ప్రయత్నముచేసికొని, చేయకకొని. దక్షపురిమార్గము పట్టివచ్చినగాని భీమేశుని స్మరించువాడు ముక్తుడగును. 157. మదనశాసనుని=భీమేశుని; అవరోధసంరంభము=బాధలు. 158. దివిషత్కాంతాజనుల్=దేవతాస్త్రీలు; దుఃఖంబాఱన్=దుఃఖముపోగా; వారిన్=నీటిలో; పురారాతి=శివుడు.

భైమేశ్వరంబు శోభిత మాదిమధ్యాంత, శూన్యంబు సకలంబు • శుద్ధబుద్ధ
మనవద్య మచ్ఛేద్య మక్షోభ్య మఖిలది, గ్దేశకాలాపరి • క్షీణమనఘ

తే. మంబరము మోచి యున్నలింగంబుఁ జూచి, సంప్రతిష్ఠ యొనర్పంగ • సమ్మతించి
కాలమీక్షించి తగినలగ్నంబుఁ జూచి, సకలసంభార నిచయంబు • సంగ్రహించి. 160

తే. గౌతమీగంగఁ బాపి యిక్కడికి నొక్క, సిద్ధవాహినిఁ బ్రవహింపఁ • జేసికాని
లింగసంస్థాపనంబుఁ గల్పింపమనుచుఁ, బరమసంయము లేద్బురుఁ • బ్రబలినట్టి. 161

సీ. ఆలగ్నవేళకు • నమృతదివ్యస్వయం, భూమహాలింగైక • మూర్తియైన
శ్రీభీమనాథుని • శీతాంశుశేఖరు, నభిషేక మొనరింప • నభిలషించి
కదలి సప్తర్షులు • గౌతమాదులుశిష్య, సహితంబు కడుభక్తి • సంభ్రమమున
దక్షవాటీపుర • స్థానంబునందుండి, యేగి యంతంతఁగ • నెదురఁ గనిరి

తే. గౌతమీగంగ నాలోల • ఘనతరంగఁ, గేలిదోలావిహారసం • క్రీడమాన
చక్రవాకబకక్రౌంచ • సారసాళి, హంసకారండవాదిమా • ద్యద్విహంగ. 162

కం. గౌతమకన్యాతటినిన్, బ్రీతిఁ బయఃపానమాచ • రించిన మనుజ
వ్రాత మొనర్చదు మరల, న్మాతృపయోధరపయఃప • దాస్వాదనమున్, 163

వ. అని మునీంద్రులు తమలోన నెంతయు నొండొరులం గనుంగొని. 164

తే. కంటిరే ఘోరపాతకౌఘముల నెల్లఁ, గడిమి జంకించుచున్నది • గంగ యిపుడు
వీచికాహస్తవిన్యాస • విభ్రమముల, ఘుమఘుమధ్వానహుంకార • ఘోషమెసఁగ, 165

తే. యక్షగంధర్వసిద్ధవి • ద్యాధరోర, గామరవ్రాతభరితోభ • యప్రతీర
పృథివియెల్లను రక్షించు • పేరఁటాలు, సుమ్ము రక్షించు గోదావ • రమ్మ యెపుడు. 166

తే. అమృతమైనపయోధార • నహరహంబు, సృష్టిఁ గల జంతుకోట్ల ర • క్షింతు వీవు
జనని వౌటకునేమి సం • శయము చెపుమ, గౌతమీగంగ యాలోల • ఘనతరంగ. 167

కం. త్రైలోక్యపవిత్ర పావన, నాళీకాసనకరాబ్జ • నవమణికుండీ
కూలంకషసలిలామృత, పాలింపు గిరీశజాయ • పర్వతతనయా. 168

కం. గోదావరి గోదావరి, గోదావరి యంచుఁ బల్కు • గుణవంతులకున్
గోదావరితల్లీ! సం, పాదింతుగదమ్మ నీవు • భవ్యశుభంబుల్. 169

కం. కంబుశశిరజతశుక్తివి, డంబసితచ్ఛాయకలిత • డంబరములు నీ
యంబువు లమృతోపమరుచు, లంబా! మా కొసఁగుఁగాత • నభ్యుదయంబుల్. 170

---

163. గౌతమకన్యాతటిని = గౌతమి; మనుజవ్రాతము = జనులు; మాతృ... ఆస్వాదనమున్ = తల్లిచనుబాలు త్రాగుటను. 166. పేరటాలు = పేరంటాలు. 168. నాళీక... అమృత = బ్రహ్మచేతిలోని మణికమండలువును తాకియుండు నీరుకలది; గిరీశజాయ = శివునిభార్య. 170. కంబు...డంబరములు = శంఖము, చంద్రుడు, వెండి, ముత్యపుచిప్పను పోలిన తెల్లని కాంతితో మెరయునవి.

శా. ఆపాతాళగభీరనీరకసుధా • హారామలచ్ఛాయతన్
ద్వీపాలంకృతికి న్మహేంద్రనగరీ • నిశ్రేణికాయష్టికిం
దాపోపాయవిధావిహర్త్రికి మహో • దన్వాదృఢాలింగన
వ్యాపారప్రతిపన్నసౌఖ్యన్ను సా • ష్టాంగంబు గంగమ్మకున్. 171

శా. రంభోరూకరశాతకుంభఘటధా • రాపూరణప్రక్రియా
గంభీరక్వణసాంద్రభిన్నకరిరా • ట్గండూషనిర్భిన్నకు
న్సంభావించి నమస్కరింతుము త్రిసం • ధ్యంబున్ ముదంబొప్ప నీ
కంభోజాసనకుండికాంబుజవనీ • హంసాభ గోదావరీ! 172

కం. గౌతమికిన్ బంచమహా, పాతకపటలాంధకార • పాటనవిధిరా
ట్గౌతమికి నమస్కారం, బాతతమతిఁ జేయుదము ప్ర • యత్నంబెసఁగన్. 173

వ. అని ప్రార్థించి యిట్లనిరి. 174

సీ. విచ్చేయవమ్మ శ్రీ • వృషభవాహనధర, సామజకటమదా • సారధార
పయనంబుగావమ్మ • భర్గజటాటవీ, కుటజశాఖాశిఖా • కోరకంబ
రావమ్మ యాదిమ • బ్రహ్మదోఃపల్లవ, స్థితకమండలుపుణ్య • తీర్థజలమ
లేవమ్మ విశ్వంభ • రావధూటీకంఠ, తారమౌక్తికహార • ధామకంబ

తే. తెరలతో వీచికలతోడఁ • దరులతోడ, విమలడిండీరఖండదం • డములతోడ
మురువు లీవియు నామోద•మునుజవంబు, వడువునొప్పంగ గంగమ్మ•నడువవమ్మ. 175

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు ద • క్షారామభీమేశుఁ డ
భ్యుదయంబొంది ప్రతిష్ఠఁగైకొనెడు నం • భోరాశితీరంబునన్
బదమా షట్పదమాలికాపరిలస • త్పాథోధునీసంపదా
స్పదనానాసలిలప్రవాహలహరీ • సంభార గోదావరీ. 176

తే. సోమశేఖరుండు • భీమేశ్వరస్వామి, తివిరినాఁడు సంప్ర • తిష్ఠఁబొంద
వేళదప్పకుండ • విచ్చేయఁగారాదె, త్ర్యంబకాద్రిసరసి • ధామలక్ష్మి. 177

171. ఆపాతాళగభీర = పాతాళమువరకు లోతైన; మహేంద్ర...యష్టి = స్వర్గమునకు నిచ్చెన మెట్టైనది; మహో...సౌఖ్య = సముద్రముయొక్క దృఢమైన కౌగిలింత సౌఖ్యముకలది. 172. రంభోరూ...నిర్భిన్న = స్త్రీలు బంగారుకుండలచే ముంచగానైన చప్పుడును ధిక్కరించు ఏనుగుల పుక్కిలింతలచే ధ్వనిచేయునది. త్రిసంధ్యంబున్ = ఉదయ, మధ్యాహ్న, సాయంకాలముల. 173. పంచ...గౌతమి = పంచమహాపాతకములను చీకటిని పోగొట్టుటలో వెన్నెలవంటిది. 175. డిండీరము = నురుగు. 176. సుధారసోద్భవుడు = అమృతజలమున పుట్టినవాడు; పదమా = నడువుమా! షట్పద...సంభార = తుమ్మెదలతో ప్రకాశించు సెలయేళ్లతోనిండిన ప్రవాహముకలదానా; 177. తివిరినాడు = కోరినాడు.

మ. అని మెప్పించి మహర్షు లేద్వురును న • త్యాశ్చర్య మొప్పన్ బ్రభా
వ నిరూఢిం గొనివచ్చి రంధ్రవసుధా • వక్షోజహారావళీ
ము ను బృందారక సేవ్యమానసలిలా • గోదావరీవాహినీ
వెనుక న్ముందఱఁ బార్శ్వదేశముల నా • వేశించి సేవించుచున్. 178

వ. అప్పుడు ప్రతిష్ఠానలోకంబునకు లోకపాలక గంధర్వ యక్షసిద్ధ సాధ్యవిద్యాధరో రగామర సహితుండై దేవేంద్రుం డంబరమార్గంబున ఋషుల ననుసరించి యేతెంచుచుండె నాసమయమ్మున. 179

తే. ఒక్కనదిపొంత గార్హస్థ్య • యుక్తమైన, పుణ్యతపమాచరించుచుఁ • బుణ్యజనులు తారు బంధులఁ దామర•తంపరగుచుఁ, గూడియుండంగ నెంతయుఁ•గాడుచేసి. 180

తే. ఋషులవెంబడి సంరంభ • మెసఁగవచ్చు
తటినినదుస్రోవవనములోఁ • దపము సేయు
దైత్యమునులపుణ్యాశ్రమ • స్థలము సొచ్చి
వఱదఁగొనిపోయె నిండు స • ర్వస్వములును 181

శా. ప్రాగ్వంశంబులు స్రుక్స్రువంబులును యూ • పస్తంభసంస్తీర్ణ హవి
ర్భుగ్వేదీనిలయంబులున్ వఱదలోఁ • బోవంగ దేవార్చనా
స్రగ్వాసోఘటికాకమండలు బ్రుసీ • సంఘాతముం దేలిపో
వాగ్వాదం బొనరించి రప్పుడు ముని • వ్రాతంబుతో దానవుల్. 182

కం. ఆకాశదివ్యమునులును, నాకౌకఃప్రత్యనీక • నాయకమునులున్
వాకాటులకుం జొచ్చిరి, పాకంబులు దప్పినట్టి • పటురోషములన్. 183

తే. శిఖలు వీడఁగ ముఖములు • జేగురింప
గటము లదరంగ నొకవిడిఁ • గాటులాడి
యొండొరులమీఁద శాపంబు • లుగ్గడింప
హస్తములయందునలిలంబు • లందుకొనిరి. 184

వ. ఇట్లందుకొని దానవులు నస్థిరిపమానీత మైనయవ్వాహిని శుష్కతోయ యయ్యెడు మనియును, మునులు దానవులకు సమాశ్రయం బైనయప్పుణ్యవాహిని యపూజ్యయై యస్పృశ్యయయ్యెడు మనియును, శపియించి రప్పుడు. 185

178. ఆంధ్ర...హారావళి = ఆంధ్రభూమికి స్తనములమీది హారమువంటిది. 180. పుణ్యజనులు = రాక్షసులు; తారు — తాము; తామరతంపరగుచు = కలిసిమెలిసి; కాడుచేసి = విధ్వంసముచేసి. 181. తటిని = నది. 182. హవి...నిలయంబులు = అగ్ని కుండములు; స్రక్ = మాలికలు; వాసః = వస్త్రములు; బ్రుసీ = దర్భాసనము. 183. నాకౌకఃప్రత్యనీక = రాక్షసులు; వాయి + కోటు = వాకోటు = కొట్లాట; పాకం బులుతప్పినట్టి = ముదిరిన. 184. ఒకవిడిన్ = ఒకవరుసగా. 185. శుష్కతోయ = నీరెండినది.

—♦ తుల్యభాగ యుత్పత్తిక్రమము ♦—

తే. అసురులకునాశ్రయంబైన • యాస్రవంతి,తుల్యభాగాహ్వయుండనుదై • త్యుండుదేరఁ
బూర్వమున గౌతమీగంగఁ • బుట్టివచ్చె. నందు రితిహాసతత్త్వజ్ఞు•లైనబుధులు. 186

వ. తుల్యభాగుం డనుదైత్యుండు పరమార్థతత్త్వజ్ఞుండై పక్షపాతంబు లేక సురాసురులకు మాధ్యస్థ్యంబున వివాదంబులు తీర్చుచుండుటకు సమర్థుం డగుట నద్దానవుండు తుల్యభాగాహ్వయుం డనంబరఁగుట నన్వర్థనామధేయుండు. 187

కం. ఆతుల్యభాగుపేరను, నాతటినికిఁ దుల్యభాగ • యనునామము ప్ర
ఖ్యాతివడసె నవ్వాహిని. గౌతమకన్యకకుఁ గూర్మి • కన్యక మొదలన్. 188

సీ. ఆ తుల్యభాగమ • హాముసీంద్రుఁడు ప్రీతి, మునిదానవశ్రేణి • ముందల నిలిచి
వరుసతో వాదించి • యిరుదెఱంగులవారి, వారించి కోపంబు • వలదు మీకు
శపియింపఁ దగునయ్య • సర్వసర్వంసహా, భువనపావనలైన • పుణ్యనదులఁ
గ్రమ్మఱింపుఁడు శాప • గరళాక్షరంబులు, క్రోధంబు లేల త • బోధనులకు

తే. ననుటయును వార లామాట • లాదరించి
క్రమ్మఱసరాదు పలు క మో • ఘమ్ము మాకు
నీవు నిప్పుడు చెప్పిన • హితవు నూది
వేఱు చందాన మేలు గా • వింతుమింక. 189

వ. అని రాక్షసులు సప్తమునిసింధువునకు సంతతప్రవాహంబును మునులు తుల్యభాగకు నుత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలంబులను సూర్యచంద్రగ్రహణంబులను ప్రతిభానువారంబునను దర్శ పౌర్ణమాసీ ప్రభృతిమహాపర్వకాలంబులను సంక్రమణంబులు మొదలైనవిశేషకాలంబులను స్నానదానజపతపోహోమ శ్రాద్ధదేవార్చనావిధానంబు లక్షయఫలంబు లగునట్టుగాను బతిసమేతంబుగా సతికి రజస్వలాత్వాద్యంతరాయంబు లేక యధశ్మయన బ్రహ్మచర్యోపవాసనియమంబులతో భానువారచతుష్టయంబు స్నానంబు సిద్ధించిన సంతానప్రాప్తి యౌనట్టుగాను వరంబు ప్రసాదించిరి తదనంతరంబ. 190

మ. కెలనన్ ముందర సిద్ధకింపురుషులుం • గీర్వాణులు న్నాగసా
ధ్యులు విద్యాధరకిన్నరేంద్రులు సము • ద్భాషింప దివ్యాప్సరో
లలనాబృందము లాడ దానవులు పి • ల్లంగ్రోళ్లు పట్టంగ బొ
బ్బలు నార్పుల్ పటుసింహనాదములు ను • ప్పాదిల్ల ధాత్రీస్థలిన్. 191

186. ఇతిహాస తత్త్వజ్ఞులు=కథ లెరిగినవారు. 188. అవ్వాహిని=ఆనది. 189. శాపగరళాక్షరంబులు=శాపవిషాక్షరములు, పలుకు+అమోఘమ్ము=మాట తథ్యము; ఊది=వహించి; చందానన్=రీతిగా. 190. దర్శ=అమావాస్య. 191. కెలనన్=ప్రక్కన.

చం. మలఁగి మలంగి భీమపతి • మందిరమండలసిద్ధభూమికిన్
దొలఁగి తొలంగి యుచ్ఛలిత • తోయతరంగపరంపరోద్ధతిన్
జెలఁగి చెలంగి యారభటి • శీర్ణధరాధరధాతురేణులం
గలఁగి కలంగి పాఱె వడి • గౌతమకన్యక దక్షవాటికిన్. 192

తే. దేవదుందుభు లుడువీథిఁ జీటుకొలుప, నమరు లందంద పుష్పవర్షములు గురియ
మునిజనంబులు జయజయ • ధ్వనులొనర్ప, దక్షవాటంబు చొచ్చె గౌతమతనూజ. 193

వ. ఇవ్విధంబున గోదావరీపుణ్యవాహినిం గొనివచ్చి సప్తర్షులు పరమహర్షోత్కర్షంబున. 194

—• శ్రీ భీమనాథేశ్వరుండు దనకుఁ దాన ప్రతిష్ఠితుండగుట •—

తే. తారు దలఁచిన శుభవేళ • దప్పకుండ, సంప్రతిష్ఠితుఁడై సమర్చనము గొన్న
యమృతలింగంబు భీమనాయకునిఁ జూచి, చాల విస్మయ మందిరి సప్తమునులు. 195

వ. ఇట్లాశ్చర్యంబునుం బొంది. 196

ఉ. తారు వినిశ్చయించిన ప్ర • ధానముహూర్తము దప్పకుండఁ గా
మారి ప్రతిష్ఠఁ బొందుటకు • నాత్మల సంతసముల్ వహించి యె
వ్వారొకొ మమ్ముఁగైకొనక • వారక మే మొనరింప నున్న సం
స్కారము తార చేసి రెడ • సందున నంచుఁ గలంగి యెంతయున్. 197

తే. రోషసంరంభములును సం • తోషములును
హృదయములఁ దిక్కటిలనున్న • ఋషులకడకు
నంతరిక్షంబు నందుండి • యతిరయమున
భానుమంతుండు భక్తిసం • భ్రమము వెసఁగ. 198

వ. వచ్చి యభివాదనంబుచేసి ముకుళితకరకమలుండై కమలమిత్రుం డమ్మహామునుల కిట్లనియె. 199

చం. పరమమునీంద్రులార మిముఁ బ్రార్థనసేయుచు విన్నవించెదన్
గరుణ దలిర్ప మీచనవుఁ గైకొని నన్ను ననుగ్రహింపుఁ డీ
తెరువున మీకు నంకిలులు • దీర్పఁగఁ గాలవిలంబమైన దా
హరుఁడు ప్రతిష్ఠితుండు నగు • నప్పుడు నే నటు పూజచేసితిన్. 200

192. ఆరభటి...రేణులన్ = తొందరతో ముక్కలైన కొండరేణువులతో.
193. ఉడువీధిన్ = ఆకాశమున; గౌతమతనూజ = గౌతమి. 196. తారు = తాము.
197. కామారి = శివుడు; వారక = సంకోచింపక; తారచేసిరి = తామే చేసిరి; ఎడసందున = కాలమధ్యలో; కలంగి = కోపించి. 198. భానుమంతుడు = సూర్యుడు.
199. కమలమిత్రుడు = సూర్యుడు. 200. అంకిలులు = సాధక బాధకములు; కాలవిలంబము = వేళతప్పుట.

కం. మీ రొనరించు ప్రతిష్ఠా, ప్రారంభము నాకుఁ జేయ • నలవియె శ్రీద
క్షారామవిభుఁడు జగదా, ధారుఁడు గైకొనియెఁ దనకుఁ • దాన ప్రతిష్ఠన్. 201

కం. మే లెట్టి దట్టి శోభన, కాలము సరిగడచెనేని • కాదని కంఠే
కాలుఁడు కారుణ్యసము,న్మీలితమతిఁ దనకుఁదాన • నిలువంబడియెన్. 202

మ. తనకుం దాన ప్రతిష్ఠితుండయిన యీ • దక్షాధ్వరధ్వంసి నే
మును పూజించితిఁ దిమ్మటన్ హరియు సం • భోజాతగర్భుండునుం
గని కైసేసిరి యంతమీఁద సురలున్ • గంధర్వులుం జేరి య
ర్చనముల్ చేసిరి మీరుఁ జేయుఁడు తగన్ • సమ్యక్సమారాధనల్. 203

తే. అనిన సంయములును గాల • యాపనమునఁ, జంద్రశేఖరు సంప్రతి•ష్ఠాపనంబు
తమకు సిద్ధింపకునికి సం•తాపమొందఁ, బలికె నాకాశవాణి వి•స్పష్టఫణితి. 204

ఉ. ఓ పరమర్షులార! కరు • ణోదధి యిందువతంసుఁ డాత్మసం
స్థాపితుఁ డయ్యె మీ దెసఁ బ్ర • సాదము పేర్మి భవత్ప్రయత్నసం
స్థాపితుఁ డైనవాఁడ యిది • సత్యము మీరు మనంబులోన సం
తాపముఁ బొందకుండుఁడు ప్ర • ధానము భక్తియె కాదె యిమ్మహిన్. 205

తే. అల్పమే మీరు చేసిన•యట్టి భక్తి, యభవమూర్ధాభిషేకార్థ • మధికభక్తిఁ
దెచ్చితిరి గౌతమీమహా • దివ్యతటినిఁ, బాదపీఠోపకంఠ భూ•భాగమునకు. 206

మ. అభిమానించిన మీర లేడ్వురుఁ బ్రతి • ష్ఠారంభకాలంబునం
దభిషేకించిన తిగ్మభానుఁడును నే • కార్థక్రియ న్మించువాం
డ్రుఁ భవార్చారతి నెంచ మీర లెనమం • డ్రుం నిల్పినా రంబికా
విభునిన్ సత్యము నేను చెప్పితి నభో • వీథీవిటంకంబునన్. 207

తే. మీర లెనమండ్రు భుజగేంద్ర•హారునొద్ద, భక్తిఁ బూజింపఁ బెట్టుఁడు•పాశుపతుల
వారిపేరష్టమూర్తులు • గారవమున, వారు దాఁకఁగ నర్హు లె•వ్వారలైన. 208

---

201. తనకుదాన=తనకుతానే. 202. శోభనకాలము=సుముహూర్తము; కంఠేకాలుడు=శివుడు. 203. అంభోజాతగర్భుండు=విష్ణువు; కైసేసిరి=అలంకరించిరి; సమ్యక్సమారాధనల్=లెస్సయైన పూజలు. 204. సంయములు=మునులు; సిద్ధింపకునికి=సిద్ధింపకుండుటచే; విస్పష్టఫణితిన్=స్పష్టమైన రీతితో. 205. ఇందువతంసుడు=శివుడు; మీదెసన్=మీమీద; ప్రసాదము పేర్మిన్=దయతో. 206. అభవమూర్ధాభిషేకార్థము=శివునితలపై అభిషేకముచేయుటకు; భవ్యతటినిన్=గొప్ప నదిని; పాదపీఠోపకంఠభూభాగమునకున్=పాదములముందరికి. 207. తిగ్మభానుడు=సూర్యుడు; ఏకార్థక్రియన్=ఒకేపని చేయుటలో; భవార్చారతిన్=శివునిపూజపై గాసక్తితో; నభోవీథీవిటంకంబునన్=ఆకాశమునందు.

తే. అష్టమూర్తివిశిష్టాన్వ • యప్రసూతుఁ, డష్టఁదేపాటివాఁడైన • నభవునంట
వేదశాస్త్రపురాణసం • వేదియైన, నితరుఁ డర్హుండు గాఁడు భీ • మేశునంట. 209

వ. అని యాకాశవాణి మీరలును సూర్యుండును సములని యుపదేశించి పల్కిన విని హర్షంబునొంది మహర్షులు నభోమణి నభినందించి యతండును దానును హేమకుంభంబుల సప్తగోదావర ప్రవాహాంబుపూరంబులు దెచ్చి యయ్యీశ్వరు నభిషేకించి పూజించిరి; సప్తర్షిసమానీతగావున నమ్మహానదికి సప్తగోదావరాహ్వయంబు సంభవించెనని చెప్పుటయు శ్రీభీమేశ్వరమహాదేవుమాహాత్మ్యంబు విన వేడుకయయ్యెడు నయ్యాశానుపుణ్యకథావిధానంబు వినిపింపవే యనుటయు, 210

మ. అవనీధారధురీణ రిణరిపుసై • న్యాధీశ ఫీశక్తిసై
శివలీలాకలితకావ్య కావ్యరచనా • పారీణతావాస వా
సవభోగప్రతిమాన మానవినయా • చారార్థిసంధార ధా
రవిసంకాశమహాకవీంద్రపరిష • త్ప్రస్తూయమానోదయా. 211

కం. కాశ్యపగోత్రపవిత్ర యు,పశ్యాయధరాధరోద్ధ • వాధిపభక్తా
వేశ్యాకటాక్షదీక్షా, పశ్యవిహారాపహసిత • వాసవతనయా. 212

మాలినీ. కమలభవవధూటీ • కాంతికల్హారమాలా
సముదితమధుహారా • సౌరభాసారలక్ష్మీ
సమధికరుచిసంప • త్సార సారస్వత శ్రీ
హిమితసుతవిరోధీ • ద్ధృత్సరోజాతజాతా 213

గద్య ఇది శ్రీ కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ సకల విద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వరపురాణంబను మహాప్రబంధంబునందుఁ

జతుర్థాశ్వాసము.

---

208. భుజగేంద్రహారునొద్ద = భీమేశునివద్ద; పాశుపతులన్ = శివలింగములను. తా॥ భీమేశునికి దగ్గరగా మీరు మీ పేర్లతో శివలింగములను ప్రతిష్ఠింపుడు. వాటి నెవరైనను ముట్టుకొనవచ్చును. వారి కష్టమూర్తులని పేరు బరగును. 209. విశిష్టాన్వయప్రసూతుడు = పవిత్రమైనకులమున పుట్టినవాడు; అభవునంటన్ = శివుని ముట్టుటకు. 210. నభోమణి = సూర్యుడు, హేమకుంభంబులన్ = బంగారుకుండలతో; సప్త...పూరంబులన్ = గోదావరీజలములను; సప్తర్షిసమానీత = సప్తర్షులచే తేబడినది.

శ్రీరస్తు

శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## పంచమాశ్వాసము



శ్రీవత్సలాంఛనోపమ
భావభవాకార మంత్రి • పరమేశ్వర పా
రావారనిభగభీరా
దేవాధిప సుప్రసన్న • దేవయయన్నా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

తే. ధర్మపారాయణుండుమైత్రావరుణుఁడు వెండియును విట్టులనిచెప్పె•విశదఫణితి
గాథసమ్మోదభవనేత్ర•కంకణునకు,మంకణునకాత్మధృతభోగి•కంకణునకు. 3

వ. అనంతరం బావివస్వతుం డాత్మప్రతిష్ఠితంబైన యద్దివ్యలింగంబునందు శివసన్నిధా
నంబు సేయఁదలంచి, 4

### —♦ సూర్యుండు కైలాసమునకరిగి శివుని దక్షారామమునకుఁ దోడి తెచ్చుట ♦—

సీ. ద్యోస్థలీనక్షత్ర • ధూళిపాళీకేళి, చుళుకితస్వర్ణదీ • జలచరములు
వైజయంతీపట • వ్యాక్షేపసంభూత, మారుతోద్ధూతేందు • మండలములు
సింహికాసుతకంఠ • సీమాపునర్దండ, చక్రధారావ్యథా • ప్రక్రమములు
రథరథ్యనిశ్వాస • రంహస్సముద్భ్రాంత, గగనగంగాతరం • గచ్ఛటములు

తే. వైనప్రస్థానవేగంబు • లతిశయిల్ల, నభ్రఘంటాపథంబున • నరుగువాఁడు
గతికినొకమూర్తిఁజాలించి•కదలిచనియె,శీఘ్రమున ద్వాదశాత్ముండు•శివునిగిరికి. 5

3. మైత్రావరుణుడు=వసిష్ఠుడు; గాథ...కంకణుడు=ఎక్కువ ఆనందము వలనపుట్టినకన్నీరుకలవాడు. 4. వివస్వంతుడు=రవి.

పూరితంబులైన యాపీడవిధిశిరఃకరోటికందర క్రోడంబులఁ బాటిల్లు ఘుమఘుమా ఘోషంబు భీషణభూషాభుజంగంబుల నిద్రాముద్రాగ్రంథిని గ్రహింపఁ గెంజడముడి బిగియించి నెట్టియంబు చుట్టిన జగజెట్టిపాపతేనియాొదల మాణిక్యంబుల తురంగలి మెఱుంగులు వెనువెంట మింటదాఁకను జరిగి ధగద్ధగనిగనిగ వెలుఁగుటంజేసి యప్పుడప్పుడు యనల స్తంభంబున నావిర్భవించినభంగి నంగీకరించుచు నగ్రగరళ పరిమళా ఘ్రాణంబునంజేసి మూర్ఛిల్లిన విధంబున నిరంతరధ్యాన స్తిమితలోచనులై యుభయపార్శ్వంబుల సనకసనందన సనత్సుజాతాది యోగీశ్వరులు పరివేష్టింప శేఖరశశాంకునకుఁ గ్రొత్తగాఁ గాశరాత్రికళత్రంబును గల్పించినట్లు పొలిసిన పచ్చి యేనికతోలు పచ్చడంబు జంగాళంబుగా వైచుకొని చరణభూషణ శేషాహిశిఖామణి ప్రతిబింబితాంబరుం డగుటంజేసి ఘోరవిషవితరణమహాపరాధక్షమకై పయోధివచ్చి పాదంబులపయింబడిన ఛావంబు భజియింప ధారాజలబిందుదంతురంబునుఁబోని వార ణాసురకుంభకూట విదారణంబునహత్తిన ముత్తియంబులతోడఁ జాల నాభీలం బగు త్రిశూలంబు కేలం గీలు కొల్పిన కఠినళమనశిరస్పాలనంబునంగట్టిన శ్రీపాదార విందంబునం దాపించిన బిరుదుకటకంబున ఘటియింపఁబడి వెలుంగుయాదఃపతి మేదోమృతంబు జిడ్డున గడ్డుకొనిన పూషాదిత్యు పలువరుసయంతంబున నుప్పతిల్లు త్రుళ్లుమెఱుంగులు పెల్లుగసుల్లసిల్లవిలసిల్లుచు విశ్వజగదుత్పత్తి గుప్తివివర్తికారి యగు పురారిం గనుంగొని జయజయశబ్ద పూర్వకంబుగా సంస్తుతి యొనర్చి ముకు ళితకరారవిందుండై. 9

తే. బ్రహ్మవిష్ణు మహేంద్రాది • పరివృఢునకు, నద్రిరాజన్యకన్యాస • మన్వితునకుఁ
బ్రమథగణభూతబేతాళ•పరివృతునకు, హరున కినుఁడు నమస్కార • మాచరించె. 10

వ. ఇట్లు ప్రణామానంతరంబున భాస్వంతుండు గౌరీకాంతునకు నిజాగమన ప్రయోజనం బెఱింగించినఁ దదనంతరంబ. 11

ఆ. ఇనునితోడిచెలిమి • నిభరాజవదనుండు, విన్నపంబుచేసె • విశ్వపతికి
నమృతమథనవేళ • నావిర్భవుండైన, భుజగహారుఁ జూడఁ•బోద మనుచు. 12

సీ. విఘ్నాధినాథుండు • విన్నవించినమీఁదఁ, బర్వతాత్మజ, విన్న•పంబుచేసెఁ
బర్వతాత్మజ విన్న•పంబొనరించిన, వెనుకఁ గ్రౌంచఘ్నుండు • విన్నవించెఁ
గ్రౌంచఘ్నుఁ డటు విన్న•వించినయత్తఱి,మఱివిన్నవించెను • మాతృగణము
బ్రాహ్మ్యదిమాతృవ • ర్గము విన్నవించిన, వెండియు భూతముల్ • విన్నవించె

9. విధిశిరంబులు = బ్రహ్మముఖములు; సంతమసము = కారుచీకటి; ఆపీడము = శిఖయందు మట్టినపూలదండ; నెట్టియము = గుండుపాగ; జంగాళంబుగాన్ = వల్లె వాటుగా, గుప్తివివర్తికారి = రక్షణ, శిక్షణలు సేయువాడు. 11. భాస్వంతుడు = రవి. 12. ఇనునితోడి చెలిమిన్ = సూర్యునితోడి స్నేహముతో; భుజగహారున్ = శివుని.

తే. సింధుధరునకుఁ గైలాసమందిరునకు, నభవు విచ్చేయు రవికిఁ బ్రియంబుగాఁగ
నమృతవారాశి నుదయించి యంధ్రభూమి, దక్షపురి నున్న యాదివ్యతనువుఁ జూడ. 13

వ. అని యిట్లు విన్నవించిన విఘ్నేశ్వరుని మీఁది యనుగ్రహంబునను భవానిమీఁది కూర్మినిఁ గుమారునిమీఁది ప్రేమానుబంధంబునను బ్రాహ్మ్యాదిమాతృగణంబు మీఁది ప్రీతిని భూతంబులమీఁది యాదరాతిశయంబునను భాస్వంతునిమీఁది సంతోషంబునను మధ్యమలోకగమనోద్యుక్తుండై హరివిరించులం జూచి మహాదేవుం డిట్లనియె. 14

—♦ మహాదేవుండు ప్రమథగణసమేతుండై దక్షారామమునకుఁ బోవుట ♦—

మ. కలవారందఱు దక్షవాటిగమనో • త్కంఠాసముత్సాహదో
హలులైనారు సహస్రభానుఁడును నేతెంచుచున్నాఁడు మం
గళదివ్యామృతలింగదర్శనమునుం • గర్తవ్య మంధ్రక్షమా
స్థలికిం బోదమె యూసుపోకకు వినో • దంబుల్ పరీక్షింపఁగన్. 15

తే. పాయ కొకచోటఁ జనికిలఁబడఁగ నుండ, నైనఫలమేమి యటు వినోదార్థ మరిగి
సంచరింతముగాక యాజలజహితుని, ధర్మ మౌర్జిత్యమును బొందు దక్షపురిని. 16

వ. అని యానతిచ్చి యాక్షణంబ. 17

కం. చాటింపఁ బంచెఁ జంద్రకిరీటుఁడు కైలాసనగపురీవీథుల ఘం
టాటంకృతితో దక్షుని, వాటికిఁ బయనంబు ప్రమథవరులకు ననుచున్. 18

వ. అప్పుడు భవాని భవుసన్నిధిఁ జేతులు మొగిచి యిట్లని విన్నవించె. 19

తే. పుట్టినిలుగాన నాకు నెప్పుడును ప్రేమ, దక్షవాటి మీఁద నెంతయు ఘనంబు
సన్నిధానంబు సేయు మో • చంద్రమౌళి, యమ్మహాపురి భీమలింగంబుమీఁద. 20

తే. ఉత్తరంబునఁ గాశి పుణ్యోత్తమంబు, మోక్షలక్ష్మికి నెబ్బంగి • మూలమయ్యె
దక్షిణంబున నాభంగి దక్షవాటి, మూలమౌఁగావుతను భోగమోక్షములకు. 21

తే. కుంటి కుదుపు లశక్తులు • కుష్ఠరోగు, లంధులును వృద్ధులును బాలురాదిగాఁగఁ
గాశి కరుగంగ లేని బికారులెల్ల, మోక్షమును బొందుదురుగాక దక్షవాటి. 22

మ. కలిదోషంబున నిష్ఠురాత్మకులునుం • గామాంధులుం బాపక
ర్ములు నజ్ఞానదవాగ్నిదగ్ధులును నై • ప్రోద్యన్మహారౌరవా
వలిఁ గూలంగల దుష్టమానసులకుం • వారాణశీతుల్యమై
కలుగుంగావుత ముక్తి దక్షపురి నీ • కారుణ్యసంభావనన్. 23

13. క్రౌంచఘ్నుఁడు = కుమారస్వామి. 14. మధ్యమలోక = భూలోకము. 15. ఊసుపోక = కాలక్షేపము; అంధ్రక్షమాస్థలి = ఆంధ్రభూమి. 16. జలజహితుని = సూర్యుని. 22. బికారులు = బిచ్చగాండ్రు.

తే. సర్వలోకంబులకును మోక్షదుఁడవైన, నీవు సన్నిహితుండవై • నిల్చినపుడు
దక్షిణాపథ కాశి శ్రీ దక్షవాటి, భువనమాన్యంబ కద నాదు•పుట్టినిల్లు. 24

వ. అని విన్నవించిన యనంతరంబ యంబికావల్లభుండు మందరాచలకూటంబనం బొల్చి సంస్మృతిమాత్రంబునం బొడచూపి నిల్చిన వృషభంబు నెక్కి యథోచితంబుగా నమందానందంబున గిరిరాజనందన వెనుకదెస నిటియం గౌఁగిలించుకొని యుండఁ దమతమ వాహనంబుల నారోహణంబుచేసి బ్రహ్మాదులు పరివేష్టించి చనుదేర శంసితవ్రతులైన యక్షసురసిద్ధసాధ్యులు ముందటం గెలనబలనియేతేర హృద్యంబు లగుగద్యపద్యంబులు తుంబురు నారదాదులు పఠింప వేదఘోషంబులు జయజయశబ్దంబులు వేణువీణాకాహళాదిపంచమహావాద్యనాదంబులు కుంజరబృంహితంబులుతురంగహేషితంబులు చెలంగ మూషకారూఢుండై వినాయకుండు మున్నాడినడువ సుబ్రహ్మణ్యుండు మయూరవాహనుండై కదిసికొలువ వసురుద్రాదిత్యులు దుర్గావీరభద్రభైరవులు నంతరాంతరంబులఁ జండీశ్వరా ద్యసంఖ్యాత ప్రమథగణంబులు బలసికొలువ కైలాసభవనంబుననుండి యక్షీణవిభవంబున దక్షారామంబు డాయంజను దెంచునప్పుడు. 25

తే. పొగడె రందు నికుంభకుం • భోదరులును
వెరసి భద్రమహాకాళి • భృంగిరిటులు
పాయు బగళంబు తొలఁగు వి • చ్చేయుఁడనుచుఁ
బార్శ్వములయందు మిగులనా • ర్భటము నేయ. 26

వ. అంత నీలకంఠుఁడు పురోపకంఠంబునకు విచ్చేయునప్పుడు. 27

గీ. విషమకఠిననిమ్నవీథీ • విటంకంబు, నంతరాంతరముల • నరసి యరసి
యక్షకర్దమమున • యక్షేశ్వరాదులు, సవరచేసి రధిక • సంభ్రమమున. 28

కం. ఘుసృణప్రసూనరసమునఁ, బసపుంజూర్ణమునఁ జంద్ర•పాంసులముక్తా
విసరముల సుర లొనర్చిరి, పసగా శంఖాబ్జముఖ్య • బహుచిత్రంబుల్. 29

వ. వెండియు సువర్ణారవిందసందానితసుందరమందార మాలికాభిరామంబును సంస్తంభిత శాతకుంభదండమండిత ధ్వజోపశోభితంబును నానావిపణిమార్గన్యస్త సంఘటిత

---

25. శంసితవ్రతులు = స్తుతిపాఠకులు; అంతరాంతరంబులన్ = మధ్యమధ్య; 26. బగళంబు = తొలగుడు; ఆర్భటము = హడావిడి. 28. విషమ = సమముగాలేని; నిమ్న = పల్లము; యక్షకర్దమము = కస్తూరి మున్నగువానిపూత; సవరచేసిరి = నునుపుచేసిరి. 29. ఘుసృణ...రసమునన్ = జిడ్డుగానున్న అత్తరుతో; పసపుంజూర్ణము = పసుపుపొడి; చంద్రపాంసులము = గంధపుపొడి; శంఖ...చిత్రంబుల్ = శంఖము, పద్మము మున్నగు ముగ్గులు.

మాణిక్యమయూఖ రేఖాకిమ్మీరితదళదిశాముఖంబును పరవిశేషవిభవ లక్ష్మీధామంబును నగు దక్షారామంబుఁ బ్రవేశించునప్పుడు. 30

—♦ శివుఁడు దక్షారామంబుఁ బ్రవేశించుట ♦—

ఉ. అక్షతగంధపుష్పఫలహారి • హిరణ్మయపాత్రహస్తలై
దక్షపురీవిలాసినులు • తామరసాయతలోచనల్ సహ
స్రాక్షుఁడు భీమలింగమున • కర్పణచేసిన యప్సరల్ విభూ
షాక్ష వెదుర్కొనం జనిరి • యందియ లంఘ్రుల ఘల్లుఘల్లనన్. 31

తే. భావహావవిలాస విభ్రమము లమరఁ, జంద్రశేఖరు నగరియుప్పరలపిండు
తగ సమర్పించె నయ్యాని • చంపకులకు, రత్నదీపాంకురముల నీరాజనములు 32

ఉ. శైలతనూజ తోడుగఁ బ్ర • సాదగుణంబున మాటిమాటికిన్
మేలములాడుచున్ నిజ స • మీపమునన్ గుహమాతృభద్ర షం
డాలముఖప్రధానగణ • నాథులు గొల్వఁగ భారతీశ లం
క్ష్మీలలనేశ్వరుల్ గదిసి • చెప్పెడు విన్నప మాలకించుచున్. 33

తే. భూమి దక్షిణపాథోధి • పుణ్యసీమఁ, బ్రజలు చేసిన భాగ్యమై • భవనమ్మృద్ధి
శ్రీమహాదేవుకరుణాని • రీక్షణంబు, గౌరిముఖరాజలక్ష్మియుఁ • గానఁబడియె. 34

శా. సంతోషించిరి దక్షిణాపథజనుల్ • సాక్షాద్విరూపాక్షునిం
గాంతాసంయుతు నందివాహు శశిరే • ఖాజూటకోటీరు వే
దాంతాభ్యర్చితపాదపంకజుని ద • క్షారామమధ్యంబునం
దంతన్ సంభృతసౌఖ్యుఁ గంటి మిగులన్ • న్యాయంబునం జెందుచున్. 35

కం. నాగేంద్రకర్ణకుండలు, నాగేంద్రత్వక్కటీరు • నగరాజసుతా
సౌగంధ్యలలితదక్షిణ, భాగుం గనుఁగొంటి మిట్టి • భాగ్యము గలచే. 36

గీ. అని సమస్తజనంబులు • నభినుతింప, నల్లనల్లన పెంచేసె • సంధకారి
దక్షవాటివిఘంటాపథంబునందు, హరిశతానందశక్రాది • సురలు గొలువ. 37

వ. ఇట్లు భీమేశ్వరసదనాంతరంబుం బ్రవేశించి. 38

తే. గారవించెను విధి శిరః • కంపమునను, నాదరించెఁ బ్రియోక్తుల • నబ్జనాభు
మించుమందస్మితమున మన్నించె శక్రు, హరుఁడు గటుతించెనురలఁగ • టాక్షదృష్టి. 39

30. శాతకుంభదండ = బంగారుధ్వజస్తంభము; విపణిమార్గ = అంగడివ్రోవలందు; కిమ్మీరిత = రంగురంగులుకలదిగా చేయబడిన. 31. అంఘ్రులన్ = కాళ్లయందు; రత్నదీపాంకురముల = మొలకలవంటిరత్నదీపముల. 33. గుహ = కుమారస్వామి; కదిసి = సమీపించి. 36. నాగ...కుండలున్ = పాములు కుండలములుగా కలవాని; నాగ...కటీరున్ = గజాజినము కట్టినవాని. 37. శతానంద = బ్రహ్మ. 39. విధి = బ్రహ్మ.

చం. సకలదిశాముఖంబులుఁ బ్ర • సన్నములయ్యెఁ బ్రదక్షిణార్చియై
యకలుషలీలఁ గైకొనియె • హవ్యవహుండు హవిర్విభాగముం
బ్రకటితసౌఖ్యకారియయి • పాయక వీచె సమీరణంబు త్ర్యం
బకుఁ డట భీమనాయకుని • మందిరమధ్యముఁ జొచ్చునత్తఱిన్. 40

సీ. గంగాజలాపూర్ణ • గాంగేయమణికుంభ, హస్తాబ్జములఁ గొంద • ఱప్సరసలు
ఫలపుష్పకిసలయ • ప్రచురపాత్రవిశేష, హస్తాబ్జములఁ గొంద • ఱప్సరసలు
నిర్మలానేకమా • ణిక్యనీరాజన, హస్తాబ్జములఁ గొంద • ఱప్సరసలు
లాజాక్షతాదిక•ల్యాణవస్తువ్రాత, హస్తాబ్జములఁ గొంద • ఱప్సరసలు

తే. నాటపాటల మ్రొక్కుల • నభినుతులను, నర్థిసేవించి రొకకొంద • ఱప్సరసలు
నపుడు రెండవకైలాస•మనఁగ నొప్పె. నభవుఁడేతేర భీమనా•యకునినగరు. 41

వ. మఱియు ననేక ప్రకారంబుల దివ్యాంగనారచితోపచారంబు లంగీకరించుచు నాం గీరసదత్తశోభనలగ్నంబున మునుల యాశీర్వాదంబులు చెలంగ నందివాహనంబు డిగ్గి నిజభుజావలంబనావతీర్ణయగు నపర్ణ హస్తాబ్జంబు కరపల్లవంబున నవలంబించి ముందట జలధరవాహుఁడు వేత్రహస్తుండై సందడి నెడంగలుగ జడియ మార్గ శీర్ష శుద్ధచతుర్దశియందు రోహిణీనక్షత్రంబున సిద్ధయోగంబున యోగీశ్వరేశ్వ రుండు. 42

తే. దాఁటెఁ బ్రాసాదదేహళి • దర్పకారి, ధరణిధరరాజపుత్రి కై•దండ యొసఁగ
సమ్మహాదేవి కుచమండ•లమ్ము సోఁకి, యంగకంబులఁ బులకంబు•లంకురింప. 43

వ. అప్పుడు. 44

ఉ. తా మును చేసినాఁడ నొక • తప్పని చిత్తములోఁ దలంచునో
యేమనునో తనుం గనిన • నీశ్వరుఁ డంచు భయంబుతోన యా
స్వామికి నర్చనం బొసఁగె • శంబరశత్రుఁడు దక్షవాటికా
ధామవిలాసదీర్ఘికలఁ • దన్వుగఁ బూచిన హల్లకంబులన్. 45

తే. మును కటాక్షైకవీక్షణాం•భోరుహముల, నర్చనము లిచ్చి రఖిలలో•కాధిపునకు
శివునిఁ బూజించి రప్సర•స్త్రీలు పిదప, హస్తపంకజపుష్పోప•హారములను. 46

తే. కామమునులోభమును ముక్తి • కాంతయందు
మోహమద్ధములు బాలిక • ముగ్ధలందు

---

40. ప్రదక్షిణార్చి = ఎడమనుండి కుడికితిరిగెడి జ్వాలకలవాఁడై; సమీరణము = గాలి. 41. కిసలయప్రచుర = చిగుళ్లతో వ్యాపించిన; ఏతేరన్ = రాగా. 42. ఆంగీరస = బృహస్పతి; అపర్ణ = పార్వతి; జలధరవాహుడు = ఇంద్రుడు. 43. దేహళి = గడప. 45. శంబరశత్రుడు = మన్మథుడు; తన్వుగన్ = పుల్లముగా; హల్లకము = ఎఱ్ఱతామర; మురభిదంబుజభవాని = విష్ణువు, బ్రహ్మ మొదలైన.

నధికపాపాత్ములం దధ • ర్మాత్ములంటుఁ
గ్రోధమాత్సర్యములు జన • కోటికొదవె. 47

వ. అనంతరం బాశివుం డభ్యంతరమందిరంబునఁ బ్రవేశించి హరివిరించి ప్రముఖ బృందారకులచేత మధుపర్కాద్యుపచారంబులు గైకొని యభ్యంతరంబులు గడచి గర్భగృహమండపంబునందు నూత్నరత్నస్వరూపంబైన శ్రీభీమనాథ మహాదేవ స్వయంభూజ్యోతిస్సుధామయమహాలింగంబు నాగమోక్త ప్రకారంబున నర్చించి యాపాదమస్తకంబు తద్రూపంబు ముహూర్తమాత్రంబు చింతించి. 48

—♦ శ్రీకంఠుండు దక్షారామ భీమేశునితో నైక్యంబు నొందుట ♦—

శా. కైలాసాచల కేలిమందిరుఁడు శ్రీ • కంఠుండు నుత్కంఠుఁడై
ప్రాలేయాచలరాజకన్యకయుఁ దా • బ్రహ్మాదిదేవవ్రజం
బాలోకింపఁగ నైక్యతం బొరసె ద • క్షారామభీమేశుతోఁ
ద్రైలోక్యంబును దివ్యలింగశివతా • దాత్మ్యంబు వర్ణింపఁగన్. 49

సీ. అవ్యయం బనపద్య • మాద్య మచ్యుత మజం, బవ్యక్త మప్రమే • యం బనంగఁ
బరఁగి కైలాసభూ • ధర సమాగతమైన, తేజంబుతోఁగూడి • తేజరిల్లె
దక్షవాటీపురా • ధ్యక్షభీమేశ్వర, శ్రీస్వయంభూదివ్య • సిద్ధలింగ
మమృతపాథోధి మ • ధ్యాంతసముద్భూత, మమలపరంజ్యోతి • రాదిరంబు

తే. భువనబీజంబు కైవల్య • భోగదాయి, యఖిలకల్యాణకారి వి • శ్వాద్భుతంబు
పూజఁగొనియెను సురభిదం • బుబ్బివాడి, దేవతాకోటిచే సంప్ర • తిష్ఠఁదొంది. 50

వ. బ్రాహ్మీప్రధానసప్తమాతృకలును నందీమహాకాళాది ప్రమథగణంబులును హరివి రించిప్రముఖ బృందారకులును బురందరాదిలోకపాలకులును వసురుద్రాదిత్య మరు ద్విశ్వేదేవాశ్వినీదేవతలును సిద్ధసాధ్యులును విద్యాధరోరగులును గ్రహనక్షత్రతారకం బులును పితృగణంబులును మూర్తంబులునమూర్తంబులునగు చరాచరంబులన్నియు నానారత్నగంధపుష్పధూపదీప నైవేద్యాదులు సమర్పించి ప్రదక్షిణంబు లాచరించి నమస్కరించి స్తుతియించిరి. తదనంతరంబ వెండియు. 15

—♦ లక్ష్మ్యాదులు శ్రీ భీమేశుని స్తుతించుట ♦—

తరు. సిరివాణిగౌరిశచి యప్సరసలరుంధతియహల్య • శచిమొదలగు స
త్పరమపతివ్రత లర్చించిరి దక్షారామనిలయు • శ్రీభీమేశున్. 62

వ. ఇట్లు పూజచేసి పరమపతివ్రతలు ముకుళితకరాంబుజలై శ్రీ దక్షవాటీపురాధ్యక్ష భీమేశ్వర భీమనాథ భీమశంకర భీమలింగ మహాదివ్యలింగ యవాఙ్మానసగోచర

సనకసనందనసనత్కుమార సనత్సుజాతాదియోగీంద్రులు నపారంబైన నీమహిమఁ గొనియాడనేర, రటుగావున మిమ్ము స్తోత్రంబుసేయ మాబోంట్లతరంబె? నిర్గుణుండవు సగుణుండవు గుణాతీతుండవు గుణాఢ్యుండవు నీవొక్కగుణంబున బ్రహ్మవై సృజియింతు వొక్కగుణంబున విష్ణుండవై పాలింతు వొక్క గుణంబున రుద్రుండవై సంహరింతువు, సర్వభూతాంతరాత్మభావనా, పరమపావనా, నీవుచంద్ర సూర్యాత్మదీధితివై యహోరాత్రస్వరూపంబున వర్తింతువు. పృథివ్యాపస్తే జోవాయు రాకాశాది పంచభూతాత్మకజీవాత్మక స్వరూపంబున వర్తింతువు సర్వభూతాత్మప్రవిష్టుండవు. సర్వేంద్రియగుణాధారా, సర్వేంద్రియవర్జిత సర్వసర్వాత్మక రూపంబున సర్వంబు ననుభవింతువు, సర్వశక్త్యాత్మక సర్వభూతగుహాశయ యని నమోనమశ్శబ్దంబులతోడ నిన్ను శ్రుతులు సంస్తుతించు శుద్ధుండవు బుద్ధుండవు సుఖివి సదానందుండవు సదాముక్తుండవు మముఁబోటి కామిను లల్పబుద్ధులు మిమ్ము బ్రస్తుతింపఁగలవారలా? క్షమియింపు క్షమియింపుము రక్షింపు రక్షింపు మగోచరచరిత్ర యగోచరబలాబల మహర్షి యోగీంద్రులకు దుర్లభుండవు సంసారి వసంసారివి శివుండ వభవుండవు ఘంగళుండ వమంగళుండవు భుజంగభూషణా, నిన్ను నీవ యెఱుంగుదువు సర్వాతీతుండవు, తాపసప్రియుండవు, తపోలభ్యుండవు నిజకర్మనిష్ఠులైన కర్మఠులు నిన్ను భజియింతురు నీకుఁ బ్రణామంబులు సేయుదురు జ్ఞానంబున నొందె దజ్ఞానంబున నొందె నీ మహిమార్ణవంబున మునింగి దరిచేరం దెరువెఱుంగక నీవే తక్క నితఃపరంబెఱుంగక మా యాత్మశుద్ధికొఱకుఁ దోఁచినట్లు వర్ణించెదముగాని శక్తిగలిగి కాదు దేవదేవ మహాదేవ దేవతాసార్వభౌమా దేవాదిదేవ దేవదేవేశ మహాలింగ తపోవిశేషంబునం బర్వతాత్మజ నీదేహంబున సగపాలు గొనియె నీ దేవికి నమస్కారంబు నీకు దండప్రమాణంబు కటాక్షింపుమని ప్రార్థించిరి. తదనంతరంబ యోసర్వమంగళా భువనేశ్వరీ సర్వమంగళదాయినీ నీకు మ్రొక్కెదము మమ్ము రక్షింపుమని మహాదేవికిం గేలుదోయి నొసలివయిం గీలించి యోమహాదేవ మహానుభావ శశాంకశేఖర నమస్తేనమస్తేనమ యని యనేక ప్రకారంబుల స్తుతియించిన. 53

చం. వికటజటాకుడుంగమున • వెన్నెలతేని ధరించి వీనులం
బ్రకటితనాగకుండలభ • రంబులు ప్రేలఁగ సుప్రసన్నుఁడై
వికవికనవ్వుచుం గరము • వేడుకతోఁ బొడచూపె భీమనా
యకుఁడు మహాపతివ్రతల • కంబికతోఁ గరుణాగుణంబునన్. 54

---

53. జ్ఞానంబుననొందె = తెలిసికొనీ; కేలుదోయి = రెండుచేతులు; నొసలిపయింగీలించి = మొగమునకుచేర్చి. 54. వికటజటాకుడుంగమునన్ = వికటమైన జటాజూటమున.

తే. ఇట్లు ప్రాదుర్భవించి స•ర్వేశ్వరుండు, పరమ తెన్నెని యాపతి•ప్రతిల లోనఁగ
యంత నంతర్హితుండయ్యె నఖిలసురులు, గానఁ గానంగ భీమలిం•గంబునందు. 55

వ. అప్పుడు సమీపవర్తియగు బృహస్పతికి దివస్పతి యిట్లనియె. 56

—◆ దివస్పతి బృహస్పతిని దానములఁగూర్చి యడుగుట ◆—

కం. దాతృత్వము దానంబును, దాతవ్యం బనఁగ నెట్టి • ధర్మవిధిజ్ఞా
దాతవ్యం బెయ్యది వి•ఖ్యాతము భవ్యానుజన్మ • యానతియీవే. 57

కం. దేవతలకు బ్రాహ్మణులకు, నీవలయు పదార్థ మెద్ది • యొఱిఁగింపఁదగుం
జీవా బహుదాతవ్యలు, గావున రాజులకుఁ దెలియఁ•గాఁ దగుపగుఁటో. 58

వ. అనిన విని వాస్తోష్పతికి గీష్పతి యిట్లనియె. 59

—◆ భూదానమహిమ ◆—

కం. పురుహూత భూమిదానము, పరమము దానములయందు • బహువస్తుతతుల్
ధరణీతలమునయందును, విరళంబై యెపుడు నుద్భ•వించుటకతనన్. 60

కం. సర్వపదార్థాశయమగు, నుర్వి మహీసురుల కిచ్చు • నుత్తముల కగుఁ జా
సర్వప్రదానఫలమును, గీర్వాణాధీశ యేటి•కి సంశయముల్. 61

చం. రజతము కాంచనంబు నవ•రత్నములున్ వనముల్ తటాకముల్
గజతురగాదిజంతువులు • గంధము పుష్పములుఁ బండ్లుఁ దేనియల్
ద్విజునకు వేలువేలు తడు • వేడుక నిచ్చుటకంటెఁ బ్రీతిఁ ద
త్ప్రజననకారణంబగు ధ • రాస్థల మిచ్చుట యిచ్చుటన్నియున్. 62

తే. ధరణిసర్వగుణోపేత • ధాన్యజనని, సస్యశాలిని నెవ్వాఁడు • శాంతబుద్ధిఁ
బాత్రమునకిచ్చు నతనికి•ధాత్రియుండు,నంతకాలంబు సకలసౌ•ఖ్యములుగలుగు. 63

సీ. కృతదక్షిణంబు ల•గ్నిష్టోమములు పెక్కు, యజనించునట్టి పు•ణ్యాత్ములకును
జ్ఞానదయాసత్య•సంతతవిజితేంద్రి•యత్వముల్ గురుదేవ•తార్చనములు
మొదలుగాఁగలపుణ్య•ములు సేయుధన్యుల, కధికుండుభూప్రదుం•డంద్రుబుధులు
పరమపాతివ్రత్య•పరిపాటి పాటించు, తరుణికంటె మహిప్ర•దాత పెద్ద

తే. వాఁ డనూనగోత్రుండును • వాఁడుఘనుఁడు, వాఁడు పుణ్యగరిష్ఠుండు•వాఁడు బుధుఁడు
వాఁడు విశ్రాంతిమంతుండు•వాఁడు దాత, యెవ్వఁడే వేదవిప్రున•కిచ్చు ధరణి. 64

---

56. దివస్పతి = ఇంద్రుడు; 58. జీవా = గురూ! వాస్తోష్పతి = ఇంద్రుడు; గీష్పతి = గురుడు. 61. గీర్వాణాధీశ = ఇంద్రా. 64. అగ్నిష్టోమము = యాజ్ఞము; యజనించు = చేయు; అనూనగోత్రుడు = మంచిగోత్రముకలవాడు.

తే. కాలమృత్యువు వెసఁదోలిఁ•కఁజవవెఱచు,నహిమరోచియు నెండగాఁ•యంగ నణఁగు
నగ్ని శంకించు నెరమంటఁ•లప్పళింప, భూమిదానంబొనర్చిన•పుణ్యతముని. 65

కం. స్వామిహిత మొప్పఁగను సం.గ్రామమునఁ జా శరపరంప•రలు పయిఁ గురియం
గా మృతిఁ బొందిన శూరుఁడు, భూమీదాతకుఁ బ్రభావ•మునఁ గట్టుపడున్. 66

తే. అయిదుతరములపూర్వుల • నపులమీఁద
నందఱనుగాచు నూర్ధ్వలో•కాలయములఁ
గమియఁబండిన వివిధస • స్యములతోడి
యవనిదానంబుచేయు పు • ణ్యాత్మకుండు. 67

కం. అనుములు గోధూమంబులు, మినుములు సెనగలును బండు • మేదిని భూదే
వున కిచ్చు నెవ్వఁ డతనికి, ననపాయస్వర్గసౌఖ్య•మబ్బు మహేంద్రా. 68

ఉ. హాటకపీఠికాధవళ • హర్మ్యమదావళశంఖకాహళీ
ఘోటసితాతపత్రములు • క్రొత్తమెఱుంగులు వోనిభామినుల్
మేటిధనంబు వస్త్రములు • మేదినియీఁగికి నెంచిచూచినం
సాటికి రావుగాన నిది • సత్ఫల మభ్రమునాథవాహనా. 69

తే. శ్వేతపక్షంబులోపలఁ బెరుఁగునెట్లు, దినదినంబును నీహార • దీప్తి దీప్తి
నవ్విధంబునఁ బెరుఁగు ని•త్యాభివృద్ధిఁ, బంటపంటకుభూదాన•భర్తఫలము. 70

తే. పాతకము చేసియైనను • బరితపించి, ధరణిదానంబు చేసిన • ధన్యుఁ డడఁచు
నయ్యఘముఁ దథ్య మిదినిర్జ•రాధినాథ, కుబుసమూడ్చెడి మేటినా•గువునుబోలె. 71

తే. ఒకఁడు హయమేధ మొనరించు • నొక్కరుండు
భూమిదానంబొనర్చునీ • పురుషులందుఁ
దారతమ్యంబు లేదంద్రు • తత్త్వవిదులు
ధర్మములు రెండు నొక్క వి • ధంబకాన. 72

ఉ. కాంచనకింకిణీయుతము • కామగమంబును దేవతాప్సర
శ్చంచలలోచనానికర • సంకులముం బ్రమదావహంబునై
మించిన దివ్యయానమున • మీఁదిజగంబులఁ గ్రీడసల్పు ని
ర్వంచన భూమిదాత యగు • వాఁడు పురందర పెక్కువర్షముల్. 73

65. అహిమరోచి=రవి. 67. అవనిదానము=భూదానము. 68. అనపాయ =శాశ్వతమైన. 69. క్రొత్తమెఱుంగులువోని=క్రొమ్మెఱుపులవంటి; ఈగి= దానము; అభ్రమునాథవాహనా=ఇంద్రా! 70. శ్వేతపక్షము=శుక్ల పక్షము; నీహారదీప్తిదీప్తి=వెన్నెల; భూదానభర్త=భూదానముచేసినతడు. 73. కాంచన... యుతము=బంగారుచిరుగంటలుకలది; కామగమము = స్వేచ్ఛగావెళ్లునది; దివ్య యానము=విమానము; నిర్వంచనన్=అడ్డులేక; పురందర=ఇంద్రా!

కం. భూమికి సరియగు వస్తువు, భూమికి సరియైన విధియు • భూమీదాన
స్వామికి సరియగు పుణ్యుఁడు. లేమికి సందియ మొకింత•లేదు మహేంద్రా. 74

తే. భూమిదానంబె దాన•మంభోదగమన, సూనృతమె సారధర్మంబు•సురవరేణ్య
యనృతమె పాతకంబు స•హస్రనయన, తెలియఁజెప్పితి నీకు సం•దియము వలదు. 75

—♦ దివస్పతి శ్రీ భీమేశ్వరునకు భీమమండలంబు సమర్పించుట ♦—

వ. అనిన విని దివస్పతి బృహస్పతిం బూజించి యతని యుపదేశంబున భక్తి శ్రద్ధా తాత్పర్యవిశ్వాసంబులు మనంబునం బెనంగొన భూమీమండలంబు ససస్యంబును సోద్యానంబును సకూపంబును సతటాకంబును సపద్మాకరంబును సదక్షిణంబును సశాస్త్రోక్తంబును గా ధారాపురస్సరంబుగా శ్రీభీమేశ్వర శ్రీమన్మహాదేవునకు సమర్పించి యామహీసన్నివేశంబునకు భీమమండలంబను నామంబు గల్పించె నది యెట్లనిన. 76

ఉ. అంబుధి మేర తూర్పునకు • నబ్ధియ సీ మటు యామ్యదిగ్విభా
గంబునకుం బ్రతీచికిని • గౌతమి సీమ యుదీచికిం బ్రమా
ణంబు త్రియోజనంబు సుర • నాథుఁడు దక్షిణకాశి భీమలిం
గంబున కేకభోగముగఁ • గట్టడచేసె వసుంధరాస్థలిన్. 77

తే. తుల్యభాగాతరంగిణీ•తోడఁగూడఁ, గణ్వవాహినితోఁ గూడఁ•గనకరత్న
దివ్యపరిధానసహితంబు • దేవభర్త, ధరణిభీమేశ్వరున కిచ్చె•ధారపోసి. 78

తే. దాత త్రైలోక్యభర్త వృ•ద్ధశ్రవుండు, దేయ మంభోధిగౌతమీ • తీరభూమి
త్రిపురవిధ్వంసనుండు ప్ర•తిగ్రహీత, యింత యొప్పునె వరికింప•నీసమృద్ధి. 79

వ. ఇవ్విధంబునఁ బాకశాసనుండు పురశాసనుండగు శ్రీభీమేశ్వర శ్రీమన్మహాదేవునకు నంగరాగాదిభోగవైభవ వినోదార్థంబుగా గజాశ్వదాసదాసీగాణిక్య మాణిక్యగోధేను సహితంబుగా భీమమండలంబు దక్షారామ సమేతంబుగా సమర్పించి చాతుర్వర్ణ్యంబును రప్పించి యిట్లనియె. 80

సీ. ఓ మహాజనులార • భీమమండలమహా, గ్రామఖండికభట్టి • క్షాత్రవైశ్య
వాస్తవ్యులార వి • శ్వాసపూర్వకముగా, సావధానమనస్కు•లై వినుండు
ప్రాగ్దిశకును యామ్య•పశ్చిమంబులకును, నంభోధిగౌతము•లవధిచిహ్న
ముత్తరమున మూఁడు•యోజనంబుల తుద, పొలిమేర యిది చక్ర•వలయరేఖ

75. అంభోదగమన = ఇంద్రా ! 77. మేర, సీమ = హద్దు; అబ్ధియ = సముద్రమే; యామ్యదిగ్విభాగము = దక్షిణము; ప్రతీచి = పడమర; ఉదీచి = ఉత్తరము; కట్టడ చేసెను = శాసించెను. 79. వృద్ధశ్రవుడు = ఇంద్రుడు; దేయము = దానమియ్యదగినది. 80. పాకశాసనుడు = ఇంద్రుడు; గాణిక్య = గణికల (వేశ్యల) సమూహము.

తే. యీమహాక్షేత్ర మేను స•ర్వేశ్వరునకు, నిందుధరునకు దక్షవా•టీశ్వరునకు
నిచ్చితిని ధారపోసి భీ•మేశ్వరునకు, నాసుధాకరతారకా•హస్కరముగ. 81

ఆ. ఏలుకొం(డు మీర • లేపురాంతకునకుఁ. బృథివియీగి బిడ్డ • బిడ్డతరము
(బతుకుఁ దా(శ్రయించి • ఫణిరాజకుండలు. భీమనాథదేవు • భూమిజనులు. 82

వ. అని యీ(ప్రకారంబునఁ దెల్పుడు సేయుచు. 83

చం. సురపతి మార్గశీర్షమున • శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం
బొరసిన సిద్ధయోగమున • భూతలమిచ్చెఁ బయోధిగౌతముల్
గరుసుగఁ దుల్యభాగయును • గం(డెడు శోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు • వారవధూ(త్రిశతద్వయంబుతోన్. 84

వ. ఇట్లిచ్చి ధర్మశాసనంబు (వ్రాయించె నది యె ట్లనిన.

ఉ. ఇప్పటి భూమిపాలురును • నింకిట రాఁగల భూమిపాలురుం
దప్పకుఁడయ్య మ(త్ప్రవిహి•తస్థిరభూతలదానధర్మ మె
ల్లప్పుడు మీకు నయ్యెడుఁ జి•రాయువు భాగ్యము వైభవంబుచే
నొప్పగుసు(ప్రతాపము సు • ఖోన్నతి గంధగజాదిలక్ష్మియున్. 86

వ. అని వెండియు. 87

సీ. కట్టించెఁ బట్టణఁబ్మొ విభాగముపైఁడిఁ, గల్పించె వ(ప్రంబుఁ • గాంచనమున
మలిపించె బంగార•ముల దేవగృహములు, కూర్పించె నట్టిండ్లు • కుందనమున
నిర్మించెఁ (బాసాద•నివహంబు గనకానఁ, బాటించె గవకుఁలు • హాటకమున
రచియించెఁ గా ర్తస్వ•రమున గోపురములు, కీలించెఁ గేలిదీ•ర్ఘికలు భూరి

తే. నాటె మందారతరువులు • తోఁటలందు, వలఁతిసురభులఁగీలార•ములకునిచ్చెఁ
బోసె సిద్ధరసంబును•బుష్కరిణులఁ, గణఁక విం(దుండు దక్షిణ•కాశియందు. 88

తే. ఏకభోగంబుగాఁగ నే•లేఱుగరుసు, గడలిసీమయు గౌతమీ•గంగమేర
కప్పురపుఁ(గోవికాశ్మీర•ఖండ మవధి, యేలె విశ్వకుటుంబి భీ•మేశ్వరుండు 89

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికా • చాళుక్యభీమేశ్వరే
శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీ • సంవేద్యరాడ్భైరవుం

81. ఖండిక = చిన్నపల్లె; యామ్య = దక్షిణము; పొలిమేర = ఊరిహద్దు; ఆసుధాకరతారకావాహస్కరముగన్ = సూర్యచం(ద్రనక్ష(త్రములున్నన్నాళ్లును. 83. తెల్పుడుసేయుచు = తెలియజెప్పుచు; గరుసుగన్ = హద్దుగా; వారవధూ(త్రిశతద్వయము = 600 భోగపువనితలు. 88. పైడిన్ = బంగారముతో; వ(ప్రము = (ప్రాకారము; గవకులు = గోపురములు; భూరి, కార్తస్వరము = బంగారు; వలఁతిసురభులకీలారములు = మంచియావుల మందలు; కణఁకన్ = పూనికతో.

డిరువుంబొర్వను బల్వతేశుఁడు మ్మరం • దేపండుగా నేచె ని
ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరా•తంకప్రతాపోద్ధతిన్. 90

తే. కట్టెఁబట్టంబు యువరాజు•గజముఖునికి, రాణివాసంబుతుహినాద్రి•రాజతనయ
కూర్మిసైన్యాధినాథుండు•గొమరసామి, యిలకుఁ బతి యైనదక్షవా•టీశ్వరునకు. 91

శా. శ్రీకంఠుండు త్రిలింగ భూవలయమున్ • శ్రీభీమనాథేశ్వరుం
డేకచ్ఛత్రముగా సమస్తభువనా•ధీశుండు పాలింపఁ గాఁ
బాకోన్ముద్రితమాధవీవిచికల • ప్రత్యగ్రసౌరభ్య ల
క్ష్మీకం బైనవసంతకాల ముదయిం•చెన్ సౌఖ్యసంధాయియై. 92

## —◆ వసంతఋతు వర్ణనము ◆—

తే సకలదైవతమండల • సార్వభౌము, దక్షిణాపథవాటికా•ధవునిఁ గొల్వఁ
గుసుమవిసరంబుఁ గానుకఁ•గొంచువచ్చె. నఖిలఋతుచక్రవర్తి మ•ధ్వాగమంబు. 93

తే. కమిచె సురపొన్న వనలక్ష్మి•కబరిమీఁద, సంతరించినముత్యాల•జల్లివోలెఁ
బూచె సంపెంగలారామ•భూమియందుఁ, గుసుమనారాచుచిచ్చుల • కోలవోలె 94

శా. హేమంతావధిసంప్రబోధగురువుల్ • హృజ్జాతతేజోగ్ని ధా
య్యామంత్రాక్షరముల్ పటీరగిరిప • వ్యామందవాతూలముల్
వేమాఖుం గలశీతనూభవవధూ•వేణీభరాంతఃప్రసూ
నామోదగ్రహయాళువుల్ పొలసె ద•క్షారామమధ్యంబునన్. 95

చం. దిగదిగఁ జేరవచ్చి రతి•దేవి యుపాయముఁ బొందపన్నెనై
తగవున రత్నకుండల త•దంబకముం దను వేఁడిపుచ్చుకోఁ
దెగువ మనోభవుండు తియ•తియ్యనిసింగిణివింటికొప్పునన్
దగిలిచె దక్షవాటివని•తాచికురంబులఁ బోలు తుంటినిన్. 96

90. సరిసామంతుడు = సాటియైనరాజు; ఉపకంఠబాంధవుడు = సరిహద్దు చుట్టము. 92. శ్రీకంఠుడు = శివుడు; పాక...లక్ష్మీకము = సకాలమున వికసించిన మాధవి, మల్లెపూల క్రొత్త పరిమళములతో కూడినది. 93. కుసుమవిసరము = పూల ప్రోగు; మధ్వాగమంబు = వసంతఋతువచ్చుట. 94. కమిచెన్ = గ్రహించెను; కబరి = కొప్పు; కుసుమనారాచు = మన్మథుని; చిచ్చులకోల = అగ్నిబాణము. 95. హేమంత...గురువుల్ = హేమంతము పూర్తియైనదని చెప్పెడివి; హృజ్జాత... అక్షరముల్ = మన్మథాగ్ని రగుల్కొల్పు మంత్రాక్షరములు; ధాయ్యా = అగ్ని సమింధనీఋక్కు; పటీర...వాతూలముల్ = మలయగిరిమీదినుండివచ్చు పైరుగాలులు; వేమాఖున్ = పల్మఱు; కలశీ...గ్రహయాళువుల్ = లోపాముద్రకొప్పులోని పూల వాసనను తెచ్చునవి. (లోపాముద్రాగస్త్యులు దక్షిణదిక్కునందుండుటచే ఆగాలు లక్కడనుండి వచ్చునవి) పొలసెన్ = వీచెను.

తే. పాంథనివహంబుపాలియుత్పాతకారి, ధూమకేతువుఁబోలి పెన్దోఁటనడుమ
విరిసెఁ గ్రొవ్వారినాగకేసరపుఁబువ్వు.మీఁదిధూమంబుభంగిఁదుమ్మెదలువెడలె. 97

శా. సందుగ్ధార్ణవచంద్రమండలశిఖిజ్వాలాతటిద్వల్లరీ
కందర్పేషుశరాసనాచ్యుతతనూ గంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపుం
మందారద్రుమవాటియందు సుమనోమైరేయముల్ గ్రోలుచున్. 98

మ. అళికోలాహలసంభ్రమంబును శుకవ్యాజృంభముం శారికా
కులసల్లాపములుం విహారవిపిన క్షోణీవిభాగంబునం
గల పుంస్కోకిలకంఠకోమలకుహూకార ప్రపంచంబుతోఁ
దలఁపించెన్ రతికాంతమూలరథినీ ధాటీసమారంభముం. 99

వ. మఱియును దత్సమయంబున భువనోత్సంగమంగళాలంకారంబైన దక్షారామంబునఁ బరిసరారామంబులయందుఁ బరమపరిపాకభిదుర ఫలాపీడదాడిమీక్రోడ నీడాక్రీడచ్చిక్రోడయూథంబును, బరిసన్నమత్తామ్రచూడ చూడాతామ్రకిసలయా మ్రేడితమదన సామ్రాజ్య పూజ్యంబును, నవకుసుమమధుపానహర్షితపుష్పతరు పుష్పితలావణ్య విశేషంబును, వనదేవతాతాళవృంతాయమానదళనిచయరోచనామేచక మోచారణ్యంబును, బరిసరావనిరుహనివహావకులపనసనిస్రంస్యమాణ శీధురసధునీ జంబాలజాలవన విభాగంబును, మదచపలచంచరీక చక్రచరణతాడన చంచల చంపకదాడిమీ ప్రసవ మంజరీరజః పుంజసముత్పుంజనికుంజంబును, గంధసారగిరి గంధవాహ ప్రవాహ లహరికావిహారబహుళితభూతనూతనక్రముకకుహాళిగర్భనిర్భరామోద మేదురంబునునగుచు జగదాహ్లాదంబు సంపాదించుచు విజృంభించిన. 100

---

96. తియ...కొప్పున = చెఱకువింటిని; శింజిని = నారి. తా॥ రతీదేవి వచ్చి 'నాథా! దక్షారామముమీదికి విల్లు నెత్తవద్దు. ఇదివరకొకసారి బూడిదకాగా నానా బాధలుపడి నిన్ను బ్రతికించుకున్నాను' అని బ్రతిమాలుచున్నను ధైర్యముగా చెఱకు విల్లునందు తుమ్మెదనారిని బిగించెను. 97. తా॥ ప్రవాసిజనము పాలిట నుత్పాతచిహ్నమువలె తోటమధ్య నాగకేసర పువ్వు వికసించినది. దానిమీద వ్రాలిన తుమ్మెదలు పొగవలెనున్నవి. 98. సందుగ్ధ...ఉద్భవల్ = క్షీరసముద్రము మున్నగువాటిలో పుట్టిన; అచ్చరల్ = అప్సరసలు; ద్రుమవాటి = తోట; సుమనోమైరేయము = పూదేనె. 99. అళి...సంభ్రమము = తుమ్మెదల కలకలము; శుకవ్యాజృంభము = చిలుకల సందడి; శారికాకులసల్లాపములున్ = గోరువంకల కూతలు; విహార...ప్రపంచంబుతో = ఉద్యానమందలి మగకోకిలల కుహూకారములతో; రతి...సమారంభమున్ = మన్మథుని మూలసైన్యపు టార్భాటమును; తలపించెన్ = అనిపించెను. 100. భిదుర = బ్రద్దలగుచున్న; చిక్రోడయూథము = ఉడుతలు; మోచారణ్యంబు = అరఁటితోట.

సీ. కర్పూరకస్తూరి•కలఁ గోట నిర్మించి, కుంకుమద్రవమునఁ•గొమ్మఁ దీర్చి
యగురుజంబాలంబు•నందు బెందడి చేసి, పన్నీటివెల్లువఁ•బరిఖఁ దాల్చి
పవడంపుఁ జిపురుల•గవఁకు లుత్పాదించి, తమ్మిరేకుల బోరు•తలుపు లెత్తి
రత్నాంకురంబుల•రంగవల్లి రచించి, పట్టుపుట్టంబులఁ•బడగ లెత్తి

తే. లలితశృంగారరచన న•లంకరించి, విబుధగంధర్వు లామని • వేళలందు
భీమనాథునినగరియా•రామరేఖఁ, బూజచేసిరి సహకార • భూరుహముల. 101

కం. కిసలయరసజిగ్రహిషా, వ్యసనాకులపికకుహూభ•వత్పంచమమై
కుసుమసమయావతారము, రసముంచెను జగములంగ • రాగాంబునిధిన్. 102

ఉ. జాదురజాదురంబు మృదు•చర్చరిగీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకములఁ • జంద్రిక కాయఁగ పక్షవాటికా
వేదులమీఁదటన్ గనక•వీణలు మీటుచుఁ బాడి రచ్చరల్
మోద మెలర్పఁగా భువన•మోహనవిగ్రహు భీమనాథునిన్. 103

చం. అనువగు కౌనుదీఁగె లసి•యాడఁ బయోధరముల్ వణంకఁగాఁ
గనకమరాళకీరకల•కంఠమయూరరథాధిరూఢలై
వనితలు భీమనాయకుని • వారక యేసిరి కమ్మఁదేనియల్
చినుకు పసిండిలేఁజెఱకు • సింగిణివిండ్లను బుష్పబాణముల్. 104

వ. తదనంతరంబ, 105

ఉ. చంచలనేత్ర హేమరథ • సౌధశిలోగృహకూటకోటిపైఁ
గాంచనపత్రపద్మమునఁ • గర్ణికమధ్యమునందు నిల్వ ని
ర్వంచననేనె నంతఁబరి•వర్తనచిత్రవిలాసలీల ని
ర్తించుచుఁ బుష్పబాణముల • దేవశిఖామణి భీమనాథునిన్. 106

101. కొమ్మ = కోటకొమ్మ; జంబాలము = బెందడి; గవకులు = సింహద్వారములు; తమ్మిరేకులు = తామరపూరేకులు; రంగవల్లి = ముగ్గు; పడగలు = జెండాలు; ఆమని వేళ = వసంతసమయము; ఆరామరేఖన్ = ఉద్యానములందు; సహకారభూరుహము = తియ్యమామిడిచెట్టు. 102. కిసలయ...పంచమము = చిగుళ్ల రసము త్రాగగోరునట్టి వ్యసనముకల కోకిలల కుహూకారమున పుట్టిన పంచమస్వరముకలదై; కుసుమసమయావతారము = వసంతము. 103. జాదురజాదురంబు = మిక్కిలి నేర్పు; మృదు చర్చరిగీతులు = శివునిమీది పాటలు; వారుణీ...అతిరేకములన్ = కల్లుత్రావినమదముతో; చంద్రిక = వెన్నెల; వేదులమీదటన్ = అరుగులమీద. 104. కౌనుదీగలు = తీగెలవంటి నడుములు; పయోధరముల్ = స్తనములు; వారక = ఎడతెరపిలేక; కమ్మదేనియల్ చినుకు = పూదేనె స్రవించు; పసిండి...విండ్లను = బంగారు చెఱకువిల్లులతో.

తే. ఆజ్ఞవాటించెఁ గేలీవి॰హారములకు, భీమనాథుండు దేవతా॰గ్రామణులకు
గంధకర్పూరకస్తూరి॰కాప్రశస్త, వస్తుకోటులు నొసఁగె న॰వారితముగ, 107

వ. అప్పు డప్పురంబున నంగనాజనంబులు, 108

మ. జిలుగుంజెంద్రికవన్నెచేలలును గా • శ్మీరాంగరాగంబులున్
వలిముత్యంబులభూషణంబులును భా • స్వత్కేతకీపత్త్రికా
విలసద్వేణులుఁ జొక్కమై మెఱయఁగా • వేల్పుంజకోరేక్షణల్
లలి భీమేశ్వరు రాజశేఖరునిఁ గొ • ల్వ న్వచ్చి రొక్కుమ్మడిన్. 109

శా. బీజాపూరఫలేక్షుచారుమణికుం • భీమేచకేందీవరాం
భోజంబుల్ సమయోచితంబులుగ శుం • భుం జేరి కుంభస్థలీ
రాజార్ధాభరణంబు దక్షనగరీ • రామాసముత్తుంగ వ
క్షోజద్వంద్వశిఖాంకురస్ఫురణఁగై॰కొన్విఘ్నరాజర్మిలిన్. 110

తే. సానికూఁతుల పల్లవో॰ష్ఠములఁబోలు, దానవపుఁబువ్వుదండఁ గం॰ధర ధరించి
పసిఁడిబుఱ్ఱటకొమ్ముచే॰పట్టివచ్చెఁ, భవునిఁగొలువంగఁ బాతాళ॰భైరవుండు. 111

చం. మగఁటిమిఁ జెంద్రగుజ్జురస॰మంటినవామపదాంబుజంబుపై
నిగళము నా సురాసురవి • నిర్జితమౌ బిరుదందె ఘల్లనం
బొగడలు బొండుమల్లియలు • పొన్నలు పావడచొళ్లియంబునన్
నిగిడిచి వీరభద్రుఁడు చ॰నెన్ శశిమౌళిసమీపభూమికిన్ 112

వ. అప్పుడు బ్రహ్మాదిదేవతలును నింద్రాద్యష్టదిక్పాలకులును నందిభృంగిరిటికుంభ నికుంభకుంభోదరచండీశ్వరమహాకాళప్రముఖు లగునసంఖ్యాత ప్రమథులును సుర గరుడోరగకిన్నరగంధర్వసిద్ధసాధ్యవిద్యాధర రాక్షసులును భూతబేతాళశాకినీ డాకినీ గణంబులును సమయోచితాలంకారంబులఁ గైసేసి వృషకేతునిం గొలిచి యుండి రంత. 113

శా. ప్రీత్యుత్ఫుల్లనఫాలనేత్రుఁడగు శ్రీ॰భీమేశ్వరస్వామి ని
ష్ప్రత్యూహం బగు సౌహృదంబున హరి • బ్రహ్మాదులన్ భ్రూలతా

---

106. హేమ...కోటిపైన్ = మేడమీదినుండి; కర్ణిక = పద్మముమధ్య నెత్తుగా నుండునది; పుష్ప...మణీ = మన్మథుడు. 107. అవారితముగన్ = ఎక్కువగా. 109. జిలుగు... చేలలు = తెల్లనికోకలు; కాశ్మీరాంగరా గములు = కుంకుమమైపూతలు; భాస్వత్ వేణులు = మొగలిరేకులు కుట్టిన జడలు; వేల్పు...జకోరేక్షణల్ = దేవతా స్త్రీలు. 110. శా॥ గణపతి దానిమ్మపళ్లు, మణికుంభములు, నల్లగలువలు, పద్మములను, దక్షవాటికలోని స్త్రీల యున్నత స్తనాగ్రముల భ్రాన్తితో చేపట్టును. 111. సాని కూతుల = భోగపువనితల; కంధరన్ = కంఠమున; 112. చెంద్రగుజ్జురసము = సిందూరపురంగు; బిరుదు = కాలి గండపెండేరము; పావడచొళ్ళియంబునన్ = మొలకుచుట్టు కొన్న కాసెకోకలయందు. 113. కైసేసి = అలంకరించి; వృషకేతనుని = శివుని

ప్రత్యుద్బోధనసంజ్ఞచేసి కనుగిఁర్పం జాగె గంగోదకా
హత్యాక్షేపహృతి ప్రపంచములు దక్షారామమధ్యంబునన్. 114

సీ. హేరాళముగఁ జల్లె • నెలనాఁగయొక్కర్తు. కుంభోదరునిమీఁదఁ • గుసుమరజముఁ
గుటిలకుంతల భృంగి • రిటిమోమునం దోర్తు • తాఁకించె నొకసలిగం • ధంబుఁ బసుపు
పక్షంబు లక్షించి • వైచె గంధపుటుండ. వీరభద్రుని నొర్క • నీరజాక్షి
చెవిలోనఁ బాలంగఁ • జిమ్మె గొజ్జఁగనీటఁ. గాలభైరవు నొక్క • కలువకంటి

తే. కొమ్మయొక్కతెయందందఁ • గొమరసామి
యొదలలయందు జవ్వాది • యసలుగలిపెఁ
బునుఁగు మణికుంభమున నించి • పోసెనొక్క
పొలఁతి విఘ్నేశ్వరుని కుండ • బొజ్జమీద. 115

ఉ. నేతుల నూనెలం బసుపు • నీరునఁ గుంకుమచెందిరంబులన్
నూతన గంధసారముల • నున్నానరించిరి కేలితంత్రముల్
కౌతుక మొప్పు దక్షవని • కాపురవీథుల భూతకోటితో
మాతృక గోఁగు నూకసతి • మండమదేవియు ఘట్టతల్లియున్. 116

వ. అంత. 117

తే. పోళవిదేవి శ్రీభద్ర • కాళిమీఁదఁ, బరిమళముతోడి చిటుబంతి • పసుపుఁ జల్లె
గాజుకుప్పెలఁ గస్తూరి • కాజలంబు. కర్ణికారాంబపై నించెఁ • గర్ణమోటి. 188

ఉ. ఘట్టతరోద్ధతిం గరిము • ఖంబునఁ బీలిచి గౌతమీనదిం
బుట్టిన సత్ప్రవాహజల • పూరముఁ ద్రుస్సన నూఁదుచుం బుర్
హట్టమున వ్మధూత్సవ వి • హారము సల్పెను గౌరిదేవి చొ
ల్పట్టిగణేశ్వరుండు సుర • భామిను లోలమునం బొదుంగఁగన్. 119

మ. ప్రమదంబింపెసలార మేనకయు రం • భామంజుఘోషా తిలో
త్తమలున్ వెండియుఁ గల్గునప్సరసలుం • దారాధిపోత్తంసునిన్
భ్రమయం జల్లిరి గంధసారమునసుం • బన్నీటఁ గాశ్మీర పం
కమునన్ సంకుమదంబునం బునుఁగునం • గర్పూరఖండంబులన్. 120

తే. అచ్యుతునిమీఁదఁ జల్లె దు • గ్ధాబ్ధికన్య, భారతీదేవి పద్మజు • పైన చల్లె
శచిమహేంద్రునిఁ జల్లె వ • సంతకేలి, గంధకర్పూరకస్తూరి • కాజలంబు. 121

---

114. ప్రీతి... నేత్రుడు = సంతోషముతో వికసించిన ఫాలనేత్రముకలవాడు; నిర్వ్యూత్యూహము = అడ్డులేని; సౌహృదము = మైత్రి; భ్రూ...సంజ్ఞ = కనుబొమలు కదలుటతోడిసైగ; కనుగిర్పంజాగెన్ = కన్నుగీటసాగెను. 115. జవ్వాదియసలు = బురదవంటి జవ్వాది. 116. మాతృకగోఁగు = గోగులమ్మ; నూకసతి = నూకాంబ. 118. చిటుబంతిపసుపు = పూసికొనుపసుపు; కర్ణమోటి = మాతృదేవత. 121. దుగ్ధాబ్ధికన్య = లక్ష్మి; పద్మజుపైని = బ్రహ్మపై.

మ. అగురుం గుంకుమధూళియుం దిమిరసం • ధ్యారాగ సంస్పర్శముం
గగనాభోగము సంధ్యకాలమున నాఁ • గాన్పింప నాభింగికిం
దగియెం జుక్కలువోలెఁ దాండవగణా•ధ్యక్షుండు తుండంబున
న్నెగయంజల్లిన సప్తసింధుజలవే • ణీబిందుసందోహముల్. 122

వ. అట్టియెడ మున్ను కిన్నరులు చల్లినఁ బెల్లునెఱసిన ఘుసృణకుసుమకేసరధూళిపాళియు, విద్యాధరసందోహంబులు ఱువ్వినం జిందిన మవ్వంపుఁ జెందిరంబును సుచ్చరించి విచ్చలవిడి హెచ్చుగా నచ్చరలు చిమ్మినఁ గ్రమ్ము కుసుంభాంభఃపూరంబును, నంగనాజనంబులపై సుడిసి తడిసి యార్ద్రాంగరాగశీకరాసారవాహిని యగు గంధవాహప్రవాహంబును, ధారాళకరాళరక్తచందనాంబు సంసిక్త వసుంధరాభాగంబును, గలయం గెంపు పెంపుసంపాదింప నకాండసంధ్య నావహించిన నందుచిత వ్యవహారయోగ్యంబులై పొడచూపిన యంధకారంబునుం బోలెగంధర్వకర వికీర్యమాణకస్తూరికారేణువిసరంబులవలనను గుసుమకస్తూరికా సాంధ్యరాగాంధకారంబులకుఁ దోడై పొడచూపనేతెంచు చుక్కలచక్కఁదనంబునకుందోఁబుట్టైనహాయల పనాపాళిపల్లవవిక్షిప్తంబులైన పచ్చకప్పురంబు పలుకులును,జెదరలంటోబరకపోలానిలంబులవలన రోలంబనికురుంబంబులునెగయుటయును బరస్పరసంవర్గార్థపళంబున వళంబులు సముద్ధతినిగుడించు పసిండితమ్మిమొగడలు మెండుమండుటయునుఁగామూర్తంబగు మకరకేతనభుజప్రతాపదావానలంబు ఛటచ్ఛటాశబ్దంబుల చాడ్పునం జెలంగుచున్న యక్షకర్దమప్రక్షిప్తలాక్షకరండ సంఘట్టనస్వనంబుల వలనను దొట్టి దొట్టి యెడనెడమడువులుగట్టిన సజ్జకపు గొజ్జంగనీరునందుఁ బ్రతిబింబించు నప్సరఃకాంతల వదనారవిందంబులలోపలంబడి తేలియాడువాడని చేమంతిబంతులవడువునై కొలంకులు చందంబు నొందం బువ్వాని కరిగెడి కొదువతుమ్మెదకదుపులను గదిరి తొరఁగు గుహ్యకమండలీకృత పుండ్రేక్షుకోదండ పృషనిష్ఠ్యూతనూతనకుపలయాస్త్రంబులవలనను నిశాటకరహాటముఖనఖసముజ్జ్రితంబైన సంకుమదపంకంబు వలనను, నలుదెసల నంతంత జాఱిపడియున్న కమలమృణాలకాండంబువలనను, వరంబును బదిలంబుగా నమర్చిన కేదారంబుతెఱంగుఁదోచుటకునీడై చతురహాలికుండు జల్లుపరుపవుమరువంపు మొలకల చెలువునం బెల్లుడుల్లు ప్రమథగణవిక్షిప్త విమలహారయష్టిముక్తాఫలంబులవలనను వసంతర్త్వారంభంబు త్రిభువనదృక్ప్రియతమం బయ్యెఁ నయ్యవసరంబున. 123

తే. బహుళకస్తూరికామేఘ • పటలమునకు, శీకరాసారమయ్యె గొ • జ్జెంగనీరు
వలుద వడగండ్లునయ్యె న • వ్వర్షమునకుఁ, గామినులుచల్లు కర్పూర • ఖండవితతి. 124

122. సంధ్యకాలమునానన్ = సంధ్యవేళనన్నట్లు; 123. అకాండసంధ్య = వేళకానివేళ వచ్చిన సంధ్య; 124. వలుద = పెద్దవి;

వ. ఇవ్విధంబున వసంతోత్సవం బవధరించి భీమేశ్వరుండు హరిబ్రహ్మాదిదేవతలకు నింద్రాద్యష్టదిక్పాలకులకు నరకిన్నరకింపురుష సిద్ధసాధ్యగంధర్వయక్షరాక్షసగణంబులకు భృంగిరిటికుంభనికుంభకుంభోదరవీరభద్రకుమారవిఘ్నేశ్వరనందిమహాకా పాతాళభైరవకాళభైరవాదిప్రఖ్యాతప్రమథులకు బ్రాహ్మ్యాది మాతృవర్గంబులకు శక్తిచతుష్టయంబునకు శ్రీమహాలక్ష్మీసరస్వతీశచీదేవీప్రభృతి పరమపతివ్రతా తిలకంబులకు నప్సరస్త్రీలకు సముచితప్రకారంబులఁ గట్నంబులిప్పించి యప్పు శ్రీ స్వయంభూర జ్యోతిర్లింగమూర్తి శక్తిసహితంబు పరమానందంబునం బొందె ననంతరంబు సప్తర్షులు గంగాజలసప్తగోదావరీజలంబుల నభిషేకించి పూజించి భీమలింగంబు నిట్లని ప్రత్యేకంబు ప్రత్యేకంబు స్తుతియించిరి. 125

## —• సప్తముని స్తోత్రము •—

తే. వేయి ముఖములుగలకాద్ర • వేయవిభుఁడు
నెఱయ శక్తుండు గాఁడటఁ • నిన్నుఁ బొగడ
నేకముఖమునఁ బొగడంగ • నెట్లు నేర్తు
నిన్ను శ్రీదక్షవాటికా • నీలకంఠ. 126

కం. మిహిరలవంబులఁ దారా, గ్రహనక్షత్రముల పచ్చు • గణుతింప భవ
న్మహిమాపూర్వగుణరత్నము, లహికంకణ యెవరికైన • నలవియె పొగడన్. 127

తే. అధికమైనతపంబు మూ • ల్యంబుగాఁగ, సర్వదేహంబునఁ గౌరికి • నలముకొన్న
బాల దేవర నిను నాత్మ • సంస్తుతింతు, దక్షిణాపథకాశికా • భీమ భీమ. 128

కం. ఎవ్వని కిరీటమునకుం, బువ్వై కడునొప్పునన్న • భోవాహిని రే
జవ్వనపుఁదుహినరుచితో, నవ్వేలుపు భీమనాథు • నభివర్ణింతున్. 129

కం. అర్ధకపాలము తేలను, సర్వనిశాసార్వభౌముఁ • దౌదల నెదమున్
అర్ధాంగలక్ష్మిగౌరియు, వర్ధిల్లఁగ నొప్పు శివు • వత్సలుఁ గొలుతున్. 130

కం. సాధారణమతి సహజత, బోధముఁగాఁ దలఁచి రతివి • భుం డెవ్వనిదృ
క్క్రోధాగ్నికి నింధనమగు, నాధూర్జటి నహరహంబు • నభివర్ణింతున్. 131

కం. అస్తంగమితసురద్విష, హస్తన్యస్తత్రిశూలు • నంతర్విధి నం
విస్తృతవిజ్ఞానోదయుఁ, గస్తూరీసదృశనీల • కంఠునిఁ దలఁతున్. 132

---

125. అవధరించి = జరిపించి; 126. కాద్రవేయవిభుడు = సర్పరాజు (శేషుడు); ఏకముఖమునన్ = ఒక్క ముఖముతో; 128. మూల్యము = వెల; 129. అన్నభోవాహిని = ఆ గంగ; జవ్వనపు దుహినరుచి = చంద్రరేఖ; 130. అర్ధ...భౌముడు = చంద్రకళ; 131. రతివిభుండు = మన్మథుడు; దృక్క్రోధాగ్ని = నేత్రమను కోపాగ్ని. 132. అస్తం...శూలున్ = చంపబడిన రాక్షసులు కల త్రిశూలము చేతఁ గలవాడు.

తే. విశ్వునకు శాశ్వతునకు వి • శ్వేశ్వరునకు, విశ్వరూపాత్మకునకు మ • హేశ్వరునకు
శ్రీస్వయంభూమహాసుధా • సిద్ధలింగ, భీమనాథేశ్వరునకు న • ర్పింతుమనసు. 133

తే. భీమభీమేశ్వరేశ్వర • భీమనాథ, భవ భవారణ్యపావక • భవ్యమూర్తి
భర్గ ఫాలాక్షభసితాంగ • ఫణివిభూష, శిఖిశిఖాభాసమాన భ • జింతునిన్ను. 134

తే. శర్వ సర్వేశ్వరేశ్వర • సర్వవంద్య, శర్వ సర్వప్రదాయక • సర్వధాత
శర్వసర్వంసహామహీ • చక్రధరుని, శర్వ వర్ణింతు దేవతా • సార్వభౌము. 135

శా. వేదాతీతుని వేదవేద్యుని శివున్ • వేదాంతవేద్యున్ భవున్
వేదాంతోపనిషద్రహస్యముఁ జతు • ర్వేదీవిహారాలయున్
వేదాంగాది పురాణముఖ్య విలస • ద్వేద్యాగమప్రక్రియా
వేది న్నిన్ను భజింతు నెమ్మనమునన్ విశ్వేశ భీమేశ్వరా. 136

కం. కామేశ్వరు నీశ్వరునిం, గామితఫలదానకల్ప • కముఁ గామరిపున్
గామాతీతుని దేవ, గ్రామణి నిను నాశ్రయింతు • గౌరీరమణా. 137

కం. ఆనందజ్యోతినిఁ బర, మానందానందమూర్తి • నవ్యయునిఁ ద్రిలో
కానందామృతదాయి మ, హానందుని వృషభవాహు • నభివర్ణింతున్. 138

సీ. ఓమహాలింగంబ • యో మహాదేవుఁడ, యోమహాత్ముఁడ దేవ • యోమహేశ
యోమహాసంపత్ప్ర • యోగదీక్షాదక్ష, యోమహాపాపేంధ • నౌఘదహన
నీమూర్తిసంస్మృతి • నీనామసంస్మృతి, నీకథాశ్రవణంబు • నిఖిలదురిత
యూథాంధకారసూ • ర్యోదయం బఖిలక • ల్యాణనికాయసం • ప్రాప్తిహేతు

తే. వంబికాకుచకుంభద్వ • యాంగరాగ, పరిమళాసారవాసిత • బాహుమధ్య
దక్షిణాపథకాశికాం • తర్విహార, గిరిశ శ్రీ భీమనాథ ర • క్షింపు మమ్ము. 139

వ. అని సప్తఋషులు సంస్తుతించిరి. తదనంతరంబ యరుంధతీదేవియు హంసవాహన
పశు సఖిచండికా పరిచారికా సముదయంబును ననేకప్రకారంబులఁ బ్రశంసించి
యథాశక్తిం బూజించిరి. 140

కం. ఈ సప్తమునిస్తోత్రము, వ్రాసినఁ జదివినను వినిన • వర్ణించినఁ గై
లాసపతి దక్షవాటిని, వాసుఁడు జనులకు నభీష్ట • వరము లొసంగున్ 141

వ. అనిన విని మంకణుండు మునీంద్రా సదాశివభక్తిమాహాత్మ్యం బింకను నాకెఱింగిం
పవే యని యడుగుటయు వసిష్ఠమునీంద్రుం డిట్లనియె. 142

గీ. కల్పవృక్షం బదేటికిఁ • గామధేను, సముదయం బేల యిష్టార్థ • సంపదలకు
నిశ్చయంబుగ మనసులో • నిల్చెనేని, చాలదా? మర్త్య రక్షింప • శంభుభక్తి. 143

గీ. శంభుపదభక్తులకు వినా • శంబు లేదు, కదియ వీశానుభక్తులఁ • గల్మషములు
నాదియందుఁ బ్రతిజ్ఞగా • నానతిచ్చెఁ, జంద్రచూడుండు నిజభక్త • జనముఁగూర్చి 144

137. కామరిపుడు=మన్మథుని శత్రువు; దేవగ్రామణి=దేవశ్రేష్ఠుడు.

సీ. భోగీంద్రభూషణు•భూతిదిగ్ధాంగుని, నాఖిలకపాలాయు•ధాగ్రహస్తుఁ
గాకోలవిషనీల•కంధరాభాగుని, గజచర్మపరిధాన • కటివిభాగుఁ
దాండవాడంబరో•ద్దండదివ్యాకారు, నజవిష్ణువిబుధాధి • పాధిపంద్యు
గంగాతరంగసం•కలితోత్తమాంగునిఁ, త్రైలోక్యరక్ష ప్ర•దానదక్షు

తే. నీకు సాకారునొండె నొం•డే విభూతి, పరనిరాకారుఁగాఁజూచి•బహువిధములఁ
బూజసేయంగ నేర్చిన • పుణ్యమతులు, వారు శివభక్తులందు రీ•వ్వసుధలోన. 145

కం. శివధనము ప్రముచ్ఛిలించిన. శివధన మన్యాయవృత్తిఁ • జెడిపోవంగాఁ
దవులక యుపేక్షచేసిన, శివభక్తి ద్రోహమంద్రు • శివభక్తవిదుల్. 146

గీ. శివునికై భిక్షచేసి యా•ర్జించినట్టి. ద్రవ్య మావంతయేనియుఁ•దా స్వప్రయెంప
కభవునకు నెవ్వఁడొనరించు•నర్పణంబు,వాఁడు శివభక్తముఖ్యుఁడు•వసుధలోన. 147

కం. మాటలు వేయును నేటికి. హాటకధాన్యాదిశివప•దార్థములయెడం
జేటునకోర్వమి తుదిఁ బరి•పాటించినశంభుభక్తి•పథము మునీంద్రా. 148

సీ. మహనీయసంప్రీతి • మద్భక్తజనముల, నాదరించుచునుండు•నతఁ డొకండు
ఫలములఁ బక్వాన్న•ములుమాకు నర్పింప. కనుభవింపక యుండు•నతఁ డొకండు
పంచాక్షరీమంత్ర•పాఠంబు నిత్యంబు, నాచరించుచునుండు•నతఁ డొకండు
ననుఁ బ్రస్తుతించు నా•నాపురాణంబులు, సతత మావరించు • నతఁ డొకండు

తే. శిలలఁ గాష్ఠంబులను స్ఫూర్తి•కలను నిసుక
లింగముల చెన్నగాఁగఁ గ•ల్పించి భక్తి
నర్చనము సేయునతఁడొకం•డనుచుఁ జెప్పు
శివుఁడు భక్తవిమర్శన•చేయునపుడు. 149

వ. అదియునుంగాక రాగద్వేషఝషసంకులంబును కామక్రోధలోభమోహమదమా
త్సర్యమహాగ్రాహాకులంబును బుణ్యపాపతోయమహాప్రవాహంబును నైన యీ
సంసార మహాంభోరాశియందుఁ గర్మచోదితములైన జంతువులు మునుంగుచుఁ దేలు
చుం గొంతతడవు సుఖంబును గొంతతడవు దుఃఖంబును ననుభవించుచుండును.
కలియుగంబున శివభక్తి యుత్పన్నంబై యుండు. 150

గీ. అతివిశుద్ధాత్మః చతురంఘ్రిఁ • గృతయుగమునఁ
ద్రేతఁ బాదత్రయమున వ • ర్తించుచుండి
ద్వాపరంబునయందుఁ • బాదముల రెంట
వెలయు శివభక్తి యొకకాలఁ • గలియుగమున. 151

---

144. కదియవు = దరిచేరవు; 148. చేటునకోర్వమి = పాడగుటకోర్చ లేకపోవుట; 149. ఆవర్తించు = వల్లించు (జపించు). 150. ఉత్పన్నము = నశించినది. 151. చతురంఘ్రి = నాల్గుపాదములు కలది; ఒకకాలన్ = ఒక్కపాదముతో

గీ. కలియుగంబున ధర్మంబు • కఱవుగాన, నందు ధర్మంబుఁజేసిన • యతఁడుఘనుఁడు
నిండువేసవి మరుభూమి•నిర్మలముగఁ, జేర్మిసలిలాన్నసత్రంబుఁ•బెట్టినట్లు. 152

వ. అని మఱియు నొక ప్రశ్నంబుచెప్పెదఁ బూర్వకాలంబున. 153

గీ. అభవునొకనాఁడు ప్రార్థించి • యడిగెగౌరి, కలియుగంబున శివభక్తి•గ్రాఁగిపోవు
నఖిలలోకహితంబుగా•నానతిమ్ము. భక్తివిజ్ఞానయోగంబు • పాలనయన. 154

వ. అని భవాని విన్నవించిన మహేశ్వరుండు. 155

— గౌరికి మహేశ్వరుండు భక్తి విజ్ఞానయోగంబుఁ జెప్పుట —

గీ. అడుగవలసినయర్థంబ•యడిగితీవు, క్రాఁగియుండెడు శివభక్తి • కలియుగమునఁ
బాపకర్ముఁడుకాని యె•ప్పాటలేఁడు, పుణ్యకర్ముఁడు వికసితాం•భోజనయన. 156

సీ. ఎప్పుడు కలియుగం•బేతెంచుఁ గ్రమవృత్తిఁ, బాపంబులన్నియుఁ•బ్రబలుచుండుఁ
బాపంబు లోకభంగిఁ•బ్రక్షయంబొందిన, నామీఁద దృఢభక్తి•నాటుకొనును
నామీఁద దృఢభక్తి•నాటుకొన్నప్పుడు, ధర్మంబు వర్తించుఁ • దరతరంబు
ధర్మంబు వృద్ధిఁబొం•దఁగఁ జిత్తమునఁబట్టు, లింగార్చనావిధి • మంగళంబు

గీ. అంతట విభూతి యలఁదంగ • నాసపుట్టు, నంతమీఁదటఁ గట్టు రు•ద్రాక్షకలన
పాశుపతమటమీఁదను•బదిలపడును, ముక్తిలతికకు నదిగదా • మూలదుంప. 157

వ. మఱియు నొక్కటిచెప్పెద సదాచారనిరతులైన బ్రహ్మక్షత్రియవైశ్యులును త్రైవర్ణిక
శుశ్రూషాపరులై సత్యవాదులైన శూద్రులును బతివ్రతలైన పుణ్యస్త్రీలును నాత్మదర్శ
నంబునకు నధికారులు విశేషించి. 158

గీ. రాగవైషమ్యములులేక • ప్రజ్ఞగలిగి. మనములోన విరక్తి యె•వ్వనికిఁగలుగు
వాఁడె యధికారి బ్రహ్మకై•వల్యమునకు, వీఁడువాఁడని కులశుద్ధి • వెదుకవలదు. 159

సీ. బహుజన్మసంశుద్ధి•భాగ్యసంపదగాని, యోగవిద్యాశక్తి • నూన దాత్మ
యోగసామగ్రికి • నుచితసాధనములు, వాయుమార్గవిశుద్ధ•వర్తనములు
నాడిపరంపరా•క్రోడవాయుజయంబు, బలము చేతఃస్థితి • భాగ్యమునకుఁ
జిత్తంబు తనయాజ్ఞ•చేసివర్తించెనే, నిట్టట్టనఁగఁజాల • వింద్రియములు

గీ. యమనియమములునాసన • ప్రాణనియతి
ధ్యానమునుధారణంబుఁ బ్ర•త్యాహృతంబు
నన సమాధియునాఁగ న • ష్టాంగకలన
బ్రహ్మయోగంబు విలసిల్లుఁ • బద్మనేత్ర. 160

---

152. మరుభూమి = నిర్జల ప్రదేశము. 156. ఎప్పాటన్ = ఏరీతినైన. 160. నూనను = పొందను.

గీ. దేవి! సద్గురునాథోప•దిష్టసరణి, మనుజుఁ డష్టాంగయోగంబు•ననుష్ఠించి
యంతనద్వైతభక్తిఁగృ•తార్థుఁడగుచు, నన్నుఁగనిఘోరభవబంధ•నంబుఁబాయు. 161

వ. రజ్జుజ్ఞానంబున సర్పభ్రాంతి నివృత్తి యగుచందంబున యోగంబున నన్ను నాత్మంగనుకారణంబున నవిద్యానివృత్తియగు ననినఁ గృతాంజలియై త్రిపురహర! యోగం బెయ్యది? బ్రహ్మజ్ఞానంబెయ్యది? యానతి చేయుమనుటయు. 162

గీ. శమము దమము తపంబును • శ్రద్ధ తాల్మి
మతి సమాధానమనఁగ ని • ర్మలవివేక
సాధనములాఱుదెరువులు • సంఘటిల్లు
మోక్షమునకండ్రు నిగమార్థ • మూలవిదులు. 163

గీ. బలిమిమైనింద్రియంబులఁ•బట్టితెచ్చు,నదిసుమీయిందువదన ప్రత్యాహరణము
సర్వసంసారదుఃఖప్ర•శాంతిహేతు, వేకచిత్తప్రకారంబు•విదియెసూవె. 164

వ. ధ్యానంబు సాకారనిరాకారంబులు సూవె. 165

గీ. నిర్గుణుని నిత్యశుద్ధుని • నిర్వికారు, నాత్మఁ గనుట నిరాకార•మనఁగఁబరఁగు
శేషనదిచంద్రరేఖాది • చిహ్నధారి, నన్నుఁదలంచుట సాకార•మనఁగ వెలయు. 166

కం. గురుఁడే యభవుఁ డభవుఁడే, గురుఁడని యభవునకు గురునకును భేదమెడం
బరికింపనిశిష్యునకే, గురుఁడ నభవుఁడనయి వాని•కోర్కులు దీర్తున్. 167

గీ. రాజసము మాని శిష్యుండు • ప్రకటభక్తి
గురునిఁ గొలువంగఁదగురాజుఁ•గొలిచినట్లు
వినయమొప్పంగ నిశ్శంక • వృత్తినొప్ప
నిభృతుఁడందుఁ త్రివర్గంబు • నీరజాక్షి. 168

గీ. సర్వభూతములందును • సమతఁబూని, సత్త్వవిదుఁడయి యెవ్వాఁడు•సంచరించు
నతఁడు శివభక్తుఁ డాతని • నాదరింతు, నెట్టివేళలయందుఁ బూ•ర్ణేందువదన. 169

సీ. పాపపుణ్యంబు • పాతఃప్రపూరంబు, దుర్వారమైనట్టి • దుఃఖమడుగు
కాంతాదిసుఖము వైఁకతవేదికాస్థలి, కందర్పవిశృతులు•కరడములును
ప్రాణభయంబు నక్రకుళీరనివహముల్, చేతోవికారముల్ • శీతదరములు
బహుళదారిద్ర్యంబు • బడబాగ్నిపిండంబు, విషయాభిలాషంబు • విషముగాఁగ

గీ. సమధికంబైనసంసార•జలధియందు, మునుఁగుచును దేలుచును దడ•ముట్టఁబడని
జనులకెల్లను మత్పాద•సరసిజములు, తెప్పయైయుద్ధరించు విం•దీవరాక్షి. 170

---

164. ప్రత్యాహారణము = ప్రత్యాహారమనుయోగాంగము. 166. శేష... ధారి = పాములను గంగ, చంద్రరేఖనున్నగు చిహ్నములు ధరించినవాడు. 167. ఎడన్ = మనసులో. 168. త్రివర్గము = ధర్మార్థకామములు. 169. సమత = సమభావము.

కం. కామక్రోధావేశ, వ్యామోహాదుల నిజాన్వయాచారంబుల్
వైముఖ్యమునొందించుచుఁ, బామరసంసారజలధిఁ • బడుదురు కుమతుల్. 171

కం. సుఖముల దుఃఖంబులుగా, సుఖములుగా దుఃఖములను • జూతురు కుమతుల్
సుఖదుఃఖసమతఁ జూచిన, నఖిలభవాంభోధిఁ గడుతు • రంబుజవదనా. 172

సీ. మనసుఁ గామక్రోధ•మదలోభముల కిచ్చి, సడలింతు రన్వయా•చారసరణి
నన్వయాచారంబు • లట్లుమాని చనంగ, వర్తింతు రన్యాయ•వర్తనమున
నన్యాయవర్తనం • బదికారణముగాఁగఁ, బడిమునుంగుదు రుగ్ర•భవపయోధి
భవపయోనిధిలోనఁ • బడియుండి కాంతురు, నరకకూపమున ను•న్మజ్జనంబు

గీ. నిరయమునఁ బెద్దకాలంబు • నిష్కృతిఁబొంది,యిలకు వచ్చి జనింతురు•హీనజాతి
హీనజాతి జనించిపా•పానువృత్తిఁ, బాపులగుచుందురట నధః•పాతమునమ. 173

గీ. ఎట్టిహీనాత్మునకునైన • నేన శరణ, మెట్టిపుణ్యాత్మునకునైన • నేనదిక్కు
నన్ను వర్ణింపమేలు మా•నవుల కెందు, సత్య మిది నమ్ము హిమధామ•చారువదన. 174

వ. అనిన విని భవాని యొద్దాని నెఱింగి భవార్ణంబుపలన నిర్ముక్తులై పురాతనయోగీం
ద్రులు సనకసనందన సనత్కుమారసనత్సుజాతాదులు నిశ్శ్రేయసంబునొంది ర మ్మ
హాజ్ఞానంబు సవిస్తరంబుగా నానతిమ్మనిన నమ్మహాదేవుం డిట్లనియె. 175

మాలిని. శమదమ పరినిష్ఠా • సర్వభూతానుకంపా
సమనిగమనివృత్తి • జ్ఞానవృత్తిప్రశాంతుల్
విమలదళనిభాక్షీ • కల్గినఁ గల్గు న య్యు
త్తమునకుఁ జిరకాల • స్థాయికైవల్యలక్ష్మల్. 176

గీ. చిత్తమునఁదుష్టియును నతుష్టియునులేక
మొదలిలోనన్యు గృహమందు • నున్నభంగి
నిస్పృహుండయి యుండఁగ • నేర్చెనేని
యతఁడు ముక్తుండు పద్మపత్త్రాయతాక్షి. 177

గీ. అవనిగగనాగ్నివాయుజ • లాదు లైన
ప్రకృతి సంభూతముల వికా • రములఁబాసి
యున్న నామూర్తిఁ బొడఁగాన•నొప్పునేని
నతఁడు ముక్తుండు సుమ్ము హై • మాద్రితనయ. 178

వ. నిత్యానిత్యవివేకుండును నీషణత్రయవిరహితుండును సమాధిషట్కసంపన్నుండును
నంతరరిషడ్వర్గవివర్జితుండును నగువాఁడు ముముక్షుండు. 179

173. నిరయము=నరకము; నిష్కృతి=బాధ; హిమధామ=చంద్రుడు. 175. నిశ్శ్రేయసంబు=మోక్షము.

గీ. తత్పదార్థంబు పరమాత్మ • తలిరుఁబోణి, త్వంపదార్థంబు జీవుండు • తలఁచిచూడఁ
దత్త్వమారయ వేదసూ • త్రంబులోని, యర్థ మది చిత్తమందునీ • వలవరింపు. 180

గీ. ప్రత్యభిజ్ఞాన మనియెడి • ప్రత్యయమున, విశ్రుతంబైనయాత్మ భా • వింపవలయుఁ
బెద్దకాలంబునకుఁ గన్న • ప్రియవయస్యు, నానవాల్పట్టి తెలిసిన • యట్లపోలె. 181

గీ. త్రాడుఁజూచిభ్రాంతి • దందశూకంబని, యాత్మవలనఁ దలఁచి • నట్లపోలె
వేదశాస్త్రజనిత • విజ్ఞానబలమునఁ, దెలివివడని యాత్మఁ • దెలియవలయు. 182

వ. నిత్యంబు సర్వగతంబు కూటస్థం బేకంబుదోషవర్జితంబు భ్రాంతివశంబున భిన్నం బైతోఁచు. ఘటాకాశంబు మహాకాశంబు భిన్నంబుగానేర్చునే? జీవేశ్వరులకు భేదం బెక్కడిది? పృథివ్యాపస్తేజోవాయురాకాశంబులు శబ్దస్పర్శరూపరసగంధంబులు మాయాసంసారప్రపంచంబు లేను సదా సాక్షిస్వరూపకుండనైన జీవుండననిసమాధి నిష్ఠులైనపెద్దలు తెలిసికొని పరమనిర్వృతి ననుభవింతురు. 183

సీ. ప్రణవాత్మవర్ణరూ • పస్పర్శనామూర్తి, ప్రణవంబు మూఁడక్షర • రములు గలది
యది పరబ్రహ్మ మే • కాక్షరంబున నొప్పు, నది ఋగ్యజుస్సామ • మందు నిలిచె
ననులోమకము లుదా • త్తాదిస్వరములు కా • లంబులు వహ్నిత్ర • యంబులవియు
వర్ణత్రయంబు స • ర్వంబు నంతర్భావ, మొందుట యది యేమి • సందియంబు

గీ. గలినకార ముకార మ • కారములను, నాత్మమాయను జీవాత్మ • నాటుకొల్పి
జీవు నీశ్వరబుద్ధి భా • వింపవలయు, ధృతి చలుఁగనీక యెప్పుడు • మఱవిపేర. 184

సీ. చైతన్య మెప్పుడు • సర్వంబుఁ దానయై, విలసిల్లుచుండు న • ప్పేశఁగాని
విశ్వభూతములను • వీక్షించుఁ దనయందుఁ, బరిపాటి నెప్పుడ • ప్పాటఁగాని
సకలభూతములకు • సంతసంబునుఁబొంది, యెపుడు వర్తించుఁ దా • నపుడుగాని
యఖిలలోకములకు • నధ్యక్షుఁడైనను, నధ్యక్షుఁ డెప్పుడ • య్యెదనఁగాని

గీ. తన్నుఁగేవలమాత్మగాఁ • దలచియిష్ట, మతిశయముదృఢముగఁజూచు • నపుడుగాని
జన్మదుఃఖజరావ్యాధి • శాంతికరము, బ్రహ్మవిజ్ఞాన మూరక • పట్టువడదు. 185

గీ. జ్ఞానసంపదఁగాని మో • క్షంబులేదు, కర్మశతమున నేని యో • నిర్మలాత్మ!
జ్ఞానమనఁగ వేదాంతవి • జ్ఞాన మబల!, యితరవిజ్ఞాన మజ్ఞాన • మెంచిచూడ. 186

కం. జ్ఞానాభ్యాసం బల్పం • బైన మహాపాతముల • హరియించును గం
జాననః దీపంబించుక • యైనను హరియించుఁ గాదె • యంధతమంబుల్. 187

గీ. వహ్ని సందీప్తమై మహా • వనమునందు, వరసవీరసతరుల భ • స్మంబుసేయు
బ్రహ్మవిజ్ఞానమును నట్ల • ప్రజ్వరిల్లి, శుభము నశుభము నొకటిగా • నుడివికాల్చు.

180. తత్ + త్వం = తత్త్వం. 181. విశ్రుతము = ప్రసిద్ధము. 182. దందశూకము = సర్పము. 183. పరమ నిర్వృతి = మోక్షము (బ్రహ్మానందము)

గీ. జలజపత్త్రంబు తనమీఁదఁ • జల్లియున్న, యుదకబిందులతోఁ గూడ • కున్నయట్లు
బ్రహ్మవిజ్ఞాని తనమీఁదఁ•బడినయట్టి, విషయమలమునఁబడకుండు•విమలచరిత. 189

గీ. భక్షితం బైనవిష మెల్లఁ • గుక్షినఱుగు, విమలమణిమూలమంత్రౌష • ధములచేత
ననుభవించినవిషయంబు • లట్లయఱుగు, బ్రహ్మవిజ్ఞానమునఁజేసి • పరమమునికి. 190

శా. పూవుంబోఁణీ ! విశాలలక్ష్మిఁగనుచుం • బుష్పంబు మూర్కొంచు వీ
ణావాద్యంబులు వించు నిష్టమధురా • న్నంబర్థి సేవించుచు
న్వేవేభంగుల నిల్చుచు న్నడచుచు • న్నిద్రించు చో నీశ్వరా !
నీవే కర్తవు సుమ్మటన్నపురుషు • న్వేధింప వే దోషముల్. 191

గీ. జ్ఞానవైరాగ్యసంపన్ను • డయినపెద్ద, నెఱుఁగలేక యవహసించు • నెవ్వఁడేని
వాఁడు గాల్పంగఁబడుఁ దీవ్ర • వహ్నిశిఖల, రౌరవాదికఘోరనా • రకములందు. 192

సీ. సజ్జనుండైన దు • ర్జనుఁడైన మూర్ఖైనఁ, బండితుఁడైన నా • తండె ఘనుఁడు
నిరపేక్షుఁ డాతండు • నిర్వైరుఁ డాతండు, సమదృష్టియాతండు • శాంతుఁడతఁడు
రా జిలజనులచేఁ • బూజఁగైకొనుమాడ్కి. నతఁడు దేవతలచే • నర్చగాంచు
నతనిపాదాబ్జంబు • లంటినభూభాగ, మఖిలతీర్థములకు నభ్యధికము

గీ. వానిజన్మంబు జన్మ మ • వ్వాఁడుసుకృతి, వాఁడు ద్రొక్కినయి ల్లిల్లు • వాఁడు దైవ
మేకొఱంతయు లేకుండు నింతః యెఱుఁగు, బ్రహ్మవిజ్ఞానమయశీలి • భాగ్యశాలి. 193

గీ. ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞుఁ • డేగుదెంచుఁ, బ్రియముఁగారుణ్యమునుగల్గి • భిక్షగొనఁగ
వానిఁ బితృదేవతలు హర్ష•వైభవమునఁ, బొగడుదురు కేలివర్తనా•భోగకముగ. 194

కం. అనుభవపర్యంతం బెవ్వనిచిత్తము తత్త్వవీథి • వర్తించుమహా
త్ముని నాతనిఁ బొడఁగను స, జ్జనులకు నాక్షణము కిల్బి • షంబు లడంగున్. 195

గీ. అన్వయము పావనంబు కృ • తార్థుఁడతఁడు, పుణ్యవతి వార్ధి వేష్టిత • భూతధాత్రిఁ
జెలఁగియోలాడునెవ్వని • చిత్తవృత్తి, సచ్చిదానందమయసుధా•సాగరమున. 196

గీ. శ్రద్ధ గురుభక్తివిశ్వాస • సౌష్ఠవంబు, జరగెనేఁ గల్గు వేదాంత • సంగ్రహంబు
జరగదాలేదుసత్యంబు•సత్యమిదియు, బహువిధోక్తులపనయింపు•బ్రహ్మమిదియు. 197

వ. ఈ యర్థంబులు దేవతాగురువిశ్వాసంబులు గలవారికిఁగాని ప్రకాశింప వని భవా
నికి భవుఁ డుపదేశించె నని మంకణునకు వసిష్ఠుండు చెప్పెనని శౌనకాది మహా
మునులకు సూతుండు వివరించె. 198

శా. ఆకల్పస్థిరధర్మవైభవ ! దిశా • హర్మ్యాగ్రసంస్థాపితా
స్తోకస్ఫాటికకుంభవిభ్రమధురా • కుంభ ద్యశోమండలా !
రాకాచంద్రమసోవిరాజ నవభ • ద్రా ! వీరభద్రేశ్వర
శ్రీకాంతాగ్రజపేమభూధవకృపా • సంవర్ధితప్రాభవా. 199

కం. లింగనమంత్రిసహోదర, గంగాధరదివ్యచరణ • పశుపతినివాసా
భంగాపరతంత్ర ! సఖి, ద్రదంగార్జున ! యిందుధరరథ రాధపధీరా. 200

మాలిని. రవినిభశుభతేజా • రామమాంబాతనూజా
దివిజగురుచరిత్రా • దేవయామాత్యపుత్రా
భువనభవనకీర్తీ • పుష్పకోదండమూర్తీ
ప్రవిమలగుణసంగా • రాయవేశ్యాభుజంగా. 201

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుజనవిధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైన భీమేశ్వరపురాణంబను మహాప్రబంధంబునందు

పంచమాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీమహాగణాధిపతయేనమః

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## షష్ఠాశ్వాసము



క. మహిత దక్షవాటీ
భీమేశ్వరపాదపద్మ • పీఠాశిరసా
సామస్త్యసుప్రవృద్ధమ
హామహిమా! చెందవూఁడి • యన్నామాత్యా. 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లని చెప్పందొడంగె. 2

సీ. [illegible] సద్యోముక్తి•విశ్వైకకారణం, బామ్నాయవిద్యార•హస్యపథము
[illegible]మహా•స్థానమాహాత్మ్యంబు, వెండియుఁ బరిపాటి • విస్తరింతు
నా[illegible]శ్వరి • యఖిలతత్త్వేశ్వరి, భోగమోక్షఫలాను•భూతధాత్రి
[illegible] శైలేంద్రతనయ హ•స్తములు మొగిచి

గీ. [illegible] విన్న•పంబుచేసె, దేవదేవ! జగన్నాథ•దివిజవంద్య!
దేవ [illegible] సంస్థ, యభవ! కృప నాదు విన్నపం•బవధరింపు. 3

క. [illegible] తీర్థం బెయ్యది? పుణ్యస్థానం బెయ్యది? యానతిం డనుటయు • జగద్ధితా
[illegible] నా ప్రశ్నము [illegible] భవాని నభినందించి యిట్లని యానతిచ్చె. 4

ఉ. [illegible]ముక్తి[illegible]రంబును, సద్యస్సౌఖ్యప్రదంబు • సద్యోదురిత
[illegible]భంగకరంబును, సద్యస్సకలార్థసిద్ధి • సంపాదియునై. 5

సీ. [illegible]నమాత్ర వేం•ద్రైపత్రగ్రామణి, జనులకు భోగమో•క్షము లొసంగు
సమ్మృతాప్తిసద్మంబు•నందు నేవేల్పు తేఁ•డుర్వి లింగాకృతి • నుదయమొందె
మార్తాండుచే సప్త•మౌనిముఖ్యులచేఁ బ్ర•తిష్ఠఁ గైకొనియెనే • దివ్యమూర్తి
యుప్పరత్న్రీప్సటా•జీవలోకసత్కా,పాథేయ మెవనికిఁ • బ్రాహణికము

---

3. ఆమ్నాయవిద్యా=వేదములు; సద్యోముక్తిదము=వెంటనే మోక్షము నిచ్చునది. 5. సద్యో...కరము=వెంటనే పాపములను పోఁగొట్టునది.

గీ. విశ్వపతి భీమనాథనామేశ్వరుండు, శివుఁ డతండు వసించు నేక్షేత్రసీమ
నట్టి శ్రీదక్షవాటీమహాపురంబు, భుక్తిముక్తికి రెంటికిం బుట్టినిల్లు. 6

వ. తొల్లి కృతయుగంబున నమ్మహాస్థానంబున సంశ్రితవ్రతులును త్రికాలవిహితాచరితస్నానులును భస్మోద్ధూళితసర్వాంగులును రుద్రాక్షమాలికాభరణులును జటావల్కలధారులును శంభులింగార్చనాపరాయణులును నగుమహామునులు పెద్దకాలంబు ఘోరతపంబుఁ జేసిన నత్తపోధనుల యుత్తమతపంబునకుఁ జిత్తంబునఁ బ్రసాదంబు వహించి మంగళసంకల్పకల్పవృక్షం బగునయ్యుమాకాంతుండు ప్రత్యక్షంబైన నద్దక్షవాటికాధ్యక్షుని సాక్షాత్కారంబు వీక్షించి పరమహృష్టులు హర్షోత్కర్షంబు నొంది యందంద దండప్రణామంబు లాచరించి హస్తారవిందంబులు మొగిడ్చి యిట్లనిరి. 7

గీ. ఓసదాశివ! యో దేవ! యో మహాత్మ!
యోవిరూపాక్ష! యోమహాదేవ! యభవ!
వరముఁ గృపసేయు మీదక్షవాటమునకు
మ్రొక్కెదము మేము మీపదాంభోజములకు. 8

కం. సద్యోభోగశ్రీయును, సద్యఃకైవల్యవిభవసౌలభ్యంబు
న్విద్యాసముద్యమంబు న,విద్యానాశంబు దక్షవీటికి వలయున్. 9

చం. అనఁగఁ బ్రహృష్టచిత్తుఁడయి యర్ధశశాంకకిరీటుఁ డప్పు డి
ట్లను దగ నూర్ధ్వరేతసుల నమ్మునిముఖ్యుల కిష్టవ
ర్తనులకు నిచ్చితిన్ వరము దక్షిణపీటికి దక్షవాటికి
న్ననుపమరత్నపేటికి మహఃప్రమదాపహవస్తుకోటికిన్. 10

గీ. ఎల్లకాలంబునుందేద నిచట నేను, మొదలి మామామ యారామపదమునందు
వెండిగుబ్బలిపై పెద్క వీడుకొల్పి, మేరునగరాజుపైఁ జాల మెచ్చు సడలి. 11

సీ. అగ్రజుండైనను నంత్యజుండైనను బ్రాఁడోఁడియైనను బురుషుఁడైనఁ
బరమమూర్ఖుండైనఁ బండితుండైనను దారిద్ర్యగుండైన ధనికుఁడైనఁ
బలవంతుఁడైనను బలహీనుఁడైనను బ్రాయంపువాఁడైనఁ బంగువైన
నాస్తికుండైనను ననృతవాదియునైనఁ, బరఁగ గార్దభమైనఁ బందియైనఁ

తే. గీటకంబైన బకమైనఁ గ్రిమియునైనఁ, బాదపంబైనఁ దృణమైనఁ బ్రాణరహిత
మై రహిని దక్షవనచతుర్ద్వారసీమఁ, బొందుఁ గైవల్యకల్యాణభోగలక్ష్మి. 12

6. ప్రాహుణికము = ఆతిథ్యము. 9. విద్యాసముద్యమము = జ్ఞానము కలుగుట; అవిద్యానాశము = అజ్ఞానము పోవుట. 10. ఊర్ధ్వరేతసులు = ఇంద్రియనిగ్రహము కలవారు. 11. మొదలి...నందు = దక్షారామమున; వెండిగుబ్బలి = కైలాసము. 12. పంగువు = కుంటివాఁడు; రహిని = శ్రద్ధతో.

ఉ. ప్రాణవియోగవేళ నర • పక్షిమృగాళికి దక్షవాటికా
క్షోణినిఁ దారకంబుఁ బుర•సూదనుఁ డాసతియిచ్చుచుండఁగన్
వాణిబిసప్రసూనములఁ • బయ్యెద నొయ్యన వీచుచుండు శ
ర్వాణి త్రిలోకమాత బల•వన్మరణశ్రమభారశాంతికిన్. 13

తే. తూర్పుదిశకును లవణపా•థోధి సీమ, దక్షిణమునకు వృద్ధగౌ•తమియె సీమ
పడమటికి రాజమహేంద్ర•పట్టణంబు, ద్యుమ్నపతిదిక్కునకు సీమ•తుల్యభాగ. 14

వ. ఈ క్రమంబున సీమావిభాగంబు లేర్పడిన భీమమండలంబు భుక్తిముక్తిప్రదంబు. వహ్నిసంయోగంబున శుష్కకాష్ఠంబులు హరణంబైనచందంబున దర్శనమాత్రంబునఁ బాపౌఘంబును నది భస్మీభావంబునుం బొందింపంజాలును. ప్రాణవియోగకాలంబున జంతుకోటికిం గాలకంధరుండు తారకబ్రహ్మవిద్యారహస్యార్థంబుపదేశించును. కాసిమాత్రంబైన ధనంబును పిడికెఁడు ధాన్యంబైన నిచ్చుదాతకుననంత ఫలంబుచెందు. శ్రద్ధాసమన్వితంబుగా శివయోగికిం బెట్టిన భోజనంబును నిచ్చిన వస్త్రంబును భవబంధవిధ్వంసనంబులు. జపహోమదానతపోధ్యానసమాధియోగంబుల గలుగుపుణ్యాలకుం గొలఁదిలేదు. హిమవత్పర్వతంబునఁ గోటివర్షంబులు తపంబుచేసిన ఫలంబు ఘటికార్ధోపవాసమాత్రంబునను, వారణాసియందుఁ గోటి బ్రాహ్మణులకు భోజనంబు పెట్టిన ఫలంబు భిక్షుకు నొక్కభిక్ష యిడినమాత్రంబునను, గురుక్షేత్రంబున సూర్యగ్రహణకాలంబునం దులాపురుషదానంబు చేసిన ఫలంబు నొక్క భూసురాతిథిరభ్యాగతికి శివయోగులకుఁ బెట్టిన భోజనమాత్రంబునను, దక్షవాటికాపుణ్యక్షేత్రంబున సంభవించు. 15

తే. భీమలింగంబు ప్రభువను•స్వామి యెపుడు, సన్నిధానంబుఁ గైకొని•యున్నకతనఁ
దీర్థములలోన నుత్తమ•తీర్థమయ్యె, దక్షిణానందవనవాటి • దక్షవాటి. 16

తే. ఘనతటినిగంగయును రుద్ర•గంగయనఁగఁ, గూపములు రెండు దక్షవా•టీపురమున
మొదలియవి పాపములనెల్ల•నుడపఁజాలు, నొకటి పితృదేవతలఁ దృప్తి•నొనుపనోపు. 17

ఆ. అని వరంబు లిచ్చి • యంతర్హితుం డయ్యె, నిందుమౌళి ఋషుల•కెట్టయెదుట
వార లోన్నమశ్శి•వాయ యంచుఁ బఠించి, రొక్కమొగిని దిశలు • పిక్కటిల్ల. 18

సీ. పంచాక్షరీమంత్ర • పారాయణంబులు, పఠియించుచును స్పష్ట•భణితితోడ
నెప్పటికేఁగిరో • యెఱుఁగకయున్నార, మెచటికి విచ్చేయు•కిచట నుండు

---

13. తారకంబు = తారకమంత్రము; బిసప్రసూనము = పద్మము; పయ్యెద = పైట. 14. ద్యుమ్నపతిదిక్కు = ఉత్తరము. 15. హరణంబైన చందంబునన్ = తగులబడినట్లు; కోటివర్షంబులు = కోటియేండ్లు; కొలఁది = 'ఇంత' అని పరిమాణము. 17. ఉడపఁజాలు = పోఁగొట్టుటకు సమర్థమైనది.

మనుచుఁ బ్రార్థింపఁగ నౌఁగాక యనిపల్కి, ఋషులు చూడఁగఁ జూడ నిందుధరుఁడు
భీమనాథేశ్వరుఁ డ కామితార్థప్రదుఁ, డా కామితదివ్యలింగంబుఁ జొచ్చె

తే. మెఱుఁగు మెఱచినపగిదిని మెఱయదీప్తి, నద్భుతంబును బొందిరి యపుడు వారు
గౌరి! యిది భీమలింగంబు గౌరవంబు, దక్షవాటీపురీమహాస్థానమునను. 19

వ. అనంతరం బమ్మునీశ్వరులు నియమశ్రద్ధాతాత్పర్యంబు లొప్పు సప్తర్షిసమానీతయగు గోదావరిఁ గనుంగొని పరమానందంబున. 20

శ్లో. దేవి! శంభోర్జటాజూట, నివాసిని! శివప్రియే!
లోకరక్షణకార్యార్థ, ముద్భూతాయై నమోస్తు తే. 21

శ్లో. ఏకేనైవస్వరూపేణ, భీమనాథస్యసన్నిధౌ
సదా సన్నిహితాస్యత్ర, గోదావరి! నమోస్తు తే. 22

కం. అని సంస్తుతించి యందఱు, మునిగణములు మంకణముని మునుకొని వికచ
త్కనకారవిందసౌరభ, ఖని యగునయ్యేటినీటఁ గౌతుకమొప్పన్. 23

వ. అఘమర్షణస్నానమాడిరి. 24

తే. అఖిలకాలంబు నొకప్రవాహంబుతోడ, భీమలింగంబు సేవించి పెరసి ప్రేమ
యొరసి మదిను బ్బుపాతాళ మొరసి హారి, సప్తసింధువు మున్నిటి సంక్రమించె. 25

తే. భీమలింగంబు మ్రోల గాంభీర్యసలిల, పూరమగుచుండు నేకాల మునుసమృద్ధి
దనిపి తగఁబాఱుచుండు నిత్యమ్ము ఘన ము దారజలనిధి సప్తగోదావరంబు. 26

ఉ. ఏటమునింగి లేచి పరమేశ్వరుమందిరసౌధవాటికా
హాటకకుంభముం గని షడక్షరమంత్రము జిహ్వఁ గూర్చి వా
చాటత సత్యతత్త్వఁ డగు శాంభవయోగివరేణ్యుఁ డేల జం
జాటపుసంసృతిం బొరలి చచ్చుచుఁ బుట్టుచునుండుఁ బార్వతీ. 27

---

19. స్పష్టఫణితిన్ = స్పష్టముగా; మెఱచినపగిదిని = మెఱసినట్లు. 21. శంభోః = శివునియొక్క; జటాజూటనివాసి = జటాజూటమున నుండుదానా! శివప్రియే = శివునికి భార్యయైనదానా! లోకరక్షణకార్యార్థసముద్భూతాయై = లోకరక్షణకై పుట్టిన; తే = నీకొరకు; నమోఽస్తు = నమస్కారము. 22. గోదావరి! ఏకేనైవ = ఒకే; స్వరూపేణ = రూపముతో; భీమనాథస్య = భీమేశునియొక్క; సన్నిధౌ = సమీపమందు; సదా = ఎల్లప్పుడును; సన్నిహితా = ప్రత్యక్షమైయున్నదానవు; అసి = అయితివి; తే = నీకొఱకు; నమోస్తు = దండము. 23. మునుకొని = మొదలుకొని; వికచత్...ఖని = వికసించిన బంగారు తామరపూలు కలది. 26. తనిపి = తృప్తిపొందించి; ఉదార జలనిధి = మంచినీరుకలది. 27. ఏటన్ = నదియందు; హాటకకుంభము = పసిడికుండ; వాచాటతన్ = జపించుటతో; జంజాటపు సంసృతిన్ = తెమలని సంసారమందు.

చం. కొడుకులుసేవ నేఁ బ్రమథకోటివిరించిసరోజలోచను
డుడుగణరాజఖేచరమహోరగకిన్నరసిద్ధసాధ్యులె
ప్పుడుగొలువంగవైభవముపొంపిరివోవఁగ దక్షవాటినుం
డెడుశివు భీమనాయకుఁ దటిన్యవతంసు భజింపమేలగున్. 28

కం. సప్తాశ్వసంప్రతిష్ఠుని, సప్తమునీశ్వరప్రధానసంస్థితు నంత
ర్గుప్తస్వరూపుఁ ద్రిభువన, గోప్తను భీమేశ్వరేశుఁ గొలువుము తరుణీ. 29

వ. భీమనాథమహాస్థానంబు సర్వకామార్థసాధకంబు; సంవత్సరంబును గొలువ ముక్తిప్రదాయకంబు. సూర్యుండు మేషరాశియందుఁ జిత్రానక్షత్రంబున వసియించియుండు చైత్రమాసంబున సప్తగోదావరంబునఁ బ్రాతస్స్నానంబుఁ జేసి యథాశక్తి విప్రులకుఁ దగినదానంబు లొసఁగి, భీమనాథుండ నగునాకు సమస్తాభిషేకపూజానైవేద్యంబు లాచరించి నరుండు నక్తభోజియయ్యెను. నట్లె భానుఁడు వృషభరాశియందు విశాఖానక్షత్రంబు నాశ్రయించియుండు వైశాఖమాసంబునను, ప్రభాకరుండు మిథునంబునందు జ్యేష్ఠానక్షత్రంబునందు నిలిచియుండు జ్యేష్ఠమాసంబునను, రవి కర్కాటకంబున భగదైవతంబైన నక్షత్రంబున నాషాఢమాసంబునఁ గూడియుండఁగను, శ్రావణమాసంబున శ్రవణనక్షత్రంబున సింహరాశియందు మార్తాండుఁడు నిలిచియుండఁగను, భాద్రపదమాసంబునఁ బూర్వాభాద్రానక్షత్రమునఁ గన్యారాశియందు భానుండుండఁగను, నాశ్వయుజమాసమున నశ్వినీనక్షత్రంబునందుఁ దులారాశియందుఁ జిత్రభానుండు నిలిచియుండఁగను, గార్తికమాసంబునఁ గృత్తికానక్షత్రంబున వృశ్చికరాశిని సూర్యుం డుండఁగను, మార్గశీర్షమాసంబున ధనూరాశియందు మృగశిరానక్షత్రంబున నభోమణియుండఁగను, పుష్యమాసంబునఁ బుష్యనక్షత్రంబున మకరరాశియందు లోకబాంధవుఁ డుండఁగను, మాఘమాసంబున మఘానక్షత్రంబునఁ గుంభరాశియందు మిహిరుండుండఁగను, ఫాల్గునమాసంబున నుత్తరానక్షత్రంబున మీనరాశినిం దినకరుండుండఁగను, పూర్వోక్తప్రకారంబున శైవవ్రతాచారంబులు నడపిన మనుజుండు, పాతకంబుల వలన విముక్తుండగును; వెండియు యజ్ఞతీర్థం బను తటాకంబు సకలతీర్థరాజంబు. 30

సీ. మేషరాశిస్థుఁడై మిహిరుఁడుండగఁ బర్వతిథి స్నాతుఁడగుచుఁ దత్తీర్థమందుఁ
దనియథాశక్తిఁ గాంచనము విప్రులకిచ్చి, పాతకంబులఁ బాయుఁ బంచజనుఁడు

---

23. ఉడుగణరాజు = చంద్రుడు; పొంపిరివోవగన్ = పెరుగగా; తటిన్యవతంసున్ = గంగనెత్తిపైకలవాని. 29. సప్తాశ్వ = సూర్యుడు; అంతర్గుప్తస్వరూపుడు = లోపలనున్న స్వరూపముకలవాడు. 30. నక్తభోజి = రాత్రిమాత్రమే తినువాడు; మిహిరుడు = సూర్యుడు.

వృషభంబునం దట్లు • వెండిమార్తాండుండు, మిథునరాశిందగ • మెచ్చుమీఱు
స్థితిఁ గర్కటకరాశిఁ • గృతసప్తగోదావ, రాభిషేకుఁడు దోష •ముపనయించుఁ

తే. దప్పకాషాఢసితచతు • ర్దశినిసింహ, కన్యలనుసూర్యసంగమ • కాలమునను
జన్మతారలయందున • సంధులందు, యజ్ఞకుండపయస్స్నాన • మఘహరంబు. 31

తే. భానుమంతుండుతులమీఁదఁ • బవ్వళింప, యజ్ఞకుండతటాకంబు • నందుఁ గ్రుంకి
బ్రహ్మహత్యాదులైనపా • పనిచయములఁ, బంచబంగాళముగఁ దోలుఁ • బంచజనుఁడు. 32

కం. ఆదిత్యుఁడు వృశ్చికమునఁ, బాదం బిడినట్టివేళఁ • బావనతిథి సూ
ర్యోదయమున యజ్ఞతటా, కోదకమునఁ గ్రుంకిమనుజుఁ • డొందుచు నఘంబుల్. 33

తే. ఇనుఁడుకోదండరాశియం • దెక్కియుండ, రుద్రనక్షత్రమునసుమ • స్త్యుండునియతి
యజ్ఞకుండపయస్స్నాన • మాచరించి, సృష్టిలోఁ దోలుఁ బాతక • శ్రేణినెల్ల. 34

తే. మకరరాశిస్థుఁడై భాను • మంతుఁడుండఁ
బుష్యనక్షత్రమునఁ బ్రొద్దు • పొడుచునపుడు
భానువాసరమునయజ్ఞ • భద్రసరసిఁ
గ్రుంకిపాతకచయముల • పొంక మణఁచు. 35

కం. మాఘమునఁ గుంభరాశి ని, దాఘద్యుతియుండ సప్త • తాపసవాహి
న్యోఘమున మునుఁగునరుఁ డఖి, లాఘవిఘటితుఁ డగుచుండు • హావప్రౌఢిన్. 36

తే. ఫాల్గునంబున నుత్తరా • ఫల్గునినిని, మీనరాశిని సూర్యుండు • మెలఁగుచుండ
సప్తగోదావరాభిషే • చనము సేయఁ, బాతకవ్రాతములనెల్ల • భంగపఱుచు. 37

మ. ప్రతివేళం దగ మర్త్యుఁ డీక్రియఁ జరిం • పంబాడి యంగీకృత
వ్రతుఁడై దక్షిణకాశియందు బహుళ • స్వర్గాపవర్గార్థమై
శితికంఠప్రియమందిరంబయిన యీ • క్షేత్రంబునం దెచ్చటన్
మృతుఁడై యున్న నరుండు పొందు గమిక • ర్మీభూతకైవల్యమున్. 38

కం. కనకంబణుమాత్రంబై, నను దక్షారామనగర • నైకటికమహా
మునిసింధువుదరి దానం, బొనరించుట మేరుదాన • మూర్విం దలఁపన్. 39

31. పర్వతిథి = ఏకాదశి. పూర్ణిమయున్న గుతిథులు; పంచజనుడు = మనుజుడు; సితచతుర్దశి = శుక్లపక్షచతుర్దశి; సంగమకాలము = సంక్రాంతికాలము; పయస్స్నానము = నీటిలో స్నానము; అఘహరంబు = పాపమును పోగొట్టునది; భానుమంతుడు = సూర్యుడు; క్రుంకి = స్నానముచేసి; పంచబంగాళముగన్ = కన్పడకుండ; పావనతిథి = పర్వతిథి. 34. కోదండరాశి = ధనుస్సు; రుద్రనక్షత్రము = ఆర్ద్ర. 38. స్వర్గాపవర్గార్థమై = స్వర్గమోక్షములకై; శితికంఠ = శివుడు; గమికర్మీభూతకైవల్యమున్ = మోక్షమును పొందును. 39. నైకటిక = దగ్గఱి.

తే. వర్తనంబెల్ల శంభుసే•వా వ్రతంబు, మాటలెల్లఁ బంచాక్షరీ•మంత్రరాశి
భోగమోక్షనివాసైక • భూమియైన, దక్షపురినున్న జనులకో•తలిరుఁబోణి. 40

వ. దక్షారామమాహాత్మ్యం బవాఙ్మానసగోచరంబు. భీమనాథ మహాదేవదివ్యశ్రీపాద పద్మసేవావ్రతంబువలన నెట్టి పాపకర్మండును భోగమోక్షపదవీ సామ్రాజ్య పట్టాభిషేకమహాదివ్యపదవినొందు సర్వశాస్త్రసిద్ధాంతమతాంతరంబులకు సమ్మతంబైన యిమ్మహాస్థానంబేకపటీభూతంబు సద్యోముక్తిప్రదంబు సద్యఃపరిజ్ఞానసదనంబు సద్యఃశివాసమృద్ధిప్రదంబై యుండు; ననిదయార్ద్రమానసుండై వృషభధ్వజుం డాదేవి నుద్దేశించి పార్వతీ నీవడిగినయర్థంబు సర్వంబుసమర్థించితి. చిత్తంబున నవధానంబు సేయుమనినం బతికిఁ గరంబులు మొగిడిచి మ్రొక్కి భవాని హర్షోత్కర్షంబునొంచె. నీరహస్యంబేను గురుముఖంబున నెఱిఁగి ప్రసంగవశంబునం బ్రహ్మవేదులగు మీకు నుపదేశించితి. 41

శా. సద్యోముక్తిప్రసంబుదక్షనగరీ•స్థానంబు విశ్వేశ్వరుం
డామ్రం బవ్యయుఁ డానతిచ్చె నిదివే•దార్థంబు; సద్యోవిము
క్త్యుద్యోగం బనుపేక్షమైన నది సుం•దొందొక్కతీర్థంబు పు
ష్పోద్యానం బనఁ గాల మందుఁ గడుపజ • యోగంబు భావింపఁగన్ 42

వ. మఱియు భీమలింగమాహాత్మ్యంబు భవకలుషనాశనంబు బ్రహ్మవిష్ణు పురందరాదులకుఁ గల్పకోటిశతంబులనైన వచియింప నలవిగాదు. అయినను నానేర్పు విధంబున నింత వర్ణించెద. 43

తే. భువనములమూఁటియందును • బొబ్బవిడుచు, నంతదాఁకనె యితరతీ•ర్థాదులెల్ల
నపుడు భేదంబు లేదని • రవనిమీఁద, దక్షవాటీపురీభీమ•ధామమహిమ 44

సీ. దక్షుండుపోట్టేలి•తల ధరించినయప్డు, భారతి ముక్కు గో•ల్పడినయపుడు
పూషార్కువదనంబు•బోసివోయినయప్డు, విష్ణునిచక్రంబు•విఱిగినపుడు
అగ్ని నాలుకలేడు•నౌడుమాసినయప్డు, దుడురాజు బొట్టిగు•జ్జుఱికినపుడు
జన్నంపుటిట్టిమ• స్తకము ద్రెళ్లినయప్డు, పడిదపుతల చిచ్చు•పడినయపుడు

తే. ప్రాణభయమునమ్ముక్తిసం•భ్రమము మెఱయ
నమ్మహోత్పాతకాలంబు•నందుమునులు
దైవగంధర్వసిద్ధవి•ద్యాధరులును
నేమమునగొల్తు రెవ్వాని•నెమ్మనమున. 45

40. వర్తనంబు = జీవిక; 42. అదిసుండు = అదిసునూ; 45. బోడు మాసిన = పెదవిపోయిన; ఉడురాజు = చంద్రుడు; జన్నంపుటిట్టి = యజ్ఞమృగము; నేమము = నియమము.

సీ. దుగ్ధాబ్ధిమంథనో•ద్భూతహాలాహల, జ్వలనమేచకకంఠ • శరణు శరణు
గిరిచాపనిష్ఠ్యూత•హరిశిలీముఖదగ్ధ, పురగోపురాట్టాల•శరణు శరణు
సింధురాంధజలంధ•రాంధకవ్యాఘ్రాది; సురకంటకధ్వంస • శరణు శరణు
విలయసంధ్యాకాల•వికటతాండవకేళి, జర్జర బ్రహ్మాండ • శరణు శరణు
తే. శరణు ఖేచరదేవతా•సార్వభౌమ, శరణు త్రైలోక్య సతతర • ఖధురీణ
శరణు దక్షిణకాశికా•స్థానవిలయ, శరణు భీమేశ శంకర • శరణు శరణు. 46

కం. హరః సర్గస్థితినాశన, కరః సంసారాబ్ధితరణ•ఘనతరచరణాం
బురుహప్లవః రక్షింపుము, శరణాగతులై నమమ్ముఁ•జంద్రాభరణా. 47

కం. అపరాధశతము లోఁగొను, మపరిమితకృపావిధేయ • యార్తశరణ్యా
త్రపుసీకసుమాభరణా, కపర్దిః జటాజూటకోటీ • ఘటితశశాంకా. 48

తే. సుప్రకాశుండవగుమువి•శ్వప్రకాశ, శర్వః సర్వేశః త్రిపురభం•జనః గిరీశః
యనుచునందండనందజు • సభినుతింప, నచటభీమేశ్వరేశ్వరుం•డభవుఁడపుడు.

ఉ. సన్నిధిచేసి వారలకు•శాక్కరకేతుఁడు సుప్రసన్నుఁడై
యెన్నిక కెక్కఁగా వరము•లిచ్చె ననేకము లింతనుండి నా
మన్నన దక్షవాటిక స•మస్తమహీవలయింబులోన నా
పన్నుఁగ దీర్థరాజ పద•భాజన మయ్యెడు నెల్లకాలమున్. 50

కం. ఈ దక్షారామమునకు, మేదినిఁగల తీర్థకోటి • మిగులకయుండున్
మేదురకటణాగరిమను, సాదరముగ ఖచరసిద్ధ•జనహితబుద్ధిన్. 51

తే. దక్షుఁ గీర్తించి యాచంద్ర•తారకంబు, దక్షవాటిక సకలతీ•ర్థంబులందు
నుత్తమంబుగ వరమిచ్చి•యుండుమిచట• నేర్పుగను నేరికినిముందు•నేసు సుమ్ము. 52

సీ. యజ్ఞకుండంబున•యందుఁ దీర్థంబాడుఁ, బాయ కెవ్వండు నా•భక్తుఁడతఁడు
గ్రుంకు లేపులుస ప్త•గోదావరంబునఁ, బాయ కెవ్వండు నా•భక్తుఁడతఁడు
ద్వాదశ క్షేత్రయా•త్రావిధాన మొనర్చుఁ, బాయ కెవ్వండు నా•భక్తుఁడతఁడు
దక్షవాటీమహా•స్థానంబునందుండుఁ, బాయ కెవ్వండు నా•భక్తుఁ డతఁడు
తే. తెరువునడిచెడువారికి•నిరవుచేసి, ధాన్యములు నెయ్యినూనె వ•స్త్రములు లవణ
మాదిగాఁగల యాత్రాప•దార్థసమితిఁ, బాయ కెవ్వండు పెట్టు నా•భక్తుఁడతఁడు. 53

కం. మాటలు వేయియు నేటికిఁ, జాటించెన్ శివుఁడు వేడ్క•జగములలో ము
న్నీటి దరి దక్షవాటికి, సాటిగఁ దీర్థములు లేపు • సత్యము సుండీ. 54

46. మేచకకంఠ = నీలకంఠ; సురకంటక = రాక్షసులు; 47. సంసార...ప్లవ = సంసారసాగరమును దాటుటకు తెప్పయైన పాదములుకలవాడు; 50. శాక్కరకేతుఁడు = వృషభధ్వజుడు; 53. ఏరికిని = ఎవరికిని; 54. లేపులు = ఉదయములందు; ఇరవుచేసి = బసయిచ్చి;

తే. బ్రహ్మవిద్వాంసులకుఁ దాపసయతులకుఁ, బెట్టు ధనధాన్యవస్త్రాన్న•భిక్షమెవ్వఁ
డక్షయగుణంబుగాఁగ నీ•దక్షవాటి, వాని కలవడు నిజము కై•వల్య పదవి. 55

తే. చప్పరంబొండె గుడియొండెఁ • జవికయొండెఁ
గలుమఠం బొండె నిల్లొండెఁ • గట్టి పెట్టి
బ్రహ్మయోగీశ్వరుని నుంచు • భక్తినెవ్వఁ
డతఁడు మాన్యుండు పూజ్యుండు • నతులితముగ. 56

వ. తొల్లి జలంధరగంధగజ పుండరీకాంధకాసురాదు లగుమహాదైత్యులు భువనత్రయం బాక్రమించిన శక్రుండు భయభ్రాంతుండై దేవగణదేవముని సిద్ధసాధ్యవిద్యాధరోరగ గరుడగంధర్వకిన్నరకింపురుషాదులం గూర్చుకొని బ్రహ్మకు విన్నవించిన విరించియు వారిందోడ్కొని పాలమున్నీటిలో ఫణిరాజతల్పంబుపైఁ బవ్వళించిన పాంచజన్యధరునకు విన్నపంబుచేసి సంస్తుతించినఁ గైటభారి హాటకగర్భునివిన్నపం బవధరించిచింతాభరంబున నొక్కింతదడవూరకుండి పుండరీకాససుంజూచియిట్లనియె. 57

తే. వీరభద్రుండు చక్రంబు • విఱిచి దక్ష
యాగముననాఁడు భక్షించె • నాగ్రహమునఁ
జెఱకు శర్కర పాకంబు చేసినట్టి
చక్కిలముఁబోలె ఛటఛటా • శబ్దమొప్ప. 58

ఉ. కోపముచిచ్చునంబడిన • కూరిమితల్లిఋణంబు దీఱ ను
ద్దీపతరాగ్రహంబునను • దేవతలం గడుభంగపెట్టఁగా
నేపున నేను మార్కొని పయిం బఱ లెంచినయంతమాత్రలో
జాపరమేశ్వరా యనుచుఁ • జక్రము మ్రింగిన నోహటించితిన్. 59

తే. తెగువ దక్షునికంఠంబు • ద్రెవ్వనేసి, వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని • వీరభద్రుఁ
డా ప్రజాపతి మెడమీఁద•నాక్షణంబ, నగుచుఁ బొట్టేలితలఁదెచ్చి • నాటుకొలిపె. 60

వ. అప్పు డవ్వీరభద్రునితేజోవిశేషంబున గనుఁగొనఁగన్నులు మిఱుమిట్లుగొన వెఱచఱచి యెలుంగుడించి తొలంగితి నాఁటనుండియు. 61

శా. పట్టంగైదువులేక విన్న నయి నా • బాహార్గళుల్ చూడుఁడా
యిట్టుంగాత సురేంద్రః బాధపడి మీ • రిబ్బంగి దుఃఖింపఁగాఁ
గట్టాపో యిటు మిన్నకుండుదునె • శీఘ్రంబిప్డు భీమేశ్వరున్
ముట్టంగొల్చెదఁ జక్రలాభమునకై • ముగ్ధేందుచూడామణిన్. 62

---

56. చప్పరంబొండె=పందిరికాని; చవిక=మంటపము; కలుమఠము=రాతి మఠము; అతులితముగన్=సాటిలేకుండ; 57. పాలమున్నీటిలో=పాల్సముములో; ఫణిరాజతల్పము=శేషశయ్య; కైటభారి=విష్ణువు; 59. జాపరమేశ్వరా=జయపరమేశ్వర; ఓహటించితిన్=వెలదీసితిని; 61. వెఱచఱచి=భయపడి; ఎలుంగుడించి=మాట్లాడక;

**వ.** అని పలికి నలిన సంభవేంద్రాదు లగునిర్జరులతోడంగూడి సరోరుహాక్షుండు దక్షారామంబునకు వచ్చి శివగంగాకూపంబునఁ ద్రిషవణస్నానంబు చేసి భస్మోద్ధూళితగాత్రుండును, ద్రిపుండ్రాంకితమస్తకుండును, రుద్రాక్షమాలికాధరుండును జటావల్కలసంయుతుండునునై నిత్యంబును సహస్రపద్మంబులఁ బూజఁగావించుచు భీమనాథేశ్వరేశ్వరు సేవించుచుండెనంతఁ గొంతకాలంబునకు. 63

**కం.** ఈభంగి వేయుదమ్ముల, నా భుజగాధిశాయి యెప్పు • డర్చన సేయన్
శ్రీభీమేశుండు కమల, నాభుని మనమరయ నొక్క • నలినము దాఁచెన్. 64

**తే.** తొంబనూరునుదొంబది • తొమ్మిదియును
జలజములు పూజచేసెను • శార్ఙ్గపాణి
వేయిఁటికినొక్కపద్మంబు • వెలితియైన
నహహా! నియమంబునకు భంగ • మయ్యె ననుచు. 65

**చం.** కటకకలాపసంఘటిత • క్రమమణి ద్యుతి పాటవంబుసం
జిటికినవ్రేలిగోరఁగొని • చిఱ్ఱున దీసెఁను లోచనంబుఁ బ్ర
స్ఫుటకమలంబు వేగహరి • పూన్చెఁ దటుక్కున దక్షవాటికా
కటకవిలాసినీవిటశిఖామణికిన్ హరిణాంక మౌళికిన్ 66

**కం.** కైటభవిరోధి భక్తిర, సాటోపం బెసఁగ వనరుహాలోకనము
ద్ఘాటించి భీమనాథుని. హాటకపదపీఠి లోచ • నాబ్జముఁ బెట్టన్ 67

**మ.** నిడువాలుంగుడికన్ను పాదములపై • నేమంబుతోఁ బెట్ట న
ప్పుడు ప్రత్యక్షముఁబొంది నీలగళుఁ డంభోజాక్షునిం జూచి నేఁ
గడుహర్షించితి నిచ్చెదన్వరము వేఁ • గైకొమ్ము నా నమ్రుఁడై
యడిగెన్ శౌరి జగత్త్రయోద్ధరణలీలావక్రమునన్ జక్రమున్. 68

**తే.** భీమనాథుఁడు త్రిభువనస్వామి యిచ్చె, నస్త్రకులదైవమననొప్పు • నాయుధంబు
హరికి నటమున్న యిచ్చెఁ జంద్రార్ధమౌళి, వికచపద్మోపమంబైన వెడఁదకన్ను. 69

---

62. కైదువు = ఆయుధము; విన్ననయి = తెల్లపోయి; బాహార్గళుల్ = గడియలవంటి చేతులు. 63. త్రిషవణస్నానము = మూడువేళల స్నానము; త్రిపుండ్రాంకితమస్తకుండు = నామములతో చిహ్నితమైన తలకలవాడు. 64. ఈభంగిన్ = ఈరీతిగా; వేయుదమ్ములన్ = వేయి కమలములతో; మనమరయున్ = పరీక్షకు; నలినము = పద్మము. 65. తొంబనూరులు = తొమ్మిదివందలు, 66. తా. వేయికిని నొక్క కమలము తక్కువైనదని విష్ణువు తన కన్నును చిటికెన వ్రేలికొనగోటితో తీసి శివుని పూజించెను. 67. వనరుహాలోకనము = పద్మమువంటి కన్ను. 69. వికచపద్మోపమము = వికసించిన పద్మమువంటి; వెడఁద = విశాలమైన.

వ. ఇవ్విధంబున శ్రీభీమనాథ మహాదేవునివలనం జగద్విజయం బగు చక్రాయుధంబు వడసి కోటి సహస్రమార్తాండమండల తేజఃప్రభాప్రభావభాసమానం బైన యారథాంగంబునమున్ను చెప్పంబడ్డవిబుధవిరోధులఖండించి యింద్రాదిప్రముఖనిఖిల బర్హిర్ముఖవ్రాతంబునకుం జేతఃప్రమోదం బాపాదించె నిది యమ్మహాదేవుని మహిమంబు. 70

కం. శివగంగాజలములనా, ప్లవనం బొనరించినట్టి • పరమాత్ములు త
ద్దివసమున భీమనాథుని, నవలోకింపంగఁ గలుగు • నభిమతసిద్ధుల్. 71

తే. మదనవిధ్వంసితిరిచుట్టు • మాఱెయందు, దక్షిణపుదిక్కునందు మా•ధవునిఁ గాంచి
రహిని వేడుక విఘ్నా•ధిరాజుఁ జూచి, మనుజుఁ డిష్టార్థసిద్ధిసం•పదలనొందు. 72

తే. అష్టమీభానువాసరం•బందు నొందె, నొండె సేనిచతుర్దశి • నిండుభక్తిఁ
బూజఁ గావించియెవ్వఁడే • భూమినున్న, దుర్గ సేవింప దురితంబు•దొలఁగు నండ్రు. 73

కం. తాండవభవుపీక్షణమున, ఖండేందుశిఖావతంసు • కట్టెదురుగఁ దా
నుండెడుగౌరిని మంచుం, గొండసుతం బూజసేయఁ • గోర్కులు నిండున్. 74

సీ. భూర్భువస్స్వర్లోక•ములు మూఁడు భేదించి, బ్రహ్మాండభాండక • ర్పరము దాఁకఁ
బెరిగి దిక్చక్రంబు • పిక్కటిల్లఁగఁ బట్టి! బలినిశుష్మునముతోఁ • బాము వోలె
నివవకాళంబుగా • నిత్యసన్నిహితంబు. నుండులింగమూర్తితో • నుబ్బియబ్బ
భీమనాథుఁడు మహా•భీమాద్భుతప్రౌఢి, బహువిరాడ్రూపవి•భ్రాజియయిన

తే. భయము సుంబొంపి దేవతల్ • ప్రస్తుతించి, యయ్యనీరూపమింతింత•యనఁగరాదు
మేదిమొద వేదికడపల • యేవిమధ్య, మెట్టునిమఁ బూజసేయుదు•మిందఱమును 75

వ. అనిసం గరుడాసామ్రాజ్యపట్టాభిషిక్తం డగునాజగజట్టివేల్పు బ్రహ్మాండగోళంబునకు ముక్కుటంబుగాఁ బెరిఁగినదేహంబుఁ బొట్టిచేసి తిరుచుట్టుమాలికలోన గౌరీ, జనార్దన, రుద్ర, కేశవ, వినాయక, దుర్గాతాండవేశ్వర, నృత్యభైరవులను దేవతాసప్తకంబు పరివేష్టింప, సకలలోకానందకరపరదారగమనపాపహరేశ్వరులు నైఋతి భాగంబున నధివసింప, నంతర్గర్భగృహంబులోపల మాణిక్యాదేవీ సహితుండై సలిలనిధివృద్ధ గంగాకౌంతేయసరిత్తుల్యభాగా హేలానదీసప్తగోదావర మాతృకాపరివృతమండలంబు న మధ్యమలోకభాగదేయింబును, విబుధగంధర్వపతాకావేదియుఁ, బరిసరోద్యానవాటి కాసరసకాసార కఠోరకుహూకీపాళికాకుసుమధూళీ మధూళికాసౌరభాసార సంవాసిత దశదిశాముఖంబును, మఖకుండితటాకసముద్దండ పుండరీకషండమకరందబిందు గండూషావ్యగ్రసముదగ్రమధుపమండవాహంకారఝుంకారకోలాహలకరంబితమకర

70. రథాంగము = చక్రము; విబుధవిరోధులు = రాక్షసులు; బర్హిర్ముఖ = దేవతలు; 71. ఆప్లవనము = స్నానము.

ధ్వజభుజాదండమండలీకృత కుసుమకోదండశింజినీఠంకారంబును, నాఖండిలాది దిక్పాలకఖరితకలితగోపురప్రాంగణంబును,బాదుకా ఖడ్గ ఘుటికారసరసాయనిమూలి కాంజనాకార్షణాదృశ్యాది విద్యాసిద్ధిక్షేత్రంబును సత్రాత్రేయాగస్త్యహరితాంబరీషాసిత భార్గవ పరాశరపారాశర్య మాండవ్యమార్కండేయ మౌద్గల్యమంకణ శౌనకశాండిల్య మందపాల వత్స వసిష్ఠ వాధూలసవాలఖిల్య కౌండిన్య కాశ్యపకణ్వగాలవగాధి గార్గ్య ప్రముఖ వాలఖిల్యాద్యష్టాశీతిసహస్రసంయమిసమాకీర్ణంబును, గర్జికారాంచికాకరక మలపుటఘటితకనత్కనకమణిమయడమరుకఢమఢమధ్వానపర్జన్యగర్జాసముజ్జృంభిత గుహాశిఖండితాండవంబును మార్కండేశ్వర కుండలాముఖసంవేద్యాంతర్వేదిచాళుక్య భీమేశ్వరప్రధాన నానావిధశాఖోపశాఖాతీర్థసంబాధసంభరితంబును నై యఖిలభువనభిప నాభి రామంబైన దక్షారామంబును గైలాసమేరుమందరంబులకంటెను, గాంచీ చిదం బర కాళహస్తి కాశీ శ్రీశైలాది మహాస్థానంబులకంటెను, సేతు కేదారంబులకంటె ను, నతిశయంబుగాఁ జేసి యా క్షేత్రంబునుమరగిగరళకూటకృపీటభిజ్వాలావష్టం భంబు సంస్తంభించి, త్రిపురదైతేయమదవతీగండభాగమకరికాపత్రభంగంబులు దొలంగించి భీమలింగంబు సర్వమంగళాదేవియుం దానును లోకరక్షణార్థంబుగా నధిష్ఠించియుండును. 76

తే. దేవదర్శనమాత్ర సంధిల్లు భుక్తి, కొందఱకు దక్షవాటికాక్షోణియందు
దేవదర్శనమాత్ర సంధిల్లు ముక్తి, కొందఱకు దక్షవాటికాక్షోణియందు. 77

తే. గీతవాదిత్రనృత్యంబు కేవలంబు, శంభునకు సార్వకాలంబుసం భ్రమింప
నప్సరస్త్రీలనర్పించె నాఱునూఱు, బాలలను యువతుల జంభభంజనుండు. 78

శా. ఆవంశంబున సానికూఁతులయి దివ్యస్త్రీలు దుగ్ధాబ్ధిమ
ధ్యావిర్భూతలు మీనకేతనునిపుష్పాస్త్రంబు లెక్కాలమున్
సేవాదక్షతఁ గొల్తు రిందుధరునిన్ శ్రీదక్షవాటీశ్వరుం
గైవల్యాధిపు భీమనాధుని లసత్కారుణ్యపాథోనిధిన్. 79

వ. మఱియు మహనీయదేవగంధర్వాప్సరోవేశ్యా జాతిసంజాతకాంతాచికురతిమిరాంగ సుమంగళవిభావరీ లలాటశశికలావిలాసద్వితీయభ్రూలతాలాసికాలాస్యలలితరంగ భూ మియు, నయనశంబరానుబంధనవకందర్పపతాకయు, నధరబంధూకకుసుమయు, వికాసవిభ్రమశర ద్వోళాకంబుకమనీయకంఠయు, బిబ్బోకసరిదంబుధరవేణియుఁ, బృథులతాచక్రవాకయుఁ, గరపల్లవస్ఫురణపర్యాయవల్లీమతల్లీ పన్నగపరిషత్తునుంబో లెఁ, బ్రకటితవిలాసమన్మథలీలయుంబోలె, రతిసుఖసంపత్సంపాదనలంపటకుముదిని

76. అష్టాశీతిసహస్ర=88 వేలు. 78. జంభభంజనుడు = ఇంద్రుడు.
79. మీనకేతనుడు=మన్మథుడు.

కం. కొందఱు తాండవమాడిరి, కొందఱు పరిహాసకేలిఁ • గొఱలిరి మఱియుం
గొందఱు బాహాయుద్ధం, బందంద ఘటించి రమ్మ • హాసంఘమునన్. 94

వ. వ్యాసర్షికనుగ్రహం బొసఁగి యప్పరమేశ్వరుండు కూడినయశేషమునులను సర్వ యోగీశ్వరులను సకలదేవతలనుద్దేశించి యిట్లని యానతిచ్చె. 95

కం. ఈ యున్నవారలందఱు, నా యానతి వినుఁడు నెమ్మ • నంబులలోనం
బాయం బెట్టుఁడు సంశయ, మీయర్థము వేదములకు • నెక్కుడుసుండీ. 96

తే. అర్కుఁ డెబ్బంగి నభమున • కాభరణము, భువనములకెల్ల నాభంగి • భూషణంబు
దక్షవాటీపురము భోగ • మోక్షవిభవ, పావనం బందు విశ్వాస • పరులు గండ్రు. 97

కం. త్రిభువనములయందును మా, కభిమతములు పెక్కులైన • నారామము లం
దభిమానమింత సేయము, విభవాస్పదమైన దక్ష • వాటిం బోలెన్. 98

తే. వినుఁడు సత్యంబు సత్యంబు • వెండి సత్య, మాత్మలోన విచారించి • యానతిత్తు
దక్షవాటంబుకంటెఁ దీ • ర్థంబు నిఖిల, మేదినీమండలంబున • లేదు లేదు. 99

గీ. వాఁడిగోర్గొండిఁ గన్నులు • వోఁడియైన, నడుగు లడిదంబుచేతఁ జ • క్కడచియైన
నొండుకడ కేగుటలుమాని • యుండవలయు, దక్కుమాటలు దక్షవా • టంబునందు. 100

కం. తిష్ఠన్మాత్రుననైన వ, సిష్ఠప్రతిమానుఁడైన • శిష్టుననైనన్
నిష్ఠాత్ముగలిగెనేనియు, నిష్ఠాకాలంబుముక్తి • నియతం బచటన్. 101

ఆ. బ్రహ్మహత్యమద్య • పానంబు గురుతల్ప, గమనమాదిగాఁగఁ • గలుగునట్టి
పాతకంబులపుడె • పాయు మానవులకు, దక్షవాటిభీమ • దర్శనమున. 102

వ. అని యిట్లర్ధేందుమౌళి యానతిచ్చి యంతర్ధానంబు చేసెఁ. తదనంతరం బాహరి విరించి పురందరాదులగు బృందారకులును సనకసనందనసనత్కుమారసనత్సుజాతులగు బ్రహ్మయోగీశ్వరులును మార్కండేయమందపాల మౌద్గల్యమాండవ్యమంకణాదులగు మహామునులును, బాదరాయణు నభినందించుచు, నిజస్థానంబులకుం జనిరి. 103

సీ. సప్తగోదావర • స్నానంబు రామనా • థావలోకనము పి • త్రర్పణంబు
రామగయాపితృ • శ్రాద్ధంబు గౌరీజ • నార్దనరుద్రస • న్నామజపము
పఱఁగమహాదివ్య • భావనానార్చనా • భవప్రదక్షిణ • ప్రక్రమంబు
పంచాక్షరీమంత్ర • పారాయణజపంబు, పాశుపతాచార • పరమనియతి

తే. సమయమిది సర్వదేవతా • సార్వభౌము, భుక్తిముక్తిప్రదాయకు • భువనభర్త
భీమనాథేశ్వరేశ్వరు • స్వామిఁ గొలుచు, భిక్షులకునెల్ల నాగమ • పద్ధతియిది. 104

మ. పరదారేశ్వరకుంభసంభవవిభుల్ • ప్రాగ్దిగ్విభాగంబులం
బురవిధ్వంసికి దూరదేశమునఁ దా • భోగంబునన్ శశ్వదా
వరణద్వారమునన్ మహామహిమ చే • వాయవ్యదిక్సీమ ను
ద్ధురతన్ వాయుశిఖుండు సుంద్రుమిగులం • దాత్పర్యశ్రద్ధారతిన్. 105

100. గోర్గొండిన్ = గోరుగల్లుతో; అడిదంబుచేతన్ = ఉలితో. 101. తిష్ఠన్మాత్రుకు = [illegible]. 107. మోక్షపదము = మోక్షస్థానము.

